# శ్రీ అరవిందుల సూక్తులు

## మొదటి భాగము

సంకలనం - అనువాదం :

కమలాకర వేంకటరావు

కృష్ణా పబ్లికేషన్స్
పాండిచ్చేరి

ద్వితీయ ముద్రణ :
నవంబరు 1977
4000 ప్రతులు



"ఆంధ్రప్రభ" నుంచి
పునర్ముద్రితము

వెల : రు. ~~8-00~~ 6/-

ముద్రణ :
పేపర్ అండ్ పేపర్ ప్రొడక్ట్సు,
విజయవాడ-2.

# విషయసూచిక

# శ్రీ అరవిందులు

మానవుని ఆధ్యాత్మిక విజ్ఞాన వికాస చరిత్రలో శ్రీఅరవిందుల కొక విశిష్టమైన స్థానం ఉన్నది. పరతత్త్వనిరూపణమునందేమి, తదుప లబ్ధికై చేయదగు సాధనవిధాన వివరణమునందేమి, అపూర్వమైన ఒక ప్రత్యేక పంథా ఆయన త్రొక్కినారు. కేవల బుద్ధివైభవంచేత ఇది ఆయన ఊహాకల్పనగా ప్రపంచించినది కాదనీ, అపారమైన ఆధ్యాత్మికానుభవ సంపత్తియే ఈ ప్రబోధమున కంతకూ మూలమైనదనీ ఇచట గుర్తించడం అవసరం.

శ్రీ అరవిందుల బుద్ధిపటిమ నిజమునకు సామాన్యమైనది కాదు. కౌమారవయస్సులో విద్యాభ్యాసమంతయూ ఇంగ్లండులో జరిగిన కారణమున తొలుత ఆయన పాశ్చాత్య విజ్ఞానమునంతనూ అపోశనము పట్టినారు. కాని, జననాంతర సౌహృదం అదేరీతిగా ప్రాచ్యవిజ్ఞానమును సైతం ఆపోశనం పట్టడానికి అనివార్యంగా ఆయనను ప్రోత్సహించింది. ముఖ్యంగా భారతీయ విజ్ఞానసంస్కృతుల వైభవానికి ఆయన హృదయం అయస్కాంతమునకు ఇనుమువలె ఆకర్షితమైపోయింది, భరతమాత దివ్యస్వరూపాన్ని ఆయన సాక్షాత్కరింపజేసుకొన్నారు. మానవజాతి ఉద్ధరణకై భరతవర్షం నిర్వహించవలసిన పాత్ర ఇంకనూ కలదని గుర్తించి, తదాశయసిద్ధికై దేశ దాస్యశృంఖలా విచ్ఛేదం కొరకు తహతహ చెందారు.

అయితే భారతీయ విజ్ఞానము నుపాసించే సందర్భంలో ఆయనకు యోగవిజ్ఞాన సాక్షాత్కారంకూడా అయింది. బుద్ధి అందుకోజాలని సత్య జ్ఞానోపలబ్ధి యోగంవలననే సాధ్యమని గ్రహించారు. గురువు నిమిత్త మాత్రుడుగా, యోగమార్గమం దాయన నడక అప్రతిహతంగా సాగి పోయింది. అద్భుతావహమైన దివ్యానుభూతులతో ఆయన సాధన పరా భూమికలలోని కెగసింది. మంత్రద్రష్టలైన వేదఋషి వాక్కులలో గర్భితములైన పరమరహస్యము లాయనకు తేటతెల్లములై కనిపించాయి. భగవద్గీతలో బోధించబడిన ఈశ్వరాధీన కర్మయోగసాధన మాయనకు ఉచ్ఛ్వాసనిశ్వాసప్రాయమైపోయింది. అహంకారమును విసర్జించి, స్వీయాభీష్టముల నావలకు పోద్రోలి, ఈశ్వరేచ్ఛానుసారముగా వర్తించుటెట్లో ఆయన తెలుసుకున్నారు. దేశస్వాతంత్ర్య సంపాదనార్థమైతా నంతవరకూ సారథ్యం వహిస్తూఉండిన మహోద్యమాన్ని అవలీలగా వదలివేసి అలనా డాయన పుదుచ్చేరికి చేరుకొనడం అట్టి ఈశ్వరాదేశ పూర్వకముగా జరిగినదే. ఉల్లంఘించగోరినా ఉల్లంఘించ వీలులేని ఆదేశ మది.

ఎందు కిటుల జరిగినదో తరువాతి చరిత్రయే మనకు తేటతెల్లం చేస్తున్నది. భారతదేశమునకు స్వరాజ్య సంపాదనకంటె మహోన్నతమైన మరొక లక్ష్యసాధనకు శ్రీ అరవిందుల జీవితం ఉద్దిష్టమయింది. భారతదేశమునకు స్వరాజ్యసిద్ధి నిశ్చయమే. దానిని సాధించుటకు ఇతరులు నిమిత్తమాత్రులుగా నిర్దేశించబడి ఉన్నారు. ఆధ్యాత్మికసాధన చరిత్రలో—పృథ్వీతలంపై మానవజాతి వికాసపరిణామ చరిత్రలోనే—అపూర్వమైన ఒకానొక దివ్యప్రగతికి ప్రవక్తయై తత్సంసిద్ధికి బాటలు వేసే పని శ్రీ అరవిందులకు కల్పించబడింది. అపరప్రకృతిలోనిదై అజ్ఞానమయమైన మనస్సుకంటె అతీతమగు పరాప్రకృతియందలి విజ్ఞాన

తత్వం పృథ్విపైకి అవతరించవలసి వున్నదనీ, అట్టిది సాధ్యమైనప్పుడు అతీతమానవులు పృథ్విపై విలసిల్లగలరనీ, మానవునిలో అట్టి దివ్యపరివర్తనం సాధించగల యోగపద్ధతిని రూపొందించడమే తన లక్ష్యమనీ ఆయన వెల్లడించి, పుదుచ్చేరిలో 1914—1921 సంవత్సరముల నడిమి కాలమున తాను ఆంగ్లమున నిర్వహించిన 'ఆర్య' పత్రిక ద్వారా వివిధ మహారచనల రూపమున దీనినే అనేక విధములుగా విస్తరించి లోకమునకు చాటినారు.

నిజమున కిది చాల ఆశ్చర్యకరమైన విషయమే—కొందరికి సందేహాస్పదమైన విషయముకూడ. తెలిసినంతవరకు యుగయుగాలుగా పృథ్విపై మానవుని పూర్వచరిత్రను సింహావలోకనంచేసి చూచుకొన్నప్పుడు, మనకు సుస్పష్టంగా కనిపించునది మనోరాజ్యం మాత్రమే. తొలిపలుకులైన వేదముల నాటినుండియూ మనస్సు నతిక్రమించెడి సాధనలు మానవుడు చేయకపోలేదు. మనస్సు నతిక్రమించుటలో అత్యద్భుత ప్రజ్ఞలనే అతడు తరచుగా ప్రదర్శిస్తూ వచ్చినాడు. మనస్సున కతీతంగా దివ్యభూమిక లెన్నియో ఉండడం అతడు కనుగొన్నాడు. అనృత జడదుఃఖాత్మకమైన యీ సమస్త సృష్టికీ మూలమై, సచ్చిదానంద లక్షణోపేతమైన పరతత్వం ఉన్నదని ప్రత్యక్షానుభవ పూర్వకంగా తెలిసికోగలిగినాడు. ఒకమార్గం కాదు, అనేక మార్గములు దానిని చేరడానికున్నవని సైతం దర్శించి లోకమునకు చాటినాడు. కాని, ఇహజీవనము నతిక్రమించి చనుటకేకాని దీనినికూడ రూపాంతరం చెందించుటకు కాదు. ఇహజీవన మెప్పటికీ అజ్ఞానపు టంతస్తులోనిదే. అది దివ్యజీవనంగా పరివర్తనం చెందడం పొసగదు. ఆధ్యాత్మిక సాధనలన్నీ దివ్యభూమికల కధిరోహించి దివ్యత్వము నందుకొనుటకేగాని, ఆ దివ్యత్వమును క్రింది కవరోహింపజేసి ఇహజీవనమును సైతం దివ్యం చెయ్యడానికి

కాదు. కడచిన ఆధ్యాత్మికసాధన పద్ధతులన్నీ ఈ ధోరణిలో కొనసాగి వుండగా శ్రీ అరవిందులు చాటిన నూతన పంథా కొందరికి సందేహములు జనింపజేయడం సహజమే.

కాని, అత్యంత ప్రబలములైన తన దర్శనానుభవముల కారణమున అనివార్యంగా శ్రీ అరవిందు లీతత్వనిశ్చయమునకు వచ్చినారు. ఆయన దృష్టిలో జగత్తు మిథ్యకాదు, అర్థరహితమైన మాయాకల్పన కాదు. అయ్యది సత్యవస్తువు యొక్క అభివ్యక్తి అగుటచే అదికూడా సత్యమే. శ్రీ అరవిందుల దర్శనం అద్వైతదర్శనమేకాని, అయ్యది మాయాద్వైతంకాదు, సత్యాద్వైతం. ఏకమునకూ అనేకమునకూ పరస్పర వైరుధ్యములేదని ఆయన హెచ్చరిక. ఏకత్వ నిరూపణకు అనేకత్వమును తుడిచిపెట్టి దాని అస్తిత్వమునే నిరాకరించవలసినపనిలేదు. ఏకమునందలి అభేదత్వ మెటుల సత్యమో, అనేకమునందలి భేదములు కూడ అటులనే సత్యము. కాని, అనేకము ఏకమునందు నిష్ఠమై ఏకము వలననే మనుచున్నది. సృష్టియందు కానవచ్చు భేదములు అభేదవస్తువు యొక్క అభివ్యక్తిలో కాననగు వైవిధ్యము మాత్రమే. ఏకత్వమునందు అంతులేని నానాత్వము జగత్తునందు మనకు ప్రత్యక్షమగుచునేయున్నది. ఉదాహరణకు, మానవజాతి ఒకటే అయినా, నానారూపమానవులు మనకు కానవచ్చుచున్నారు. ఆకు అనేదిగాని, పూవు అనేదిగాని ఒకటే అయినా, పలువిధములైన రూపములలో, తీరులలో, రంగులలో ఆకులను, పూవులను మనము చూచుచున్నాము. దీని ననుసరించి సృష్టిమూలములోనికి మనము దృష్టి సారించేయెడల, సృష్టిరహస్యములలోని ఒక రహస్యము మనకు తెల్లమై పొడగట్టక మానదు. ఏకమైన సత్యవస్తువునందే గర్భితమైయున్న రహస్యమది. సత్యజ్ఞానానంతుని ఏకత్వము తన ఏకత్వమునకు బద్ధమై, పరిమితమైనది కాదు. అనంతమైన

నానాత్వమునకు సైతం అందు తావున్నది. పరమసత్యముయొక్క స్వరూపం అటు ఏకత్వమునకుగాని, ఇటు అనేకత్వమునకుగాని పరిమితమై యున్నది కాదు. ఏకకాలమున రెంటినీ గర్భితమొనర్చుకొన్న వస్తువది. ఏకత్వము మూలమై అనేకత్వము అ ఏకత్వముపైన ఆధారపడివున్నా, రెండునూ ఆ పరమసత్యపు భిన్నముఖములే.

సత్యాద్వైతంలో సగుణం నిర్గుణం నుండి ఆవిర్భవించినదని గాని, నిర్గుణం ప్రధానమైనదికాగా సగుణం అప్రధానమైనదని గాని భావింప నక్కరలేదు. అవి ఒకే సత్యముయొక్క భిన్నముఖాలు. ఒకటి స్థితిలక్షణాత్మకం, వేరొకటి గతిలక్షణాత్మకం, ఒకటి అచలం, రెండవది సచలం. నిత్యమైన అచలస్థితి నిత్యమైన సచలగతి కాధారభూతమై ఉంటున్నది. పరమసత్యము ఈ రెండింటిలో దేనికినీ పరిమితమైనది కాదు. రెండింటినీ అది తనలో భుక్త మొనర్చుకొని ఉన్నది. ఏకత్వ నానాత్వములకు, భేదాభేదములకు ఎట్లు వైరుధ్యములేదో సగుణ నిర్గుణములకునూ అట్లే వైరుధ్యములేదు. రెండునూ నిత్యములే. రెంటిలో ఏది లేకపోయిననూ జగత్సృష్టి కవకాశం లేదు, కనుక. జగత్తుగా అభివ్యక్తమైన పరమసత్యమున కవి రెండునూ భిన్నముఖములని అంగీకరించడం యుక్తం. స్థూలదృష్టికి పరస్పర విరుద్ధములుగా కనుపించే యీ రెంటిలో ఏదో ఒకదానిని మాయగా కొట్టివేసి యీ వైరుధ్యాన్ని తొలగించుకోవచ్చు ననే మాట నిజమే, కాని, నిత్యమైన పరమసత్యం తనకెట్టి సంబంధమూలేని ఒక నిత్యమైన మాయను అంగీకరిస్తున్నదని గాని, లేక నిరర్థకమైన ఒక మాయావిలసనమున కాధారభూతం కావడం తప్ప మరే ఇతర సార్థకకార్యనిర్వాహణశక్తి దానికి లేదనిగాని తలపోయడం హేతుబద్ధంగా కనిపించదు, నిత్యశక్తిసమన్వితమైనది ఆ పరమసత్యం. స్థితియందూ గతియందూ కూడ ఎల్లప్పుడూ అది ఉండనే

ఉన్నది. స్థితియందది అచలం. గతియం దది సచలం, జగత్తు ఈ గతి యందే అభివ్యక్తమౌతున్నది. బ్రహ్మాండమైన ఒక అనృతసృష్టిని— మిథ్యాసృష్టిని చేసే శక్తి తప్ప ఇంకే శక్తీ ఆ పరమసత్యానికి లేదను కోడం యుక్తంకాదు.

సత్యాద్వైతంలో జగత్తు ఈ రీతిగా పరమసత్యపు అభివ్యక్తి కావడంవలన అదికూడా సత్యమే అవుతున్నది. పరమసత్యంఅనంతుడు, సచ్చిదానందాత్మకుడు అయిన పురుషోత్తముడు. అతడే యీ జగత్తును తన అనంతస్వరూపమునందు అభివ్యక్త మొనర్చినాడు. అట్టిదగు భౌతిక జగత్తులో, తన స్వరూపానికి విరుద్ధముగా పైకికనిపించే అసత్–అచిత్–అనానందముల మాటున దాగుకొని ఉన్నాడు. ఈ అసత్–అచిత్–అనానందరూపమైన అచేతన వస్తువే తన జడశక్తిచేత యీ భౌతిక జగత్తును సృష్టించినట్లుగా స్థూలదృష్టికి కనిపిస్తూ ఉన్నది.కాని, లోతుగా పరిశీలించి చూచినయెడల, చాటున దాగుకొనియున్న ఒక మహావిజ్ఞాన కార్య ఫలితంగా తప్ప జగత్తులోని యీ వ్యవస్థలన్నీ యీ రీతిగా వ్యవస్థీకరించడం సాధ్యంకాదని బోధగట్టక పోదు. పైన పేర్కొన్న శూన్యప్రాయమైన అచేతనం చాటున దాగుకొనియున్న చేతనారూపుడైన పురుషుడే జడజగత్తులో మొదట జడద్రవ్యంగాను, పిమ్మట ప్రాణం గాను, అటుపిమ్మట మనస్సుగాను, తుదకు ఆత్మచైతన్యంగానూ అభివ్యక్తమౌతూ వస్తున్నాడు. జగత్సృష్టికి మూలంగా స్థూలదృష్టికితోచే జడశక్తి వాస్తవానికి పరమపురుషుని చిచ్ఛక్తియే. ఆ చిచ్ఛక్తివిశేషము జడద్రవ్యంలో దాగివుండి, పిమ్మట క్రమంగా ప్రాణంలో అభివ్యక్త మౌతూ, అటుపిమ్మట మనస్సులో మరింతగా వికసించి, అనంతరం ఆధ్యాత్మిక చేతనలో నిజాత్మను గుర్తించుకొని, కడకు మనస్సు కతీత మైన విజ్ఞానచేతనద్వారమున తనపరమసత్యసాక్షాత్కారము నంది,దానిలో ఏకత్వమును పొందుతున్నది. ఇదియే సృష్టియందు గోచరించెడి క్రమ

వికాసపరిణామము. ఇది బయటకు కనిపించే వివిధజాతుల స్థూలదేహముల క్రమవికాస పరిణామమేగాక, ఆ దేహములందలి ఆత్మవికాస పరిణామమూ, చైతన్యవికాసపరిణామమూ అని కూడ గుర్తించడం అవసరం. చైతన్య మెట్లు ఈ రీతిగా వికసిస్తూ వస్తున్నదో అట్లే సత్యవస్తువునందలి ఆనంద లక్షణంకూడ తొలుత అనానందములో దాగివుండి పిమ్మట సుఖదుఃఖముల రూపమున అభివ్యక్తమై; తుదకు ఆత్మానందమున_ఉపనిషత్తులు పేర్కొనే బ్రహ్మానందమున స్వస్వరూపమును పొందవలసివున్నది. ఇదియే శ్రీ అరవిందులు 'దివ్యజీవన' మనుపేర తాము రచించిన మహనీయ దర్శన గ్రంథంలో జగత్సృష్టితత్వమును గురించి వివరించినదాని సారాంశం.

జగత్తు ఈ రీతిని మాయగాక సత్యమై, పరమపురుషుని అభివ్యక్తియై అందు ఆత్మ చైతన్యం మొదట అచేతనముగ సంకోచమును పొంది, పిమ్మట జడపదార్థముగ వ్యవస్థీకరించబడి, అట్టి జడమునందే క్రమముగా ప్రాణము, మనస్సు వికాసముపొందుతూ రావడం సృష్టివిధానమై గోచరించగా, ఈవికాసపరిణామ మింతటితో ఆగిపోనేరదనీ, మనస్సుపై అంతస్సునుగూడ అది అందుకోవలసి యున్నదనీ శ్రీ అరవిందులకు వారి యోగసాధనానుభూతుల అనుక్రమణికలో పొడగట్టినది. దీనినే తైత్తిరీయోపనిషత్తులో పేర్కొనబడిన కోశముల పద్ధతిలో చెప్పవలసివస్తే పృథ్వియందు అన్న, ప్రాణ, మనోమయ కోశములు వ్యవస్థపొంది అన్న, ప్రాణ, మనోమయ పురుషచేతనావికాసం తద్వారా జరిగినట్లే, మనోమయ కోశం పైనున్న విజ్ఞానమయకోశం కూడా ఇచట వ్యవస్థపొంది, విజ్ఞానమయ పురుష చేతనావికాసంకూడ ఇచటనే అవశ్యం జరగవలసి యున్నది. శ్రీ అరవిందుల దృష్టిలో ఈ విజ్ఞాన

మయ చేతన బుద్ధికాదు. బుద్ధికంటె అతీతమై సృష్టికి మూలమైయున్న అవిద్యారహితమైన సత్యచేతన.

ఓం భూః, ఓం భువః, ఓం స్వః. ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం,—అని వేదంలో సప్తవ్యాహృతులు పేర్కొనబడి ఉన్నవి. ఈ ఏడునూ భూలోక, భువర్లోక, స్వర్లోక. మహర్లోక, జన లోక. తపోలోక, సత్యలోకములకు, అందలి చేతనా విశేషములకు సంజ్ఞలు. బ్రహ్మాండమున భూర్భువ స్వర్లోకములను అపరార్ధముగను, మహర్జన తపో సత్యలోకములను పరార్ధముగను శ్రీ అరవిందులు పేర్కొని వున్నారు. అపరార్ధ పరార్ధముల సంధిలోనున్నది మహస్సు. భూర్భువ స్వర్లోక చేతనలు అన్న, ప్రాణ, మనోమయ చేతనలకు, సత్య, తపో జనలోక చేతనలు సత్-చిత్-ఆనందములకు సంకేతములు కాగా, నడుమనున్న మహస్సు విజ్ఞానమయ చేతనకు సంకేతం. అప రార్ధసృష్టికి బీజభూతమైనది ఈ విజ్ఞానమేయని చెప్పవచ్చు. అవిద్యా వరణం లేని అభేదదర్శనం దీని లక్షణం. దీని దిగువ భూమికనుండియే భేదదర్శనం ప్రారంభమైనది. కనుకనే. పృథ్విలోనికి మనస్సు అవత రించినదాని ఫలితంగా భేదదర్శనులైన మానవులు రూపొందినట్లే, విజ్ఞా నం అవతరించినప్పుడు, అభేదదర్శనులైన అతీత మానవులు పృథ్విపై విలసిల్లగలరని శ్రీ అరవిందులు చాటినారు.

సృష్టివిధానంలో పరచేతన అచేతనగా సంకుచితమై అందుండి జడ పదార్థసృష్టి జరుగుటకు ఎన్నియుగములు పట్టినదో చెప్పలేము. పిమ్మట ఆ జడములోనికి ప్రాణము, అనంతరము మనస్సు అవతరించుటకు ఇంకెన్ని యుగములు కావలసి వచ్చినదో ఊహించలేము. విజ్ఞాన మవతరించుటకు సైతం అట్లే పెక్కు యుగములు పట్టక తప్పదు. కాని, మానవుడు తన యోగసాధనద్వారా ఆ శుభావతరణను సన్నిహితం

చేయగలదని శ్రీ అరవిందులు వక్కాణించారు. ఏలనంటే, ప్రాణ మనస్సుల అవతరణ సందర్భములలోవలెగాక ఇచట మానవుడు ప్రయత్న పూర్వకముగా ఆ విజ్ఞానావతరణము నాహ్వానించి ఆకర్షించుటకు సైతం వీలున్నది. క్రిందినుండి పిలుపునకు పైనుండి ఒత్తిడి తోడు కాగా విజ్ఞానావతరణం ప్రకృతిసహజంగా వచ్చే కాలంకంటే తక్కువ కాలంలోనే సాధ్యపడుతుందనేది యుక్తమే. శ్రీ అరవిందుల యోగ సాధనమంతా అపూర్వమైన యీ మహాప్రయత్నానికే అంకితమై పోయింది.

పృథ్విపై విజ్ఞానచేతనావిలసనమున కనువుగా మనః ప్రాణ దేహముల దివ్యపరివర్తన లీయోగములో ముఖ్యముగా సాధించవలసియున్నది. ఇతర యోగసాధనల కిది లక్ష్యంకాదు. దేహ ప్రాణ మనస్సుల నతిక్రమించి మనస్సున కతీతమైన పరమోపలబ్ధిని పొందుటయే వాటిలక్ష్యం. ఆరోహణమే కాని అవరోహణం వాటియందు లేదు. జీవితమును పరిత్యజించుటే వాటి చరమలక్ష్యమైనందున, జీవితోపకరణములైన దేహప్రాణ మనస్సుల పరివర్తనంతో వాటికి పనిలేదు. ఉన్నత భూమికలకు ఆరోహించుటలోలబ్ధమయ్యే ఆధ్యాత్మికానుభూతుల ప్రభావం వాటిపైన కొంత ప్రసరిస్తే ప్రసరించవచ్చు. అంతమాత్రమున వాటి అవరప్రవృత్తులు నిర్మూలమై అవి రూపాంతరం చెందనేరవు. ఆరోహణంతోపాటు అవరోహణం ద్వారా జీవితానికి పూర్ణ సాఫల్యం సాధించడం శ్రీ అరవిందుల యోగలక్ష్యంగనుక ఇచట మనఃప్రాణదేహముల దివ్య పరివర్తనం కూడా జరుగవలసిన ఆవశ్యకత ఉన్నది. కనుకనే దీనికి పూర్ణయోగమని పేరు.

పూర్ణయోగసాధన అహంకారముతో చేసెడిది కాదని ప్రప్రథమమున గ్రహించడం అత్యంతావశ్యకం. అహంకారం లవలేశంకూడ ఈ

సాధనలో ఉండరాదు. అహంకారమును పరిత్యజించి సర్వాత్మనా పరమే శ్వరునికి తనను తా నధీన మొనర్చుకొనుచూ కొనసాగించవలసిన సాధన ఇది. అహంకారం దేహంలో, ప్రాణంలో, మనస్సులో, - అవరప్రకృతియందలి అన్ని అంతస్తులలోనూ నిష్ఠమై ఉన్నది. అది పూర్తిగా నిర్మూలమై పోయినప్పుడే ఈశ్వరేచ్ఛా విలసనమున కను వైన విశుద్ధిని దేహప్రాణమనస్సులు పొందగలుగుతాయి. ప్రారంభ దశలో ఈ యోగసాధన పురుషకారముతో సాగిననూ పోనుపోను సర్వమూ ఈశ్వరాధీనముగనే ప్రవర్తిల్లడం యోగంలో పరిపక్వతకు లక్షణమౌతుంది. కావుననే యోగ్యలక్ష్యమైన పరమార్థోపలబ్ధికై తీవ్ర మైన ఆకాంక్ష, దానికి ప్రతిబంధకములై సాధనను వక్రింప చేయజూచెడి అవర ప్రవృత్తుల అనవరత నిరాకరణము, ఏ కోశమునందునూ అహం కారమున కణుమాత్రమైన తావీయని సర్వసమర్పణ భావము — ఈ యోగసాధన ముఖ్యాంశములుగా పేర్కొనబడి యున్నవి.

పూర్ణయోగసాధకులకు మార్గదర్శకంగా ఉండుటకై శ్రీ అరవిం దులు వివరించిన మానవసత్తాలోని వివిధ విభాగములను, భూమికలను సంక్షేపంగా ఇచట కొంచెం ప్రస్తావించడం అవసరం. పూర్ణమైన పరమ సత్యం ఏకకాలముననే సగుణము, నిర్గుణముకూడ అని, ఏకము, అనే కముకూడ అని శ్రీ అరవిందులు ప్రవచించిన సంగతి ఈ వ్యాసంలో వెనుక సూచించివున్నాను. పరమపురుషుడు ఒక్కడయ్యూ నానాకేంద్ర విలసితుడు. 'సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్,' కావుననే పరమాత్మలో నిత్యాంశగా విరాజిల్లుతున్నవాడే జీవాత్మ. 'పరాప్రకృతి ర్జీవభూతా' అని భగవద్గీత వర్ణించింది. పరమేశ్వరాభివ్యక్తి రూపమైన ఈ జగత్తులో నానాత్వం ఈ జీవాత్మ కేంద్రములనుబట్టియే వచ్చింది. సృష్టివిధానంలోని సంకోచ వికాస క్రమమంతా వీటిమూలముననే నడుస్తూ

వున్నది. జీవాత్మ సృష్టికి అతీతుడై సృష్టివికాసక్రమమునకు అధ్యక్షం వహించి వుంటాడనీ, సృష్టియందు అతని ప్రతినిధిరూపములు ప్రవేశించి క్రమవికాసము నందుతూ వుంటాయనీ శ్రీ అరవిందులు వక్కాణించారు. అవర జీవరాసులలో ఆత్మ ఆ జీవాత్మ ప్రతినిధియే. మానవునిలోని అన్నమయ, ప్రాణమయ, మనోమయ పురుషులు, వీరికి వెనుకగా హృదయాంతరాంతమునగల చైత్యపురుషుడు జీవాత్మ ప్రతినిధులే. వీరందరిలో చైత్య పురుషుడు అత్యంత ప్రధానుడు. హృదయాంతర్వర్తియై మరుగునఉన్న ఈ చైత్యపురుషుడీవలకువచ్చి సాధనను చేపట్టినప్పుడే సాధన త్వరితగతి నందుకొంటుందనీ, అన్న, ప్రాణ, మనోమయ ప్రకృతుల విశుద్ధిపూర్వకంగా చైత్యపురుషుని ఊర్ధ్వగమనమే సాధనను పరిపక్వం చేయగలదనీ, శిరస్సునకుపైగా ఈ పరిణామమునకంతకూ అధ్యక్షత వహిస్తున్న విశుద్ధరూపంలో జీవాత్మ విరాజిల్లుతున్నదనీ శ్రీ అరవిందులు వివరించారు.

బహిరంతర్విభాగములతో దేహ ప్రాణ మనస్సులను ఆయన రెండుగా విడదీశారు. అంతర్విభాగమైన సూక్ష్మదేహంలోనే మూలధారం నుండి సహస్రారంవరకూ ఆయా స్థానాలలో అన్నప్రాణమనోమయ చేతనలు నెలకొని వున్నాయన్నారు. మనస్సునకు పైనిదైన విజ్ఞానమయ చేతన శిరస్సున కూర్ధ్వమున కలదనీ, మనోమయచేతనలో పై అంతస్తులలో ఉన్నతమనస్సు. ప్రదీప్తమనస్సు, ప్రబుద్ధమనస్సు కలవనీ, మనోవిజ్ఞానమయచేతనల నడిమి సరిహద్దులో అధిమనస్సు ఉన్నదనీ అన్నారు. ఈ వివరాలన్నిటిలోకీ పోవడాని కిచట తావులేదు. ముఖ్యంగా గమనించవలసినదేమంటే, ఇవన్నీ ఆయన తన సాధనానుభవంలో కనుగొని వివరించినవిగాని ఊహించి చెప్పినవికావు. సాధనక్రమంలో ఒకప్పు డాయన నిరవధిక శాంతిరూపమైన నిర్వాణానుభవంలో

దీర కాలముండిన పిమ్మట అంతకంటె ఉన్నతమైన అనుభూతులలోని కెట్లు ప్రయాణించినదీ ఒకచోట పొసగ్రుచ్చినట్లువర్ణించారు. చిత్రవిచిత్రములైన అనుభూతులకు తబ్బిబ్బయిపోక, ఏ అనుభూతితోనూ ఆగిపోక, ప్రతిదానినీ నిశితంగా పరిశీలించి, విలువకట్టి, సూక్ష్మతమాంశములతో సైతం వాటిని వాక్చిత్రాలలో చిత్రించి చూపే ఆయన బుద్ధివిశేషం నిజంగా అత్యంతాశ్చర్యకరం.

భవిష్యత్తులో ఆయన దర్శించిన విజ్ఞానమయ అతీత మానవులతో పృథ్వి ఎప్పటికైనా విలసిల్లుతుందా, ఆయన లక్షించిన సిద్ధికి ఆయన జీవిత మెంతవరకు ప్రమాణభూతమయింది మొదలైన విషయాలు మనబోటుల ఊహ కందనివి. ఈశ్వరసంకల్పం దుర్జ్ఞేయం - శ్రీ అరవిందులు పరమేశ్వరునికి పూర్తిగా సర్వసమర్పణం చేసుకున్న మహనీయులని మాత్రం ఇచట గుర్తుంచుకోడం అవసరం. కాల మనంతం గనుక ఈ పూర్ణయోగ లక్ష్యసిద్ధికి కాలమే ప్రమాణం కావలసి వుంటుంది. కాని, శ్రీ అరవిందులు నాటిన యీ బీజంమాత్రం మొలిచి మొక్కయై వృక్షమై శాఖోపశాఖలుగ కాలక్రమమున విస్తరిల్లక మానదు, ఆరోహణమే ముఖ్యాశయంగాగల ఇతర దర్శనములు, యోగములు జగత్తులో ఎప్పటివలె ప్రాబల్యం వహిస్తూనేవుంటాయి. ఈ పూర్ణయోగ దర్శనం వాటిని ఖండించదు. ఆరోహణంతోపాటు అవరోహణంకూడా సాధించవలసి వున్నదనీ, పృథ్విపై మనస్సు కతీతమైన విజ్ఞాన చేతనావతరణ సృష్టివిధానంలో గర్భితమైయున్న రహస్యమనీ మాత్రం అది సందేశమిస్తున్నది. ఈ యోగపద్ధతికి ఆకర్షితులయ్యేవారు సహజంగా చాల కొద్దిమందే ఉంటారు. కామమును, అహంకారమును పూర్తిగ విడనాడి, సర్వాత్మనా పరమేశ్వరునకు సర్వసమర్పణ మొనర్చుకొన

సిద్ధమగువారే ఈ యోగమునకు ఉత్తమాధికారులని మాత్రం గుర్తించవలసి వుంటుంది. ఆ మాట ఎట్లున్ననూ, భక్తిజ్ఞానకర్మలు మూడింటి సమన్వయంతోనూ నిర్మించబడిన ఈ బాటలో సహజంగా గొప్ప వైశిష్ట్యం లేకపోలేదు. అంతశ్శుద్ధివుండి అనుసరిస్తే, 'స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్.'

—కమలాకర వేంకటరావు

# శ్రీ అరవిందుల సూక్తులు

## జగన్నాటకం

### జగన్నాటకం

ఈ ప్రపంచం ఈశ్వరుని నాటకశాల. ఈశ్వరుడే నటుడు. నీ వాయన ధరించిన వేషం. ఇది నీవూ గుర్తించి, నీద్వారా ఆయననే నటించనీ. జనులు నిన్ను మెచ్చినా గేలిచేసినా, వారుకూడా వేషాలేఅని తెలుసుకో. నీలోని ఈశ్వరునే నీ విమర్శకునిగా, ప్రేక్షకునిగా గ్రహించు.

### అవివేక ప్రవృత్తులు

వేషాలు చూచి కలత చెందుతావెందుకు ? పైకి అప్రియంగానో, జుగుప్సాకరంగానో, భయావహంగానో కనిపించే ఆ వేషాల మాటు నుండి కృష్ణభగవానుడు నీ అవివేకపు కోపానికీ, అంతకంటే అవివేకపు జుగుప్సకూ, ఇంకా అంతకంటె అవివేకపు భయానికీ నవ్వుకుంటున్నాడు. ఇతరులను నిరసించే లక్షణం నీలో పొడసూపినప్పుడెల్ల నీ హృదయంలోనికి దృష్టి సారించుకొని నీ అవివేకానికి నవ్వుకోవడం నేర్చుకో.

## కర్మయోగ దృష్టి

ఈశ్వరుని దృష్టిలో అల్పమనునది లేదు. అల్లే నీ దృష్టిలోనూ ఉండ రాదు. ఒక మహాసామ్రాజ్య నిర్మాణానికి వెచ్చించినంతటి దివ్యపరి శ్రమనే ఆయన ఒక నత్తగుల్ల నిర్మాణానికి సైతం వెచ్చిస్తూ వుంటాడు. నీ మట్టుకు నీవు, భోగలాలసుడూ, అసమర్థుడూనైన రాజుగా వుండే కంటె, చెప్పులు కుట్టడంలో నేర్పరితనంగల మాదిగవాడుగా వుండడం మేలు.

## అతిముఖ్య సుగుణాలు

ధైర్యమూ, ప్రేమ,—ఇవి రెండే తప్పనిసరిగా వుండవలసిన ముఖ్య సుగుణాలు, తక్కిన అన్ని సుగుణాలూ తిరోహితమైపోయినా, లేక నిద్రాణమై వున్నా, ఆత్మను ఈ రెండు సుగుణాలూ ఉద్ధరించ గలవు.

## బ్రహ్మఘటనావిష్కారం

ఒక నక్షత్రకాంతి ఆ నక్షత్రం అంతరించిపోయిన ఎన్నో వందల సంవత్సరాల తరువాత భూమికి చేరునట్లుగా ఆదిలో బ్రహ్మమునందు ఇదివరకే సాధించబడిన ఘటన ఈనాడు అభివ్యక్తమై భౌతిక ప్రపం చంలో మన అనుభవానికి వస్తూవుంటుంది.

## ప్రభుత్వాది వ్యవస్థల మూలకారణం

ఈశ్వరుడు తన స్వరూపం మనకు కనిపించనీకుండ మరుగుపరచు కొన్న హేతువుచేత, ప్రభుత్వాలు, సమాజాలు, ప్రభువులు, రక్షణాధి కారులు, న్యాయాధీశులు, సంస్థలు, పీఠాలు, చట్టాలు, ఆచారాలు,

సైన్యాలు కొన్ని యుగాలపాటు తాత్కాలికంగా మనకూ అవసరమై మనపై విధించబడినాయి. ఆ స్వరూపం తన సహజ సత్య సౌందర్యంతో మనకు గోచరమైన నాడు దాని వెలుగులో ఇవన్నీ అంతర్ధానమై పోవలసినవే.

## మానవ సమాజ గమ్యం

ఏ ప్రభుత్వాలతోనూ పనిలేని స్థితికి మానవుడు చేరుకోవలసివున్నది. అదే అతడు ఆదిలో వలెనే అంతంలో పొందవలసిన యథార్థమైన దివ్యస్థితి. కాని, ఈ నడిమికాలంలో మాత్రం అట్టి అరాజకస్థితి సరాసరి అసురరాజ్యానికి దారితీయక తప్పదు.

## కమ్యూనిస్టు ధర్మము, దాని ఆచరణ

అసూయా ద్వేషాలతో ఒండొరులను చంపుకోడంకంటె, సోదర భావంతో ఒండొరులను ప్రేమించుకోడం శ్రేష్ఠమైనట్లే. విశృంఖల వ్యక్తి స్వేచ్ఛా ప్రధానమైన సమాజధర్మంకంటె కమ్యూనిస్టు సమాజధర్మం శ్రేష్ఠమనే మాట నిజం. కాని, సోషలిజంను ఆచరణలో పెట్టడానికై యూరపులో కల్పితమైన అన్ని విధానాలూ మానవుల పాలిటికి గుదిబండలు, చెరసాలలవంటివిగానే తయారైనాయి.

## కమ్యూనిజం ప్రతిష్ఠ

కమ్యూనిజం పృథ్విపై విజయవంతంగా పునః ప్రతిష్ఠితం కావాలంటే; అహంకార వినాశం, ఆత్మసౌభ్రాత్రం అనే పునాదిపైన మాత్రమే అది సాధ్యపడుతుంది. బలాత్కారపూర్వకమైన సహవాసమూ, యంత్ర

ప్రాయమైన సాహచర్యమూ, సర్వత్రా తుట్టతుదకు పూర్ణమైన సాఫల్యం పొంది తీరవలసినవే.

## మతాలు కనిన కల

కమ్యూనిస్టు రాజ్యసిద్ధికి ఆధారభూతం కాదగినది వేదాంతానుభూతి ఒక్కటే. అట్టి జ్ఞానుల రాజ్యం కొరకే క్రైస్తవమతం, ఇస్లాంమతం, పౌరాణిక హిందూమతం కలలుగన్నాయి.

## ఫ్రెంచి విప్లవ నినాదాలు

'స్వాతంత్ర్యం, సమత్వం, సౌభ్రాత్రం'—అని నినాదాలు చేశారు ఫ్రెంచి విప్లవకారులు. కాని, వాస్తవానికి వారు అమలు జరిపినది ఇంచుక సమత్వం చేర్చిన స్వాతంత్ర్యాన్ని మాత్రమే. ఇక, సౌభ్రాత్ర మంటారా—వారు అమలు జరిపినది కేవలం భ్రాతృ హత్యలకు వెనుకాడనివారి సౌభ్రాత్రం. 'ట్రస్టు' అనీ, 'కంబైన్' అనీ, ఇలాటి పేర్లు దానికి ఒక్కొక్కప్పుడు వారు పెట్టుకొన్నారు.

## మానవ సమాజానికి పరిపూర్ణత

జీవుడు తనదిగా చెప్పుకునేదంతా తనలోని ఈశ్వరునికి సమర్పించుకునే పర్యంతం తాను పరిపూర్ణుడు కానేరడు. అట్లే మానవజాతి తనకు కలిగినదంతా ఈశ్వరార్పణ చేయగలిగేటంతవరకూ మానవ సమాజానికి పరిపూర్ణత సిద్ధింపనేరదు.

## కర్మయోగ లక్ష్యం

కర్మయోగ లక్ష్యం ఆయా కర్మల ఫలితాలను సాధించడం కాదు,—ఇచ్ఛా జ్ఞాన క్రియారూపంలో అభివ్యక్తమయ్యే ఈశ్వరుని నిత్యానంద విభూతియందు పాల్గొనడం.

## ప్రపంచ పురోగతి

ఉన్నతస్థాయిలో విశాలతరమైన వ్యవస్థల ప్రతిష్ఠాపనకు గట్టిగా కృషి చేసేముందు, వాటికంటే తక్కువస్థాయిలోని వ్యవస్థలను నిర్మాణం చేస్తూ ఈశ్వరుని ప్రపంచం సోపాన క్రమంలో ఒక్కొక్క అడుగే ముందుకు సాగుతూవుంటుంది. ప్రపంచమంతా ఒకేజాతిగా ఎప్పటికైన సుసంఘటితం కావాలన్నట్టయితే, నీ దేశంలో నీవు మొదట స్వతంత్ర మైన జాతీయతను సుప్రతిష్ఠితం చేసుకో.

## జాతీయతావిష్కారం

జాతీయత అనేది ఒకే కులంవల్లనో, ఒకే భాషవల్లనో, ఒకే మతం వల్లనో నిర్మాణ మయ్యేదికాదు. దాని కివి చాల తోడ్పడేవి కావచ్చు - అంతే. రక్తసంబంధాలు లేకుండానే మానవసంఘాలు ఎచ్చటెచ్చట తమ పూర్వులనుండి సంక్రమించిన ఒకే వారసత్వసంపదను రక్షించుకోవాలనీ, లేక తమ భవిష్యత్సంతతికి ఒకే భవితవ్యాన్ని ఆర్జించిపెట్టాలనీ ఆశిస్తూ, ఆ ఆశయమందు ఐక్యభావం కలిగివుంటాయో, అచ్చటచ్చటనెల్ల జాతీయత ఆవిష్కారమైన ట్లెంచుకోవచ్చు.

## ఈశ్వర పురోగతిలోని మజిలీ

జగద్రూపంలో పురోగమిస్తున్న ఈశ్వరుడు కులానికీ, వంశానికీ ప్రాధాన్యంగల మజిలీని అతిక్రమించి మరొక అడుగు ముందుకువేయగా వచ్చిన మజిలీయే జాతీయత. కావున, జాతీయత ఆవిష్కారం చెంద డానికి కులాభిమానమూ వంశాభిమానమూ క్షీణించి నశించి పోవడం అత్యంతావశ్యకం.

## త్రివిక్రముని మూడడుగులు

కుటుంబాదర్శం, జాతీయతాదర్శం, మానవతాదర్శం – ఈ మూడూ త్రివిక్రముడైన మహావిష్ణువు వ్యష్టిభావంనుండి సమష్టిభావైక్యం దెసకు వేయ సంకల్పించిన మూడడుగులు. దీనిలో మొదటిది నెరవేరినది. రెండవదాని సంసిద్ధికొరకు కింకనూ ప్రయత్నాలు చేస్తున్నాము. మూడవ దానికొరకు తొలియత్నాలు మాత్రం కొంతవరకు జరిగినవి.

## నీ కర్తవ్యం

మానవు లనేకులు సిరిసంపదలూ, శక్తిప్రాభవాలూ పొందడానికి కృషి చేస్తూవుంటారు. కొందరు పేదరికాన్ని తమ వధువుగా ఆలింగనం చేసు కొంటారు. మరి నీవో, – ఈశ్వరుని పొందడానికి మాత్రమే కృషి చెయ్యి. ఆయనను మాత్రమే వరించి ఆలింగనం చేసుకో. నీకు రాజ సింహాసన మివ్వనీ, భిక్షాపాత్ర యివ్వనీ, అది ఆయనకే వదిలివెయ్యి.

## నే నెవరిని ?

నేను భక్తుడను కాను, జ్ఞానిని కాను, భగవత్కార్యములునెరవేర్పబూనిన

కర్మిష్ఠినీ కాను. మరి నే నెవరిని? నా ప్రభుని చేతిలోని పనిముట్టును. దివ్యగోపకిశోరుడు ప్రమోయించు పిల్లనగ్రోవిని, ఈశ్వర నిశ్శ్వాసవశమున నెగురు ఎండుటాకును.

## భగవత్సంసిద్ధి

భగవానుని నీవు వెంటాడి పట్టుకోగలిగితే, ఆయన నిజతత్త్వాన్ని పొందగలిగేవరకూ నీ వాయనను వదలిపెట్టవద్దు. ఆయన నిజతత్త్వాన్ని పొందగలిగినమీదట, ఆయన పూర్ణత్వాన్ని పొందడానికై నీవు పట్టుపట్టవలసి వుంటుంది. మొదటిది నీకు దివ్యజ్ఞానం ప్రసాదించగా, రెండవది నిన్ను దివ్యకర్మలయందు ప్రతిష్ఠించి జగద్వ్యాపారంలో నీకు పూర్ణానంద మనుగ్రహిస్తుంది.

## ప్రేమస్వరూపావగాహన

భగవానుడు నాకు స్త్రీమూర్తిగా తెలియబడినప్పుడు, ప్రేమ స్వరూపం అతి దూరాన చూచాయిగా మాత్రమే నాకు గోచరించింది. నేనే స్త్రీనై, భగవానుని నా ప్రభునిగా, ప్రియునిగా సేవించగలిగిన తర్వాతగాని, ప్రేమతత్వం నాకు పూర్తిగా అవగాహన కాలేదు.

## భగవత్ప్రేమను గురించి

భగవానునియెడ తమకున్న ప్రేమను గురించి ఇతరులు గొప్ప చెప్పుకుంటారు కాని నేను ఏమని గొప్ప చెప్పుకుంటానంటే, — భగవానుని నేను ప్రేమించడంలేదు. భగవానుడే నన్ను ప్రేమించి, నా వెంటదగిలి, బలవంతాన నన్ను తన వానిగా జేసుకొన్నాడు.

## సృష్టి ప్రయోజనం

దివ్యజ్ఞానంలో, దివ్యకర్మలో పర్యవసించినప్పుడే భక్తికి పూర్ణత్వసిద్ధి. భగవానునితో వ్యభిచరించడమనే దివ్యానుభవం పొందడానికే ఈ జగత్తు సృష్టించబడినది.

## భగవానునియెడ భయప్రవృత్తి

భగవానుడంటే నిక్కంగా భయపడడం ఆయనకు మనం చాలా దూరంగా ఉండిపోవడమే. అలాకాక, ఆటలో ఆయనకు మనం భయపడడం మహదానందంలో భాగమే అవుతుంది కాని వేరుకాదు.

## దాస్యభావ భేదాలు

భగవానునియెడ భయంకలవానిని రూపొందించినవారు యూదులు. భగవానుని స్వరూపజ్ఞానం కలవానినీ, భగవానునియెడ అనురాగం కలవానినీ రూపొందించినవారు భారతీయులు, భయంతో కూడిన దాసత్వభావన యూదులలో పుట్టి అరబ్బులలో పరిణతి చెందగా, అనురాగంతోకూడిన దాసత్వ భావనలో ఆనందించారు భారతీయులు.

## భగవానునితో పోరాటం

భగవానుడు నిన్ను ప్రేమించేటట్లుగా నీవు చేసుకోలేకపోతే, నీతో పోరాడేటట్లుగానైనా చేసుకో, ఆయన నీకు ప్రేమాలింగనం ఇవ్వనిపక్షంలో, మల్లయుద్ధంలో ఆలింగనమైనా నీకాయన ఇవ్వక తప్పని పరిస్థితి కల్పించు.

## వైరసాధన విశిష్టత

భగవానునియెడ వైరం పూని, ఆయన పన్నుగడలను ప్రతిఘటిస్తూ, ఆయనతో ఘోరయుద్ధానికి తలపడడంలో వుండే ఆనందాన్ని నీ ఆత్మ యెన్నడూ ఎరుగకపోతే, భగవానునియందలి పూర్ణానందపు రుచిని నీ వింకనూ చవిచూడలేదనే చెప్పాలి.

## భగవానునితో పోరాటం

పోరాటంలోనే భగవానుడు నా ఆత్మను తనకు బందీగా చేసుకున్నాడు. ఆ పోరాట మిప్పుడు లేదు. అయినా నా స్మృతిపథంలో అది ఇంకా మెలగుతున్నది. ఆనందాశ్చర్య సంభ్రమాలు ముప్పిరిగొనగా దానిని నేను స్మరిస్తూవుంటాను.

## భగవత్ప్రేమానందం

సాటిలేని మహానందం భగవానుని ప్రేమించడంలో ఉన్నది. దాని తరువాత, మానవులలోని భగవానుని ప్రేమించడంలో ఉన్నదికూడా అటువంటి మహానందమే, అనేకత్వలీలలోని ఆనందానుభవం ఈ రెంటింటిలోనూ ఉన్నది.

## భగవత్ప్రేమ రహస్యం

ఒక్కరినే ప్రేమించి పెళ్ళిచేసుకోడం శరీరధర్మం దృష్ట్యా అత్యుత్తమమైనదే కావచ్చు. కాని, మానవులలోని భగవంతుని ప్రేమించే ఆత్మయొక్క ధర్మం మాత్రం అనేకులతో ప్రేమానుబంధం పెట్టుకొని అంతులేని ఆనందాబ్ధిలో నోలలాడడమే. అయితే, ఆ అందరిలోనూ అది ప్రేమించునది మాత్రం ఒకే పరమాత్మను. ఇదీ రహస్యం.

## ప్రపంచం నా అంతఃపురం

ప్రపంచమంతా నా అంతఃపురం. అందలి చేతనాచేతన వస్తుజాతమంతా నా ఆనందానికి సాధనమే. హృదయంలో దివ్యదర్శనానుభూతి కలిగినప్పుడు, సమస్తమూ ప్రియతముడైన భగవంతుని రూపంలోనే గోచరించి ఆనందోన్మత్తత కలుగజేస్తుంది.

## కృష్ణప్రేమ

శ్రీకృష్ణుని నేను తొలుతగా కలుసుకున్నప్పుడు చెలికానిగా అతనిని ప్రేమించాను. ఆ కాలంలో అతడు నన్ను మోసం చేసినప్పుడు నాకు చాలా కోపం వచ్చింది. అతనిని నేను మన్నించలేకపోయాను. తరునాత నే నతనిని ప్రియునిగా ప్రేమించడం జరిగింది. అప్పుడు కూడా నన్ను అతడు మోసం చెయ్యడం మానలేదు. నాకు కోపం మరింత ఎక్కువగా వచ్చింది. కాని ఈపర్యాయం నే నతనిని మన్నించకుండా ఉండలేకపోయాను.

## కృష్ణలీలా రహస్యం

నేనూ, నా కృష్ణుడూ - మా యిరువురితోపాటు ఇతరులూ కూడ ప్రపంచంలో నాకు గోచరించిన కాలమందు, నాతో ఆయన జరిపిన లీలలన్నీ నేను ఎవ్వరికీ వెల్లడిచేయక చాలా రహస్యంగా ఉంచుతూ వచ్చాను. అలాకాక యిప్పుడు ప్రపంచంలో ఎల్లెడలా మా యిర్వురను మాత్రమే నేను చూడనేర్చుకున్నప్పటినుండీ నాకు సిగ్గనేది లేకుండాపోయి అంతా బట్టబయలుగా వాగేస్తున్నాను.

## భగవత్ప్రేమ పూర్ణత్వం

ప్రపంచాన్ని ఓనహాయించి భగవానుని ప్రేమించడంలో ఎంత గాఢత్వ మున్నప్పటికీ అది అపరిపూర్ణమైన ప్రేమయే. ప్రపంచంలోని తుచ్ఛపురుగునూ, పరమపాపిని సైతం నీవు ప్రేమించలేకపోతే భగవానుని ఏమి ప్రేమించినట్లు?

## అనన్య ప్రేమపద్ధతి

భగవానునిపై నీకు అనన్య ప్రేమ ఉన్న కారణాన, భగవానుడు కూడా ఇతరులకంటె నిన్నే అధికంగా ప్రేమించాలన్న భావం నీలో ఉత్పన్నం కావచ్చు. కాని అలా అపేక్షించడం క్రమవిరుద్ధం. ఏలనంటే - భగవానుడు ఒక్కడు, నీవు అనేకులలోనివాడవు. ఆత్మలో నీవు అనేకులతో ఏకం కావడం నేర్చుకో. అప్పుడు ప్రపంచంలో భగవానుని ప్రేమించడానికి నీవుదక్క మరెవ్వరూ ఉండరు.

## కృష్ణప్రేమలో ఈసుకు తావులేదు

కృష్ణప్రేమ ఈసును పుట్టించేదికారాదు. కృష్ణుడు చంద్రబాలిని ప్రేమిస్తున్నప్పుడు, నేనుకూడా ఆమె నెందుకు ప్రేమించరాదు ? నా తగాదా నా ప్రియుడైన కృష్ణుని ప్రేమించని వారితోనేకాని, నాతోపాటు ఆయన ప్రేమలో పాలుపంచుకునేవారితో కాదు.

## ప్రేమసాధనలో నీ కర్తవ్యం

భగవానుని ప్రేమకు ఎవరు పాత్రులవుతున్నారో అట్టివారిని చూచి ఆనందించు. ఎవరిని భగవానుడు ప్రేమించనట్లుగా నటిస్తున్నాడో అట్టివారియెడ జాలివహించు.

## నా స్తికుడు ద్వేష్యుడుకాడు

నాస్తికునియెడ నీ కెందుకు ద్వేషం ? అతడు భగవానుని ప్రేమించడం లేదన్న కారణం చేతనేనా ? అట్లయినచో, భగవానుని ప్రేమించవలసినట్లుగా ప్రేమించకున్న నీవుకూడా ద్వేషించదగినవాడవే.

## భగవదానందం

భగవదానందం పరమాద్భుతమైన పరమ రహస్యం. ఆ రహస్యానందం ఇట్టిదని గ్రహించలేని లౌకికబుద్ధి దానిని ఎన్నోవిధాలుగా ఎగతాళి చేస్తూ వుంటుంది. కాని, ఆ ఆనందాన్ని ఒక్కసారి చవిచూచిన ఆత్మమాత్రం దానిమూలంగా తాను ప్రపంచంలో ఎట్టి అప్రతిష్ఠకూ, ఎన్ని కష్టనష్టాలకూ గురికావలసివచ్చినా ఇక దానిని విడనాడజాలదు.

## భగవానునితో పరమానుబంధ కల్పన

భగవానుని గురునిగా, పితనుగా, మాతనుగా, సఖునిగా, క్రీడాసహచరునిగా, ప్రభునిగా, ప్రియునిగా ఇట్లు ఏడురకాలుగా భావించి ఏడురకాల ఆనందాలను అనుభవించే అవకాశం మానవుని కున్నది. ఈ ఏడింటినీ ఇంద్రధనుస్సులోని వర్ణములవలె మేళవించి ఒకే పరమానుబంధం భగవానునితో నీవు కల్పించుకోగలిగితే, అద్వైతుల మోక్షసుఖాన్ని సైతం నీవు అతిక్రమించగలవు.

## ప్రేమస్వరూప వైవిధ్యం

పురుషునియందలి ప్రేమ, స్త్రీయందలి ప్రేమ, వివిధ వస్తుజాతమందలి ప్రేమ, ఇరుగుపొరుగునందలి ప్రేమ, జన్మభూమియందలి ప్రేమ,

జంతువులయందలి ప్రేమ, మానవజాతియందలి ప్రేమ—ఇవన్నీ ఆయా ఉపాధులలో ప్రతిఫలించిన భగవానునియందలి ప్రేమకు ప్రతిబింబాలే, సమస్తమునూ సర్వదా ప్రేమించి అనుభవించే మహాశక్తి సంపదను సమకూర్చడంకోసమే ఈవైవిధ్యం.

## పరమ మిత్రుడు

భగవానుడు మనకు పరమ మిత్రుడు. ఏలనంటే, మనలను ఎప్పుడు లాలించాలో తెలియడమే కాక, ఎప్పుడు దండించాలో కూడ ఆయనకు తెలుసు. ఎప్పుడు కాపాడాలో తెలియడమేకాక, ఎప్పుడు హతమార్చాలో కూడా ఆయనకు తెలుసు.

## సత్యస్వరూప సాక్షాత్కారం

అశరీరి అయిన అనంతునిగా భగవానుని నీవు చూడగలుగుతూ, పురుషుడు తన ప్రియురాలిని ప్రేమించినట్లుగా నీ వాయనను ప్రేమించగలిగితే, పరమసత్యపు అత్యున్నత శిఖరాలను నీవు అధిరోహించగలిగావని చెప్పవచ్చు. అట్లే, ఆ అనంతునికి నీవు పరిష్వంగయోగ్యమైన దివ్యశరీరాన్ని కల్పించడంతోపాటు ఈ జగత్తున దృగ్గోచరమయ్యే సమస్త శరీరాలలోనూ ఆయనను నీవు దర్శించగలిగితే, పరమసత్యపు అత్యంత సువిశాల అగాధతలాలను సైతం నీవు అందుకోగలిగావని చెప్పవచ్చు.

## బాధానుభవ ప్రయోజనం

పూర్వం నాకు బాధ అంటే గిట్టేదికాదు. బాధను తప్పించుకోడానికే ఎంతో చేస్తూ ప్రయత్నిస్తూ వుండేవాణ్ణి. నాకు బాధకలుగజేయ బడినందుకు

నిరసన ప్రకటిస్తూ వుండేవాణ్ణి. కాని, బాధలే కనుక నేను అనుభవించి వుండకపోతే, నా మనస్సులో, హృదయంలో, శరీరంలో ఈ అపార బహుళానందానుభవ శక్తిసంపద ఈనాడు నాకు లభ్యపడివుండేదికాదు. భగవానుడు తొలుత అత్యంత బాధాకరుడుగా ముసుగువేసుకొని కనిపించినా, అదంతా మన మంచికేనని తుదకాయన నిరూపించుకుంటాడు.

### బాధద్వారా శక్త్యానందాలు

భగవానుడు ఆనందధాముడేకాక సర్వశక్తిమంతుడు. దుఃఖానుభవంద్వారా మనం ఆయన ఆనందతీవ్రతనే కాక, శక్తి తీవ్రతను సైతం భరించ గలుగుతాము. బాధ అనేది శక్తిమందిర కవాటాలను తెరచే తళముచెవి. ఆనందధామానికి మనలను సరాసరి గొంపోయే రాచబాట.

### బాధానుభవం నీయంతట నీవు కోరుకోరాదు!

బాధ అనేది మనలను ఆనందధామానికి గొనిపోయే రాచబాట యని ఉగ్గడించిన కారణాన, నీవుమాత్ర మెన్నడూ బాధానుభవాన్ని కోరుకోరాదు. అది భగవానుని ఇచ్ఛకాదు. నీవు కోరుకోవలసినది ఎప్పుడూ ఆయన ఆనందాన్ని మాత్రమే. బాధానుభవం నీకు ఆయన ఆజ్ఞానుసారం ఎన్నిసార్లు ఎంతవరకు అవసరమైతే అంతవరకు అన్నిసార్లూ తప్పకుండా కలిగితీరుతుంది. అప్పుడా బాధను నీవు ఓపికతో భరించే యెడల దాని ఆనందమయ గర్భకోశాన్ని తుట్టతుదకు నిశ్చయంగా చేరుకోగలుగుతావు.

### హింసా ప్రయోగాధికారం

నీతోటివానిపై హింసాప్రయోగంచేసే అధికారం నీకు లేదు. అది ఒక్క

భగవానునికి మాత్రమే ఉన్నది. లేక, భగవానునిచే ఆదేశించబడినవారి కున్నది. కాని, అలా ఆదేశించబడినవారిలో నీ వొక్కడవని మాత్రం మూఢావేశవశుడవై తలపోయబోకు.

## భగవానునికి పరమ ప్రీతికరమైన రెండు పనులు

భగవత్సేవకులు చేసేపనులలో రెండుపనులు ముఖ్యంగా భగవానునికి అత్యంత ప్రీతికరములై వుంటాయి. ఒకటి—నిరాడంబరమైన భక్తి భావంతో ఆయన ఆలయప్రదేశాలను ఊడ్వడం. రెండు—మానవజాతికి దివ్యత్వసిద్ధి కలుగ గలందులకై ప్రపంచ రణక్షోణిపై నిలిచి పోరాడడం.

## కాళీ ఉపాసన ద్వారా కృష్ణ సాక్షాత్కారం

నిన్ను చంపేవానియందు నీ మరణసమయంలోకూడా నీవు భగవద్దర్శనం చెయ్యగలిగివుండాలి. అట్లే, నీవు చంపవలసి వచ్చేవానియందు ఆ చంపే సమయంలో సైతం భగవత్సాక్షాత్కారమే నీవు పొందగలిగివుండాలి. అదే పరమమైన దివ్యజ్ఞానసిద్ధి కాళిని ఉపాసించనివానికి కృష్ణ సాక్షాత్కారం ఎలా కలుగుతుంది ?

## నిక్కమైన అమృతత్వం

మరణానంతరం మనోమయపురుషుడు మిగిలివుండడమనేది ఒకవిధంగా అమృతత్వమే అయినా నిక్కమైన అమృతత్వం అది కాదు. శరీరముండగానే, మెలకువగావున్న స్థితిలోనే చావుపుట్టుకలు లేని ఆత్మోపలబ్ధి కలిగివుండడమే నిక్కమైన అమృతత్వం. శరీరం అట్టి ఆత్మకు ఛాయ, ఉపకరణము మాత్రమే.

## భగవానుని అస్తిత్వం

ఒప్పిదములైన హేతువులు చూపి, భగవంతుడనేవాడు లేనేలేడని వారు నాకు నిరూపణచేసి చెప్పారు. నేను వారిని విశ్వసించాను. కాని, అటు పిమ్మట, భగవంతుడే నా చెంతకువచ్చి నన్ను కౌగిలించుకున్నందువల్ల నే నాయనను చూడడం తటస్థించింది. ఇప్పుడు నేను దేనిని విశ్వసించాలి? ఇతరుల హేతువాదాన్నా, నా సొంత అనుభవాన్నా?

## ద్వంద్వాతీత దృష్టి

ద్వంద్వాత్మకంగా ఆలోచించే తర్కబుద్ధి నాశ్రయించి యుండిన కాలంలో, అనేక విషయాలయెడ నాకు ఏవగింపు ఉండేది. సాక్షాద్దర్శనంలో తర్కబుద్ధి తిరోహితమైన పిమ్మట ఏవగింపు కలిగించే వికారవస్తువుల కొరకు లోకమంతా గాలించానుగాని అవి యెక్కడా నాకు కనిపించలేదు.

## సమ్యగ్దృష్టి

భగవానుడు నా కన్నులు తెరిచాడు. ఏలనంటే, నీచవస్తువులలోని ఉదాత్తతను, అసహ్య వస్తువులలోని మనోజ్ఞతను, వికలాంగులలోని సౌష్ఠవాన్ని, వికారరూపులలోని సౌందర్యాన్ని నేను చూడగలిగాను.

## క్షమించే దెవరిని

క్షమించేగుణం చాల గొప్పదని క్రైస్తవులు, వైష్ణవులు కీర్తిస్తూ వుంటారు. కాని, నేను క్షమించవలసినది ఎవరిని, ఎందుకోసం, అని నా ప్రశ్న. భగవానుడొక మానవహస్తంతో నన్ను ప్రహరించినప్పుడు,

'ఓభగవానుడా, నీ దుస్సాహసాన్ని క్షమిస్తున్నా' ననియా నే ననవలసినది? భగవానుడొక ప్రహారంతో నాకు మేలు చేకూర్చినప్పుడు, 'ఓ భగవానుడా, నీ క్రూరత్వాన్ని క్షమిస్తున్నాను. ఇలాంటి పనిమాత్రం తిరిగి ఇంకొకసారి చేయవ'ద్దనియా నే నాదేశించవలసినది?

## నాకు కనిపించేది

పాపమేమిటో, పుణ్యమేమిటో నేను పూర్తిగా మరచిపోయాను. నాకు కనుపించేదెల్లా భగవానుడు, జగత్తులో ఆయనలీల, మానవ జాతిలో ఆయన సంకల్పం,—ఇవి మాత్రమే.

## పసిబిడ్డ పరమ విశుద్ధత

మురికిలో పొర్లాడుతున్న పసిబిడ్డను చూచాను. ఆ పసిబిడ్డనే తల్లి నీళ్ళు పోసి శుభ్రంచేసిన మీదట మిసమిసలాడుతూ ఉండగా చూచాను. రెండు సందర్భాలలోకూడా ఆ పసిబిడ్డ పరమ విశుద్ధత నన్ను దద్దరిల్ల జేసింది.

## నాస్తికుడు - ఆస్తికుడు

తనలో తాను దాగుడుమూత లాడుకొంటున్న భగవానుడే నాస్తికుడు. అయితే, ఆస్తికుడు మాత్రం అంతకంటె భిన్నమైనవాడా? బహుశా కావచ్చును. ఏలనంటే, అతడు భగవానుని నీడచూచి దానిని పట్టుకున్నాడు.

## నిద్ర - మేలుకువ

నేను అజ్ఞానంలో నిద్రిస్తూ వుండిన కాలంలో, పుణ్యపురుష మయమైన ఒక ధ్యానమందిరానికి వెళ్ళినప్పుడు, వారి సాంగత్యం నాకు విసువు జనింప జేయగా, ఆ స్థలం నా కొక చెరసాలయై తోచింది. జ్ఞానంలోనికి నేను మేల్కొన్న పిమ్మట, భగవానుడు నన్నొక చెరసాలకు గొనిపోయి, దానినే ఒక ధ్యానమందిరంగానూ, తనతోడి కలయికకు సంకేత స్థలం గానూ మార్చివేశాడు.

## ఒక విడ్డూరం

మానవులు భగవానుని ప్రేమించగలిగి తోటిమానవులను ప్రేమించలేక పోవడ మనేది చాల విడ్డూరమైన సంగతి. మరి, అలాంటివారు ప్రేమిస్తున్న దెవరిని ?

## మతాల వివాదాలు

వివిధ మతాలమధ్య వివాదాలు—అమృతం పోయవలసింది తమలోనే అంటూ వివిధ పాత్రలు తమలో తాము కలహించుకోడం వంటిది. వాటిని అలాగే కలహించుకో నివ్వండి. మనకు ముఖ్యంగా కావలసినది మాత్రం, ఏ పాత్రద్వారా నైనాసరే ఆ అమృతాన్ని పొంది అమృతత్వాన్ని సంపాదించడం. పాత్రలకుండే పరిమళం ఆ అమృతాన్ని కెక్కడా అని మీ రనవచ్చు. కాని, దానిని రుచి అంటారు. రుచిభేదం ఎలావున్నా అమృతత్వం ప్రసాదించే దాని స్వభావాన్ని ఎవ్వరూ తీసి వేయలేరు.

## పెద్దపులి దోషాదోషాలు

తన స్వభావం ప్రకారం ప్రవర్తించడం తప్ప పెద్దపులికి వేరొకటేమీ తెలియదు. కనుకనే దానిలో దివ్యత్వ మున్నది. ఏదోషమూ దానియందు లేదు. ఆత్మవిమర్శ దానిలో తలయెత్తితేమాత్రం, అది మహాదోషియే అవుతుంది.

## మతంవల్ల సమకూరే ముఖ్య సదుపాయం

మతంవల్ల సమకూరే అతిముఖ్యమైన సదుపాయాలలో ఒకటి ఏమిటంటే, నీ వాక్కొక్కప్పుడు భగవానుని పట్టుకొని తనివితీరా తాడనం చేయ వచ్చు. చేసిన ప్రార్థనలు నెరవేరకపోతే తమ దేవుళ్ళను తాడనంచేసే అనాగరికజాతుల అవివేకాన్ని కొందరు గేలిచేస్తూ వుంటారు. కాని, నిజానికి అవివేకులూ అనాగరికులూ ఆ గేలి చేసేవారే.

## దయ – నిర్దయ

నిన్ను నీవు నిర్దయగా విమర్శించుకోవడం నేర్చుకో. అప్పుడు నీవు ఇతరులయెడ దయతో మెలగడం నేర్చుకో గలుగుతావు.

## అనుభవమే ప్రమాణం

శాస్త్రం బోధించిన సత్యాన్ని నీ ఆత్మలో సాక్షాత్కరించుకొని అనుభ వించు. అటుపిమ్మట కావాలనుకుంటే ఆ అనుభవాన్ని బుద్ధితో తర్కించి వాగ్రూపంలో అభివ్యక్తంచెయ్యి. అయితే, ఈ ప్రవచనాన్ని మాత్రం నీ వెన్నడూ పరమప్రమాణంగా భావించవద్దు. నీకు పరమప్రమాణం నీ అనుభవమే.

## ఆత్మానుభవాలలో భిన్నత్వం

నీ ఆత్మానుభవం నీవు యథార్థమని చాటుకొని, దానికి భిన్నంగా ఉండే మరొకరి ఆత్మానుభవం యథార్థంకాదని నీవు నిరాకరించేయెడల, భగవానుడు నిన్ను వెర్రివాణ్ణిచేసి నవ్వుకుంటున్నాడని తెలుసుకో, నీ ఆత్మ మందిరపు తెరల చాటునుండి తనలో తాను ఆనందిస్తూ ఆయన నవ్వే నవ్వు నీకు వినబడడంలేదా ?

## సాక్షాత్కారం

సాక్షాత్కారం పొందడ మంటే ప్రత్యక్షంగా చూడడం, ప్రత్యక్షంగా వినడం, దివ్యస్ఫురణచే స్మరించడం_దృష్టి, శ్రుతి, స్మృతి. అది ఒక పరమోత్కృష్టమైన అనుభవం. దానిని ఎప్పుడైనాసరే తిరిగి పొందడానికి వీలున్నది. దైవంచేత పలుకబడినందువలన గాక, ఆత్మచేత దర్శించబడినందువలననే శాస్త్రవాక్కు మనకు పరమప్రమాణ మవుతున్నది.

## శాస్త్రవాక్కు అర్థనిర్ణయం

శాస్త్రవాక్కు అమోఘమే, అందు పొరపాటుండదు. కాని, దాని అర్థం ఇదియని హృదయంతోనూ, బుద్ధితోనూ చేసే వ్యాఖ్యానంలో పొరపాటుండవచ్చును.

## బంధరహిత కర్మప్రవృత్తి

సామాన్య మానవ జీవితం గడుపుతూనే బంధముక్తుడై వుండడం చాల

కష్టమైనపని, కష్టమైనది కనుకనే దానికొరకు ప్రయత్నం చేసి సాధించడం అవసరం. దేవర్షియైన నారదుడంతటివాడు కూడా జనక చక్రవర్తి బాహ్య ప్రవృత్తులనుబట్టి ఆయనను భోగపరాయణునిగా భావించాడు. ఆత్మను దర్శించగలిగితే తప్ప ఒకడు బద్ధుడో ముక్తుడో నీవెట్లు చెప్పగలవు?

## మానవాత్మ దర్శనం

ఆధునిక విజ్ఞానశాస్త్రం కనిపెట్టిన సాధనాలద్వారా సూర్య, అంగారక గ్రహాదుల ఛాయాచిత్రాలను చూడగల్గడం చాల గొప్ప విశేషమే. కాని, మానవుని ఆత్మను చిత్తరువులో చూచినట్లుగా చూచేసాధనం నీకు అల వడినప్పుడు, ఈ భౌతిక విజ్ఞానశాస్త్రపు వింతలన్నీ పిల్లల బొమ్మలాట వలె కనిపించి నీకు నవ్వు రాకమానదు.

## కర్మలో అకర్మ

నీవు మహత్కార్యాలు చేస్తూ బృహత్ఫలితాలు సాధిస్తున్నప్పుడు ఏమీ చెయ్యడం లేదన్న అనుభవాన్ని పొందగలిగితే భగవదనుగ్రహం నీకు కనువిప్పు కలిగించిందని తెలుసుకో.

## అకర్మలో కర్మ

పర్వత శిఖరాగ్రాన ఒంటరిగా, మౌనంగా నీవు కూర్చున్నప్పుడు. నీచే నిర్వహించబడుతున్న విప్లవాలను నీవు దర్శించగలిగితే, నీకు దివ్యదృష్టి సిద్ధించినదనీ, దృశ్య బంధమునుండి నీవు విముక్తుడవైనావనీ తెలుసుకో.

## జీవన సూత్రం

ప్రకృతి ననుసరించి జీవించు, — అనేది పాశ్చాత్య జీవన సూత్రం, కాని, ఏ ప్రకృతి? శరీర ప్రకృతా, దాని కతీతమైన ప్రకృతా? ఓ అమృత పుత్రుడా! ప్రకృతి ననుసరించి జీవించవద్దు. ఈశ్వరు ననుసరించి జీవించు. ప్రకృతినికూడా నీలోని ఈశ్వరు ననుసరించి వర్తించేటట్లు అధిశాసించు.

## విధియనగా:-

విధి యనగా, దేశ కాలాలలో జరగవలసి యున్నదానిని గురించి ఈశ్వరుడు దేశ కాలాతీతుడై దర్శించినది. ఆయన ఆ విధంగా దర్శించినదానినే వివిధ శక్తుల సంఘర్షణలద్వారా ప్రకృతి కార్యరూపంలో సాధిస్తుంది.

## "నిమిత్తమాత్రం భవ"

ఈశ్వరుడు సర్వమూ ముందే సంకల్పించి దర్శించాడు గదాయని, నీవు నిష్క్రియుడవై కూర్చుండి ఆయన విధిఫలితంకోసమై నిరీక్షించరాదు. ఏలనంటే, నీ కర్మకూడా ఆయన కుపకరణమైన ప్రధాన శక్తులలో నొక్కటే. కనుక, ఆయనచే ముందుగనే నిర్ణీతమైన ఘటనకు నిమిత్తమాత్రుడవై, ఉపకరణానివై అహంకారము వర్జించి కర్మ చెయ్యి.

## పాపజీవనుల పూజ్యత

నేను అజ్ఞానంలో ఉన్నప్పుడు, చోరులను, హంతకులను, పాపజీవులను

ఏవగించుకొన్నాను. అజ్ఞానం తొలగినమీదట చోరునికీ, హంతకునికీ ఆత్మలో నమస్కరించాను. జారస్త్రీ పాదాలను పూజించాను. ఏలనంటే, ఈ జీవులు విపరీతమైన పాపభారాన్ని మోస్తూ, సంసారసాగర మథనంలో పుట్టిన కాలకూట విషంలో విశేషభాగాన్ని మనందరికోసమూ ఓడ్చి వేస్తున్నారు.

## రాక్షసుల బలాధిక్యత

దేవతలకంటె రాక్షసులు బలవంతులు. ఎందువల్ల ? ఈశ్వరుని క్రోధాన్నీ శత్రుత్వాన్నీ ఎదుర్కొని భరించడానికి ఆయనతో వారు ఒప్పందం చేసుకున్నారు. దేవతలు సుఖప్రదమైన ఆయన ప్రేమానుగ్రహానందభారం వహించడానికి మాత్రమే అంగీకరించగలిగారు.

## ఈశ్వరుని కార్యపద్ధతి

తుట్టతుది ఆనందం అందుకోడానికి దుఃఖమనేదీ, అడ్డులేని కార్యసిద్ధి పొందడానికి అపజయమనేదీ, కట్టకడపటి తీవ్రావేగం అలవడడానికి అవరోధమనేదీ ఎంతగా అవసరములో నీవు గుర్తించగలిగినప్పుడే, ఈశ్వరుని కార్యపద్ధతులు మసక మసకగానైనా ఏ కొంచెమో నీకు అర్థం కావడమనేది ప్రారంభమౌతుంది.

## కళా ప్రయోజనం

ప్రకృతిని అనుకరించడమే కళకు లక్ష్యమైతే ప్రపంచంలోని చిత్రకళాశాలలన్నింటినీ తగులబెట్టి వాటికి బదులుగా ఫోటో స్టూడియోలను వెలయింపజేయడం మంచిది. ప్రకృతి మరుగు పరచిన దానిని కళ వెల్లడిచేస్తుంది

కనుకనే, ఒక చిత్రరువు రాజాధిరాజుల, కోటీశ్వరుల మహదైశ్వర్య సంపత్తికంటే ఎంతో విలువయైనది.

## ప్రకృతికి దర్పణం పట్టడం కవి కర్తవ్యమా ?

ఓ కవీ ! ఓ శిల్పీ! ప్రకృతికి దర్పణం పట్టడమే నీ పనియైతే నీవు చేసే పనికి ప్రకృతి ఎంతమాత్రమూ సంతోషించదు. ఏలనంటే, నీవు దర్పణం పట్టేది ఆమె నిజస్వరూపానికి కాదనీ, నిర్జీవమైన ఆమె ఛాయకు మాత్రమేననీ తెలుసుకో. నీవు పట్టుకోవలసినది ఆమె గుప్తాత్మను. ఏ నిత్యసత్యానికి ఆమె ఛాయారూపం నిత్యప్రతీకయో దాని కొరకే నీవు నిత్యమూ అన్వేషించవలసి వున్నది. అన్వేషించే నిన్ను గాని, అన్వేషించబడే ప్రకృతినిగాని ఏదర్పణాలూ పట్టజాలవు.

## షేక్స్పియర్ సృష్టించిన పాత్రలు

కవిచేసేపని 'ప్రకృతికి దర్పణం పట్టడం' — అనే అలంకార కల్పన చేసినవాడు షేక్స్పియర్ మహాకవే అయినా, ఎన్నడూ ఆయన అనుకరణలకూ, ఛాయాచిత్ర రచనలకూ దిగినవాడు కాదు. ఆయన సృష్టించిన ఫాల్‌స్టాఫ్, మాక్‌బెత్, లియర్, హామ్లెట్ — మొదలైన పాత్రలు ప్రకృత్యనుకరణలుగా భావించే పాఠకునికి అంతర్దృష్టి లేదనో, ఒకానొక ఉక్తివైచిత్ర్యాని కతడు సమ్మోహితుడై పోయాడనో అనక తప్పదు.

## షేక్స్పియర్ సాధించిన మహత్కార్యం

సూక్ష్మమైన వ్యక్తి గుణశీల వైచిత్ర్యాలను ప్రస్తావించక పోవడంద్వారా విశ్వజనీనతను సాధించారు గ్రీకులు. అపురూపమైన వ్యక్తి గుణశీల

పై చిత్రాలకు విశ్వజనీనత కల్పించి షేక్స్పియర్ మహాకవి ఆ పనిని మరింత విజయవంతంగా సాధించాడు. మన దృష్టినుండి అనంతుని మరుగుపరచడానికి ఉపకరణంగా ప్రకృతి ఉపయోగించే దానినే షేక్స్పియర్ మానవునిలోని అనంతగుణుని సాక్షాత్కరింపజేయడానికి ఉపయోగించాడు.

## జ్ఞానం – అనుష్ఠానం

నీవు తెలుసుకొన్న దానిని ఆచరణలోపెట్టి, అదే నీవై పోవడం నేర్చుకో. అప్పుడు, ఆ జ్ఞానమే నీలోపల ప్రత్యక్ష దైవంగా నీకు భాసిస్తుంది.

## భగవంతుని నేతృత్వం

మనం అజ్ఞానబంధంలో తగుల్కొని వున్నప్పుడు కూడా మనలోని భగవంతుడు మనకు ఏడుగడగా వుండి నడిపిస్తూనే వున్నాడు. అయితే, గమ్యస్థానం చేరుకోడం నిశ్చయమే అయినా. అది చుట్టుత్రోవలు, ప్రక్కత్రోవలు, పట్టిన అనంతరం చేరుకోడమవుతుంది.

## మంచి చెడుగులు

మంచివాడు మరణించడం, అపజయం పొందడం_చెడ్డవాడు జీవించడం, విజయం పొందడం_ వీటినిబట్టి ఈశ్వరతత్వం చెడ్డదనవలసినదేనా ? ఇది సరియైన తర్కంగా నాకు తోచదు. అసలు మృత్యువు, అపజయము చెడ్డవి ఎట్లయినాయి! అవి సంప్రాప్తమైనప్పుడు మన తత్కాల పరమ శ్రేయస్సు కొరకే సంప్రాప్తమైనట్టు నే నొక్కొక్కసారి భావిస్తూ

ఉంటాను. మన చిత్తవృత్తులు మనలను వివేక భ్రష్టులను చెయ్యడం వలన, వాటి కిష్టంకాని ప్రతిదీ చెడ్డదని వాదించడం మనకు పరిపాటి అయిపోయింది.

## అపజయ ప్రయోజనం

నేను అపజయాలు పొంది కష్టాలనుభవించడ మనేదే జరుగకపోతే, నా జీవిత పరమార్థం నాకు దక్కకుండా పోయేదని వెనుకటి జీవితం సింహావలోకనంచేసి చూచుకుంటే నా కిప్పుడు స్పష్టంగా తెలుస్తున్నది. కాని, ఆ అపజయాలు, కష్టాలు అనుభవించే సమయంలో మాత్రం, ఒక మహావిపత్తు సంఘటిల్లినట్టే భావించి తల్లడిల్లిపోయాను. ఎట్ట యెదుట సన్నిహితంగా కన్పించేదితప్ప మరేదీ చూడజాలని హేతువుచే మనం నానా విక్షేపాలూ చెందుతూ వుంటాము. శాంతచిత్తులమై, అహంకారం నిర్జించి, విశ్వవిశాల దృష్టిని మనం అలవరచుకోవాలి.

## విశ్వజనీన దృష్టి

విశుద్ధమైన విశ్వజనీనదృష్టి, విశ్వజనీన భావం, ఇదే సకల దుఃఖాలకూ, భ్రమలకూ నివారణోపాయం. కాని, మానవులనేకులు సామాన్యంగా విశ్వజనీనత పేరట తమ అహంకారాన్ని విస్తృతపరచుకోడం మాత్రమే చేస్తూవుంటారు.

## కుహనా విముక్తి

'నా దేశం కోసం', 'మానవజాతి కోసం', 'ప్రపంచం కోసం',... అంటూ మానవులు వాకొనడం, తలపోయడం. జరుగుతూ వుంటుంది.

కాని, అంతర్యంలో వారి నిక్కమయిన అభిప్రాయం మాత్రం — 'నా దేశంలో అంతర్భూతుడనైన నా కోసం', 'మానవ జాతిలో అంతర్భూతుడనైన నా కోసం', 'ప్రపంచంగా నేను ఊహాకల్పన చేసుకున్న నా కోసం' అనియే. అది అహంకార విస్తృతి కావచ్చు కాని, విముక్తి కానేరదు. విడుదల పొంది, ఒక పెద్దఖైదులో వుండడమనేది విముక్తి లక్షణ మనిపించుకోదు.

## తిన్నని విముక్తిమార్గం

నీవు జీవించవలసినది నీ పొరుగువానిలో వున్న భగవంతుని కోసం. నీలో వున్న భగవంతునికోసం, నీ దేశంలో ఉన్న భగవంతునికోసం, నీ విరోధి దేశంలో వున్న భగవంతునికోసం, మానవజాతిలో వున్న భగవంతుని కోసం, చెట్టులో, రాయిలో, పశువులో వున్న భగవంతుని కోసం, ఈ ప్రపంచానికి లోపలా వెలుపలా వున్న భగవంతుని కోసం. అప్పుడే నీవు తిన్ననైన విముక్తి మార్గంలో నడుస్తున్నవాడ వవుతావు.

## శాశ్వతత్వ నిరూపణ

శాశ్వతత్వంలో చిన్న, పెద్ద తరగతులున్నాయి. ఏలనంటే శాశ్వతత్వ మనేది ఆత్మసంబంధమైన భావం. అది కాలం లోపలా వుండగలదు, కాలాతీతంగానూ వుండగలదు. 'శాశ్వతీః సమాః'—అని ఉపనిషత్తులు పేర్కొన్నప్పుడు, అచట కడు విస్తారమైన, కొలతకందని దేశకాలాలు సూచితమవుతున్నాయి. నిరపేక్ష శాశ్వతత్వం కలిగిన వస్తువు నిర్విశేష బ్రహ్మ మొక్కటే. అయినా, అంతర్దృష్టితో చూచినప్పుడు అన్ని వస్తువులూ వాస్తవానికి శాశ్వతములుగానే కనిపిస్తాయి. వాటికి అంతము లేదు, ఆదీ లేదు.

## పేదలయెడ నీ బాధ్యత

పేదలు నీ చెంత ఉన్నప్పుడు వారికి తప్పక సహాయం చెయ్యి. కాని, అంతతోనే తృప్తిచెందకు. నీవు సహాయపడేటందుకు అసలు పేదలనే వారే లేకుండ చెయ్యడ మెలాగో పరిశోధించి అందుకోసం కూడా కృషిచెయ్యి.

## పేదరికం చేసే నిరూపణ

సమాజంలో పేదరికం వుండడ మనేది ఆ సమాజం అన్యాయంతో కూడు కొని అవ్యవస్థితమై వున్నదనే విషయాన్ని నిరూపణ చేస్తుంది. బంది పోటుగాని మనస్సాక్షి కొంచెం కొంచెంగా మేల్కొనజొచ్చినదాని సూచ నలే ప్రజోపయోగార్థమై వెలసిన మన ధర్మాదాయాలు.

## ప్రాచీన భారతీయ సాంఘికాదర్శం

ప్రాచీన భారతీయ సాంఘికాదర్శం ప్రకారం, బ్రాహ్మణుడు ఐచ్ఛికంగా స్వచ్ఛమైన నిరాడంబర జీవనం గడుపుతూ విద్యావంతుడై ఉచితంగా సమాజానికి విద్యాబోధ చెయ్యాలి. క్షత్రియుడు పరిపాలనా ధర్మం నిర్వహిస్తూ దుర్బలులకు రక్షకుడై యుద్ధరంగాలలో ప్రాణాలర్పించాలి. వైశ్యుడు వాణిజ్యంద్వారా లాభాలు సంపాదించి ఆ లాభాలను సమాజా నికే దానధర్మాల రూపంలో సమర్పణ చెయ్యాలి. శూద్రుడు తక్కిన వారికి దాసుడై సేవిస్తూ భౌతికవస్తు సమృద్ధిని కలిగి జీవించాలి. దాస త్వానికి పరిహారంగానే అతనికి త్యాగమయ జీవితరూపంలోగాని, రక్త బలిదానరూపంలోగాని, ధనసంపద్వితరణ రూపంలోగాని సుంకం చెల్లించే బాధ్యత లేకుండా చెయ్యబడింది.

## పేదరికం జాతీయాదర్శం కారాదు

ఒక వర్గంకాని, వ్యక్తిగాని పేదరికాన్ని కోరి చేపట్టడం గొప్ప విషయమే, ప్రయోజనకారియే. కాని, దానిని సర్వసాధారణమైన జాతీయాదర్శముగా వ్యవస్థ చేయడానికి ప్రయత్నించితే మాత్రం, జాతీయ జీవన విస్తృతికీ సుసంపన్నత్వానికీ అది భంజకమై ప్రమాదకరంగా తయారవుతుంది.

## ఉన్నతి లక్షణం

విస్తారమైన సంపదలతో తులతూగుతూ విరివిగా ఖర్చుపెట్టే ఆదర్శం కలిగిన ప్రాచీన భారతదేశం అన్ని దేశాలలోకీ గొప్పదేశంగా విరాజిల్లింది. సన్యాసప్రవృత్తిః జాతీయాదర్శంగా స్వీకరించే ధోరణిలో ఉన్న ఆధునిక భారతదేశం జీవనసమృద్ధిని కోల్పోయి, పేదపడి దుర్బలమై పతనావస్థలో నున్నది.

## సుఖశాంతుల సమస్య

పేదరికాన్ని తొలగించినంత మాత్రాననే మానవులు సుఖశాంతులతో మనగలరనీ, సమాజానికిక కష్టాలూ, సమస్యలూ ఉండబోవనీ అపోహ చెందబోకు. అది అన్నిటికంటె మొట్టమొదటగా తీరవలసిన కనీసపు అవసరం మాత్రమే, లోని ఆత్మ అవ్యవస్థితిలో ఉన్నంతకాలం బయట అశాంతీ, విప్లవమూ, కల్లోలమూ తప్పవు.

## మధ్యయుగ క్రైస్తవ మతం ఉద్బోధ

"ఓ మానవుడా, ఈ భూమిపై నీవొక నికృష్టుడవు. భగవంతుని క్రోల

కీటకప్రాయడవు. అహంకారం విడనాడి, భవిష్యత్తు కొరకు జీవిస్తూ, భగవంతునికీ, ఆయన పూజారికీ విధేయుడవై మెలగు', – అని ఉద్బోధించింది మధ్యయుగపు క్రైస్తవమతం. కాని, దాని ఫలితాలు మానవ జాతికి శ్రేయోదాయకములు కాలేదు.

## ఆధునిక విజ్ఞానం ఉద్బోధ

'ఓ మానవుడా, నీవొక అశాశ్వత జీవివి. ప్రకృతిలో చీమ, దోమ ఎంతో నీవూ అంతే. విశ్వాంతరాళంలో నీవొక చిన్న నలుసువు. కనుక, రాజ్యంకొరకు జీవిస్తూ, సుశిక్షిత పరిపాలకునికీ, విజ్ఞానశాస్త్ర కోవిదునికీ విధేయుడవై ప్రవర్తించు', – అని హెచ్చరిస్తున్నది ఆధునిక విజ్ఞానం. కాని, మానవజాతికి మధ్యయుగపు క్రైస్తవమతోద్బోధవలె ఇదికూడా ఏమంత గొప్ప మేలు చేకూర్పజాలదు.

## వేదాంతం చేసిన ఉద్బోధ

'ఓ మానవుడా, నీకు ఈశ్వరునితో తత్త్వతః, స్వభావతః ఏకత్వమున్నది. తోటి మానవులతో ఏకాత్మత ఉన్నది. కనుక, మెలకువ పొంది, దివ్యత్వంవైపు పురోగమిస్తూ నీలోను, ఇతరులలోను గల ఈశ్వరుని కొరకు జీవించు'– అని ఉద్బోధిస్తున్నది వేదాంతం. కొలదిమందికి మాత్రమే చేయబడిన ఈ ఉద్బోధ ఇకమీద సమస్త మానవజాతికి దాని విముక్తికొరకై చేయవలసియున్నది.

## జీవితకర్మల సాఫల్యం

ప్రతి తలంపులో, ప్రతి చేష్టలో, సాహిత్యంలో, శిల్పంలో, నిత్య

జీవితంలో, గృహంలో, ప్రభుత్వంలో, సమాజంలో, ధనం సంపాదించడంలో, నిల్వచేయడంలో, ఖర్చుపెట్టడంలో, అన్నింటిలోనూ మర్త్యరూపధారియగు అనంతుని అభివ్యక్తమొనర్చే శక్తిని నీవు సంపాదించగలిగినప్పుడు, నీ జీవితకర్మల సాఫల్యాన్ని నీవు సంపూర్ణంగా పొందగలుగుతావు.

## భావనాశక్తి

భావన జగన్నిర్మాణం చేస్తుంది. మనస్సే యథార్థం. దృశ్యమంతా స్వప్నమే. ఒక భావనను దృఢంగా మనం ధారణచేసినప్పుడు, దానికి విరుద్ధమైనదంతా క్రమంగా కరిగిపోతుంది. అది అంతా ఏమైపోయిందా అనీ, ఒకప్పు డది మనలను ఎలా భ్రమ పెట్టిందా అనీ మనం అచ్చెరువొందుతాము.

## శక్తి సాధన

'నేను శక్తిమంతుడను, నేను శక్తిమంతుడను'—అనెడి ఒకే ఒక భావనను మనం మనఃపూర్వకంగా, ప్రశాంతంగా, నిశ్చలంగా, నిండు విశ్వాసంతో హృదయమందు మౌనస్థితిలోనే ధారణచేసి ఉద్ఘాటించినప్పుడు, దాని సాన్నిధ్యంలో తద్వ్యతిరేక భావాలన్నీ బిగువు సడలి బలహీనములై ప్రక్క కొదిగి నిలువక తప్పదు.

## ఏకత్వ భావన

'మేమంతా ఒక్కటి, మేమంతా ఒక్కటి. మేము వేర్వేరనే భావం మాలో కలిగించడం దేనివలనా సాధ్యంకాదు. మేమంతా ఒక్కటి.

మాలో ఉండే విభేదాలన్నీ మిథ్యలు' - అని ఆసేతుహిమాచలంలోగల భారతీయులంతా ప్రతి సాయంకాలం ప్రదోష సమయాన ఒక పది నిమిషాలసేపు భావించనేర్చుకుంటే, దానివలన ఉత్పన్నమయ్యే శక్తి నిస్సందేహంగా అపారమే కాగలదు.

## దుర్వినియోగం కూడదు

భావనాశక్తిని ఎల్లప్పుడూ నిర్మాణాత్మక ప్రయోజనాలకే వినియోగించాలి. ద్వేషం, అసూయ, క్రోధం—వీటికి వశులమైపోక, ప్రేమతో, విశ్వాసంతో ఏదైనా ఒకే అభ్యుదయ కార్యంకొరకే దాని నుపయోగించాలి. ఒక అసత్యాన్ని ఖండించడమో, ఒక అశుభాన్ని నివారించడమో చేయవలసిన సందర్భంలోకూడ మనం చింతించవలసినది సత్యాన్ని గురించీ, శుభాన్నిగురించేకాని, అసత్యాన్నిగురించీ, అశుభాన్ని గురించీ కాదు.

## దుర్వినియోగం ప్రమాదకరం

మానసిక శక్తులను సరాసరి విధ్వంస ప్రయోజనాలకు ఉపయోగించడం హేయం. తప్పకుండ అది తిరిగి ఆ ఉపయోగించినవాని మీదికే అతి భయంకరంగా విరుచుకొని పడుతుంది. తనకు మానసికశక్తులు కలవని తెలిసినవానిలో మహోదాత్తమైన లోకశ్రేయోభిలాష దీపిస్తూ వుండడం అత్యంతావశ్యకం.

## ఏకలక్ష్యంపై ఏకాగ్రత

మానసికశక్తి నుపయోగించగోరేవాడు ఒకదాని కొకటి సరిపడని రెండు శుభముల నొకేసారి లక్షింపరాదు. అన్నిటిలోకీ ఏది ఘనతరమో,

అపేక్షణీయమో దానినే ఎన్నికచేసి, దానిపై మనస్సు నేకాగ్రం చెయ్యాలి. అప్పుడు దానికున్న ప్రతిరోధములన్నీ పొటంతటవే పటా పంచలై పోతాయి. పరస్పర విరుద్ధాశయాలతో గజిబిజి కావడం సామాన్య లోకపద్ధతి.

## మానసికశక్తి విజృంభణ

మనం సాధించగోరే లక్ష్యం ఎంతెంతగా స్వార్థము నతిక్రమించగలిగితే మన మానసికశక్తి అంతంతగా పుంజీభవించుకొని విజృంభిస్తుంది. 'ఓ మహనీయ భారతదేశమా, మేలుకో, మేలుకో, అని ప్రతిదినం ఒక నిర్ణీతసమయంలో లక్షల కొలదిగా ప్రజలు తమ మనస్సులందు ప్రశాంతముగా ఉద్ఘాటన చేసినప్పుడు, దానినుండి ఉద్భూతమయ్యేశక్తి ఆ విషయంపై వారి ఏకాగ్రభావపు లోతు ననుసరించి నిశ్చయంగా అపారమే కాగలదు.

## నిర్మాణాత్మక భావన

మనసులో మనంచేసే భావన సుస్పష్టంగాను, సువ్యవస్థితంగానూ ఉండాలి. అది సాధించినప్పుడు, దానిలోంచి నిర్మాణశక్తి ఉద్భూతం కావడంచూచి మనమే ఆశ్చర్యపోతాము. వెలుపలి ప్రపంచం లోపలి ప్రపంచాన్ని ప్రతిబింబించడం ప్రారంభిస్తుంది. పురుషులూ, స్త్రీలూ రూపుగైకొన్న భావాలుగా మారిపోతారు.

## ప్రపంచ సంస్కృతికి ఏడుగడ

ప్రపంచ సంస్కృతికి భారతజాతీయ సంస్కృతి ఏడుగడ కావాలి.

పూర్వం ఉన్నత ప్రమాణాలుగల వివిధ విద్యలలో, కళలలో భారతీయ సంస్కృతి ప్రతిబింబితమైనప్పుడు ఆ విధంగానే జరిగింది. ఇప్పుడు ఈ వైజ్ఞానిక యుగంలోకూడా అట్లే జరుగవలసివున్నది. భారతీయమేధ మరెవ్వరి మేధకూ తీసిపోదని ప్రపంచ చరిత్ర చాటుతూ వున్నది. భాస్కరాచార్య, శంకరాచార్యులను గన్న జాతీయులు, న్యూటన్, డార్విన్‌లను గన్న జాతీయుల కేమాత్రం తీసిపోరు.

## నిర్దుష్ట కర్మాచరణ

మానవుడు తప్పుదారులలో నడుస్తూవుండగా ఈశ్వరుడు వానిని నడిపిస్తూ వుంటాడు. అపరాప్రకృతికొట్టే పల్టీలను పరాప్రకృతి సాక్షిగా తిలకిస్తూ వుంటుంది. ఈ విషమస్థితి నుండి బయటపడి. విశుద్ధజ్ఞానరూపమైన ఆత్మైక్యం అందుకొన్నప్పుడే నిర్దుష్టకర్మాచరణం మనకు సాధ్యమవుతుంది.

## ఈశ్వరుని కొకనికే దాసత్వం

సకల ప్రాణుల యెడ నీవు దయగలిగి ఉండడమనేది మంచిదే. కాని, నీ దయకు నీవు దాసుడవు కావడం మాత్రం మంచిది కాదు. ఈశ్వరునికిదక్క మరెవ్వరికీ నీవు దాసుడవు కావద్దు. ఈశ్వరుని ముఖ్యపరివార దేవతలకు సైతం నీవు దాసుడవు కాకుండ నుండవలసినదే.

## మానవ లక్ష్యం

ఆనందమే ఈశ్వరుడు మానవజాతికి నిర్దేశించిన లక్ష్యం. దీనిని నీవు మొదట సంపాదించుకోగలిగితే పిమ్మట నీతోటివారికి పంచిపెట్ట గలుగు

తావు. మానవుడు స్వర్గసుఖ మనుకోని పుణ్యసంపద అనుకోనీ తనకు మాత్రమే సంపాదించుకునేది సరియైన సంపాదన కానేరదు.

## క్రోధద్వేషాలు విసర్జించు

క్రోధానికి అతీతం కాగలిగినప్పుడు శక్తి మహోదాత్తం. వినాశం చాల ఘనమైనదిగా కనుపించేమాట వాస్తవమే. కాని, క్రోధంచే సాధించబడినప్పుడది తన ఘనతను కోల్పోతుంది. క్రోధం, పగ, — ఇవి నీచ మానవ ప్రకృతికి చెందినవి. వీటిని విసర్జించు.

## యథార్థ మహాకావ్యం

కవులు మానవ జీవితంలో సంభవించే బాహ్యకష్టాలకూ మరణానికీ విశేష ప్రాధాన్యమిచ్చి వ్రాస్తూ వుంటారు. కాని, ఆత్మ వైఫల్యాలు మాత్రమే నిక్కమైన విషాదాంతనాటకాలు. దివ్యత్వందెసకు విజయవంతంగా మానవుని అధిరోహణ మొక్కటే యథార్థమైన మహాకావ్యం.

## పిల్లల యేడ్పులు

శరీర సంబంధమైన, హృదయ సంబంధమైన దుఃఖాలు — తమ పగిలిపోయిన బొమ్మలు వగైరాల కొరకు పిల్లలేడ్చే ఏడ్పుల వంటివి. వాటికి నీలో నీవు నవ్వుకో. కాని, ఏడ్చేపిల్లల నోదార్చు. చేతనైతే వారి ఆటలో కూడా పాల్గొను.

## ద్వేషం కూడదు

నిన్ను పీడించేవానిని నీవు ద్వేషించవద్దు. ఏలనంటే, అతడు బలవంతుడైతే నీ ద్వేషం అతని పీడనను పెంచుతుంది. బలహీనుడైతే, నీవు ద్వేషించడం అనవసరం. ద్వేషం రెండు వైపులా పదనుగలకత్తి. బలి దొరకనప్పుడు ఎదురు తిరిగి ప్రయోక్తనే మ్రింగివేసే ప్రాచీన మాంత్రిక ప్రయోగక్రియను బోలిన దది.

## ప్రత్యర్థిలో భగవంతుడు

నీ ప్రత్యర్థిని దునుమాడబోతున్నప్పుడు కూడా అతనిలోనున్న భగవంతుని ప్రేమించు, అపుడు మీ ఇరువురిలో నెవరికీ నరకప్రాప్తి ఉండబోదు. లోకం శత్రువులను గురించిన ప్రస్తావన చేస్తూవుంటుంది. కాని, ఎక్కడ ఉన్నారా శత్రువులు? నాకు కనిపించేది విశ్వక్రీడారంగంలో ఏదో ఒక పక్షానికి చెందిన మల్లయోధులు మాత్రమే.

## చంపుట కెవరు అధికారి?

పట్టరాని ఆగ్రహంచేతనో, ద్వేషంచేతనో, పగచేతనో, మానవులు తోటిమానవులను చంపుతూవుంటారు. దాని ప్రతిఫలాన్ని వారు ఇప్పుడో మరియొకప్పుడో అనుభవించి తీరుతారు. కొందరు కేవలం పచ్చిస్వార్థం కొరకు చంపడం జరుగుతూ వుంటుంది. అట్టివారిని ఈశ్వరుడు క్షమించడు. మానవులు తోటి మానవులను చంపవలసివచ్చే పక్షంలో చావనేది విశ్రాంతియని తమ ఆత్మలో గుర్తించి, చంపబడే వానిలో. చంపే వానిలో, చంపే క్రియలో ఈశ్వరుని దర్శించ గలిగి వుండడం అవసరం.

## క్షమించరాని పాపాలు

నీచత్వం, స్వార్థపరత్వం - ఈ రెండే క్షమించరాని పాపాలుగా నాకు కనిపిస్తున్నాయి. కాని, దాదాపు ఎక్కడ చూచినా కనిపిస్తూవుండేవి ఇవే కావున, ఇతరులయందు వీటిని సైతం మనం ద్వేషించరాదు. మనయందు వీటిని నిర్మూలించుకోడానికి మాత్రమే శ్రద్ధవహించాలి.

## ఉదాత్తత, ఉదారత

**ఉదాత్తత, ఉదారత**—ఇవి జీవునకు సువిశాల విహాయసం వంటివి. ఇవి లేనివాడు చీకటికూపంలోని కీటకంతో సమానుడు.

## నీలో పెంపొందదగిన గుణసంపద

నీలో పెంపొందవలసిన గుణసంపద నీ పూర్ణత్వసిద్ధికి దోహదం చేసేదీ, నీ ప్రకృతి ననుసరించి నీలోని యీశ్వరుడు ఆదేశించేదీ కావాలి. లోకం వలన మెప్పు, సన్మానం పొందడం దాని లక్ష్యం కారాదు.

## ఆత్మకు సంకెళ్ళు

పరోపకారబుద్ధి, కర్తవ్యపరాయణత, కుటుంబాభిమానము, దేశభక్తి, మానవజాతీయత _ ఇవి ఆత్మకు సాధనములుగా వినియోగపడనప్పుడు సంకెళ్ళుగా తయారై ఆత్మను బంధిస్తాయి.

## మన దేశమాత

మన దేశం సాక్షాత్తూ మాతృరూపధారి యగు దైవమేకాని వేరుకాదు.

ఆమెను గురించి చెడ్డగా ఎన్నడూ మాట్లాడవద్దు, – నిండైన ప్రేమతో, కడు సుకుమారంగా ఆ పని చేయగలిగితే తప్ప.

## దేశమాతృద్రోహం

మానవులు స్వలాభం కోసమై దేశహితానికి విరుద్ధమైన పనులెన్నో చేస్తూవుంటారు. అయినా, అట్టి మాతృహత్యయెడ జుగుప్స ప్రకటించే అధికారం తమకున్నట్లు వారు తలపోయడం విచిత్రం.

## భూతభవిష్యత్తులు

భూతకాలపు మూసలను అవసరమైతే విచ్ఛిన్నం చెయ్యి. కాని, దాని మూలతత్త్వాన్నీ, ఆత్మనూ మాత్రం భద్రపరుచు, లేనియెడల, నీకు భవిష్యత్తే ఉండదు.

## విప్లవాలు సాధించినది

విప్లవాలనేవి గతమును తుత్తునియ లొనర్చి దానినొక పెద్ద మూసలో కరిగించివేస్తాయి. కాని ఆ మూసలోనుంచి తుదకు బయటపడుతూ వచ్చినది క్రొత్తరూపముతో తిరిగి ప్రాతదే.

## విప్లవాల జయాపజయాలు

ప్రపంచంలో విజయవంతంగా జరిగిన విప్లవాలు దాదా పొక అరడజను మాత్రం ఉన్నాయి. వీటిలోనైనా చాలభాగం విఫలమైనవానివలె కని పించినవే. అయితే అట్టి మహోదాత్తవైఫల్యముల ద్వారముననే మానవ జాతి పురోగమిస్తూ వుంటుంది.

## భగవానుని తీరులు

భగవానుడు అత్యంత విషమంగా పరీక్షించేటప్పుడే సక్రమంగా నడిపిస్తాడు. అత్యంత క్రూరంగా శిక్షించేటప్పుడే సంపూర్ణంగా ప్రేమిస్తాడు. అత్యంతతీవ్రంగా ప్రతిఘటించేటప్పుడే సమగ్రంగా తోడ్పడుతాడు.

## సంకుచితమతం : నాస్తికత్వం

మతాల సంకుచితత్వంపట్ల పీఠాల దుష్టత్వంపట్ల, నిరసనగా నాస్తికత్వం పుట్టింది. అట్టి మలినపు గూడులను కూల్చడానికి భగవంతుడు దానిని రాయిగా ఉపయోగిస్తూ వుంటాడు. మతం పేరిట ఎంతటి ద్వేషాన్ని, మౌఢ్యాన్ని అందంగా పొదిగి ప్రదర్శిస్తూవుంటాడో మానవుడు!

## భగవానుని పరీక్షలు

మానవులను మోహపెట్టి పరీక్షించే కార్యభారం భగవానుడు తనపై వేసికొని వుండకపోతే ఈ ప్రపంచం త్వరితగతిని అధోగతి పాలయ్యేది. మోహపూర్వకమైన యీ పరీక్షలను నీ అంతరంగంలో జరగనీ. వాటిని ఎదుర్కొనడంలో అప్పుడు నీవు నీలోని కుసంస్కారాలను క్షయింపజేసుకో గలుగుతావు.

## ఆత్మ పరిశుద్ధికి ఉపాయం

నిన్ను పరిశుద్ధుని గావించే పని భగవానునికే వదలివేస్తే నీలోని చెడునంతా లోలోపలనే ఆయన తుదకు హరించి వేస్తాడు. అలా కాకుండా ఆ కర్త

వ్యం నీవే పైనవేసుకొంటే, బాహ్య ప్రవృత్తియందు సైతం తప్పు దారులు త్రొక్కి దుఃఖాల పాలౌతావు.

## ఈశ్వరాధీన ప్రవృత్తి

కర్తవ్యము, నియమము అనే రెండుదివ్వెలు లోకంలో మానవుల కున్నాయి. కాని ఈశ్వరాధీనుడైనవానికి మాత్రం వీటితో పనిలేదు. ఈశ్వరేచ్ఛయే వానికి ఏడుగడ. ఇందుకు లోకం నిన్ను నిందిస్తే లెక్క చెయ్యకు. ఈశ్వరుని చేతి ఉపకరణం నీవు. పవనునివలె, సూర్యుని వలె పోషణ శోషణములు చేస్తూ నీ పథాన్ని నీవు అనువర్తించు.

## మంచి చెడ్డలు

లోకం చెడ్డదన్న ప్రతిదానినీ నీవు చెడ్డదనబోకు. ఈశ్వరుడు నిరాకరించినది మాత్రమే నీవు నిరాకరించు. అట్లే, లోకం మంచిదన్న ప్రతి దానినీ నీవు మంచిదనబోకు. ఈశ్వరుడు స్వీకరించినది మాత్రమే నీవు స్వీకరించు.

## ఆత్మావలంబనము

కృష్ణభగవానుడు ఒక్కడూ ఒకవైపున, సమస్తసైనికశక్తితో ప్రపంచమంతా వేరొకవైపున ఉన్నా, భగవానునితోడి ఏకాంత వాసమునే కోరుకో. ప్రపంచం నీ శరీరాన్ని మట్టగించివేసినా, దాని ఆయుధ సంచయం నిన్ను తుత్తునియలు చేసివేసినా లెక్కచెయ్యకు. ఏనాడైనా శరీరమొక శవం. మనస్సొక మాయారూపం. కోశబంధ వివర్జితమైన ఆత్మదే విజయం.

## విశ్వాసం - యుక్తి

నీవు విశ్వసించేది, నీకు యుక్తిచే సమర్థనీయంగా తోచడం లేదనికదూ నీ సంకోచం? పిచ్చివాడా! యుక్తిచే సమర్థనీయంగా తోచేదైతే విశ్వసించడమెందుకు ? విశ్వసించవలసిందని నిన్ను కోరడమెందుకు?

## విశ్వాసం - విజ్ఞానం

మరుగుపడివున్న విజ్ఞానపు అస్పష్ట ప్రతిబింబమే హృదయమందలి విశ్వాసం. విశ్వాసికి అత్యంత సంశయాత్మనికంటె ఎక్కువగానే సంశయాలు కలుగుతూ వుంటాయి. కాని, అతనికి తెలియకుండా అతని లోపల తెలుసుకున్నదేదో ఉండడంచేత అతడు తన విశ్వాసం వీడడు. అదే అతని అంధవిశ్వాసాన్ని, కనుచీకటి సంశయాలనూ సైరించి, తనకు తెలిసిన దాని సాక్షాత్కారపర్యంతమూ అతనిని ప్రేరేపించి నడిపిస్తుంది.

## లోకం తీరు

హేతుబద్ధమైన బుద్ధి వెలుగులో తాను ప్రవర్తిస్తున్నట్లు లోకం అనుకుంటూ వుంటుంది. కాని, వాస్తవానికి దానిని ప్రేరేపించేవి దాని విశ్వాసాలూ, సహజ ప్రవృత్తులూ మాత్రమే.

## మానవుల హేతుబద్ధ ప్రవృత్తి లక్షణం

విశ్వాసాలను అనుసరించడం, సహజ, ప్రవృత్తులను సమర్థించడం—

ఇదే సామాన్యంగా హేతుబద్ధ మనుకొనే బుద్ధిచేసే పని. కాని, అందుకు ప్రేరణ అంతశ్చేతనలోనుంచి కానరాకుండా జరుగుతున్నందువల్ల మానవులు, తాము హేతుబద్ధంగా ప్రవర్తిస్తున్నామనే అనుకుంటూ వుంటారు.

## నిష్కామ కర్మానుష్ఠానం

నిష్కామ కర్మానుష్ఠానానికి మొట్టమొదట సాధించ వలసినది కామ రాహిత్యం. మంచివిగాని, చెడ్డవికాని కోరికలులేని స్థితిని నీవు మొదట నెలకొల్పుకోవాలి. కర్మచేసేది వాస్తవానికి ఈశ్వరశక్తియని నీవు తెలుసుకోవాలి. నీ లోపలా వెలుపలా జరిగే సమస్తకర్మయూ మంచిదిగానీ, చెడ్డదిగానీ, అంతా ఆమె చేసేదే.

## ఈశ్వకర్మ – కర్తృత్వబుద్ధి

సమస్త కర్మయూ ఈశ్వరశక్తిదే యనిచెప్పి, మానవుడు విచక్షణ రహితంగా సదసత్కర్మలుచేస్తూ అంతా ఈశ్వరుడే చేస్తున్నాడని చాటుకునే అవకాశం లేకపోలేదు. కాని, అట్టి సందర్భాలలో అతడు ఆ కర్మల యందు తనకుండే కర్తృత్వబుద్ధి ననుసరించే ఫలితాలనుకూడ పొందుతూ వుంటాడు.

## కర్మబలిసమర్పణ

నీలో నిష్కామస్థితిని నెలకొల్పుకొన్న మీదట, నీ కర్మలన్నిటినీ ఈశ్వరునికి బలిగా సమర్పించుకుంటూ పోవడమే ఇక నీవు చేయవలసినది. నీలో పనిచేసేది ఈశ్వరశక్తియేననీ, ఆమెయే ఆ పనిని ఈశ్వరు

నీకి బలిగా సమర్పిస్తున్నదనీ నీవు తెలుసుకోవాలి. చేసే పని ఎంతగా నిష్కామమైతే, అర్పించే బలికూడా అంతగా విశుద్ధమవుతూ వుంటుంది.

## ఈశ్వరశక్తిప్రేరణ

నిష్కామస్థితిని నీవు సాధించినప్పుడు, నిన్ను ప్రేరణ చెయ్యడానికి మంచి, చెడ్డ కోరిక లేవీ నీలో ఉండవు. అప్పుడు ఈశ్వరశక్తియే నిన్ను ప్రేరణ చేస్తుంది. ఆమెయే స్వయంగా కార్యం చేపట్టుతుంది. నెమ్మదిగా నీ సత్త యావత్తూ విచ్చుకొంటుంది. సర్వమూ పైనుంచి నీలోనికి ప్రసరిస్తుంది. మనం కేవలం ఉపకరణ ప్రాయులమై పోతాము.

## అంతర్దృష్టి

ఈశ్వరశక్తినిర్దిష్టమైన కర్మ యేదో, అవరప్రకృతిప్రేరితమైన కర్మ యేదో వివేచించి తెలుసుకోడానికి నీవు అంతర్దృష్టి నలవరచుకోవాలి. నీ ప్రాణ మనఃకోశములలో కొనసాగే ప్రకృతి వ్యాపారములకంటె వేరైన పురుషునిగా నిన్ను నీవు గుర్తించుకోవాలి. అచట ప్రకృతిలోంచి ఉద్భవించే ప్రతి వ్యాపారాన్నీ తిరస్కరించి, ఊర్ధ్వంనుండి నీలోనికి వచ్చుదానిని మాత్రమే స్వీకరించడం నేర్చుకోవాలి.

## పురుషుడు, ద్రష్ట, అనుమంత

ప్రాణ మనఃకోశముల ప్రకృతివ్యాపారముల నుండి నీవు వేరుపడుటయే కాదు, అట్లు వేఱుపడిన నీలోని పురుషుడు నిశ్చలుడూ నిర్లిప్తుడూ నైన ద్రష్టకూడా కావాలి. అంతట, ఆ ద్రష్టలోని నిశ్చలత్వం ప్రకృతికి

వ్యాపించి ప్రకృతి కూడ నిశ్చలమై వుంటుంది. అయితే, నీవు కేవలం నిశ్చలుడవుగానే ఉండిపోరాదు. కొన్ని ప్రకృతి వ్యాపారములకు అనుమతి నొసగే అనుమంతవు కూడ కావాలి.

## ఆధ్యాత్మిక పట్టభద్రత

ఉత్తమమైన ఆధ్యాత్మిక పట్టాలు పొందగోరేవారు అంతులేని పరీక్షలలో ఉత్తీర్ణులు కావలసి వుంటుంది. కాని, చాలమంది ఉబలాటం పరీక్షాధికారికి లంచమిచ్చి పట్టభద్రులు కావాలని మాత్రమే.

## సన్యాసి శిలాప్రాయుడా?

ఏ పర్వత గుహలోనో, లేక ఏ పర్వత శిఖరంమీదనో ఏకాంతవాసంచేసే సన్యాసి ఏపనీ చేయనిచ్చగించని వట్టి శిలాప్రాయుడని నీ అభిప్రాయం. కాని, నీకేమి తెలుసును? మహత్తరమైన తన సంకల్పశక్తి ప్రవాహముల చేనతడు ప్రపంచమునెల్ల నింపివేస్తూ కేవలం తన ఆత్మసంస్థితి ప్రాబల్యం చేతనే ప్రపంచంలో పరివర్తనం సాధిస్తూ వుండవచ్చు గదా!

## ఋషుల దర్శన ప్రభావం

బంధముక్తుడైన ఋషి తన ఆత్మలో పర్వత శిఖరాగ్రాన దర్శించిన దానినే లోకమునకెల్ల చాటి కార్యరూపం ధరింపజేయడానికి భౌతిక జగత్తులో ప్రవక్తలూ, మహావీరులూ ఉద్భవిస్తూ వుంటారు.

## ముక్తాత్ముని స్థితి

మహాసాగరం లోలోతులలో ఎట్టి సంచలనమూ ఉండదు. ఉపరితలాన

మాత్రమే మహాఘోషతో కూడిన దాని సంరంభమూ, తీరం వైపునకు దాని ఉరుకులూ కానవస్తాయి. అత్యుత్కటమైన క్రియాకలాపం మధ్య ముక్తాత్ముని స్థితికూడ ఇట్టిదే. ఆత్మ క్రియారహితం. కాని, శ్వాసను విడిచినట్లది నిరవధికమైన క్రియాబాహుళ్యాన్ని తనలోనుండి వెల్లువి కింపజేస్తుంది.

## మృత్యువు మన నేస్తం

ఓ మృత్యువా ! నీవు మారువేసములో నున్న మా నేస్తమవు. నదవకాశ కల్పనమే నీ పని. మా కొరకై నీవు గేటు తెరచునప్పుడు, ముందుగా మాకు తెలియజేయుటకు సంకోచింపవద్దు. ఏలనంటే, దాని కర్కశ ధ్వనులకు మేము జడిసిపోవువారము కాదు.

## అపకృతుల మన్నింపు

నీకు జరిగిన అపకృతులను నీవు మన్నించడం ఘనతే కాని, ఇతరులకు జరిగిన అపకృతులను మన్నించడంలో అంత ఘనతలేదు. అయితే, వీటినిగూడా మన్నించవచ్చుగాని, అవసరం పట్టినప్పుడు ప్రశాంత చిత్తంతో ప్రతీకారం చెయ్యి.

## ఆగ్రహపూర్వక ధర్మాభినివేశం

అధర్మంపట్ల ఆగ్రహపూర్వకంగా తమ ధర్మాభినివేశం ప్రకటించేవారి నొకకంట కనిపెట్టి వుండు. ఏ అధర్మాన్ని వారు అంత ఆగ్రహావేశంతో విమర్శించారో దానికే వారు స్వయంగా పాల్పడడమో, లేక ఇతరులు పాల్పడుతూవుంటే హర్షించడమో చేయడం అచిరకాలంలోనే నీవు చూడగలవు.

## విజ్ఞాన సముపార్జన

వ్యర్థవివాదాలు పెట్టుకోవద్దు. స్వేచ్ఛగా నీ అభిప్రాయాలు వెల్లడించు కాని ఎదుటివారి అభిప్రాయాలు ఆలకించు. వివాదం పెట్టుకోవలసివస్తే, నీ ప్రతికక్షినుండి సైతం నేర్చుకోడానికి ప్రయత్నించు. ఏలనంటే, కేవలం శ్రవణేంద్రియంతోనూ, తార్కికబుద్ధితోనూగాక, ఆత్మ వెలుగుతో నీవు వినగలిగే పక్షంలో, వట్టి అవివేకినుండి కూడ ఎంతో విజ్ఞానం సముపార్జించగలవు.

## వెనుదీయగూడని సమరం

నీ సొంతవిషయాల్లో, వివాదాలకు దిగకుండా వుండడానికే నీ వెప్పుడూ ప్రయత్నించాలి. కాని, ప్రజావ్యవహారాల్లో మాత్రం సమరానికి నీవు వెనుదీయరాదు. అయితే, ఆ సమరం కొనసాగించేటప్పుడు కూడా, నీ ప్రతికక్షి శక్తిసామర్థ్యాలను గుర్తించి మెచ్చుకో.

## దోష మెవరిది?

సన్యాసులను మోహింపచేసేటందుకే భగవంతుడు స్త్రీలను సృష్టించాడనే ఉద్దేశంతో మధ్యయుగపు సన్యాసులు స్త్రీలయెడ ద్వేషభావంకలిగి వుండేవారు. కాని, భగవంతుని గురించి గాని, స్త్రీలను గురించిగాని ఇంతకంటె ఉదాత్తముగా ఆలోచించడం అవసరం. స్త్రీ నన్ను మోహింపచేస్తే, అది ఆమె దోషమా, నీ దోషమా? అవివేకివై ఆత్మవంచన పాలు గాకు.

## రెండు మార్గాలు

కామిని అనే ఉచ్చునుండి తప్పించుకోడానికి రెండు మార్గాలున్నాయి.

ఒకటి స్త్రీజాతికంతకూ దూరంగా వైదొలగిపోవడం—రెండవది ప్రాణి కోటి నంతనీ ప్రేమించడం.

## అవిశ్వసనీయుడు

ఎన్నడూ అపజయాలు పొంది బాధ లనుభవించనివానిని నీవు విశ్వసించ వద్దు. అతని అదృష్టాలు నీకు అనుసరించదగినవి కావు, అతని పతాకం క్రింద నీవెప్పుడూ పోరాడవద్దు.

## ప్రయాణపు హెచ్చరిక

నీ గమ్యం చాలదూరాన ఉన్నదికనుక, అడుగులు త్వరగా ముందుకు వెయ్యి. గమ్యస్థానంలో నీ ప్రభువు నీకొరకు వేచియున్నాడుగనుక అనవసరముగా ఎక్కడా తడయబోకు.

## లక్ష్యానుసంధానం

నిష్కాముడవై నీ ఆత్మను లక్ష్యమందు లగ్నంచేసి, నీలోని దివ్య శక్తితో దానినే అనుసంధానం చెయ్యి. అపుడు, ఆ లక్ష్యమే సాధనాన్ని సృష్టిచేస్తుంది. అంతేకాదు, తనకుతానే సాధనమౌతుంది కూడ. ఏల నంటే, బ్రహ్మమైన ఆ లక్ష్యం ఇదివరకే సిద్ధించియున్నది. బ్రహ్మము గానే దానిని నీవు సర్వకాల సర్వావస్థలలో దర్శించు. ఇదివరకే అది నీ ఆత్మలో సిద్ధమైయున్నదని సాక్షాత్కరించుకో.

## బాహ్యపరిసరసంశుద్ధి

ప్రభుత్వ యంత్రాన్ని చక్కదిద్దడం ద్వారా తమ పరిసరసంశుద్ధి సాధించు కోవాలని మానవులు నిత్యమూ కలలు కంటూ వుంటారు. కాని, బాహ్య

మైన పరిసర సంశుద్ధి అంతరమైన ఆత్మశుద్ధిద్వారా మాత్రమే సాధ్య పడుతుంది. లోపల నీ స్వరూపం ఎట్టిదైతే దానినే నీ వెలుపల నీవు అనుభవించగలుగుతావు. ఏ బాహ్యయంత్రాలూ నీ అంతఃప్రకృతి నుండి నిన్ను రక్షించలేవు.

## కాషాయవస్త్రధారి

సన్యాసిధరించే కాషాయ వస్త్రాలను గౌరవించు. కాని, దానితోపాటు ఆ వస్త్రధారిని సైతం పరిశీలించి చూడు. ఏలనంటే, మిథ్యాచారం పవిత్ర స్థలాలలోనికి చొరబడవచ్చు. అంతర్దృష్టితో కూడిన ఆత్మనైర్మల్య మనేది వట్టి కట్టుకథగా తయారుకావచ్చు.

## పాపపుణ్యాలు

మనలను బానిసగా చేసుకొనే అలవాటే పాపమనేది. అట్లే పుణ్యమనేది కేవలం మానవునకు కలిగిన ఒక అభిప్రాయం. కనుక నీవు నేరుగా భగవంతుని దర్శించి, ఆయన సంకల్పానుసారం ఏమార్గం నీకు నిర్దిష్ట మైతే ఆ మార్గం అనుసరించు.

## భగవత్సంకల్పం ఎలా తెలుసుకోడం ?

నాలోని భగవత్సంకల్పం నేను తెలుసుకోడం ఎలాగు ? ఇందుకు అహం కారాన్ని నాలోంచి నేను తొలగించివెయ్యాలి. నాయందలి ప్రతి పొర లోంచీ దానిని వేటాడి తరిమివెయ్యాలి. విశుద్ధమైన నా నగ్నాత్మను ఆయన అనంత లీలావిశేషములలో ఓలలాడించాలి. అప్పుడే ఆయన నాకు సాక్షాత్కరిస్తాడు.

## అహంకారాభివృద్ధికి చిన్నసువారం

నీ భాగ్య భోగాలనుగురించి గొప్పచెప్పుకోబోకు. నీ పేద జీవితాన్నీ త్యాగప్రవృత్తినీ లోకం మెచ్చుకోవాలని ఆశించబోకు. నీ అహంకారాన్ని పెంచడానికి మొదటిది ముతక భోజనమైతే రెండవది నన్నసువారం.

## ఆత్మసుఖత్యాగపద్ధతి

ఆత్మసుఖత్యాగపద్ధతి ఆత్మ పారిశుద్ధ్యానికి గొప్ప సాధనమనే మాట నిజమే. కాని, అదే జీవితానికి పరమలక్ష్యమూ, పరమ ధర్మమూ కానేరదు, నిన్ను నీవు హింసించుకోడం కంటె జగత్తులో ఈశ్వరుని తృప్తిని చెయ్యడం నీకు పరమలక్ష్యమై వుండాలి.

## అహంకృతిపూర్వక ధర్మప్రవృత్తి

పాపప్రవృత్తి వలన, అధర్మప్రవృత్తి వలన చేకూరెడి చెరుపును గుర్తించడం తేలికే. అహంకృతిపూర్వకమైన పుణ్యప్రవృత్తివలన, ధర్మప్రవృత్తివలన చేకూరెడి చెరుపును గుర్తించడం కష్టం. దానిని సుశిక్షితమైన నేత్రం మాత్రమే గుర్తించగలుగుతుంది.

## సర్వార్పణ బుద్ధి

ఏవో కొన్ని భౌతిక వస్తువులను త్యాగం చెయ్యడం, లేక ఏవో కొన్ని కోరికలను వదలుకొనడం—ఇదే బలి సమర్పణ మని భావించబోకు. ప్రతి ఆలోచనా, ప్రతి కర్మ, ప్రతి భోగానుభవం—అంతా నీలోని భగ

వంతునికి సమర్పణ చెయ్యి. భగవంతునిలోనే నీపదసంచారం జరగనీ. భగవంతునికే నీ నిద్ర, నీ మెలకువకూడ నివేదన చెయ్యి.

## వేదాంత ప్రయోజనం

అహంకార విశిష్టమైన బంధమనెడి చీకటి రాత్రిలో నీకు దారిచూపించే నిమిత్తం భగవంతుడు కల్పించిన దీపమే వేదాంతం. కాని, నీ ఆత్మ యందు వేదవిజ్ఞాన భాస్కరోదయమైన పిమ్మట ఆ దీపపు అవసరం సైతం నీకు లేదు. నిత్యసత్యమైన పరంజ్యోతి వెలుగులోనే సాక్షాత్తుగా నీవిక సంచరించగలవు.

## కర్మమార్గ వైశిష్ట్యం

ఈశ్వర నిర్దిష్టమైన త్రైపథమందు కర్మమార్గ మనేది ఒక విధంగా అత్యంత కష్టంతో కూడినదే అయినా వేరొక విధంగా అది అత్యంత సుగమం, సువిశాలం, మహోల్లాసకరం అనికూడా చెప్పవచ్చు. ఏల నంటే, అడుగడుగునా అందు మనం కర్మక్షేత్రమున ఈశ్వరునితో సంఘర్షిస్తూ, సహస్రాధిక దివ్యస్పర్శలతో ఈశ్వర తత్వావిష్కారాన్ని మనలో పొందగలుగుతూ వుంటాము.

## కర్మమార్గంలోని అద్భుత విశేషం

కర్మమార్గంలోని అద్భుతవిశేషం ఏమంటే, భగవంతుని తోడి శత్రుత్వం కూడా మోక్షసాధనంగా పరిణమిస్తుంది. భగవంతుడొకొక్కప్పుడు మహాభయంకర శత్రువువలె మనతో తలపడి అతివేగంగా మనలను తన చెంతకు ఆకర్షించుకొంటూ వుంటాడు.

## జీవన మరణములు

నేను మృత్యువుకు లొంగిపోవలెనా, లేక ఎదురుతిరిగి పోరాడి జయించవలెనా ? నాలోని ఈశ్వరుడెట్లు నిర్దేశిస్తే అట్లు జరుగుగాక! ఏమంటే, నేను జీవించినా మరణించినా ఎప్పుడూ ఉండేవాడినే.

## మరణానికి భయపడ తగదు

నీవు మరణమని పిలుస్తూవున్నది ఏమిటి ? దేవునికి మరణముంటుందా ? మరణమంటే భయపడుతున్న నీవు వట్టి పిచ్చివాడవు. మరణమనే తలయొకటి తగిలించుకొని, భయంకరమైన ముసుగుతో ఆటలాడుతూ జీవనమే నీకడకు వచ్చినదని తెలుసుకో.

## సశరీర అమరత్వం

భౌతిక శరీరంతో అమరత్వం సాధించి, మరణాన్ని మన యిచ్చానుసారం పొందే శక్తిని సంపాదించడం సాధ్యమే. కాని, ఒకే కోటును నూరేళ్ళు ధరించాలనిగాని. ఒకే యిరుకు కొంపలో శాశ్వతంగా బంధింపబడాలనిగాని ఎవరిచ్ఛగిస్తారు ?

## భయాందోళనలు

భయాందోళనలు సంకల్పానికి విపరీతరూపాలు. నీ మనస్సునందు పదే పదే భయాందోళనలు మసలజొచ్చి నప్పుడు దేనిని గురించి నీవు భయాందోళనలు చెందుతున్నావో అది సంభవించడానికి నీవు తోడ్పడినవాడ వవుతావు. ఏలనంటే, మెలకువ యందలి ఉపరితలంలోని నీ

సంకల్పం దానిని నివారింప గోరుతున్నా, అడుగు పొరలోని నీ మనస్సు విడువకుండా దానిని సంకల్పిస్తూనే వున్నది.

## సాధించవలసినది

మెలకువ యందలి పైపొరలోని నీ సంకల్పంకంటె, బుద్ధి కంటె, అడుగుపొరలోని నీ మనస్సు శక్తిమంతము, సువిశాలము, కార్య సాధకమునని తెలుసుకో. కాని, ఈ రెండిటికంటె బలవత్తరమైనది ఆత్మ శక్తి. కావున, భయాందోళనలను, ఆశాప్రవృత్తులను వదలి, ఆత్మ యొక్క పరమ గంభీర ప్రశాంతినీ, సహజ ప్రాభవాన్నీ సాధించు.

## క్రీడారంగం – జీవితరంగం

క్రీడారంగంలో మితిమీరిన ఆటకోటితనం కూడదు. జీవితరంగంలో మితిమీరిన గంభీరముద్ర తగదు. రెండింటి యందునూ ఆటకోటితనపు స్వేచ్ఛతోపాటు గంభీరమైన కట్టుబాటును మనం అలవరించుకోడం అవసరం.

## జ్ఞానసాధనం

నిక్కమైన జ్ఞానం తాదాత్మ్యం వలన కలుగుతుంది గాని, బుద్ధితో చేసే హేతువాదం వలన కలుగదు. తాదాత్మ్యం వలన కలిగిన జ్ఞానాన్ని బుద్ధి హేతుబద్ధం చేసి ప్రదర్శిస్తుంది — అంతే. క్రోధంతో తాదాత్మ్యం చెందడంవలననే క్రోధాన్ని నీవు తెలుసుకుంటావు. అయితే, దాని నుండి వేరై దానిని తిలకించే సామర్థ్యం కూడ నీకు ఉండవచ్చు.

## ముఖ్య ప్రతిబంధకాలు

యోగసాధనకు చిల్లర ప్రతిబంధకాలు అనేకం వున్నా ముఖ్య ప్రతిబంధ కాలు మూడు. (1) కాముక ప్రవృత్తి, (2) 'నేను గొప్ప సాధకుడ'ననే స్వాతిశయ ప్రవృత్తి, (3) జయాభిలాష, ధనాశ.

## శుద్ధత్వ సాధన

శుద్ధత్వం సాధించడానికి మనం తొలుత మనయందలి పురుషచేతనలో సుప్రతిష్ఠితులం కావాలి. పురుషుడు నిత్య శుద్ధుడు. ఆ శుద్ధత్వంలో మనం నెలకొన్న తరువాత మనయందలి ప్రకృతి క్రమంగా దానంతటదే శుద్ధంకావడం మొదలు పెట్టుతుంది.

## గాయత్రీ మంత్రార్థం

సత్యజ్ఞాన సూర్యుని దివ్య తేజస్సును మేము వరించుచున్నామనీ, అది మా చిత్తవృత్తులకు ఏడుగడయై వెలయ నభిలషించు చున్నామనీ గాయత్రీ మంత్రార్థం. సూర్యుడు క్రిందికి దిగివచ్చేడి దివ్యతేజస్సునకు ప్రతీక. ఆతేజస్సు క్రిందికి దిగివచ్చి చిత్తవృత్తులను ప్రేరేపించి నడిపించాలన్న ఆశయన్నే గాయత్రి అభివ్యక్తం చేస్తున్నది.

## యోగసాధనాధికారం

సత్యతేజస్సు క్రిందికి దిగివచ్చి మనస్సును ప్రేరేపించి నడిపించవలెనని గాయత్రీమంత్రం కోరుతున్నది. ఆ తేజస్సు క్రిందికి దిగివచ్చినప్పుడు దానిని భరించడం ఎల్లరకూ సాధ్యంకాదు. దానిని భరించగల సామర్థ్యమే యోగసాధనాధికార సంపత్తికి సూచకం.

## ఇష్టదేవతా ప్రార్థన

గాయత్రీమంత్రన్ని అర్థభావన పురస్సరంగా ధ్యానం చెయ్యి. మనస్సును నిశ్చలమొనర్చుకొని నీకిష్టమైన దేవతాస్వరూపాన్ని స్మరించు. సత్య తేజస్సును భరించే సామర్థ్యం నీ కలవరచునట్లుగా ఆ ఇష్టదేవతను ప్రార్థించు.

## శాంతిసాధనోపాయం

అంతరంగపు అగాధతలాలలో నివసించడం నేర్చుకొని, బాహ్యప్రవృత్తులు కేవలం తన ఉపరితలంలోనివిగా దర్శించగల అనుభవం మానవుడు సంపాదించుకోవాలి. అంతవరకూ ఈ ప్రపంచంలో శాంతి అనేది దొరకడం దుర్ఘటం. ఒకవేళ దొరికినా అది స్థిరంగా వుండదు.

## దివ్యశక్త్యధీనత

దివ్యశక్తి యొకటి మనలో పనిచేస్తున్నది. ఏక్షణాన ఏది జరగవలెనో, తాత్కాలికంగాగాని, శాశ్వతంగాగాని దేనిని చేపట్టవలెనో, దేనిని త్రోసిపుచ్చవలెనో అదే నిర్ణయిస్తుంది. మన కోరికలనూ, మన అహంకారాన్నీ వదలి దానికే మనం అధీనం కావడం నేర్చుకోవాలి. అందుకొరకే మన ఆత్మ నిత్య జాగరితమైవుండి, లోపలనుంచిగాని, బయటనుంచిగాని మనలను తప్పుదారి పట్టింపజూచే దివ్యేతర ప్రవృత్తులను ప్రతిఘటింప బూనుకోవాలి.

## బయటి పరిస్థితి

బయట పరిస్థితులపై నీ వెక్కువగా ఆధారపడరాదు. బయటి పరిస్థితులు

సహాయపడవనిగాని, అవరోధాలు కల్పించవనిగాని, నే ననను. కాని, ఏమైనా అవి అప్రధానములు. ప్రాధాన్యం ఇవ్వవలసినది నీ బయటగాక నీ లోపల ఉన్నది. యోగసాధనలో బయటి అవరోధాలకూ, అననుకూల పరిస్థితులకూ ప్రాధాన్యమిస్తే వాటిశక్తి పెరిగి నిన్ను మరింతగా బాధిస్తాయి. ప్రాధాన్యమివ్వక సమచిత్తంతో వాటి నెదుర్కొంటే, వాటిబలం తగ్గి క్రమంగా శమించిపోతాయి.

## చరమగమ్యప్రాప్తి

మనకోరికలనూ, అహంకారాన్ని విసర్జించి, మనలోని దివ్యశక్తికి మనం అధీనులం కావడం నేర్చుకున్నప్పుడు ఆ దివ్యశక్తియే మనలను మనస్సు కందని సువిశాల, సుగంభీర, సుసంకీర్ణమార్గాల ద్వారా చరమగమ్యానికి నడిపించుకు పోతుంది. ఇది ఎంతేని కష్టబహుళమూ, ప్రమాదభూయిష్ఠమూ నైన మార్గ మనేమాట నిజమే కాని, ఇంతకంటే మార్గాంతరము కూడా లేదు.

## ఆంతరంగిక బలసిద్ధి

మనలోని గంభీర సత్యమగు దివ్యశక్తిని గుర్తించుకొని, బాహ్యపరిస్థితుల ప్రాబల్యాన్ని తిరస్కరించగల ఆంతరంగిక బలాన్ని సుప్రతిష్ఠితం చేసుకోడమే యోగసాధన ముఖ్యాశయం. పరమ దుర్బలుర మనుకునే వారిలో సైతం ఈ బలం అంతర్గతమై ఉన్నది. దానిని కనుగొని, తెరతొలగించి, జీవిత ప్రయాణంలో,—జీవిత సంగ్రామంలో,— నిత్యమూ ఎట్టెదుట నిలుపుకోడమే కావలసినది.

## సంపూర్ణవిముక్తి

నీలోని ఏ అంశం ప్రపంచానికి చెందివున్నా, ప్రపంచం వలన నీకు బాధలు తప్పవు. సర్వాత్మనా సంపూర్ణంగా నీవు దైవానికి చెంది వున్నప్పుడే నీకు సంపూర్ణ విముక్తి.

## దైవంతో పూర్ణైక్యం

దైవంతో పూర్ణైక్యం చెందడమే సాధకునికి చరమలక్ష్యం కావాలి. ఈ ఐక్యానుభవం కొందరు తమ అంతరాత్మలో, కొందరు తమ మనఃకోశంలో, కొందరు తమ ప్రాణకోశంలో మాత్రమే పొందడం కద్దు. కాని, అన్నకోశ, విజ్ఞానకోశాల్లో సైతం దానిని పొందగలిగినప్పుడే దానికి పూర్ణత్వం.

## "శాస్త్రం"

సకలమానవ హృదంతరాళములందునూ సనాతన వేదరహస్యం గర్భితమై వున్నది. పూర్ణయోగ దర్శనంలో దానికే 'శాస్త్రం' అని పేరు.

## వేదరహస్య వికసనం

సనాతన వేదరహస్యం మానవహృత్కుహరంలో తామర మొగ్గవలె ముకుళించుకుని వున్నది. మానవుని మనస్సు సత్యవస్తువు కభిముఖం కాజొచ్చినంతనే,— అతని హృదయం పరిచ్ఛిన్న వస్తువులయెడ రాగ

బద్ధమగుట మాని ఏ కొంచెమైననూ అనంతునిపై మనసులుకొనుట ప్రారంభించినంతనే—ఆ అరవిందం ఒక్కొక్క రేకే వికసింప సమక్రమిస్తుంది

## ప్రేమలక్షణం

సాధకుడు ప్రేమించవలసినది దైవమును మాత్రమే. అతడలా దైవమును పూర్తిగా ప్రేమించగలిగినప్పుడే ఇతరులను సక్రమంగా ప్రేమించగలుగుతాడు.

# సాధన : కర్మాచరణ

—o—

## కోరగాని కర్మ

అజ్ఞానావృతమైన లోకానికి ఎంతో మేలుచేకూర్చే దైనప్పటికీ అహంకార ప్రవృత్తితో చేసిన ఏకార్యమైనా యోగసాధకునికి — కోరగానిదే అవుతుంది.

## యోగశక్తులు

సాధకుడు శక్తులకొరకై తంటాలు పడరాదు. లభ్యపడిన శక్తులు తనవిగా భావించరాదు. దైవేచ్ఛ నెరవేర్చే నిమిత్తం వాటిని దైవం అనుగ్రహించినవిగా తలపోయాలి. స్వార్థంకొరకు వాటిని దుర్వినియోగం చేయకుండ జాగ్రత్తపడాలి. వాటిని చూచుకొని గర్వించకూడదు. దైవం చేతిలో తాను సాధనం కాగలిగానన్న అహంభావానికి సైతం తావీయరాదు.

## కర్మద్వారా ఆత్మార్పణం

చేసేకర్మ ఏదైనా అది ఏభావంతో చెయ్యబడుతున్న దనేదే ముఖ్యం. నిష్కాముడవు, నిరహంకారుడవునై, సమచిత్తంతో, జయాపజయములకు, లాభనష్టములకూ వికారం చెందక, ఈశ్వరార్పణబుద్ధితో ఈశ్వరుని

కోసం, సమస్త కర్మమూ ఈశ్వరశక్తిదేయన్న ఎరుకగలిగి చేసేటి ఏ కర్మయైనా ఆత్మార్పణకు సాధనమే అవుతుంది.

## ఎక్కువ తక్కువ భావం

కవిత్వం వ్రాయడంవంటి పనులు గొప్ప పనులనీ, చెప్పులు కుట్టడం, వంటచేయడము వంటి పనులు తక్కువ పనులనీ—ఇలాంటి భావాలు లోకంలో వుంటూవుంటాయి. కాని. ఆధ్యాత్మిక దృష్టికి అన్ని పనులూ సమానములే. ఎట్టి భావంతో ఆయా పనులు చెయ్యబడుతున్నవనేదే ప్రధానం. ఆధ్యాత్మిక ప్రపంచంలో ఎక్కువ తక్కువ భావానికి స్థానం లేదు.

## కార్యనిర్వాహణ పద్ధతి

ఒకే పనిని కర్మయోగి నిత్యమూ సమధికోత్సాహంతో నిర్వర్తించగలిగి వుండాలి. అంతేకాదు, ఒక్క నిమిషం వ్యవధిలోనే, దాని స్వరూప స్వభావాలను విస్తరింప జెయ్యడానికీ, అవసరమైతే దానికి బదులు వేరొక పని చేపట్టడానికి కూడా అతడు తయారుగా వుండాలి.

## మూడు దశలు

ఆత్మసంసిద్ధికి పిమ్మట కర్మాచరణలో మూడు దశలున్నాయి. మొదటి దశలో కర్మ నిన్ను బహిర్ముఖుని చేయుటేగాక, అథఃస్థితికి తెస్తుంది. కర్మానంతరం ఆ సంసిద్ధిని నీవు తిరిగి సాధించుకోవాలి. రెండవ దశలో కర్మ నిన్ను బహిర్ముఖుని చేయగా, సంసిద్ధి తెరమరుగున ఉండిపో తుంది. కర్మాచరణ కాలంలో అది నీకు స్ఫురించకపోయినా కర్మానం

తరం అది మరల స్వయంగానే ప్రకాశిస్తుంది. మూడవదశలో కర్మనిన్ను బహిర్ముఖుని చేయదు. కర్మాచరణకాలంలో కూడా ఆ సంసిద్ధికి నీవు వెలి కాకుండానే ఉంటావు.

## ఆత్మానుభవస్థితి

ప్రాణ, మనఃకోశముల నతిక్రమించి ఆత్మానుభవం పొందిన వాడు ఎప్పుడూ ఏదో ఒక పనిచేస్తూ వుండవలసిన పనిలేదు. ఆత్మకు కేవలం తన ఉనికిలోనే ఆనందమున్నది. ఒక పనిచేయడానికిగాని, చేయకపోవడానికిగాని దానికి పరిపూర్ణ స్వేచ్ఛ కలదు. ఏదైనా ఒక పని చేస్తే అది ఆ పనికి బద్ధమై చేస్తున్నదనడానికి ఎంతమాత్రమూ వీలులేదు.

## జీవన్ముక్తావస్థ

జీవన్ముక్తుడు బంధరహితుడై చరిస్తాడు. ఏ కర్మయూ అతనిని బంధించ నేరదు. ఏలనంటే, అహంకార స్ఫురణ అతనిలో ఉండదు గనుక. కర్మ చేయునది అతనియందలి విశ్వప్రకృతిగాని, అతడు గాదు. విశ్వప్రకృతి కతీతమైన పరతత్వంతో తాదాత్మ్యంచెంది పరిపూర్ణుడై యుండుటయే అతనికి సహజ లక్షణం అవుతుంది.

## గుణకర్మలు

గుణాలు వేరు, అహంకారమూ, కామమూ వేరు. వేరు కనుకనే, అహంకార, కామప్రవృత్తులు లేకుండా, అనగా సంగరహితంగా గుణాలు ప్రవర్తిల్లడానికి వీలున్నది. సంగరహితుడైన జీవన్ముక్తుని గుణకర్మల స్వరూపం ఇటువంటిదే. లేనియెడల యోగి సంగరహితుడని చెప్పడంలో

అర్థంలేదు. ఏలనంటే, అట్టిసందర్భంలో వానిలో ఒక భాగం సంగ దోషంతో కూడినదే అవుతుంది.

## నిస్సంగత్వం

జీవన్ముక్తులు తమయందలి ప్రకృతితత్త్వమందు సంగం కలవారైనా పురుషతత్త్వమందు నిస్సంగముగా వుంటారు గనుక వారు నిస్సంగులే ననడంలో అర్థంలేదు. సంగం ఏ విభాగంలోఉన్నా అది సంగమే. నిస్సంగుడు కావడానికి మానవుడు ఎక్కడనో అంతరాత్మలోనేకాక, అంతటా—అనగా దేహ, ప్రాణ, మనః ప్రవృత్తులలోకూడా నిస్సంగుడు గానే ఉండడం అవసరం.

## ప్రకృతియందు సైతం సంగరాహిత్యస్థితి

ముక్తావస్థయందు లోని పురుషుడొక్కడే కాదు సంగరహితుడై వుండేది. (పురుషుడెప్పుడూ సంగరహితుడే. సామాన్య స్థితిలో మనమిది గుర్తించలేము) ప్రకృతి కూడా గుణప్రవృత్తులకు కలగక సంగరహితంగానే వుంటుంది. అనగా, ప్రకృతిరూపములైన అన్న, ప్రాణ, మనఃకోశాలు కూడా పురుషునివలె ప్రశాంతి ననుభవిస్తాయి. అది కర్మరహిత స్థితి కాదు. కర్మయందే ప్రశాంతస్థితి.

## పురుష ప్రకృతులు

పురుష ప్రకృతులు సత్యవస్తువుయొక్క వేర్వేరు శక్తులు. అనగా, నైష్కర్మ్యస్థితియే పురుషుడనీ, కర్మప్రవృత్తియే ప్రకృతియనీ, నైష్కర్మ్యస్థితియందు ప్రకృతిలేదనీ, కర్మప్రవృత్తియందు పురుషుడు లేడనీ

భావింపరాదు. సంపూర్ణమైన కర్మప్రవృత్తిలో కూడ పురుషుడు మరుగున దాగియే యున్నాడు. అట్లే సంపూర్ణమైన నైష్కర్మ్యస్థితిలో కూడ ప్రకృతి విశ్రాంతరూపిణిగ నిలిచియే యున్నది.

## ప్రకృతి స్వరూపం

క్రియాకారకమైన శక్తియే ప్రకృతి. కాని, శక్తి అనేది క్రియాత్మకం గానూ ఉండవచ్చు, నిష్క్రియంగానూ ఉండవచ్చు. నిష్క్రియంగా ఉన్నప్పుడది శక్తి కాకపోదు. శక్తి యొక్క క్రియారూపములే గుణాలు. సముద్రమున్నది, అలలున్నవి. అలలు సముద్రం కానేరవు. అలలు లేకుండా సముద్రం నిశ్చలంగా ఉన్నప్పుడది సముద్రం కాకుండాపోదు.

## ముక్తావస్థలో గుణప్రవృత్తులు

జీవన్ముక్తస్థితిలో సామాన్యంగా సత్వగుణం ప్రధానంగా వుండి దాని స్వాధీనంలో రజోగుణం తమోగుణప్రేరిత విరతిపర్యంతం క్రియాత్మకంగా పనిచేస్తూ వుంటుంది. ఒకవేళ తమోగుణమే ప్రధానంగా ఉండి కర్మప్రవృత్తి తీవ్రతరమైనా పురుషప్రకృతులు మాత్రం కలతకు లోనుగాక అంతటా ఒకే విధమైన ప్రశాంతి నెలకొని వుంటుంది. కర్మప్రవృత్తి అనేది అట్టిస్థితిలో ఉపరితలంమీది ఒక చిన్న అల లేక సుడి వంటిది మాత్రమే అవుతుంది.

## ముక్తావస్థలో ప్రకృతి

ముక్తావస్థలో ప్రకృతి అంతఃప్రకృతి, బాహ్యప్రకృతి — అని రెండు విభాగాలవుతుంది. తన రజస్తమో గుణప్రవృత్తుల బంధం లేనిది అంతః

ప్రకృతి. దానికి సాధనభూత మవుతూ మార్పులు చెందుతూ వుండేది బాహ్యప్రకృతి.

## జ్ఞానము - శక్తి

జ్ఞానం వేరు, శక్తి వేరు. విషయముల గురించిన ఎరుక జ్ఞానం. క్రియా కారకమైనది శక్తి. జ్ఞానం శక్తికలది కావచ్చు. శక్తిని వినియోగించ వచ్చు. కాని, అలా వినియోగించడంలో అది దానితో ఏకమైపోక దాని కంటె వేరైనిలిచి దాని ప్రవృత్తిని తిలకించగలుగుతుంది.

## చైతన్య విలసనం

తమ స్వరూపం లోలోతులకు చొరని మానవులకు మనస్సన్నా చైత న్యమన్నా ఒకటిగానే తోస్తుంది. చైతన్యవికాసం ద్వారా మన నిజస్వ రూపం మనకు ఎరుకపడుతున్న కొలదీ పెక్కు తరగతులు, భూమికలు, శక్తులు చైతన్యానికున్నవని మనం గ్రహిస్తాము. అన్నమయ, ప్రాణ మయ, మనోమయాది కోశములతో విలసిల్లేది చైతన్యమే.

## చైతన్యం — శక్తి

పరతత్త్వం సత్-చిత్-ఆనందములుగ వర్ణించబడినట్లే, జగత్కారిణి యైన శక్తిని వెలువరించు చైతన్యంగా వర్ణించబడింది. మనస్సుకూడా ఒకవిధమైన చైతన్యమే. అది మానసిక శక్తిని వెలువరించు చైతన్యం.

## మనశ్చైతన్యం

చైతన్యరూపమైన పరతత్త్వం తన శక్తినుండి తాను వేరై దాని కార్య

మును తిలకిస్తూ ప్రకృతిసాక్షియగు పురుషుడుగా నుండగలదు. అట్లే మనశ్చైతన్యంకూడా తన శక్తినుండి తాను వేరై దాని కార్యములను— అనగా యోచనలు, భావనలు మున్నగువాటిని సాక్షిగా తిలకిస్తూ ఉండ గలదు.

## మానవ చైతన్యం

మానవచైతన్యం సర్వసాధారణంగా మానసికాది వ్యాపారాలతో తాదాత్మ్యం చెందే ఉంటున్నా, వాటినుండి విడివడి వుండే శక్తినికూడా పెంపొందించుకొని ఉన్నది. పశుపక్ష్యాదులలో ఈ శక్తి పెంపొందినట్లు కనుపించదు. చైతన్యం వికసించినకొద్దీ ఈ విడివడే శక్తికూడా వికాసం చెందుతుంది.

## ద్వంద్వచైతన్యం

పరతత్త్వం తోడి సాంగత్యమూ, శాంతి మన లోలోపల వృద్ధిపొందు తున్నకొలదీ ఒక విధమైన ద్వంద్వచైతన్యం మనయందు వికాసం చెందుతుంది. వెలుపల కార్యాచరణమందు తత్పరమయ్యేది బాహ్య చైతన్యం. లోపల సాక్షిమాత్రంగా కార్యాన్ని తిలకిస్తూ, పరతత్త్వాభి ముఖమై వుండేది ఆంతర చైతన్యం. బాహ్యచైతన్యం కార్యోన్ముఖమై ఉన్న సమయంలోనే ఆంతర చైతన్యం పరతత్త్వభావనలో నిమగ్నమై వుండడానికి వీలున్నది.

## ముక్తితోపాటు శక్తి

కర్మయందు తగుల్కొనక, దానికి సాక్షిగా ఉంటూ దానిపైన తన వెలుగు

ప్రసరింపజేసే ఒకానొక ప్రశాంతస్థితిలోనికి నీలోపల నీవు వెనుకకు అడుగుపెట్టు. అపుడు, బాహ్యసత్త అంతస్సత్త అనేవి రెండు ఏర్పడుతాయి. అంతస్సత్త సాక్షియై తిలకిస్తూ ఉండగా, బాహ్యసత్త ఉపకరణప్రాయమై కార్యమెల్లనూ నిర్వర్తిస్తుంది. ముక్తితోపాటు శక్తిని చేకూర్చు సాధన ఇది.

## పరమాత్మ స్పర్శ

అంతస్సత్తయందే మనకు పరమాత్మస్పర్శ లభిస్తుంది. అయ్యది మానసిక ప్రవృత్తుల ద్వారా పొంద వీలైనదికాదు. అంతరంగపు లోలోతులలో స్ఫురించెడి ఒకానొక దివ్యస్పర్శ, దివ్యదర్శనం, దివ్యగ్రహణమది. సరియైన కర్తవ్యస్ఫురణం, కర్తవ్యప్రేరణం కూడా దానినుండియే మనకు లభిస్తాయి.

## కార్యోత్సాహ వైముఖ్యాలు

ఒకప్పుడు నీవు కార్యోత్సాహివై కర్మచేస్తావు. వేరొకప్పుడు కార్యవిముఖుడవై ప్రశాంతస్థితి నభిలషిస్తావు. ఈ రెండు ప్రవృత్తులనూ కలపడం కష్టం. కాని రెంటికీ సమన్వయం కుదిరే సమయం ఒకనాటికి వస్తుంది, అంతరంగమున నొకవంక ప్రశాంతి నెలకొనియుండగా. దాని ఆసరాతో వేరొకవంక నీవు కార్యోత్సాహివికూడ కాగలవు.

## కర్మాచరణ : దైవసన్నిధి

కర్మ నాచరించేటప్పుడు దైవసన్నిధి గుర్తులో ఉండడం ప్రారంభదశలో సులభంకాదు. కాని, కర్మాచరణం పూర్తియైన వెన్వెంటనే అది గుర్తుకు

రావడం జరుగుతూవుండే ఫరవాలేదు. కొంతకాలానికి కర్మాచరణ సమయంలోకూడా దైవసన్నిధి దానంతటదే గుర్తుకు రాగలదు.

## కర్మాచరణ పద్ధతి

దైవస్పర్శ పొందిన అంతస్సత్తనుండియే సదా కర్మల నాచరించడం నీవు నేర్చుకోవాలి. బాహ్యసత్త ఉపకరణమాత్రంగా ఉండిపోవలసినదే. దానిని నీ మనోవాక్కర్మలపై పెత్తనం చలాయించ నివ్వరాదు.

## శాంతి - కర్మాచరణ

అశాంతి లక్షణోపేతమైన బాహ్యచైతన్యంతో గాక, శాంతి సమన్వితమైన అంతశ్చైతన్యంతో అన్నిపనులూ నీవు చేయడం నేర్చుకోవాలి. పనులు చేస్తూనే శాంతిని చిక్కబట్టుకోడం సాధ్యమే. శాంతి అంటే మనస్సు శూన్యంగా వుండడం కాదు: ఏ పనినీ చేయకపోవడమూ కాదు.

## దైవప్రేరణానుభవం

దైవప్రేరణ నిత్యమూ నీవు పొందుతూ వుండాలంటే, మొట్టమొదట నీలో అందుకొరకై నిరంతరమైన ఆకాంక్ష ఉండాలి. పిమ్మట బాహ్య ప్రవృత్తులనుండి మరలి, అంతరంగంలో ఒక విధమైన ప్రశాంత స్థితిని నీవు చిక్కబట్టుకోవాలి. అచటినుండి శ్రద్ధాళువవై ఆలకిస్తే నీ అంతరాత్మనుండి వచ్చిన దివ్యప్రేరణానుభవం నీకు కలుగగలదు.

## అంతఃస్ఫురణం

నీ లోపలకు నీవు ప్రవేశించగల సామర్థ్యంపై అంతఃస్ఫురణ మనేది

ఆధారపడివుంటుంది. ఒకొక్కప్పుడది భక్తి మొదలగువానిచే లోతెక్కిన చైతన్యమునందు దానంతటదే స్ఫురించవచ్చును. లేక ఒక్కొక్కప్పుడు విషయనివేదన మొనర్చి జవాబు నాలకించు అభ్యాసముచే నైనను అనుభవానికి రావచ్చును.

## అంతరాత్మలో ఆలకింపు

అంతశ్చైతన్యమందు విషయనివేదన మొనర్చి జవాబు నాలకించడ మనేది రూపకాలంకారంగా చెప్పినమాటయేకాని వేరుకాదు. జవాబు వాగ్రూపంలోనే ఉంటుందన్న నియమంలేదు. ఏరూపంలోనైనా ఉండ వచ్చును. జవాబు సరియైనదేనని తేల్చుకోడం సులభమైన విషయం కాదు. అంతరంగంలో సద్గురుని చైతన్యంతో సాంగత్యం యిట్టి సంద ర్భంలో చాల అవసరం.

## మూడు ముఖ్యాంశాలు

దైవశక్తిని నీవు గ్రహించి నీ బాహ్య జీవనానికి ఏడుగడగా చేసుకోవా లంటే, మూడు ముఖ్యవిషయాలు ఒనగూడాలి. ఒకటి—ఏది సంప్రాప్త మైనా మనస్సులో కలతకు తావివ్వని శాంతి, సమత్వం. రెండు-పరమ శ్రేయోదాయకమైనదే నీకు సంప్రాప్తం కాగలదన్న పూర్ణవిశ్వాసం. మూడు — దైవ శక్తిని గ్రహించి దాని సాన్నిధ్యమును అనుభవిస్తూ నీ ఇచ్ఛాజ్ఞాన క్రియలను దాని కధీనం చెయ్యగల సామర్థ్యం.

## బడలిక చెందినప్పుడు

బడలిక చెందినప్పుడు మితిమీరి శ్రమచెయ్యక నీ మామూలు పనులు

మాత్రం చేసుకుంటూ విశ్రాంతి తీసుకో. లోపలా బయటా ప్రశాంత స్థితిని సంపాదించుకోడం అట్టి సందర్భంలో అవసరం. బడలికకు అవకాశమివ్వని ఒకానొక బలం నిత్యమూ నీ చేరువలో ఉన్నది, అది నీకు చేకూరాలంటే, ఈ ప్రశాంత స్థితిని చిక్కబట్టుకోడం నీవు నేర్చుకోవాలి.

## సంసిద్ధికి మార్గం

మనస్సును ప్రశాంతంగా ఉంచుకో, దాని కతీతమైవున్న దివ్యశక్తిని గుర్తించు. నీ లోపలకు దానికి దారియిచ్చి, అది నీయందు పనిచేయడానికి అవకాశం కల్పించు. సంసిద్ధికి ఇదే సరియైన మార్గం. మనస్సులో అశాంతి సంసిద్ధికి మార్గం కానేరదు.

ఆచరణయందు దోషాలుంటవనే కారణాన కర్మను మానివేయడంకంటె, వాటి నిర్మూలనకై కర్మను సాహసంగా చేపట్టడం శ్రేయస్కరం. దోషాలు రాకూడదన్న దృఢసంకల్పం కలిగివుంటే, నీ కోశసంశుద్ధికి దైవీశక్తినాహ్వానిస్తూండే పక్షంలో ఆ దోషాలు రానేరావు.

## లక్ష్మిని వెడలగొట్టే ప్రవృత్తులు

భౌతిక వస్తువులను అతిస్వల్పకాలంలోనే నిర్లక్ష్యంగా పాడుచేయడం, చిందరవందర గావించడం, ఇంద్రియోద్వేగంచే గాని, తామసిక జడత్వంచే గాని భౌతికవస్తువులను, సేవలను దుర్వినియోగం చెయ్యడం, దుబారా చెయ్యడం – ఈ లక్షణాలు అభ్యుదయానికి ప్రతిబంధకాలై లక్ష్మిని వెడలగొట్టుతాయి.

## భౌతిక వస్తువులపై ఆధిపత్యం

భౌతికవస్తువులపై ఆధిపత్య మంటే, వాటిని సమృద్ధిగా కలిగివుండి నిర్లక్ష్యంగా పారవేస్తూ తొందరగా పాడుచెయ్యడం అని అర్థం కానేరదు. కడు జాగరూకతతోనే కాక సంయమంతో వాటిని సద్వినియోగ పరచుకో గలిగినప్పుడే వాటిపై నీకు ఆధిపత్యం కుదిరినట్లు.

## భౌతికవస్తుచైతన్యం

ప్రతి భౌతికవస్తువునందూ ఒకానొక చైతన్యం ఉన్నది. దానిని మనం ధ్యానగోచరం చేసుకోవచ్చును. ఇండ్లు, మోటారుకార్లు, కుర్చీలు, బల్లలు మొదలైన ప్రతివస్తువుకూ ఒకరకమైన వ్యక్తిత్వం ఉన్నది. మన పూర్వులకు అది తెలుసు. అందుచేతనే వారు వాటి అధిష్ఠాన చైతన్యాన్ని దర్శించగలిగేవారు.

## భౌతికవస్తువులయెడ పూజ్యభావం

భౌతికవస్తువులలోని చైతన్యం ప్రాణివర్గాలలో మనమెరిగిన చైతన్యం వంటిది కానిమాట నిజమే. కాని స్థూలదృష్టికి కానరాకుండా దాగివున్న ఆ చైతన్యం అయథార్థ మనడానికి వీలులేదు. కనుకనే, భౌతికవస్తువుల యెడ మనం పూజ్యభావం అలవరచుకొని, వాటిని దుర్వినియోగం చెయ్యకుండ కడు సంయమంతో వాడుకొనడం అవసరం.

## భౌతిక చైతన్యావబోధం

సమస్త ప్రపంచమూ చైతన్యమయమేనన్న అనుభూతి నీవు పొంద

డానికి, నీయందు మనస్సుతో పాటుగా నీ భౌతికచైతన్యం కూడా నిద్ర నుండి మేల్కొని, అన్నిటిలోనూ అనుస్యూతమైవున్న ఏకత్వాన్ని గుర్తించడం అవసరం.

## చైతన్యవికాసలక్షణం

భౌతిక వస్తువులలో చైతన్యం వున్నదనేది యథార్థం. వాటిని సుకుమారంగా వాడినప్పుడు ఆ చైతన్యం అందుకు తగినవిధంగా ప్రతిస్పందిస్తుంది. అలాకాక, మోటుగా, నిర్లక్ష్యంగా వాడినప్పుడు దాని ప్రతిస్పందనం వేరువిధంగా వుంటుంది, ఇది గుర్తించి, వాటియెడ జాగరూకతతో మెలగ నేర్చుకోడమే నీలో మంచి చైతన్యవికాసం కలిగినదన డానికి గుర్తు.

## యోగదృష్టివికాసానికి ప్రతిబంధకం

భౌతికవస్తువులపట్ల కడుమోటుగా వ్యవహరిస్తూ వాటిని నిర్లక్ష్యంగా పగులగొట్టే అలవాటు యోగదృష్టివికాసానికి మిక్కిలి ప్రతిబంధకమై, దైవీశక్తిని భౌతికకోశంలోనికి అవతరింపజెయ్యడానికి ప్రబలావరోధమవుతుంది.

# సాధన: ధ్యానము

—o—

## ధ్యానం

ధ్యానం రెండు విధాలు. ఒకటి, ఒక విషయానికి చెందిన నిరంతర భావ ప్రవాహంపైన మనస్సును ఏకాగ్రం చెయ్యడం. రెండవది, ఒక విషయాన్నిగాని, రూపాన్నిగాని. భావాన్నిగాని, దానికి సంబంధించిన జ్ఞానం ఏకాగ్రతాబలంచేత స్ఫురించేటట్లు మనస్సులో ధారణచెయ్యడం. మానసికైకాగ్రత రెండింటికీ అవసరమే.

## మరొక ధ్యానపద్ధతి

నీలో బయలుదేరే ఆలోచనలకు వెనుకగా నిలువబడి, యథేచ్ఛగా అవి సాగుతూ వుంటే పరిశీలిస్తూ వాటి లక్షణం కనిపెట్టడం మరొక ధ్యాన పద్ధతి. ఇందలి ఏకాగ్రత ఆత్మపరిశీలనాత్మకం.

## తరువాతి మెట్టు

ఆలోచనలకు వెనుకగా నిలువబడి పరిశీలించే ధ్యానపద్ధతికి తరువాతి మెట్టు ఆలోచనలన్నిటినీ మనసులోంచి ఖాళీచేసే ధ్యానపద్ధతి. జాగ

రూకతతో కూడిన విశుద్ధమైన ఆ ఖాళీలో దివ్యజ్ఞానం సాధారణ మాన సిక ప్రవృత్తులచే కలుషితం కావడానికి వీలేర్పడుతుంది.

## గీత అభిమానించిన ధ్యానపద్ధతి

ఆలోచనల నన్నిటినీ మనస్సులోంచి ఖాళీచెయ్యడం ధ్యానపద్ధతులలో నొకటిగా భగవద్గీత పేర్కొన్నది. ఒక విధంగా భగద్గీతకు అభిమాన పాత్రమైన పద్ధతికూడ అదేననిపిస్తుంది. యంత్రప్రాయమైన ఆలోచనా క్రమపు బానిసత్వంనుండి మనస్సుకు విమోచన కల్పించి, స్వాతంత్ర్య పూర్వకంగా ఆలోచనాతీతమైన విజ్ఞానస్థాయికి మనలను చేర్చగల పద్ధతి ఇది.

## చతుర్విధధ్యానాల తారతమ్యాలు

ఏకవిషయానికి చెందిన ఎడతెగని ఆలోచనా ప్రవాహంపై మనస్సును ఏకాగ్రం చెయ్యడం, ఆ విషయానికి సంబంధించిన విజ్ఞానం స్ఫురించేటట్లు దానిని మనసులో ధారణచెయ్యడం, మనసులోని ఆలోచనలకు వెనుకగా నిలువబడి వాటిని పరిశీలించడం, ఆలోచనల నన్నింటిని మనసులోంచి ఖాళీ చెయ్యడం,— అనే యీ నాలుగు రకాల ధ్యాన పద్ధతులూ వరుసగా ఒకదాని కంటె ఒకటి ఎక్కువ కష్టసాధ్యములై క్రమాధికంగా విస్తృత ఫలితాలను సాధకునకు అందిస్తాయి.

## ధ్యానపద్ధతులన్నీ అవలంబనీయములే

సాధకుడు తన తాహతునుబట్టి, అభిరుచినిబట్టి నాలుగురకాల ధ్యాన పద్ధతులలో దేనినైనా అవలంబించవచ్చును. అవసరమెరిగి సమయో

చితంగా నాయిగించినీ అపలంబించడం సర్వోత్తమమైన పద్ధతి. ఇందుకు అచంచల విశ్వాసం, అవిరతశ్రద్ధ, సుస్థిర సహనం, సుదృఢసం కల్పం— ఈ లక్షణాలు సాధకునియందు దీపించడం అవసరం.

## ధ్యానలక్ష్యం

ధ్యానానికి లక్ష్యంగా సాధకులు తమ తమ అభిరుచులనుబట్టి దేనినైనా ఎన్నుకోవచ్చు. కాని, వాస్తవానికి, బ్రహ్మము కంటె ఉత్తమమైన ధ్యానలక్ష్యం మరి ఉండదు. ఈ ధ్యాన ప్రక్రియలో, ఈశ్వరుడు సర్వ భూతములలో ఉన్నాడు, సర్వభూతములూ ఈశ్వరునియం దున్నవి, ఈశ్వరుడే సర్వభూతమయుడై ఉన్నాడు, అనే భావమందు మనస్సును లగ్నం చెయ్యడం అవసరం.

## పరమసత్యస్ఫోరకం

అంతా ఈశ్వరునిలో ఉన్నవి, ఈశ్వరుడు అంతటిలో ఉన్నాడు, అంతా ఈశ్వరరూపం—అనే భావం పరమసత్య స్ఫోరకం కనుకనే ఉత్తమోత్తమం. ఇహలోక, పరలోక, లోకాతీత సత్యములన్నీ ఆ పరమ సత్యంలో ఇమిడి ఉన్నవి.

## బాహ్యపరిస్థితులు : ధ్యానసాధన

విజనస్థలం, ఏకాంతవాసం, నిశ్చలాసనం,—ఇవి ధ్యానం చేసేటప్పుడు సాధకునికి ప్రారంభ దశలో సహాయకములే. కాని, వీటికి అతడు బద్ధుడైపోరాదు. ధ్యానం అలవాటైన పిమ్మట, అన్ని పరిస్థితులలోను, అనగా పడుకున్నా, కూర్చున్నా, నడుస్తున్నా, ఒంటరిగావున్నా, పది

మందిలో ఉన్నా, సద్దు మణిగిఉన్నా, రేగినా అతడు ధ్యానం చేయగలిగి వుండాలి.

## అంతరంగిక పరిస్థితులు : ధ్యానసాధన

మనస్సు చంచలమై పరుగెత్తడం, మరపు, నిద్ర, ఓరిమి లేకపోవడం, అశాంతి, మొదలైన ధ్యాన ప్రతిబంధకాలను నిరాకరించే సంకల్పనిష్ఠ కలిగివుండడం ధ్యానసాధనకు అవసరమైన అంతరంగిక పరిస్థితులలో మొట్టమొదటిది.

## అంతరంగిక పరిస్థితులు ధ్యానసాధన

వివిధ భావోద్వేగాలకు ఆలవాలమైన చిత్తం అంతకంతకు విశుద్ధము, ప్రశాంతము కావడం ధ్యానసాధనకు ముఖ్యమైన మరియొక అంతరంగిక పరిస్థితి. అనగా, ఐహిక సంఘటనల మూలమున శోక, భయ, క్రోధాది ఉద్వేగాలకు వశుడు కాకుండా వుండడం సాధకుడు నేర్చుకోవాలి.

## ఏకాగ్రత

చైతన్యం సామాన్య మానవునిలో అంతటా పరివ్యాప్తమై వుండి, విషయాలమీదికి అటూ ఇటూ పరుగులెత్తుతూ వుంటుంది. ఏదైనా ఒక స్థిర ప్రయోజనాన్ని సాధించాలంటే అలా పరుగులెత్తే చైతన్యాన్ని వెనుకకు లాగుకొనివచ్చి ఏకాగ్రం చెయ్యాలి. అలా చేసినప్పుడు అది ఒక స్థానములో ఒక విషయంపై ఏకాగ్రమౌతున్న సంగతి జాగ్రత్తగా పరిశీలిస్తే తెలుసుకో గలుగుతాము.

## యోగసాధనలో ఏకాగ్రత

ఏకాగ్రత ఆలోచనకు సంబంధించినదైనప్పుడు, అది మెదడు నందలి ఏదో ఒక స్థానంలోనూ, భావావేశానికి సంబంధించినదైనప్పుడు హృదయస్థానంలోనూ సామాన్యంగా జరుగుతూ వుంటుంది. తీవ్రస్థాయి నందుకొన్న దీని విస్తృత రూపమే యోగసాధనయందలి ఏకాగ్రత.

## ఏకాగ్రతకు లక్ష్యాలు

ఏకాగ్రత త్రాటకాభ్యాసంలో వలె ఏ వెలుగు చుక్కవంటి దృశ్యం మీదనో కావచ్చు. అట్టి అభ్యాసంలో సాధకుని దృష్టి, ఆ చుక్కల మీదే లగ్నమై వుండాలి. ఇంకే ఆలోచనా రాగూడదు. అటులే ఏకాగ్రత ఒక భావంపైన, అక్షరంపైన, నామంపైన, భావయుక్తమైన అక్షరంపైన. భావయుక్తమైన నామంపైన కావచ్చు. ఈశ్వర భావం, ప్రణవాక్షరం, కృష్ణనామం ఇందుకు ఉదాహరణలు.

## భ్రూమధ్య స్థానంలో ధ్యానం

యోగసాధనలో ఒక్కొక్క స్థానంలో ధ్యానం చెయ్యడ మనేది ఉన్నది, భ్రూమధ్యస్థానంలో ధ్యానం సుప్రసిద్ధమే. అది అంతర్మనస్సుకూ, యోగదృష్టికీ, సంకల్పశక్తికీ కేంద్రం. నీవు పెట్టుకున్న లక్ష్యం పైన దృఢంగా ఆలోచడం గాని, దాని రూపాన్ని దర్శనం చెయ్యడం గాని ఆ చోటునుండి చెయ్యవలసి వుంటుంది. అందు నీవు విజయిం సాధించగలిగితే, నీ చైతన్యమంతా ఆ సమయంలో ఆస్థానమందు కేంద్రీకృతమైన అనుభవం నీకు కలుగుతుంది.

## ధ్యానసాధనకు ఇతర స్థానాలు

పూర్ణయోగపద్ధతిలో, కేవలం భ్రూమధ్య స్థానమందే కాక, శిరస్సులోని ఇతరస్థానములందు కూడా ధ్యానంచెయ్యడం వున్నది. అట్లే, శరీర నిర్మాణశాస్త్రజ్ఞులు హృదయ కేంద్రంగా నిర్ణయించిన వక్షస్థల మధ్య మందు కూడా ధ్యానసాధన చెయ్యవచ్చు.

## శిరస్సునందలి ధ్యానం

శిరస్సునందు చేసే ధ్యానంలో ఏదైనా ఒక సంకల్పమందు నీచిత్త మేకాగ్రం కావడం అవసరం. అదిఊర్ధ్వమునుండి పరమశాంతి నీలోనికి అవతరించాలనేడి పిలుపు కావచ్చు, లేక కానరాకుండా ఆవరించియున్న ముసుగు తొలగి నీచైతన్యం ఊర్ధ్వగతి నందుకోవాలనేడి పూనిక కావచ్చు.

## హృదయ స్థానంలో ధ్యానం

హృదయస్థానంలో ధ్యానం అచట తెర తొలగి దైవస్వరూప సాక్షాత్కారం కలగాలన్న ఆకాంక్షయందు లగ్నం కావలసి వుంటుంది. ఏదైనా నామజపం కూడ అచట చేయవచ్చు. అలా చేసే పక్షంలో, నామం దానంతటదే అచట స్పందించేటట్లు దానియందు చైతన్యం ఏకాగ్రత చెందడం అవసరం.

## ధ్యానసాధనలో చైతన్య ప్రవృత్తి

ధ్యానసాధనలో చైతన్యం ఒక స్థానమందు కేంద్రీకృత మైనప్పుడు, ఇతర స్థానములందలి చైతన్యం మూగవోయి వుంటుంది. లేక, ఆలో

చనలు మొదలైనవి బయట ఎక్కడనో కదలాడినట్లుండి కేంద్రీకృత మైనభాగం దానిని గుర్తించని స్థితిలో ఉంటుంది. ధ్యానం విజయవంత మైనట్లు చెప్పుకోదగినప్పటి పరిస్థితి అది.

## అలసట రానివ్వరాదు

చైతన్యాన్ని ఏకత్ర కేంద్రీకృతం చెయ్యడమనే అభ్యాసం ప్రారంభ దశలో దీర్ఘకాలం చెయ్యరాదు. అలాచేస్తే అలసట వలన సాధన నిష్ప్రయోజనమైపోతుంది. అలసట కలిగేటట్లు ఉన్నప్పుడు చైతన్య కేంద్రీకరణాభ్యాసం విరమించి దానికి బదులు మామూలు ధ్యానం చెయ్యవచ్చు.

## సామాన్య ధ్యానలక్షణం

చైతన్యాన్ని కూడగట్టి ఒక బిందువునందు గాని, ఒక లక్ష్యమందుగాని కేంద్రీకృతం చెయ్యడమే ఏకాగ్రత. సామాన్య ధ్యానంలో చైతన్యాన్ని ఇలా కూడగట్టవలసిన అవసరంలేదు. ప్రశాంత చిత్తంతో ఒక విషయాన్ని ఆలోచిస్తూ చైతన్యమందు దానిని గుర్తించడమే అచట జరగవలసిన పని.

## ఏకాగ్రత - ధ్యానము

చైతన్యాన్ని ఒకస్థానంలో, లేక ఒక లక్ష్యంపైన. ఒకే స్థితియందు నిలుకడ పొందించడం ఏకాగ్రత. ధ్యానంలో, నిలకడకు బదులు కదలిక ఉంటుంది. ఉదాహరణకు, బ్రహ్మమును గురించి ఆలోచించడం, తోచినభావాలను గ్రహించడం. వివేచించడం, స్వభావంలోని మార్పులను కనిపెట్టి ప్రవర్తించడం మొదలైనవి ధ్యానంలో ఉండవచ్చు.

## శబ్దంద్వారా ఏకాగ్రత

సాధకుడు ఒక శబ్దంపైన తన చైతన్యాన్ని ఏకాగ్రం చేసేటప్పుడు, దేనిని అభివ్యక్తం చెయ్యడానికి ఆ శబ్దం ఉద్దేశించబడిందో దాని అనుభవం ఆకాంక్షిస్తూ ఆశబ్దమం దిమిడియున్న ముఖ్య భావమందు నిమగ్నుడు కావడం అవసరం.

## పూర్ణయోగంలో ఏకాగ్రత, ధ్యానము

చైతన్యాన్ని ఒక ప్రత్యేక స్థితిలోనో గతిలోనో లగ్నం చెయ్యడం ఏకాగ్రత. స్థితికి ఉదాహరణం శాంతి, గతికి ఉదాహరణం ఇచ్ఛ, ఆకాంక్ష. యథార్థజ్ఞానప్రాప్తికై అంతర్మనస్సు విషయాలను ఈక్షణ చేయడం ధ్యానం.

## సర్వగత బ్రహ్మభావన

వేదాంత జ్ఞానసాధన పద్ధతిలో బ్రహ్మము సర్వగతము అనే భావముపై సాధకుడు తన మనస్సు నేకాగ్రం చెయ్యవచ్చు. అట్టి సందర్భంలో ఒకచెట్టునుగాని, పరిసరమందలి ఇతర వస్తువునుగాని చూచేటప్పుడు, అచట ఉన్నది బ్రహ్మమనీ, చెట్టు మొదలైనవి రూపమాత్రములనీ భావిస్తూచూడడం అతడు అభ్యసిస్తాడు.

## సత్యవస్తు సాక్షాత్కారం

సర్వగత బ్రహ్మభావన శ్రద్ధగా అభ్యాసం చెయ్యగా కొంత కాలానికి, ఎట్టయెదుటనున్న చెట్టు మొదలైన వస్తువులు వట్టి ముసుగులుగా గోచరించి, వాటియందలి సత్యవస్తుసన్నిధి సాధకునకు అనుభవానికి వస్తుంది.

అదే యథార్థమని అతడు గుర్తిస్తాడు. అంతట భావనతో ఇక అతనికి పనిలేదు. అతీంద్రియమైన సాక్షాత్కారం అతడు పొందగలుగుతాడు.

## స్థానాలమార్పుతో ఏకాగ్రతాసాధన

కొన్ని సమయాల్లో హృదయస్థానమున, కొన్ని సమయాల్లో శిరస్సున కూర్ధ్వమున, ఏకాగ్రతా సాధన చెయ్యడంవలన చెరుపు లేదు. కాని, ఏస్థానంలో చేసినా దృష్టిని ఆ స్థానమందు లగ్నం చెయ్యాలని కాదు దాని అర్థం. నీ చైతన్యస్థానమును ఏదో ఒక చోట ఏర్పాటు చేసుకొని అచట ఆస్థలముపైగాక బ్రహ్మముపై దృష్టి నేకాగ్రం చెయ్యడం అవసరం.

## కనులు తెరుచుకొనికూడా ఏకాగ్రతాసాధన

ఏకాగ్రతకు సూర్యుని లక్ష్యంగా ఉంచుకోడం లేకపోలేదు. కాని, ధానికంటె బ్రహ్మమును లక్ష్యంగా ఉంచుకోడమే ఉత్తమం. కనులు మూసికొని, తెరచుకొనికూడా ఏకాగ్రతా సాధన చెయ్యవచ్చు. ఏది తనకు ఎక్కువ అనుకూలంగా ఉంటుందనేది చూచుకోవాలి.

## ఏకాగ్రతాసాధన శ్రమ

ఆలోచనా కేంద్రమైన మెదడునందు ఏకాగ్రతాసాధన ఒక తపశ్చర్య. దానివలన శ్రమ కలుగక తప్పదు. ఆకేంద్రమునుండి పూర్తిగా వెలికి రాగలిగినప్పుడే సాధకునకు ఆ సాధనశ్రమ లేకుండా పోతుంది.

## చదువుకు, ఆలోచనకు ఏకాగ్రతాస్థానం

చదివేటప్పుడుగాని, ఆలోచించేటప్పుడు గాని యోగపద్ధతిలో ఏకాగ్రతా సాధనకు సరియైన స్థానం నడినెత్తి, దాని ఉపరిభాగం అని సాధకుడు గ్రహించడం అవసరం.

## నిశ్చలాసన ప్రయోజనం

చైతన్యం తనలో తాను చుట్టచుట్టుకొని కర్మప్రవృత్తి రహితంగా ఊరక యుండే స్థితి ఏకాగ్రతాసాధనకు మిక్కిలి అనుకూలం. కనుకనే నిశ్చలాసనమున కూర్చుండి సాధన చెయ్యవలెననునది యేర్పడింది.

## పడుకొనివుండి ధ్యానం

ఏకాగ్రతాసాధన పడుకొని కూడా చెయ్యవచ్చుననే మాట నిజమే. కాని ఆ స్థితిలో చైతన్యం తనలో తాను చుట్టచుట్టుకొని వుండడానికి బదులు జడత్వంలోకి పర్యవసించవచ్చు. కనుకనే యోగులెప్పుడూ కూర్చుండియే ధ్యానసాధన చేస్తూ వచ్చారు.

## అంతర్ముఖ బహిర్ముఖత్వాలు

ఏకాంతంగా ప్రశాంతచిత్తుడవై ఉన్నప్పుడే అంతర్ముఖుడవై లోనికి చొరబారి ఏకాగ్రతాసాధన చెయ్యి. బయటిశబ్దాలు నీ ఏకాగ్రతకు భంగం కలిగించరాదు. ఆ ఏకాగ్రతనుండి హఠాత్తుగా బహిర్ముఖుడవయ్యే యెడల, కొంచెము పేపు ఒకవిధమైన గుండెదడ మొదలైనవి నీకు కలుగవచ్చు. అందుచే బహిర్ముఖుడవై కనులు తెరిచేముందు కొలది క్షణాలు ప్రశాంతుడవై వుండడం మంచిది.

## బ్రహ్మనిష్ఠ - బాహ్యకర్మ

అంతరమున చైతన్యం ఏకాగ్రమైవున్న తరుణంలోనే బాహ్య కర్మ నాచరించడం మొదట్లో సాధ్యం కాకపోయినా క్రమేణా తుదకు సాధ్యమే. చైతన్యం అట్టి సందర్భాలలో ద్విధావిభక్తమై ఒకటి అంతరమున బ్రహ్మనిష్ఠమైవుండగా రెండవది బాహ్యకర్మ నాచరించవచ్చు. లేదా, చైతన్యమంతా బ్రహ్మ నిష్ఠమైవుండి నిమిత్తమాత్రమైన ఉపకరణంద్వారా దాని శక్తి బాహ్య కర్మాచరణ మొనర్పవచ్చు.

## లోనికి నెట్టే ఒత్తిడి

ధ్యానసాధనకు కూర్చున్నప్పుడు, నిన్ను లోనికినెట్టే ఒత్తిడి ఒకటి కలుగుతుంది. జాగ్రచ్చేతనను వీడి అంతశ్చేతనలో నీవు మేల్కాంచడానికై కలిగే ఒత్తిడి అది. కాని, నిద్రారూపమైన అంతశ్చేతనకు మాత్రమే అలవాటుపడిన మనస్సు మొదట్లో ఆ ఒత్తిడిని నిద్రకు కలిగే ఒత్తిడిగానే భావిస్తుంది. పట్టుదలతో నెమ్మదిగా అభ్యాసం కొనసాగించినమీదట గాని, నిద్ర క్రమేణా అంతశ్చేతనానుభవంగా మార్పు చెందదు.

## సాక్షాత్కారానుభవం

జాగ్రదవస్థకు అతీతమైన సమాధిస్థితిలో సాక్షాత్కారం కలిగినమాత్రాన చాలదు. జాగ్రదవస్థలో సైతం సాక్షాత్కారానుభవంకలిగి సుస్థిరంకావాలి. ఇందుకొరకై అంతకంతకు సువిశాల మగుచుండెడి ప్రశాంత చైతన్యమున కృషి సాగించడంలోనే సాధనతోపాటు సిద్ధి కూడా కలిసివస్తుంది.

## సమాధ్యనుభూతి

సమాధ్యనుభూతి ఒక సాధన కావచ్చునేకాని పూర్ణసిద్ధి కానేరదు. ఆ యాంతరంగికానుభూతి వలన బాహ్యచేతనలో ఏవిధమైన మార్పూ రాకపోవచ్చును. సమాధిస్థితిలో ఎన్నో చక్కని అనుభూతులు పొంద గలుగుతూకూడ బాహ్య వ్యవహారంలో ఎప్పటిస్థితిలోనే వుండే సాధకు లనేకులున్నారు.

## అనుభూతి శక్తిగా మారాలి

సాధకుడు తాను లోపల పొందిన అనుభూతిని వెలికితెచ్చి శక్తిగా మార్చుకొని తన బాహ్యాభ్యంతర ప్రకృతులను రూపాంతరం చెందించు కోడం అవసరం. సమాధిలోనికి పోనవసరం లేకుండానే జాగ్రచ్చేతన యందు దీని నతడు సాధించవచ్చు. ముఖ్యంగా కావలసినది ఏకాగ్రతా నిష్ఠ.

## జపమార్గాలు

జపం సాధారణంగా విజయవంతమయ్యే మార్గాలు రెండున్నాయి. ఒకటి, బుద్ధిని మంత్రదేవత శక్తి సౌందర్యాదుల యందు లగ్నంచేస్తూ జపించే మార్గం. రెండవది భక్తిభావ పురస్సరంగా హృదయమందు మంత్రాన్ని స్పందింపజేస్తూ జపించేమార్గం. సాధకుడు రెండింటిలో ఏదో ఒకదాన్ని అనుసరించవచ్చు.

## మూడవ మార్గం

కేవలం మంత్రశక్తి. నామప్రభావంమీదనే ఆధారపడి జపనిష్ఠ కొనసా

గించే మూడవమార్గ మొకటి ఉన్నది. అట్టి జపానుష్ఠానంలో ఆ శక్తి ప్రభావస్పందన అంతస్సత్తను ప్రభావిత మొనర్చి సాక్షాత్కారానికి దారితీసేపర్యంతందానిని కొనసాగించవలసి వుంటుంది. ఫలసిద్ధికి తొందర పాటు ఈ మార్గంలో పనికిరాదు. సిద్ధి కవసరమైన చిత్తస్థాయిని తొందర భంగపరుస్తుంది.

## చిత్తస్థాయి

సాధనకు ముఖ్యంగా చిత్తస్థాయి కావాలి. సత్వర ఫలితాల కొరకు వేగిరపడడం, మితిమీరి శ్రమచేయడం తగదు. అనుభూతులు పొందగల యోగ్యతను పెంపొందించుకోడానికి చిత్తానికి వ్యవధి యివ్వాలి. లోపలినుండి కవిత్వం, సంగీతం పుట్టుకువచ్చినంత సహజంగా ఆ అనుభూతుల నతడు పొందవలసి వుంటుంది.

## అమితశ్రమ పనికిరాదు

జపం చేయడంలోకాని, ధ్యానం చేయడంలోగాని శక్తినంతా వెచ్చించడం, మితిమీరిన శ్రమే అవుతుంది. పైనుండి దివ్యానుభూతులను అవిచ్ఛిన్నంగా పొందగలిగే ఘట్టాలలో తప్ప, ధ్యానమం దెంతో ఆరితేరిన వారు సైతం అట్టి శ్రమకు తట్టుకొనడం కష్టం.

## ఓంకారోపాసన

జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయములు నాల్గింటిలోనూ విస్తరించుకొనివున్న బ్రహ్మచైతన్యానికి ప్రతీక 'ఓమ్' కనుక, ఓంకారోపాసన స్థూల, సూక్ష్మ, కారణ, కారణాతీతములం దన్నిటా ఒకే చైతన్యాన్ని

దర్శించి అనుభవించే దివ్యజ్ఞానావిష్కారానికి దోహదంచేసేది కావడం అవసరం.

## మంత్రాలు – సాధన

సాధనకు మంత్రాలు ప్రధానం కావు. చేతనలో గాఢమైన ఆకాంక్ష, హృదయాదిస్థానములలో ఏకాగ్రనిష్ఠ,—ఇవీ ప్రధానం. ఇందుకు మంత్రం సహాయకారి అని తోచేయెడల, అలా సహాయకారి యైనంత వరకు సాధకుడు దానిని ఉపయోగించుకోవచ్చును.

## జ్ఞానమంత్రం

గాయత్రి జ్ఞానమంత్రం. దానిశక్తి పరమ సత్యతేజస్సు. మనలోని అన్ని అంతస్సులలోనికి సత్యతేజస్సును గొనితెచ్చుటకే ఆ మహామంత్రం ఉద్దిష్టమైనది.

## జప పరిణామం

మంత్రజపం చెయ్యగా చెయ్యగా, కొంత కాలానికది నీలోపల దానంతటదే సాగే స్థితి వస్తుంది. అనగా, దానిని నీ అంతశ్చేతన చేపట్టిన దన్నమాట. జపం ఆ విధంగా మరింత శక్తిమంత మవుతుంది.

# సాధన : భక్తి ప్రేమలు

—o—

## పూర్ణయోగలక్ష్యం

జగత్తులోనికి దివ్య ప్రేమానందములను గొనిరావడమే పూర్ణయోగపు ముఖ్య లక్ష్యం. కాని, అది సిద్ధించాలంటే, వాటికి ఆధారంగా దివ్యజ్ఞాన శక్త్యావిర్భావం జరగాలి. లేనియెడల మానవ సహజమైన దౌర్బల్యాలచే ప్రేమ కప్పుపడిపోతుంది.

## దివ్యప్రేమలీల

దివ్యజ్ఞాన, దివ్యేచ్ఛాపురస్సరంగా దివ్యప్రేమ నీలోనికి అవతరించునపుడు, అది మొదట విశ్వాతీత, విశ్వజనీన రూపములలో అవతరించి, అటుపిమ్మట దివ్యజ్ఞాన, దివ్యేచ్ఛానుసారంగా వ్యక్తులతో వ్యవహరించ మొదలిడుతుంది. ఆ పరమ ప్రేమను ఊహించడం మానవబుద్ధికీ, మానవ హృదయానికీ అశక్యం. అట్టి దివ్యావతరణానుభవం పొంద నేర్చినప్పుడే నీవు జగత్తులో దివ్యప్రేమలీలకు ఉపకరణం కాగలుగుతావు.

## దివ్యప్రేమానుభవం

మానవప్రేమవలె దివ్యప్రేమ ఒక భావావేశం కాదు. భావావేశాలకు అతీతులమై అంతర్హృదయంద్వారా పరమాత్మతో ఏకత్వం భజించి

నప్పుడు అనుభవానికి వస్తుంది దివ్యప్రేమ. ఇంద్రియ సంబంధమైన భావావేశపు పరుగులు దాని నెంత మాత్రమూ అందుకొనజాలవు.

## దివ్యజ్ఞానం - దివ్యప్రేమ

దివ్యజ్ఞానం ఏ విధంగా మానవబుద్ధి ప్రవృత్తుల కతీతమైన సాక్షాద్దర్శనమో, అదేవిధంగా, దివ్యప్రేమ, మానవహృదయావేశాల కతీతమైన పరమానుభవం, మానవబుద్ధి ప్రవృత్తుల కెంతటి ఉన్నతి సంతరించినా అది దివ్యజ్ఞానం కానేరదు. అటులే, మానవ హృదయావేశాల కెంతటి ఉన్నతి సంతరించినా అది దివ్యప్రేమ కాజాలదు.

## దివ్యప్రేమాభివ్యక్తి

మానవప్రేమతో ఉపక్రమించియే దివ్యప్రేమకు మనం చేరుకోవలసి వుంటుందనే మాట నిజం. దివ్యప్రేమ మానవప్రేమను మరింత సుస్నిగ్ధం గావించి తనలోనికి రూపాంతరం చెందించుకొంటుంది. దివ్య ప్రేమ అంటే ఆవేదో అస్నిగ్ధమైన వస్తువుగా భావింపరాదు. అయ్యది అత్యంత స్నిగ్ధము, ఏకత్వ సంపన్నము, ఆనందసంభరితమునై స్వీయాభివ్యక్తికి ప్రకృతిని సాధనంగా వినియోగించుకొంటుంది.

## దివ్యప్రేమ నిరపేక్షం

వ్యక్తులయెడ ప్రసరించేటప్పుడు దివ్యప్రేమ మానవప్రేమవలె ఆయా వ్యక్తులనుండి తిరిగి ఏమియూ అపేక్షింపదు. వ్యక్తిగత మైనప్పటికి అది అహంకార ప్రేరితము కాదు. అయ్యది అంతర్గతమైన ఆత్మనుండి ఆత్మకు ప్రసరించెడి దివ్యప్రసారం.

## దివ్యప్రేమోపలబ్ధి

మానవ ప్రేమవలెగాక దివ్యప్రేమ పరమగంభీరము, సువిశాలము, ప్రశాంత లక్షణోపేతము. నీవు దానిని తెలుసుకుని దానిచేత ప్రభావితుడవు కావాలంటే నీవుకూడా ప్రశాంతతను చిక్కబట్టుకుని సువిశాలుడవు కావడం అవసరం. సర్వ సమర్పణభావం ఇందుకు ముఖ్యసాధనం.

## దివ్యపరివర్తనం

పరమాత్మను ప్రేమించాలంటే అందుకు వస్తుతః కావలసినది దివ్య ప్రేమయే. కాని దాని అభివ్యక్తికి మానవ స్వభావమే తొలుత ఉపకరణం కనుక, ప్రారంభ దశలో అది మానవ ప్రేమ, భక్తిరూపాలను ధరించక తప్పదు. నీ చేతన గాంభీరౌన్నత్యాలను సంతరించుకొన్నమీదటగాని సత్యప్రేమావిర్భావమై మానవప్రేమకు దివ్యపరివర్తనం కలిగింప జాలదు.

## అంతరాత్మతో ప్రేమ

మానవప్రేమలో పలురకాలున్నాయి. వాటిలో, అంతరాత్మతో ప్రేమించేది దివ్యప్రేమకు సన్నిహితం, అంతస్సత్తకు దివ్యానందానుభవ బోధకమైన దానితో సమాగమం వాటిల్లినప్పుడు ఈ ప్రేమ ఉదయిస్తుంది. ఇది స్థిరమైనది. బాహ్యపరిస్థితులపైన ఆధారపడనిది, ఎదుటినుండి ఏమియూ ఆపేక్షింపక తననుదానే సమర్పించుకొనునట్టిది, కోపతాపాది విక్షేపాలకు లోనుగాక అవ్యాహతంగా కొనసాగునట్టిది.

## ప్రేమలీలలో అన్నమయాది చేతనలకు స్థానం

పురుషునిలోని అన్నమయ, ప్రాణమయ చేతనలకుకూడా ప్రేమలీలలో స్థానం లేకపోలేదు. దివ్యప్రేమలీలలో సైతం వీటికి ప్రముఖపాత్రయే ఉన్నది. అయితే ఈ పాత్రను ఇవి చక్కగా నిర్వర్తించుటకు వీటి ప్రవృత్తి సత్ప్రవృత్తి కావడం అవసరం.

## ప్రాణమయచేతనలో కూడా విశుద్ధప్రేమ

ప్రాణమయచేతనలో ప్రేమ రెండురకాలు. అందులో ఒకటి అంతరాత్మతో ప్రేమించే ప్రేమకు సన్నిహితమై, దానికి అనుబంధంగా ఉండి దివ్యప్రేమాభివ్యక్తికి సైతం సాధనభూతం కాదగిన లక్షణం కలది. పరిపూర్ణ త్యాగానందమయమై ఎదుటినుండి ఏమియూ నపేక్షింపక తనను దాను పూర్తిగా సమర్పణం చేసికొను స్వభావం దీనికున్నది.

## దివ్యప్రేమ : భౌతికసాధనలు

అంతరాత్మతో ప్రేమించే ప్రేమకుగాని, దివ్యప్రేమకుగాని భౌతిక సాధనలు సరిపడవని చెప్పరాదు. భౌతికసాధనలపై ఇవి ఆధారపడని మాట నిజమే, అవి లేకపోయినచో వీటికి ఏమాత్రమూ లోపము కలుగదు. అయినను ఆ సాధనలు విశుద్ధములైన పక్షములో వాటిని ఇవి మహదానందముతో వినియోగించుకొంటాయి.

## భౌతిక సాధనములు

ఈశ్వరభక్తికి, ఈశ్వరార్చనకు భౌతికసాధనములు ఉపయోగార్హములే.

కేవలం మానవప్రకృతి దౌర్బల్యాన్ని బట్టియేకాదు ఈ ఉపయోగార్హత. అంతరాత్మతో ప్రేమించేవానికి వీటితో పనిలేదనియూ చెప్పరాదు. సక్రమపద్ధతిలో వీటి నుపయోగించగలిగినప్పుడు ఇవి ఈశ్వరసాక్షాత్కారానుభవానికీ, అంతరాత్మ ప్రబోధం కలిగించడానికీ ఎంతగానో దోహదం చేస్తాయి.

## భౌతికసాధనల సక్రమ వినియోగం

భౌతిక సాధనములు సక్రమంగా వినియోగం కానిచో వాటికి ఈశ్వరారాధనలో స్థానంలేదు. సాధకుని అన్నమయ, ప్రాణమయ కోశాలలో అలసత్వము, జడిమ, వైముఖ్యము, క్షుద్రకామన, మొదలగునని పొడసూపరాదు. అప్పుడే అవి సక్రమంగా వినియోగం కాగలుగుతాయి.

## వాంఛామయ ప్రేమ

ప్రాణమయకోశమందలి ప్రేమ అహంభావపూరితము, వాంఛామయమూ అయిన పక్షంలో అట్టి ప్రేమ దివ్యప్రేమకు దోహదం చెయ్యజాలదు. ఎదుటినుండి ఏమేమియో ఆపేక్షిస్తూ వుండడం దాని స్వభావం. అపేక్షించినది లభించకున్నా, లభించకున్నదని అనుకున్నా, శోకం, క్రోధం మొదలైన అవలక్షణాలకు అది ఆస్పదమై తుదకు నశించిపోతుంది. సాధకులు దీని కేమాత్రమూ చోటివ్వరాదు.

## నిష్కామమైన దైవభక్తి

నిష్కామమైన దైవభక్తి ఆత్మార్పణపూర్వకమైనది. ఏ కోర్కెలనూ అది కోరదు. ఏ హక్కులనూ ప్రకటించుకొనదు, ఏ షరతులనూ విధించదు,

ఏ వేరాలనూ ఆడదు, ఏ విపరీతోద్వేగాలకూ లోనుకాదు. గర్వానికి, క్రోధానికి తావీయదు. ఇవన్నియూ దాని తత్త్వానికి కేవలం విరుద్ధములు.

## జగన్మాత ప్రేమప్రసారం

దైవానికి నిన్ను నీవు నిశ్శేషంగా ఇచ్చుకోడం నేర్చితే దైవంకూడా నీకు తనను తాను నిరర్గళంగా ఇచ్చుకోడం జరుగుతుంది. ఇది నీ అంతరంగంలో అనుభవానికి రాగల విషయం. అనగా జగన్మాత సాన్నిధ్యం నీ అన్నమయ, ప్రాణమయ, మనోమయ చేతనలలో నీకు స్ఫురిస్తుంది. నీ సర్వప్రకృతినీ ఆమె దివ్యప్రకృతిగా రూపాంతరం చెందిస్తుంది. ఆమె దివ్యప్రేమ నిన్ను ఆవరించి, తన చేతులతో లాలిస్తూ పరమ గమ్యానికి చేరుస్తుంది.

## సర్వాత్మనా ఈశ్వరుని ప్రేమించ నేర్చుకో

ఈశ్వరుని ప్రేమించడ మన్నప్పుడు, నీ అంతరాత్మతోనేగాక, నీ యందలి అన్నమయ ప్రాణమయాది చేతనావిభాగాలన్నిటితో కూడ ప్రేమించవలసి వుంటుందనేది ముఖ్యంగా గుర్తుంచుకో. పరిపూర్ణమైన ఆత్మార్పణం ఈ విభాగాలన్నిటికీ సాధ్యమే. ప్రియతముడైన యీశ్వరుని కొరకై ఆత్మసమర్పణ మొనర్చుకొనే ప్రాణమయ చేతనాప్రవృత్తి వాస్తవంగా పరమోదారం.

## ఈశ్వరుని ప్రేమించటంలో ప్రాణకోశం పాత్ర

ఈశ్వరుని ప్రేమించడంలో ప్రాణమయ చేతన పాల్గొనడం జరిగినప్పుడు, ఉత్సాహం, శూరత్వం, గాఢత్వం, అనన్యత్వం, సర్వసమ

ర్పణం మొదలైన గుణాలు ఆ ప్రేమకు సంతరించ బడుతాయి. ఈశ్వరుని కొరకు ప్రాణమయచేతనలోని ప్రేమోద్వేగఫలితంగానే ఆధ్యాత్మిక వీరులు, విజేతలు, ప్రాణత్యాగఘనులు ఆవిర్భవిస్తారు.

### ఈశ్వరప్రేమసాధకుని అధికార సంపత్తి

ఈశ్వరునిప్రేమ గంభీరము, విశాలము, నీరవము. దానిని నీవు గుర్తెరిగి దానిచే ప్రభావితుడవు కావాలంటే, శాంతుడవు, విశాలుడవు కావడం అవసరం. దానికి సర్వసమర్పణ మొనర్చుకొని, దాని ఉపకరణం కావడానికి నీవు సిద్ధపడినప్పుడు, అదే నిన్ను ఎలా మలచుకోవాలో అలా మలచుకొంటుంది. 

### మానవప్రేమల జంజాటం

ఈశ్వరప్రేమ పంచుకొనగోరేవాడు మానవప్రేమల జంటాటం పెట్టుకొనరాదు. ఇవి వాని భావావేశాలను వాని పరమలక్ష్యమం దేకాగ్రం కానీయకుండా చెదరగొట్టడంతోపాటు వానికి సంకెళ్ళుగా తయారై అడుగడుగునా వాని కవరోధాలు కల్పిస్తాయి. 

### జాగరూకత అవసరం

అంతరాత్మతో ప్రేమించే ప్రేమ స్వతః విశుద్ధమైనదే—ప్రతిఫలాపేక్ష లేనిదే. కాని, మానవుల మధ్య పరస్పరాకర్షణ సందర్భములో అది సామాన్యంగా తన విశుద్ధిని కోల్పోవడం జరుగుతూ వుంటుంది. కనుక, సాధకుడు దీని విషయంలో కడుజాగరూకుడై వుండడం అవసరం. ఏలనంటే, దీని మాటున ఇంద్రియలాలసలు చోటుచేసుకొనడం కద్దు.

## విశ్వప్రేమ

ఒకే పరమేశ్వరుడు అంతటా వ్యాపించివున్నాడనే దృష్టిపై ఆధారపడి వుంటుంది విశ్వప్రేమ. వ్యష్టిచేతన విశ్వచేతనగా విశాలత చెందడం దీనికి అవసరం. అజ్ఞానానికీ ఆసక్తిదోషానికీ ఇందు తావుండదు.

## రెండు రకాలు

దివ్యప్రేమ రెండురకాలు. ఒకటి — ప్రేమ స్వరూపుడైన భగవానునికి తనలో భాగమైన సృష్టియెడ, జీవులయెడ నుండే దివ్యప్రేమ. రెండవది_ప్రియతముడైన భగవానునియెడ భక్తునికుండే దివ్యప్రేమ. అది వ్యక్తిగతంగానూ, తదతీతంగానూ కూడ విలసిల్లగలదు. అయితే. ఆ వ్యక్తిగతప్రేమ అవరప్రకృతిచే దూషితము కానిది.

## దివ్యప్రేమ ; అంతరాత్మప్రేమ

భగవానుని ఏకత్వస్వరూపానందమునుండి సాక్షాత్తుగా మనలోనికి దిగి వచ్చునదియే దివ్యప్రేమ. అంతరాత్మప్రేమ అనునది. ఆ దివ్యప్రేమ మానవునిలో మానవచేతనా వికాసపు అవసరం నిమిత్తం ధరించిన ఒక రూపవిశేషం.

## ఆధ్యాత్మిక సంసిద్ధి

ఆధ్యాత్మిక సంసిద్ధికి రెండు పరస్పర విభిన్నరూపాలున్నాయి. ఒక దానియందు సాధకుడు నామరూపాత్మకమైన సమస్త జగత్తునుండి ఉపరమించి తనలోని ఈశ్వరతత్త్వమందు లీనమవుతాడు. రెండవదానియం

దాతడు సమస్త జగత్తులోనూ ఆత్మదర్శనమూ, ఈశ్వరదర్శనమూ చేస్తూ తద్వారా విశ్వాత్మకతను అందుకుంటాడు.

## ప్రేమ : ఏకత్వభావం

ప్రేమ అంతరాత్మనిష్ఠమైనప్పుడు. ఏకత్వభావం దానిలో తప్పనిసరిగా ఇమిడి వుంటుంది. పరమాత్మయందలి దివ్యప్రేమకు మూలం ఏకత్వమే. ఆ దివ్యప్రేమనుండి పుట్టినదే అంతరాత్మనిష్ఠమైన ప్రేమ.

## పరమాత్మతో సంయోగం

అంతరాత్మ పరమాత్మతో సంయోగం చెందినప్పుడు దానికిక వియోగ ముండదు. అసంయోగమే వియోగం. పరమాత్మతో ఈ సంయోగాను భూతి ఏకత్వంలో నానాత్వంవంటిది. లేక, పూర్ణంలో అంశం వంటిది. సముద్రంలో నీటికణం కలిసిపోవడం వంటిది కాదు.

## విశ్వప్రేమానుభవం

పరమాత్మస్పర్శ పొందనేర్చిన సాధకుడు స్వయంగా తాను విశ్వప్రేమానుభవం లేనివాడైనా, పరమాత్మకుగల విశ్వ ప్రేమను – అనగా సమస్త భూతజాలమునందుగల ప్రేమను తెలుసుకోగలడనియే చెప్పవచ్చును. ఆ తెలివియే తుదకాతనిని సహజంగా విశ్వప్రేమానుభవ సంపన్నునిగా చేయగలుగుతుంది.

## విశ్వచేతన మూలస్వరూప లక్షణం

సర్వజగత్తుతో ఏకత్వం మూలమందు స్వతస్సిద్ధంగానూ, స్వయం

సంపూర్ణంగానూ ఉండనే ఉన్నది. అభివ్యక్తం చేసుకోవలసిన అవసరం దానికి లేదు. అయినా, ప్రేమరూపంలో అది అభివ్యక్తమగునప్పుడు, ఎంతటి గాఢమైనదైనా దానియం దొకవిధమైన విశాలత, ప్రశాంతత, విశ్వజనీనత తప్పనిసరిగా ఉండితీరుతుంది. విశ్వచేతనకు మూలస్వరూప లక్షణ మిది.

## విశ్వచేతన ఉపరితలం

విశ్వచేతన మూలంలో ఉండేది ఏకత్వానుభూతికాగా, ఉపరితలంలో విశ్వశక్తి లీలావిశేషమును గురించిన ఎరుక ఉంటుంది. స్త్రీ పురుషుల కామలీలతో సహా ఇచట ఏదైనాసరే తలయెత్తడానికి వీలున్నది. సాధకుడు పూర్తిగా అంతరాత్మనిష్ఠుడు కాగలిగితేతప్ప, ఈ ఎరుకయందు సరియైన పద్ధతిలో వ్యవహరించడం కుదరదు.

## మనస్సునందలి ఏకత్వానుభూతి

మనస్సునందు ఏకత్వానుభూతి మనస్సున కొక విధమైన విమోచన కల్పించేమాట వాస్తవమే. కాని, అంతమాత్రాన అన్న, ప్రాణకోశము లయందు మార్పురాదు. అందలి ప్రవృత్తులు యథాపూర్వంగానే సాగిపోతూ వుండవచ్చును. ఏలనంటే, వాటినడక కొంతవరకు మాత్రమే మనస్సుపై ఆధారపడి వుంటుంది. అంతేకాదు, మనస్సుకు యిష్టం లేకపోయినా దానిని నవి తమతోపాటు లాగుకొనిపోగలవు.

## ప్రాణకోశ ప్రవృత్తుల అనురోధం

మనోమయకోశపు ఏకత్వానుభూతియందలి శాంతి, విశుద్ధత ప్రాణ

మయ, అన్నమయ కోశములలోనికి కూడా అవతరించడం అవసరం. అలా అవతరించినప్పుడే దాని ప్రభావం ఈ కోశప్రవృత్తులపై కూడ పనిచేసి సహజంగా వాటిని అరికట్టగలుగుతుంది.

## విశ్వప్రేమ ప్రకటన

నీలోని చైతన్యమంతటిలోనూ మాలిన్య మనేదిలేక పరమ విశుద్ధ స్వరూపంలో ఏకత్వానుభూతి నీయందు నెలకొనే పర్యంతం, నీవు విశ్వప్రేమను ప్రకటన చెయ్యడం మంచిదికాదు. అలా ప్రకటన చెయ్యకుండా దానిని నీలో కుంభించుకున్నప్పుడే, క్రమశః చేకూరగల యితరానుభూతులవలన కూడ అది మరింత సుస్థిరము, పరిపుష్టమునై నీ ప్రకృతి యందు అంతర్భాగమైపోతుంది.

## విశ్వప్రేమ విశ్వకామంగా మారే ప్రమాదం

విశ్వప్రేమానుభూతి ఇంకా కలిగినంతనే దానిని ప్రకటించి చెల్లాచెదరు చేసుకోడం అవివేకం. అది కామాది ప్రాణకోశ ప్రవృత్తులు అవలీలగా తలయెత్తడానికి అవకాశ మిస్తుంది. విశ్వప్రేమ విశ్వకామంగా మారి భ్రష్టులైన యోగివరులను నేనెరుగుదును. ప్రాక్పశ్చిమ దేశాలలో అనేకులకు ఈ గతి పట్టినది.

## సుస్థిరమైన పునాది అవసరం

దివ్యజ్ఞానంచే రూపాంతరం చెందింపబడని ప్రాణకోశ ప్రవృత్తులను సాధకుడు అవశ్యం నిరాకరించితీరాలి. లేనియెడల, అది అవినీతికి దారి తీయగలదని చైతన్యమతోద్యమాదుల పూర్వానుభవం హెచ్చరిక చేస్తు

న్నది. అవరకోశములయందు సుస్థిరమైన పునాది ఏర్పడితే తప్ప విశ్వ ప్రేమరూపమైన విశాల ప్రవృత్తి సాధకునియందు స్పష్టంగా ప్రకటితం కానేరదు.

## లీలయందు వైవిధ్యం

సకల భూతములతోడనూ ఏకత్వమనునది ఆంతరంగికానుభూతి. అన్నింటితోనూ ఒకేవిధంగా వ్యవహరించాలని దాని అర్థంకాదు. అలా వ్యవహరిస్తే 'ఏనుగూ బ్రహ్మమే, మావటివాడూ బ్రహ్మమే'—అన్న కథ మాదిరిగా తయారవుతుంది. మూలమందు అంతా ఒకటే అయినా లీలయందు వైవిధ్యమున్నది. సాధకుడు రెంటినీ గుర్తించడం అవసరం.

## హృదయం విచ్చుకొన్నప్పుడు—

నీ హృదయకవాటం విచ్చుకొన్నప్పుడు నీలోనుండి ప్రసరించే ప్రేమను ప్రాణకోశ సంబంధమైన ఇంద్రియ ప్రవృత్తులపాలు చెయ్యకుండా పరమాత్మయందే దానిని లగ్నంచెయ్యి. అప్పుడది తన విశుద్ధతను కాపాడుకుంటూ చరితార్థతను పొందుతుంది.

## దర్శనం

దర్శనం పలురకాలు. స్థూలదర్శనం ధ్యేయరూపాన్ని తాత్కాలికంగా మాత్రమే గ్రహిస్తుంది, ఆంతరంగికభక్తి ఉంటేతప్ప అట్టి దర్శనం వలన నీలో పరివర్తనం కలుగదు. ధ్యేయరూపాన్ని సచేతనంగా హృదయంలోనికి గ్రహించే సూక్ష్మదర్శన మొకటి ఉన్నది. అది సద్యః ఫలదాయకమై ఆధ్యాత్మిక పురోగతికి శుభారంభ మవుతుంది.

## ఏకత్వానందలీల

ఏకత్వం, ఆనందం. ఇవి రెండూ పరమసత్యపు ముఖ్య లక్షణాలు. ఏకత్వానందముల సహజశక్తియే ప్రేమ. కనుక, ఏకత్వానంద లీలా విశేషములకు ప్రేమ ఏడుగడ కావడం అవసరం. ఈ లీలా విశేషములు ఒకేవిధమైనవిగాక, అనేకవిధములైనవి కావచ్చు.

## దివ్యప్రేమ అంతస్తులు

మూలస్వరూపమందు ప్రేమ స్వయంసిద్ధం, విశ్వాతీతం, నిరపేక్షం. అదే విశ్వవ్యాప్తమై సర్వమునూ భుక్తపరచుకొనునప్పుడు విశ్వప్రేమ అనబడుతుంది. అట్లు విశ్వవ్యాప్తంగాక ఏ ఒక వ్యక్తియందో గాఢంగా లగ్నమై తద్వారా ఏకత్వానందం పొందునప్పుడు దానిని వ్యక్తిగతమైన దివ్యప్రేమగా పేర్కొనవలసి వుంటుంది.

## భక్తి - ప్రేమ

తనకంటె గొప్పవానియెడ పూజ్యభావం, ఆరాధనం, ఆత్మార్పణం—ఇవి భక్తి లక్షణాలు. సామీప్యంకొరకు, సాయుజ్యం కొరకు ఆసక్తి, అభినివేశం—ఇవి ప్రేమలక్షణాలు. ఆత్మార్పణం రెండిటిలోనూ ఉన్నది. యోగసాధనలో ఈ రెండూ కావలసినవే. ఒకదాని కొకటి సహాయకములైనప్పుడు వీటిశక్తి ఇనుమడిస్తుంది.

## భక్తిప్రాదుర్భావం

భక్తి అనునది అనుభూతికాదు. అదియొక హృదయస్థితి, హృదయ

మందలి పురుషుడు—అంతరాత్మ – మేల్కాంచి ప్రాముఖ్యం వహించి నప్పుడు ఆ స్థితి ఏర్పడుతుంది.

## అహైతుక భక్తి

అహైతుకభక్తిమార్గంలో, ప్రతిదానినీ సాధనగానే మలచుకోవచ్చు. ఉదాహరణకు, సంగీత సాహిత్యాలు భక్తిభావాభివ్యక్తికేకాక, భక్తి అనుభూతికి సైతం సాధనభూతములౌతాయి. ధ్యానమనేది ఏకాగ్రతకు చేయు మానసిక పరిశ్రమ కావడానికి బదులు భక్తిప్రేమల సహజ ప్రవాహంగా మారిపోతుంది.

## బాహ్యపూజ

పూజ కేవలం బాహ్యమే. అయితే అది చాల తక్కువరకానికి చెందిన దనడానికి సందేహంలేదు. కాని. ఆ బాహ్యపూజనే సరియైనదృష్టితో చేసేయెడల, పూజాకార్యమందు పాల్గొనే అవకాశం శరీరానికీ, బాహ్య చేతనకు గూడ కలుగుటచే ఆరాధనకు మరింత పూర్ణత్వం చేకూరుతుంది.

## ఛాయాచిత్రం

ఛాయాచిత్రం ఒకసాధనం మాత్రమే, సరియైనదృష్టి నీకుంటే, ఆ ఛాయాచిత్రం ద్వారా దానికి మూలమైన సచేతనుని గుర్తెరిగి తత్సంబంధ సాధనంగా దానిని ఉపయోగించుకొనగలవు. ఇది ఒకవిధంగా దేవాలయం లోని విగ్రహానికి చేసే ప్రాణప్రతిష్ఠ వంటిది.

## ప్రాణప్రతిష్ఠ

ప్రాణప్రతిష్ఠ మూలమున శక్తిమంతమైన దివ్యసన్నిధి కల్పించబడి నప్పుడు, ఆ దివ్యసన్నిధి కల్పించినవాని శరీరత్యాగానంతరం కూడా చాలాకాలం వరకూ ఉండవచ్చును. సామాన్యంగా అది, అర్చకుల భక్తి విశేషంచేత, దేవాలయానికివచ్చే ఆస్తికజనుల విశ్వాసబలంచేత పోషించ బడుతూ, అవి లోపించినప్పుడు తిరోహితం కావడం కద్దు.

## భగవంతునితో సంయోగం

భగవంతునితో అంతస్సంయోగమే సర్వకాల సర్వావస్థలలోనూ స్థిర మైనది. బాహ్యసంయోగం సాధారణంగా అలా స్థిరం కానేరదు. కొందరు, భగవదారాధన చేస్తున్న సమయంలో తాము పూజించే పటంగాని, విగ్ర హంగాని సచేతనమై తమకు పలుకుతున్నట్లనుభవం పొందవచ్చు. కొందరు భగవంతుడు నిత్యమూ తమ చెంతనే, తామున్న గదిలోనే తిరుగాడుతున్నట్లనుభవం పొందవచ్చు. కొందరాయన ఆలింగనాది స్పర్శ లను సైతం అనుభవిస్తూ వుండవచ్చు. కాని, ఇవన్నీ అస్థిరములే.

## అంతస్సంయోగ లక్షణం

భగవంతుడు తనలోవున్నట్లు, విశ్వమందలి ప్రతివస్తువులోనూ ఉన్నట్లు, విశ్వమంతా ఆయనలోనే ఉన్నట్లు, ఆయన విశ్వాతీతుడుగా కూడ ఉన్నట్లు, సాధకుడు తెలుసుకోగలిగే అంతస్సంయోగమే అన్నిటికంటె గొప్పది _ ఈ అనుభూతియందు సాధకుడు తన చక్షురాది ఇంద్రియ ద్వారమునగూడ భగవత్సాక్షాత్కారాన్నే పొందగలుగుతాడు.

## భగవదభివ్యక్తిని గ్రహించే మార్గాలు

భగవదభివ్యక్తిని సాధకుడు తన చక్షురాది ఇంద్రియములలో ఏ ఒక దాని చేతనైననూ గ్రహించవచ్చును. లేక, తన ఆత్మయందలి ఎరుకలో నైనను గ్రహించవచ్చును. సంపూర్ణాభివ్యక్తియందు మాత్రం, దర్శనం, శ్రవణం, స్పర్శనం మొదలైనవి అన్నీ ఉంటాయి.

## దర్శనం - ఆదేశం

దర్శనం, ఆదేశం అనేవి సాధనలో భగవంతునికి చాల దూరంలో ఉన్న స్థితిని సూచిస్తాయి. ప్రాణమనఃకోశాలు దర్శనం ద్వారా భగవత్సం సర్గనూ, ఆదేశం ద్వారా భగవదాలంబననూ, పొందాలని ఆశించడం జరుగుతుంది. కాని, ఈ ప్రాణమనో భూమికలు సామాన్యంగా అపరి శుద్ధములైన కారణాన, పొరపాట్లు సంభవించడానికి వీలున్నది, విజ్ఞానం వలన ఈ భూమికలు రూపాంతరం చెందితేతప్ప, కర్మక్షేత్రంలో భగవ త్సంయోగరూపమైన పూర్ణసత్యప్రాప్తి కలుగనేరదు.

## విశుద్ధ భక్తి వైశిష్ట్యం

విశుద్ధ భావావేశంతో కూడిన భక్తి తీవ్రతరం అయిన కొలదీ సంసిద్ధికి కావలసిన శక్తిసంపద నీలో పెరుగుతుంది. విశుద్ధభక్తి భావావేశం ద్వారానే నీలోని అంతరాత్మ మేల్కొనడం, దివ్యభూమికలలోనికిప్రవేశ మిచ్చే అంతఃకవాటములు నీలో తెరుచుకోడం జరుగుతాయి.

## హృదయం ద్రవించాలి

హృదయాన్ని భావశూన్యంగా ఎండగట్టడం పూర్ణయోగ పద్ధతి కానేరదు.

భావావేశములతో హృదయం ద్రవీభూతం కావలసినదే. కాని, ఆ భావావేశాలు ఈశ్వరాభిముఖములు కావడం అవసరం. పైనుండి వచ్చేడి దివ్యప్రవాహాని కెదురుచూస్తూ హృదయం ఒకొక్కప్పుడు ఏ భావావేశాలూ లేని ప్రశాంత స్థితిలో నుండవచ్చును. హృదయం భావశూన్యమై ఎండువారినదని దానినిబట్టి భావింపరాదు.

## హృదయమే ప్రధాన కేంద్రం

పూర్ణయోగంలో ఏకాగ్రతా సాధనకు ప్రధాన కేంద్రం హృదయమే. చైతన్యం ఊర్ధ్వగతి నందుకునే పర్యంతం ఏకాగ్రతా సాధన హృదయ స్థానంలోనే జరుగవలసి వుంటుంది.

## భావావేశ ప్రయోజనం

భావావేశాన్ని చంపవద్దు. భగవంతునివైపు దానిని మళ్ళించు. అదేసరియైన యోగసాధనా పద్ధతి. భావావేశానికి ఆధ్యాత్మిక శాంతి పునాదియైనప్పుడది విశుద్ధమై దివ్యానందంగా రూపాంతరం చెందగల యోగ్యతను సంతరించుకొంటుంది.

## భావావేశ ప్రకృతికి చరితార్థత

ప్రాణ, మనఃకోశములందు శాంతి, సమత్వములు. హృదయ కుహరమునందు తీవ్రభావావేశము - యివి పరస్పర విరుద్ధములు కావు. ఈశ్వరునియెడ భక్తిభావాన్ని నీ హృదయాంతరాళంలో రగుల్కొనేటట్లు చెయ్యి. అప్పుడే నీ భావావేశప్రకృతి చరితార్థతను పొందుతుంది.

## అణచివేయదగని హృదయ భావావేశం

ఈశ్వరునియెడ పరమ ప్రేమతో ఆనందబాష్పములు రాల్చే హృదయ భావావేశాన్ని ఎన్నడూ అణచివేయరాదు. అట్టి భావావేశం సాధనకు అత్యంత సహాయకం. ఇంద్రియవాంఛా ప్రవృత్తులతో కలగాపులగ మైనప్పుడు మాత్రమే భావావేశం సాధనకు భంగకరంగా తయారవు తుంది.

## అంతర్ముఖ భక్తిభావావేశం అపేక్షణీయం

హృదయకుహరపు ఉపరితలాన పట్టి భావావేశంతో కూడి భక్తి బహిర్ము ఖంగా మాత్రమే ప్రసరిస్తుంది. అది యెంత తీవ్రమైనదైనా కావచ్చు. జీవితాన్ని సమగ్రంగా మార్చగలశక్తి దాని కుండదు. హృదయకుహ రపు లోలోతున, అంతర్ముఖంగా ప్రసరించే భక్తి భావావేశం బాహ్యాభ్యం తర జీవనపథాన్ని సంపూర్ణంగా మార్చివేయగలదు.

## లోలోతులకు పోవలసిన ఆవశ్యకత

సాధనలో పైకి ఎక్కడం నేర్చుకొని సాధకుడు సకల సమస్యలనూ అతిక్రమించవచ్చుననేమాట నిజమే. కాని, క్రిందనున్న సమస్యలు సమస్యలుగానే వుండగా అతడు ఎల్లకాలం పైననే వుండడం చాల కష్టం. సాధనలో పైపైకి వెళ్ళడంవలెనే లోలోతులకు లోపలకు పోవడం కూడా ఉన్నది గనుక, ఈ సమస్యల పరిష్కారాని కతడు తన లోలోతులకు పోవడమనేది అత్యంతావశ్యకం.

## హృదయ గర్భములోనికి చొరబడనేర్చుకో

హృదయకోశపు ఉపరితలంలో తచ్చాడుతూ వుండిపోక హృదయగర్భం లోకి చొరబారడం నేర్చుకో. అది హృత్పురుషుడుండే స్థానం. అచటికి చేరినతర్వాత ఉపరితలపు విక్షేపాలు నిన్నేమీ చేయజాలవు. అచట నుండేవి అంతశ్శాంత్యానందములు. పరాభక్తి, పరమేశ్వరీ సాన్నిధ్యము.

## విపరీతభావలోలుపత్వం మంచిదికాదు

ప్రేమ, దుఃఖం, నిరాశ, ఉల్లాసం మొదలైన భావోద్వేగముల యందు విపరీతలోలుపత్వం సాధకులకు శ్రేయస్కరం కాదు. ఎంతటి గాఢమైన భావోద్వేగంలోనైనా సంయమం, నిగ్రహం, శాంతి అతడు అలవరచు కోవాలి. భావోద్వేగాలను అతడు తన వశంలో నుంచుకోవాలిగాని తాను వాటికి వశుడైపోరాదు.

## భక్తి, ఆకాంక్ష విలసిల్లదగు స్థానం

హృదయ కుహరపు ప్రశాంతతయందు ఈశ్వరునియెడ నిక్కమైన భక్తి, ఆకాంక్ష పాదుకొనడం అవసరం. అప్పుడే నీ స్వభావం దానంతటది విచ్చుకొంటుంది. నిక్కమైన అనుభూతి నీకు కలుగుతుంది. జగజ్జనని శక్తి నీలో పనిచేయ మొదలిడుతుంది. నీకు కావలసిన జ్ఞాన సాక్షాత్కారమవుతుంది.

## పరతత్వం సగుణ-నిర్గుణం

పరతత్వానికి సగుణ, నిర్గుణ ముఖము లున్నాయి. నిర్గుణతత్వం

మాత్రమే ప్రధానమైనది, సత్యమైనది అనుకోడం పొరపాటు. అలా అనుకోడంవల్ల సాధకుడు పాక్షిక వికాసం మాత్రమే పొందగలుగుతాడు. అతని యందలి ఒక విభాగానికి తృప్తి ఘటిల్లినా వేరొక విభాగానికి వెలితి యేర్పడుతుంది.

## సగుణతత్త్వ విశిష్టత

నిర్గుణతత్వం తార్కికబుద్ధికీ, అచలాత్మకూ సంబంధించినదికాగా, సగుణతత్వం హృదయానికీ, శక్తివిలసనకూ సంబంధించినది. సగుణ తత్వాన్ని నిర్లక్ష్యం చేసేవా రొక ముఖ్యవస్తువును విస్మరిస్తున్నారనే చెప్పాలి. విశుద్ధమైన హృదయాకాంక్షలచే అన్వేషించబడునది తార్కిక బుద్ధి గోచరమైన సత్యనిరూపణల కంటే విలువలో యేమాత్రమూ తక్కువైనది కాదు.

## విలపించడం అనవసరం

పూర్ణయోగంలో భక్తి సాధనయందు విలపించడం, వ్యాకులపాటు చెందడం వంటి ప్రవృత్తులకు ప్రాధాన్యం లేదు. హృదయంలో తీవ్రమైన ఆకాంక్ష, గాఢానురాగం, భగవత్సంయోగేచ్ఛ—ఇవన్నీ వుండవలసినవే కాని, విలపించడం, వ్యాకులపాటు చెందడం అనవసరం.

## పూర్ణయోగమందలి పరివర్తనద్వయం

మొదట నీలోని హృత్పురుషుడు ముందునకు వచ్చి నీ స్వభావాన్ని నియమిస్తూ పరివర్తనం కలుగజెయ్యాలి. పిమ్మట జగజ్జనని చైతన్యం నీలోనికి శిరస్సుపై నుండి అవతరిస్తూ నీ సమస్తసత్తనూ రూపాంతరం

పొందించాలి. ఇదే పూర్ణయోగంలో ముఖ్యంగా జరగవలసిన పరివర్తన ద్వయం.

## సాధనలో విరహానుభవం

విరహ మనునది సాధనయందొక దశలో ఆత్మోపలబ్ధికై ప్రాణకోశాకాంక్ష యందు కలిగెడి ఒక తాత్కాలికానుభవం. కాని, సాధన పరిణత దశలో కలిగేవి, మాత్రం ఏ బాధలూ లేని విశుద్ధానంద పూర్వకమైన అనుభూతులే.

## వియోగ బాధలు

వియోగబాధలు ప్రాణకోశానికి సంబంధించినవి కాని హృత్పురుషునికి సంబంధించినవి కావు. హృత్పురుషునికి బాధలూ లేవు, వాటిని ప్రకటించవలసిన అవసరమూ లేదు. నిండు విశ్వాసంతో ఆనందంతో సదా అతడు ఈశ్వరాభిముఖుడు గానే ఉన్నాడు. అతని ఆకాంక్షయందు వ్యాకులపాటుకు తావులేదు.

## యోగసాధన ముఖ్యలక్ష్యం

చేతనలో మార్పు సాధించడమే యోగసాధన ముఖ్యలక్ష్యం. నీలో దాగివున్న సత్యచేతన ముసుగు తొలగించి క్రమేణా ఆ చేతనను అభివ్యక్త పరచుకొంటూ రావడమే నీవు చేయవలసినది. అలా చేసినప్పుడే తొలుత ఈశ్వరస్పర్శనూ, తుదకు ఈశ్వరసంయోగాన్నీ నీవు పొందగలుగుతావు.

## అంతశ్చేతనయందు నివాసం

భక్తి, ఆనందము నీయందలి అంతశ్చేతనకు సంబంధించినవి. ఆ అంతశ్చేతనయందు నీవు నివసించడం నేర్చుకున్నప్పుడే భక్త్యానందములు నీయందు స్థిరంగా పాదుకొంటాయి. అంతవరకూ భక్త్యానందానుభూతులు ఎడనెడ నీకు కలిగినా అవి స్థిరంగా వుండనేరవు.

## ఆకాంక్ష తరువాతనే అనుభూతి

భగవదనుభూతి కలిగితే తప్ప భగవద్భక్తి పొసగదనుకోడం అవివేకం. సాధకుడు మొదట భగవంతుని విడువకుండ తీవ్రంగా అన్వేషించిన మీదటనే అతనికి భగవత్సాక్షాత్కార మవుతుంది. హృదయంలో ఆకాంక్ష బయలుదేరిన తరువాతనే దాని ప్రతిఫలంగా అతనికి భగవత్ప్రేమానందానుభూతులు కలుగుతాయి.

## తెర తొలగాలంటే–

తొలుత సాధకుడే భగవానుని అన్వేషించాలి, ప్రేమించాలి, అన్వేషణను కొనసాగిస్తూ భగవానుని కొరకు ఉద్విగ్న హృదయుడు కావాలి. అది జరిగినప్పుడే, తెర ప్రక్కకు తొలగుతుంది, వెలుగు ద్యోతకమవుతుంది. భగన్ముఖారవింద దర్శనమై, మరుభూమియందింతకాలమూ సంచరించుచుండిన ఆత్మకు సంతృప్తి కలుగుతుంది.

## కోశశుద్ధి ఆవశ్యకత

నీకు 'అనుభూతు' లనేవి కలుగ నారంభించడానికి ముందు, నీ ప్రాణకోశమూ హృదయకోశమూ విశుద్ధమై అందుకు తగిన యోగ్యతను సంపా

దించుకోడం అవసరం. కోశవిశుద్ధి లేకుండా పొందిన అనుభూతులు ప్రమాదకరములుగా పరిణమించిన సందర్భా లనేకం ఉన్నాయి.

## సామాన్య సాధనక్రమం

కోశవిశుద్ధికి పూర్వమే కొందరికి నిక్కమైన 'అనుభూతి' కలగ వచ్చు. కాని, అది స్థిరంగా వుండదు. మరల తిరోహితమై కోశవిశుద్ధికొరకు నిరీక్షిస్తుంది. అయినా ఇది ఎల్లరికీ వర్తించే విషయంకాదు. సామాన్యంగా సాధన ఆత్మయందలి ఆకాంక్షతోనే ప్రారంభమవుతుంది. పిమ్మట ఆలయం సిద్ధం కావడానికి ప్రకృతిలో సంఘర్షణ, అనంతరం విగ్రహావిష్కరణ, అటు తర్వాత పవిత్ర గర్భాలయంలో నిత్య సన్నిధి.

## ముఖ్యంగా కావలసినది

విశుద్ధమైన ఆకాంక్ష, ఆత్మసమర్పణ—ఇదే ముఖ్యంగా కావలసినది. వాస్తవానికి, ప్రత్యక్షం కావలసిందంటూ భగవంతుని బలవంతపెట్టే అధికారం ఎవ్వరికీ లేదు. సాధకుని ఆత్మచైతన్యవికాస పరిపక్వతను బట్టిగాని, సక్రమంగా కొనసాగిన సుదీర్ఘసాధన ఫలితంగా గాని ఆ సాక్షాత్కారం కలుగ వలసినదే.

## అనుగ్రహం హక్కుగా సంపాదించేది కాదు

సక్రమమైన సుదీర్ఘసాధనకూ, ఆత్మచైతన్య వికాసానికీ ముందే కారణం తెలియరాకుండా భగవత్సాక్షాత్కారం కలిగే యెడల భగవంతుని అనుగ్రహంగా దానిని పేర్కొన వలసివుంటుంది. అయితే, అట్టి అను

గ్రహం ఏ సాధకుడూ తనకు హక్కు ఉన్నట్టు భగవంతునిపై విధించి సంపాదించేది కాదు.

## అనుగ్రహం

అనుగ్రహమనేది భగవచ్చేతన నుంచి దానంతటది వెల్లువికి వచ్చే స్వచ్ఛంద ప్రవాహం. భక్తుడు దాని నపేక్షిస్తాడు. కాని, పరిపూర్ణ విశ్వాసంతో, అవసరమైతే తన జీవితాంతం వరకూ దానికోసం వేచి వుండడానికి సైతం సిద్ధమై వుంటాడు. అది వచ్చి తీరుతుందని అతనికి తెలుసు. అది తొందరగా రాకపోయినందువల్ల అతని భక్తిలోగాని, ఆత్మసమర్పణ భావంలోగాని మార్పురాదు.

## అనుగ్రహావతరణకు అవరోధాలు

ఈశ్వరానుగ్రహం కలుగవలెననే కోరిక ఎంత తీవ్రమైనదైనా అగు గాక, కోరిక ఉన్నమాత్రాననే చాలదు. కోరిక తీవ్రతలో ప్రాణకోశ మందు కలిగెడి అశాంతి, అసహనం అనుగ్రహప్రాప్తికి అవరోధంగా కూడా పరిణమిస్తూ వుంటాయి. అశాంత్యసహనాల సుడులలో అను గ్రహావతరణకు తావుండదు.

## అనుగ్రహస్వీకరణకు సంసిద్ధత

అశాంత్యసహనాలకు ఏమాత్రం తావివ్వక, నీకు భగవంతుడు ఏమి అను గ్రహిస్తే అది స్వీకరించడానికి ఆత్మకవాటం తెరచుకొని సిద్ధంగా వుండు. ప్రస్తుతం నీకాయన ఏమీ అనుగ్రహించక పోయినా అందుకు సైతం నీవు సిద్ధంకావలసినదే. నిక్కమైన భక్తిమార్గంలో నీవింకా ముందుకు

సాగిపోవడానికి సన్నాహమవుతున్న సమయంలో ఈ ప్రాణకోశ విక్షేపాలను నీ దారి కడ్డం రానివ్వవద్దు.

## అనుగ్రహాపేక్ష

ఈశ్వరానుగ్రహం నీవు అపేక్షింపరాదని నేననడంలేదు. యోగసాధన చెయ్యడం ఆ అనుగ్రహం పొందడానికేగదా. అది వెంటనేగాని, త్వరలోగాని రావాలని కోరరాదని మాత్రమే అంటున్నాను. అంతరంగంలో ఆకాంక్షవుండి, దానిని వదలకుండ వుంటే అనుగ్రహం త్వరగానో, ఆలస్యంగానో వచ్చి తీరుతుంది. ఆకాంక్షలో చిత్తశుద్ధితోపాటు నిశ్చలత్వంకూడా ఉండడం అవసరం.

## విరహంలో రసానందం

ప్రేమానందానికీ, విరహవేదనకూ నడుమ ఉయ్యాలలూగే వైష్ణవభక్తి సాధన యొకటి లేకపోలేదు. కాని ఆ మార్గ మనుసరించేవారు విరహంలో సైతం రసం అనుభవిస్తారు. జీవితమంతా అన్వేషించినా భగవానుడు కనిపించకుండా తప్పించుకొని పోతున్నాడని గానం చేసినవారున్నారు. ఆ అన్వేషణలో వారికి రసానందమున్నది. కనుకనే అన్వేషణ వదలిపెట్టరు. రసవిహీనమైన విరహం కోరదగినదికాదు.

## కలుషక్షాళనకు ఉపాయం

నీ లోపల ఉండే కలుషాలను, దోషాలను క్షాళన చెయ్యాలంటే, మొట్టమొదట వాటి ఉనికిని స్పష్టంగా గుర్తించు. పిమ్మట దృఢమైన సంకల్పంతో వాటిని త్రోసిపుచ్చు. అనంతరం వాటినుండి వేరుపడడం

నేర్చుకో. అప్పుడు ఒకవేళ అవి నీలోనికి తిరిగి ప్రవేశింప జూచినా నీకు పరాయివిగానే ప్రవేశించగలుగుతాయి.

## పూర్ణయోగ లక్ష్యం

ఇహజీవన పరిత్యాగ పర్యంతమైన సంపూర్ణ సన్యాసం ఇతర యోగపద్ధతుల లక్ష్యంకాగా, ఇహజీవనాన్ని క్రొత్తరీతిలో రూపాంతరం చెందించడం పూర్ణయోగ లక్ష్యం. దేహ, ప్రాణ, మనఃకోశములందు కామమును పూర్తిగా పరిత్యజించడం ఈ లక్ష్యసాధనకు అత్యంతావశ్యకం. జీవనాన్ని ఆత్మధర్మమందు ప్రతిష్ఠించడమూ, అందుకొరకై దేహప్రాణ మనో వ్యాపారముల మూలములను మనస్సునకతీతమైన చేతనకు బదలాయించడమూ ఇచట జరగవలసివున్నది.

# సాధన : మానవ సంబంధములు

—○—

## మానవ సంబంధాల పరివర్తన

పూర్ణయోగ లక్ష్యానుసారం జీవనం ఆత్మధర్మమందు ప్రతిష్ఠితం కావడమంటే, మానవుల నడుమ ఇప్పుడుండే ప్రకృతి సంబంధములకు మారుగా ఆత్మ సంబధములు ఏర్పడవలసి ఉంటుందన్నమాట. పిలుపు వచ్చిన తోడనే ప్రకృతి సంబంధమైన అనురాగములు వదలి పెట్టడానికి సాధకుడు సిద్ధమైవుండాలి. ఒకవేళ ఉంచుకుంటే వాటిని రూపాంతరం చెందించి ఉంచుకోవలసి వుంటుంది. వదలిపెట్టడంగాని, ఉంచుకొని రూపాంతరం చెందించడంగాని తన కోరికలను బట్టిగాక యోగేశ్వరుడైన ఈశ్వరేచ్ఛను బట్టి నిర్ణయం కావలసిన విషయం.

## ఈశ్వరునియందే సర్వం కేంద్రీకృతం కావాలి

సమస్తమూ ఈశ్వరునియందు, ఈశ్వరుని చుట్టూ కేంద్రీకృతం కావడమే పూర్ణయోగలక్ష్యం, సాధకుల జీవనం ఆ దృఢమైన పునాదిపైననే ప్రతిష్ఠితం కావాలి. వారి వ్యక్తిగత సంబంధాలకు సైతం ఈశ్వరుడే కేంద్రం కావలసి ఉన్నది.

## అసూయా ద్వేషాదుల విసర్జన

పూర్ణయోగ సాధనలో మానవ సంబంధాలు ప్రాణకోశము నాధారము చేసుకుని ప్రవర్తిల్లక ఆత్మస్థములై విలసిల్లడం అవసరం. ప్రాణకోశం అట్టి ఆత్మస్థితికి ఉపకరణం మాత్రమే కావాలి. అనగా, అసూయ, ద్వేషం, ఘర్షణ—మొదలైన ప్రాణకోశ ప్రవృత్తులకు ఏవిధమైన మానవ సంబంధాలలోను తావీయరాదు. ఆధ్యాత్మిక జీవనంలో వాటికి స్థానం లేదు.

## అహంకారపూర్వక ప్రేమ కూడదు

పూర్ణయోగసాధనలో అహంకారపూర్వకమైన ప్రేమకు తావులేదు. ఆహంకారం దెబ్బతిన్నా, అసంతృప్తి చెందినా ప్రేమించడం మాని వేయడం, లేక కక్షపూని ద్వేషించడం—ఇదీ అహంకారపూర్వక ప్రేమస్వభావం. నిక్కమైన ప్రేమకు మూలంలో సుస్థిరైక్యం భాసిస్తుంది. కామప్రవృత్తి కాలుష్యాలను సాధకుడు తనలో నిలువనీయరాదనేది వేరుగ చెప్పనక్కరలేదు.

## ఈశ్వరునికోసం తక్కిన సర్వమూ వదిలే పద్ధతి

పూర్ణయోగ లక్ష్యసాధనకు మార్గం వివిధ సాధకులకు వేర్వేరుగా ఉండవచ్చును. కేవలం ఈశ్వరునే అనుసరించడంకోసం తక్కిన సర్వమునూ వదలి వేయడం ఒక మార్గం. వదిలివేయడమంటే దేనినిగాని యేవగించుకోడమని అర్థంకాదు. తన ముఖ్యలక్ష్యమందు నిమగ్నం కావడమే దాని ఆశయం. లక్ష్యసిద్ధి కలిగిన పిదప సకల సంబంధాలనూ సత్యధర్మమందు ప్రతిష్ఠించుకోడం సుకరమౌతుందనే భావం దానిలో ఇమిడి వుంటుంది.

## ఈశ్వరునికె సర్వమూ ఆధీనమొనర్చె పద్ధతి

ఈశ్వరానుసరణమందు నిమగ్నుడు కావడంలో తక్కిన సర్వమునూ వదలిపెయడానికి బదులు ప్రతిదానినీ ఈశ్వరాధీనం కావిస్తూ క్రమంగా రూపాంతరం చెందించడం మరొక పద్ధతి. అంతస్సత్త క్రమంగా పరిశుద్ధమవుతూ, ఆత్మతో ఆత్మకు ఐక్యం అనుభూతమై, సాంఘికజీవనం ఈశ్వరచక్రంచే బద్ధమైనకొలదీ కామకాలుష్యం, అసూయ, క్రోధం, అహంకారికవాంఛ మొదలైనవి వాటంతటవే రాలిపోతాయి.

## ఇతరులతో సంబంధాలు

సాధకుడు తోటి సాధకులతో గాక ఇతరులతో సంబంధాలు పెట్టుకో రాదన్న నియమమేమీ లేదు కాని సాధకుని అంతరంగంలో ఆధ్యాత్మిక జీవనం అభివృద్ధి చెందినకొలదీ ఆ యితర సంబంధాలలో సైతం మార్పువచ్చు. సాధకుని దృష్టినుంచి ఆధ్యాత్మికత నలవరచుకోక తప్పదు. ఈశ్వరునికి అడ్డుగాగాని పోటీగాగాని తయారయేట్టుగా యే సంబంధమునందూ సక్తత కూడదు.

## కుటుంబమునెడ సక్తత

కుటుంబము మొదలైనవానియెడ సక్తత సామాన్యంగా సాధకు డారాధించే ఈశ్వరునకు అడ్డుగాగాని పోటీగాగాని తయారుకావడం కద్దు. అట్టి సందర్భంలో సాధకుడు దానిని తప్పక విడిచిపుచ్చవలసే వుంటుంది. అయితే, ఇదంతా క్రమంగా సాధించవచ్చును. ఉన్న సంబంధాలను విడగొట్టుకోడం కొందరికి అవసరమైనా అందరికీ అది వర్తించనక్కర లేదు.

## తోటిమానవులయెడ ప్రేమ, సానుభూతి

తోటిమానవులయెడ ప్రేమ, సానుభూతి లేకుండా వుండడం ఈశ్వర సాన్నిహిత్యానికి అవసరమని సాధకుడు తలపోయరాదు. ఈశ్వరసాన్ని హిత్య సమైక్యభావాలద్వారా అతడు పొందగల దివ్యజ్ఞానానుభూతిలో ఇతరులతోడి సాన్నిహిత్య, సమైక్య భావాలు సైతం అంతర్భూతములే.

## మానవులు ప్రేమించేది ఎందుకు?

మానవ స్నేహం, ప్రేమ. అనురాగం. సానుభూతి మున్నగునవి సామాన్యంగా ప్రాణకోశమందు ప్రతిష్ఠితములై వుంటాయి. వాటి కేంద్రంలో అహంకారం తిష్ఠవేసుకొని వుంటుంది. ఇతరుల నుండి ప్రేమను తిరిగి పొందడంకోసం, ఇతరులతోడి సంసర్గంద్వారా అహం కారాన్ని విస్తరింపజేసుకోడం కోసం, ప్రాణకోశ ప్రవృత్తుల పరస్పర వినిమయంద్వారా తమ వ్యక్తిత్వాన్ని పెంపొందించుకోడం కోసం మాన వులు సామాన్యంగా ఇతరులను ప్రేమిస్తూ వుంటారు.

## మానవ ప్రేమలోని కలగాపులగపు స్థితి

మానవప్రేమలో ప్రాణకోశ ప్రవృత్తులతోపాటు మనఃకోశ, అంత ర్హృదయకోశ ప్రవృత్తులుకూడా చేరి వుండవచ్చుననే మాట నిజమే. కాని, అదంతా ఒక కలగాపులగపు స్థితి. కనుకనే. ఒక దశకువచ్చే సరికి జీవితము, ప్రపంచము, మానవ సమాజము, అందలి సంబంధాలు, మానవసేవ (ఈ మానవ సేవాభావం కూడా శక్తిగల ప్రవృత్తులవలెనే అహంకార భూయిష్ఠం) - ఇవన్నీ నిస్సారములై గోచరిస్తాయి.

### మానవ సంబంధాల నిస్సారతాభావం

ప్రాణకోశపు బాహ్యతలమందలి ఆశాభంగం వల్లనో, ఇతరులు తనను ప్రేమించడం మానివేసినందువల్లనో, తనచే ప్రేమించబడేవారు తాను మొదట్లో అనుకున్నదానికంటే వేరువిధంగా ఉన్నట్లు తరువాత తెలుసు కున్నందువల్లనో - ఇట్లైనో స్పష్టమైన కారణాలను పురస్కరించుకొని మానవ సంబంధాలను నిస్సారములుగా భావించడం ఒక్కొక్కప్పుడు జరగవచ్చు. కాని తరచుగామాత్రం ఆ కారణాలు బయటికి స్పష్టంగా తెలియరాకుండా గర్భితంగా వుండడమే సంభవిస్తుంది.

### విశుద్ధ స్థాయిలో చేతనా ప్రతిష్ఠ

అంతస్సత్త్వయం దెచ్చుటనో, అస్పష్టమైన ఆశాభంగం పొందిన హేతువు చేతనే, సామాన్యంగా అనేకులు అధ్యాత్మిక జీవనంలోనికి మళ్ళడం, లేక నెట్టబడడం జరుగుతూ వుంటుంది. కొందరిలో అది వైరాగ్యరూపం ధరించి మోక్షసాధనకై ప్రేరేపిస్తుంది కాని, పూర్ణ యోగసాధనలో ముఖ్యంగా జరుగవలసినదిమాత్రం, అంతస్సత్త్వయందలి ఈ కలగా పులగపుస్థితి తొలగి విశుద్ధస్థాయిలో చేతన సుప్రతిష్ఠితం కావడం.

### విశుద్ధ స్థాయిలో చేతనా ప్రతిష్ఠ అంటే-

విశుద్ధస్థాయిలో చేతన సుప్రతిష్ఠితం కావాలన్నప్పుడు; కేవలం అంత ర్హృదయ చేతనయేకాదు, దేహ, ప్రాణ, మనఃకోశములందలి చేతన సైతం విశుద్ధస్థాయి నందుకోవలసినదేయని అర్థం. మానవ ప్రేమ యందలి కలగాపులగపు స్థితి అపుడంతరించి, ఏకత్వానందం ఆత్మయం దనుభూతం కావడమే గాక, వివిధ ప్రకృతి విభాగములద్వారా సైతం విశుద్ధరూపంలో అభివ్యక్తమయ్యేస్థితి ఏర్పడుతుంది.

## ప్రకృతి విభాగముల పరివర్తనం

దేహ, ప్రాణ, మనోరూపమైన ప్రకృతివిభాగములద్వారా సైతం ఏకత్వానందం విశుద్ధరూపంలో అభివ్యక్తమయ్యేస్థితి రావాలంటే, ఆ విభాగముల ప్రవృత్తులలోనే మార్పురావాలి. ప్రాతధోరణు లంతరించి వినూత్నమైన పరచేతనాభివ్యక్తికి అవి ఉపకరణములుగా పరివర్తనం చెందాలి. అదే వాటి పరమార్థం.

## ప్రాణకోశ ప్రవృత్తి ఆవశ్యకత

దివ్యకర్మ విలసనకు ప్రాణకోశప్రవృత్తి అత్యంతావశ్యకం. అదిలేకుండా జీవితానికి పూర్ణాభివ్యక్తి, పూర్ణసాఫల్యం కలుగనేరవు. సాధన కవరోధాలు కల్పించే ప్రాణకోశపు కలగాపులగ స్థితిగా నేను పేర్కొనునది కామ దూషితము, అహంకార భూయిష్ఠమూనై, అవరోద్వేగముల కాలవాలమైన దాని బాహ్యతల స్వరూపం.

## సాధనలో ప్రాణకోశ నియమన ప్రాముఖ్యం

సాధన కవరోధాలు అన్న, మనఃకోశాలనుండి కూడా సంప్రాప్తించగలవనేమాట నిజమే. కాని, ప్రాణకోశం మిక్కిలి బలవత్తరమైనదీ, అత్యంతావశ్యకమైనదీ కావడంచేత, దానివలన కలిగే అవరోధాలు అతి ప్రబలములై అందలి కలగాపులగ స్థితి సాధనకు మిక్కిలి ప్రమాద కరంగా తయారవుతుంది. కనుకనే, దానిని విశుద్ధ మొనర్చి వశపరచు కోవడం అత్యంతావశ్యకం.

## ప్రేమానురాగాలు స్వతః ఆత్మగుణాలు

ప్రేమానురాగాలు స్వభావతః ఆత్మచేతన గుణాలు. ప్రాణచేతనయందవి గోచరిస్తున్నవంటే, ప్రాణకోశంద్వారా తనను అభివ్యక్తం చేసుకోడానికి ఆత్మ యత్నిస్తున్నందువల్లనే. హృదయభావచేతన ద్వారా తనను తాను అభివ్యక్తం చేసుకోడం ఆత్మ కత్యంతసుకరం. ఏలనంటే సరిగా ఈ హృదయభావచేతనకు వెనుకగా హృదయ కేంద్రమయిన వెలుగొందుతున్నదే ఆత్మచేతన.

## ఆత్మతో అనుబంధమే ఆత్మకు ప్రధానం

హృదయాంతర్గతమైన ఆత్మను స్వభావసిద్ధంగా ఆకర్షించేది ఆత్మతో సంబంధం, ఆత్మతో సమైక్యం. అన్న, ప్రాణ, మనఃకోశాలు దాని అభివ్యక్తికి చాల విలువైన సాధనలేకావచ్చు, కాని ఆత్మకు ముఖ్యంగా కావలసినది మాత్రం ఆంతరంగిక జీవనానుభవమే. ఈ అభివ్యక్తి సాధనలన్నీ దానికి లోబడియే వర్తించవలసి ఉంటాయి.

## మానవ ప్రేమలలో సఖ్యం విశిష్టత

ఇతర సంబంధాలకంటె ఆత్మ సంబంధం ప్రాబల్యం వహించినప్పుడే మానవ ప్రేమలకు సుస్థిరత్వం ఏర్పడుతుంది. ప్రాణకోశ వృత్తి ప్రాబల్యం తక్కువగావున్న హేతువుచేత మానవ ప్రేమలలోకెల్ల సఖ్యం విశేషకాలం మన్నగల అవకాశం వున్నది. అహంకారంతో కూడిన జ్వాలయే అయినా ప్రశాంతంగా ప్రజ్వరిల్లి వెలుగూ వెచ్చదనమూ ఇవ్వగల శక్తి దాని కుంటుంది.

## నిక్కమైన సఖ్యం సులభ్యం కాదు

నిక్కమైన సఖ్యం సర్వసాధారణంగా సకృత్తుగా మాత్రమే ఒనగూరుతుంది. నిస్స్వార్థంగా ప్రేమించే నిక్కమైన మిత్రు లనేకులను సంపాదించడం మరుమరీచిక వంటిదని నిశ్చయంగా చెప్పుకోవచ్చు.

## మానవప్రేమ ఉపయోగం

మానవప్రేమ విలువ ఎట్టిదైనా, అతని వికాసపథంలో దానికొక స్థానం ఉన్నది. ఏలనంటే, అసత్యమును వీడి సత్యమును, అపూర్ణమును వీడి పూర్ణమును, మానవత్వమును వీడి దివ్యత్వమును గ్రహించే యోగ్యత సంపాదించే పర్యంతం తనకు కావలసిన హృదయభావానుభూతులను హృత్పురుషుడు ఈ మానవప్రేమ ద్వారముననే పొందగలుగుతాడు.

## ప్రేమానురాగాలకు ఆలంబనం

సకల జీవనాన్ని, సకల చేతననూ ఈశ్వరునియందు ప్రతిష్ఠించుకోడమే యోగసాధన లక్ష్యం. కాన, మన ప్రేమానురాగాలకు కూడా ఈశ్వరుడే ఆలంబనం కావాలి. ఈశ్వరునితో మన ఆత్మచేతన ఏకత్వం భజించడమే దానికి పునాదిగా ఏర్పడాలి, ఇతరమునెల్ల వీడి కేవలం ఈశ్వరు నాశ్రయించడమే దానికి రాచబాట.

## సాధనప్రధానమైన సంబంధాలు కావాలి

యోగసాధనకు దిగినపిమ్మట సాధకునకు యితర మానవులతోడి సంబంధాలలో మార్పురావడం అవసరం. రక్తసంబంధాదుల ప్రాధాన్యం అంతకంతకు తగ్గిపోవాలి. దానికి బదులుగా సాధన ప్రధానమైన సంబంధాలు

అంతకంతకు పెంపొందాలి. అందరినీ ఒకే ప్రయాణంలో వున్న ఆత్మ లుగా, ఒకే జగన్మాత సంతానంగా అతడు చూడ నేర్చుకోవాలి.

## స్త్రీ పురుషుల మధ్య యోగసంబంధం

యోగసాధన చేసే స్త్రీ పురుషులమధ్య స్వచ్ఛందమైన యోగసంబంధం నెలకొనాలంటే, తాము స్త్రీ పురుషులమనే మాట మరచి, కేవలం మాన వులుగా, ఈశ్వరాన్వేషణయం దనన్యతత్పరతగల సాధకులుగా మాత్రమే ఒండొరులతో వ్యవహరించ నేర్చుకొనడ మొక్కటే దానికి మార్గం. ఆ నిష్ఠ కుదిరిననాడు ఏచిక్కులూ రావు.

## ఇతర సాధకులతో ఘర్షణలు

స్త్రీ పురుషుల కామప్రవృత్తుల కెట్లో, అట్లే ఇతర సాధకులతో ఘర్షణలకు సైతం యోగసాధనయందు స్థానం లేదు. సామరస్యం, సద్భావం, సహనం, సమత, ఇవే సాధకులకు ఇతర సాధకులతోడి సంబంధాని కుండవలసిన లక్షణాలు.

## ఈశ్వరునిపై దృష్టి చెదరకుండా పనులు

ఎల్లవేళలా, ఎల్ల పనులలో ఈశ్వరుని దృష్టియందుంచుకొను సాధకుడు ఆ దృష్టి చెదరకుండానే వార్తాపత్రికలు చదవడం, ఉత్తరాలకు జవాబులు వ్రాయడం మొదలైనవి చేయవచ్చు. అయితే దృష్టిలో నైశిత్యం కొంత తగ్గితే తగ్గవచ్చు. సిద్ధత్వం కుదిరినపిమ్మట ఈ భేదంకూడా ఉండబోదు.

## వర్జింపవలసిన బహిర్వ్యాపారాలు

కొన్నిరకాల బహిర్వ్యాపారాలు తదితర బహిర్వ్యాపారాల కంటే ఎక్కు

వగా చేతనను చెదరగొట్టడానికీ, క్రిందికి, బయటకు లాగడానికీ సహకారు లవుతాయి. సాధకుడు ఇది గుర్తించి అట్టి బహిర్వ్యాపారాలను వర్జించడం అవసరం.

## అంతర్బహిశ్చేతనల అనుసంధాన శిక్షణ

వార్తాపత్రికలు చదవడం, ఉత్తరాలు వ్రాయడంవంటి బహిర్వ్యాపారాలు చేతనకు విక్షేపం కలిగించకపోయినా దాని నైశిత్యం తగ్గించవచ్చునన్నంతమాత్రాన ఏ బహిర్వ్యాపారాలూ సాధకుడు చెయ్యరాదని అర్థం కాదు. ఏ బహిర్వ్యాపారాలనూ చెయ్యనియెడల అంతర్బహిశ్చేతనలను అనుసంధానించే శిక్షణావకాశమే అతనికి లేకుండా పోతుంది.

## మనోమౌనం

మనోమౌనం సాధించాలంటే, వచ్చిన ప్రతి ఆలోచననూ త్రోసివేయడమనేది సరియైన పద్ధతి కానేరదు. ఆలోచనలకు వెనుక, వాటికంటె వేరై నిలిచి, బాహ్యవిషయాలట్లు వాటిని ప్రశాంతంగా తిలకించడం నేర్చుకోవాలి. ఆలోచనలను త్రోసివేయడం అపుడు సుసాధ్యమవుతుంది ఒకవేళ అవి అలా ఎదుట కదలిపోతున్నా, నీ మనోమౌనాన్ని భంగపరుపజాలవు.

## సమతా ప్రాముఖ్యం

సుఖదుఃఖములకు, నిందాస్తుతులకు, మానావమానములకు కలగని సమతాస్థితిని సాధకుడు అందుకోడం అత్యంతావశ్యకం. ప్రాణ మనఃకోశములలో ప్రశాంతి నెలకొనడానికది చాల సహాయపడుతుంది. సమత చేకూరి

నదంటే, ప్రాణచేతన, తదనుగతమైన మనస్సు ప్రశాంతి నొందసాగిన వన్నమాట. వాని వెనువెంట ఆలోచనాత్మకమైన మనస్సు కూడ ప్రశాంతి నొందక తప్పదు.

## భక్తి జ్ఞానాలు : ఆత్మ సమర్పణం

ఆత్మసమర్పణం మొదట ఆత్మజ్ఞానం ద్వారాకంటె భక్తి ద్వారానే ఎక్కువగా సాధ్యమవుతుంది. కాని, సంపూర్ణమైన ఆత్మసమర్పణను అధికతరంగా సాధ్యమొనర్చేది ఆత్మజ్ఞాన మనే మాటకూడా యథార్థమే.

# సాధనక్రమంలోని కొన్ని ముఖ్యాంశాలు

—o—

## పూర్ణ యోగాధికారులు

యోగలక్ష్యసాధన ఎల్లప్పుడూ కష్టసాధ్యమే. పూర్ణయోగ లక్ష్యసాధన మరీ కష్టం. హృదయాంతరమున ప్రేరణ కలిగినవారికీ ఏ చిక్కులనైననూ – అపజయమునైననూ సరే – ఎదుర్కొన నిచ్ఛగలవారికీ, సంపూర్ణమైన నిస్వార్థ, నిష్కామ, ఆత్మసమర్పణ స్థితికి పురోగమించగోరు సంకల్పంగలవారికీ ఇట్టి వారికే పూర్ణయోగం.

## పూర్ణయోగలక్ష్య విశిష్టత

పూర్ణయోగ లక్ష్యం భగవత్సాక్షాత్కారం మాత్రమేకాదు. భగవచ్చేతనాభివ్యక్తికి యోగ్యమై భగవత్కర్మసాధన మయ్యేరీతిగా బహిరంతర్జీవనమును భగవదంకితం గావించి పరివర్తన మొందించడం. మామూలు యమనియమాదులకంటె ఎంతో కఠినతరమైన అంతరంగికశిక్షణ దీనికి కావలసి వుంటుంది.

## పూర్ణ యోగమార్గమున ప్రవేశార్హత

అంతరాత్మ పిలుపువచ్చి, కడవరకూ సాగిపోగల సంసిద్ధత తనకు కలదన్న నిశ్చయ ముంటేతప్ప, ఇతర యోగములకంటె సువిశాలమూ కష్ట

బహుళమూనైన పూర్ణయోగ మార్గమున నెవ్వరునూ ప్రవేశింపరాదు. సంసిద్ధత అనగా సమర్థతఅనికాదు, ఇచ్ఛఅని అర్థం. ఎట్టి కష్టాలైనా ఎదుర్కొని కడవరకూ సాగిపోయే ఇచ్ఛవుంటే ఈ మార్గాన పోవచ్చును.

## మలుపు, పిలుపు

మానసిక సిద్ధాంతాలు ప్రధానం కావు. జీవుని అభిముఖ్యము ననుసరించి, ప్రయాణంలో జీవుడు తీసుకునే మలుపు ననుసరించి, మనస్సుసిద్ధాంతాలు కల్పించడం, వాటి నామోదించడం జరుగుతూ వుంటుంది. కనుక, ప్రధానమైనది నీ లోపలి ఆ మలుపు, పిలుపు.

## పూర్ణయోగలక్షితమైన జ్ఞానానుభవం

సచ్చిదానందాత్మకమైన పరతత్వమున్నది. అది నిర్విశేషమే కాక మహాశక్తి సమన్వితం. ఆ దివ్యచేతనానుభూతిని ఇహజీవనంలో సైతం ప్రతిష్ఠితం చేసుకోవచ్చు, అనెడి పూర్ణయోగలక్షిత జ్ఞానం మనస్సుకు సంబంధించినది కాదు. మనస్సున కతీతమైన అనుభూతికి సంబంధించినది, అనుభూతి కలుగక పూర్వం, అంతరాత్మనిష్ఠమైన విశ్వాసానికి సంబంధించినది. ప్రాణమనఃకోశముల అనువర్తనం సాధించునది ఆ విశ్వాసమే.

## భావన-జ్ఞానోపలబ్ధి

లక్ష్యమును గురించిన భావన వేరు, ఆధ్యాత్మిక జ్ఞానోపలబ్ధి వేరు.

భావన ఆధ్యాత్మిక జ్ఞానోపలబ్ధికి నిన్ను అభిముఖునిగా జేయవచ్చును. అంతేతప్ప, అదే జ్ఞానోపలబ్ధి కానేరదు.

## హృదంతరాత్మను ముందుకు గొనిరావాలి

హృదంతరాత్మను (చైత్యపురుషుని) ముందునకు గొనివచ్చి నిలిపి దాని శక్తి దేహ మనః ప్రాణములపై ప్రవరించునట్లు చేయడం అవసరం. అలా చేయడంవల్ల దేహ మనః ప్రాణములుకూడా అంతరాత్మయందలి ఆకాంక్షచే ప్రభావితములౌతాయి. మన స్వభావంలో అంతరాత్మచే సాక్షాత్తుగా గుర్తించబడిన అపప్రవృత్తులు దేహ మనః ప్రాణములకు సైతం తెలియబడుతాయి.

## అహంకార విసర్జన

అహంకారానికి అనేక రూపాలున్నాయి. వాటి నన్నింటినీ గుర్తించి నీ చేతనయందలి ఏ ప్రవృత్తిలోనూ దానికి తావీయకు. విశ్వచేతనను నీలో పెంపొందించుకో. అహంకారిక దృష్టిని విశ్వవిశాల దృష్టిగ మార్పు చెందించు. ఇదంతా విశ్వేశ్వరుని విశ్వలీలగా గుర్తించి, విశ్వశక్తుల నవగాహన మొనర్చుకో.

## ఆకాంక్షకు సహచరులు

సాధనలో, పరమప్రాప్యమందు తీవ్రాకాంక్ష వుండడం ఎంత అవసరమో. దానికి సహచరులుగా, ప్రశాంతి, వివేకం, నిస్సంగత్వం అనేవి ఉండడంకూడా అంతే అవసరం, ఏలనంటే, ఈ మూడింటికీ వ్యతిరేక

లక్షణాలు నీలో వుంటే, అవి జరగవలసిన దివ్య పరివర్తనకు అవరోధాలు కల్పిస్తాయి.

## హృదయంలో నుండి తిన్నని పిలుపు

సాధనలో అత్యంత ప్రధానమైన హృదయాంతరం నుండి శ్రద్ధాపూర్వకమైన తిన్నని పిలుపు,—ఆకాంక్ష. బహిర్ముఖంగా ప్రసరించే చేతనను అంతర్ముఖంగా ప్రసరింపజెయ్యడంకూడా చాల అవసరమే. అట్టి అంతర్ముఖత్వంద్వారానే హృదయాంతరమున పిలుపు, దివ్యానుభవం, దివ్య సన్నిధి పొందగలుగుతావు.

## ఆకాంక్ష

పరమేశ్వరుని కోసం పిలుపే ఆకాంక్ష. ఆకాంక్షకు మాటలు అవసరం లేదు. మాటలలో అది అభివ్యక్తం కావచ్చు, కాకపోవచ్చు. అది ఆలోచనారూపం ధరించనక్కరలేదు. మనసు పని చేసేటప్పుడు కూడా లోలోపల నిలిచి ఉండగల భావస్ఫూర్తి అది.

## ఆకాంక్ష-ఆత్మార్పణ

నిక్కమైన ఆకాంక్ష కామగంధ వివర్జితం. స్వార్థలక్షణోపేతమైన కామం నిన్ను క్రిందికి దిగలాగుతుంది. నిక్కమైన ఆకాంక్షలో ఆత్మార్పణమున్నది. పరచేతన నీలోనికి అవతరించి నిన్ను కైవసమొనర్చుకోడం కొరకై ఆత్మార్పణమిది. ఆకాంక్ష ఎంత తీవ్రతరమైతే ఆత్మార్పణంకూడా అంత మహత్తరమవుతుంది.

## ఆకాంక్ష-ప్రాణచేతన

హృత్పురుషునినుండి బయలుదేరునదే నిక్కమైన ఆకాంక్ష. ప్రాణమయ చేతన విశుద్ధం గావించబడి హృత్పురుషాధీనం చెయ్యబడినప్పుడు ఆ ఆకాంక్ష తీవ్రతను సంతరించుకొంటుంది. ప్రాణమయచేతన విశుద్ధం కానప్పుడు ఇకాంక్షయందలి తీవ్రత రాజసికమై, అసహనం, ఆశాభంగం, విపరీతఖేదం మొదలైన అవలక్షణాలకు తావేర్పడుతుంది.

## ఆకాంక్ష-వ్యాకులత

ఎడతెగని వ్యాకులత లేకపోవడం భగవంతునియెడ నిక్కమైన ఆకాంక్ష లేకపోవడానికి చిహ్నంగా భావించరాదు. కొన్ని భక్తియోగ పద్ధతులలో అట్టి వ్యాకులత ప్రాధాన్యం వహించేమాట నిజమే. కాని, పూర్ణ యోగంలో అంతరాత్మయందలి ఆకాంక్ష ఒక్కొక్కప్పుటు తరంగములుగ బయలుదేరడం వున్నా, నిశ్చలత్వమే దానికి పునాదియై నిలుకడగా అంతకంత కెక్కువగా సత్యజ్ఞాన సాక్షాత్కారానికీ భగవదనుభూతికీ సాధనభూతమవుతుంది.

## విశ్వాసమూలకమైనశ్రద్ధ

దృఢవిశ్వాసమూలకమైన శ్రద్ధ అత్యంతావశ్యకం. అది సర్వాత్మనా ఏర్పడాలి. మనోమయచేతనలో శ్రద్ధ సంశయవిచ్ఛేదియై సత్యజ్ఞానానికి దారిచేస్తుంది. ప్రాణమయచేతనలో శ్రద్ధ ప్రతికూలశక్తి నిరోధకమై నిక్కమైన ఆధ్యాత్మిక కర్మప్రవృత్తికి దోహదం చేస్తుంది. అన్నమయ చేతనలో శ్రద్ధ భౌతిక స్తబ్ధతకు వశం కానివ్వక సత్యచేతనా ప్రతిష్ఠకు

సహాయకారి అవుతుంది. అంతరాత్మలో శ్రద్ధ సాక్షాత్తుగా భగవత్స్వర కవకాశం కల్పించి భగవత్సంయోగానికీ సమర్పణకూ మార్గం చేస్తుంది.

## "అంధ విశ్వాసం"

'అంధ విశ్వాస'మనే పదప్రయోగానికి నిజంగా అర్థంలేదు. రుజువులేనిదే దేనినీ విశ్వసించరాదని దీని ఉద్దేశమై వుంటుంది. కాని, రుజువు దొరికిన తర్వాత ఏర్పడే నిర్ణయం విశ్వాసంకానేరదు, అది జ్ఞాన మవుతుంది. లేక, మనోభిప్రాయ మవుతుంది. రుజువు. జ్ఞానము కలుగకముందు ఏర్పడి జ్ఞానోపలబ్ధికి తోడ్పడేది విశ్వాసం. భగవంతు డున్నాడనడానికి రుజువులేదు, కాని, భగవంతునియందు నాకు విశ్వాసముంటే, పిమ్మట నేను భగవత్సాక్షాత్కారం పొందగలను.

## విశ్వాసబల ప్రాధాన్యం

విశ్వాసం అనుభూతిపై ఆధారపడదు. అనుభూతికి పూర్వదశలో ఉండేదే విశ్వాసం. అనుభూతిబలంతో గాక, విశ్వాసబలంతోనే సామాన్యంగా యోగసాధన నడుస్తుంది. ఆధ్యాత్మిక జీవనంలోనే కాక, సామాన్య జీవనంలో సైతం ఇదేపరిస్థితి, గొప్పగొప్ప కర్మవీరులు, ప్రకృతి రహస్యాలను క్రొత్తగా కనుగొన్నవారు వినూత్న విజ్ఞాన స్రష్టలు,- అంతా విశ్వాసబలంతో ముందుకు నడిచినవారే.

## యోగసాధనకు మూలవిశ్వాసం

భగవంతు డున్నాడు, అతడే అనుసరణీయుడు, అతనితో పోల్చి చూస్తే

జీవితంలో ఇంకేదీ పొందదగినది కాదు,— అనే విశ్వాసం యోగసాధనకు మూలభూతమై వుంటుంది. అట్టి విశ్వాసం కలిగివుండే మానవుని ఆధ్యాత్మిక ప్రగతి సునిశ్చయం. ఎన్ని అవరోధాలేర్పడినా, ఎంత కాలం పట్టినా కడ కతనికి విజయం తప్పదు.

## భావావేశం

భావావేశ మనునది కూడని వస్తువు కాదు. సాధనలో దానికిగూడ సముచిత స్థానమున్నది. అయితే, బహిర్ముఖంగా గాక అంతర్ముఖంగా అది ప్రసరించడం అవసరం. అలా అంతర్ముఖంగా ప్రసరించినప్పుడే హృదయ కవాటాలు విచ్చుకొంటాయి.

## అహంకార వైఖరి

అహంకారం కడు విచిత్రమైనది. తనను మరుగుపరుచుకొని, తాను అహంకారం కాదన్నట్టు నటించడంలో దాని చాకచక్యం మరీ గొప్పది. భగవంతుని సేవించగోరు ఆకాంక్ష చాటున గూడ అది దాగివుండగలదు. దాని మాయ ముసుగుల నన్నింటిని ఊడబెరికి దానిని మారుమూలల నుండి సైతం తరిమివేయడమే అవశ్యకర్తవ్యం.

## సాధకుని పూర్ణానుమోద ఆవశ్యకత

ఈశ్వరానుగ్రహం, ఈశ్వరశక్తి సాధించలేనిది ఉండదనేమాట నిజమే. కాని, సాధకుని పూర్ణానుమోదం వున్నప్పుడే అవి ప్రవర్తిల్లుతాయి. పూర్ణానుమోదం యివ్వడమెట్లో నేర్చుకోడమే సాధన రహస్యం.

మనోమయ చేతనలోని భావాలవల్ల, ప్రాణమయచేతనలోని కామనల వల్ల, అన్నమయ చేతనలోని స్తబ్ధతవల్ల ఇది దీర్ఘకాలం పట్టవచ్చు. ఈశ్వరశక్తి సహాయాన్నే సాధకుడు వీటిని తొలగించుకోడానికి అర్థిం చాలి.

## స్వతంత్రేచ్ఛ-సమర్పణ

జీవునకు కొంత స్వతంత్రేచ్ఛ ఉండడం పైననే జగత్తునందలి లీల అంతా ఆధారపడి వున్నది. యోగసాధన కూడా అట్టి స్వతంత్రేచ్ఛతో కూడినదే. సాధకుని అనుమోదం అడుగడుగునా అవసరం. ఈశ్వరునకు ఆత్మసమర్పణం కూడా స్వతంత్రేచ్ఛా పూర్వకమైనదే కావాలి.

## మూడు త్రోవలు

మూడే ప్రధానమైన త్రోవలు, సాధకునకున్నాయి. (1) భగవంతునిపై భారంవేసి, ఆయన అనుగ్రహం కొరకు వేచివుండడం, (2) అద్వైతి వలె, బౌద్ధునివలె, స్వశక్తిమీదనే ఆధారపడడం. (3) మధ్యేమార్గ మవ లంబించి, పరమ సంసిద్ధి కొరకై ఆకాంక్ష, అపరప్రవృత్తుల నిరాకరణ మున్నగు వానిద్వారా ఈశ్వరశక్తి తోడ్పాటుతో ముందుకు సాగడం.

## భగవదనుగ్రహం

భగవదనుగ్రహ మనునది ఏ లెక్కలకూ అందునది కాదు. మానవబుద్ధి విధించే ఏ నియమాలకూ అది లోబడదు. అంతరాత్మయందలి తీవ్రా కాంక్ష దానిని సామాన్యంగా జాగరిత మొనర్చ గలుగుతూ వుంటుందనే

మాట నిజమే. కాని, ఒక్కొక్కప్పుడు, అట్టి కోరిక ఏదీ కనిపించని సందర్భంలో సైతం అది ప్రకటం కావడం కద్దు.

## ఆత్మసమర్పణ : నిర్విశేషబ్రహ్మము

ఆత్మసమర్పణం అన్నివిధాలా మంచిదే. కాని, కేవలం నిరాకార–నిర్గుణ–నిర్విశేష బ్రహ్మకు మాత్రమే ఆత్మసమర్పణ మొనర్చుకుంటే చాలదు. అట్టి సమర్పణవలన పాక్షిక ప్రయోజనం మాత్రమే చేకూరుతుంది. నీ బాహ్య ప్రకృతిలో కలుగవలసిన పరివర్తనం కలుగనేరదు.

## నిర్విశేష బ్రహ్మప్రాప్తి

నిర్విశేష పరబ్రహ్మము నిష్క్రియము, సర్వాతీతము. జగత్తులో ఏమి జరుగుతున్నా అది పట్టించుకొనదు. నిర్విశేష పరబ్రహ్మమందలి సత్య సాక్షాత్కారం నీవు ప్రయత్నంచేసి పొందవలసినదే కాని, నిన్ను వెంటాడి అనుగ్రహించవలసిన శ్రమ అది కల్పించుకోదు.

## గురువుకు ఆత్మసమర్పణం ఏల సర్వోత్కృష్టం?

గురువుకు ఆత్మసమర్పణం సర్వసమర్పణములలో గొప్పదని దేనికన్నావంటే. ఆ సమర్పణంద్వారా నీవు, నిరాకార—నిర్విశేష బ్రహ్మకేగాక సాకార—సవిశేషబ్రహ్మకు,—నీ అంతరమందలి ఈశ్వరునికేగాక నీ బాహ్యమందలి ఈశ్వరునికి— నిన్ను అర్పించుకొంటున్నావు. అహం కారరూపమై అమూర్తమైన నీ ఆత్మలోనికి తిరోహితుడవు కావడం

ద్వారానేకాక, అహంకార ప్రాబల్యంగల మూర్త ప్రకృతి యందు సైతం అహంకారము నతిక్రమించగల అవకాశం కలిగించుకొంటున్నావు.

## భగవానునితో సంబంధం

గురుశిష్య సంబంధం భగవంతునితో సాధకున కుండదగిన అనేక సంబంధాలలో ఒకటి మాత్రమే. పూర్ణయోగములో ప్రాధాన్యం వహించే సంబంధం ఈ గురుశిష్య సంబంధము కంటే ఘనిష్ఠమైనది. ఇందు భగవానుడు సాధకునిచే తనకు మూలభూతమైన జ్ఞానతేజో భాస్కరుడుగా పరిగణింపబడుతాడు. సాధకునియందు పూర్ణపరివర్తనం సాధించే సమస్తమూ అచటినుండియే లభ్యమవుతున్నట్లు అనుభవం పొందడం జరుగుతుంది.

## భగవానునితో గురు శిష్య సంబంధం

భగవానునితో గురుశిష్య సంబంధ మనునది ముఖ్యంగా ఒక పరిచ్ఛిన్న మానసిక లక్ష్యం. అయినా, ఆ ఆలంబనం మనస్సుకు అవసరమయ్యే యెడల, ఆ అవసర మున్నంత కాలం దాని నవలంబించడం మంచిదే కాని నీ ఆత్మను దానిచేత బద్ధం కానివ్వరాదు. భగవానునితో ఇతర సంబంధాలు సైతం నీలోనికి పొరలివచ్చి నీకు విస్తృతానుభవాలు కలుగజేయడాని కది అవరోధం కానివ్వరాదు.

## గురువు : ఆత్మసమర్పణ

భగవంతునికి ఆత్మసమర్పణం, గురువుకు ఆత్మసమర్పణం ఒకటి కాదు. గురువుకు ఆత్మసమర్పణం చేసుకొనడంలో, సాధకుడు ఆత్మసమర్ప

ణం చేసుకొనేది ఆయనలోని భగవంతునికే. ఒక మానవమాత్రునికి ఆత్మసమర్పణమైతే అది ఫలప్రదాయకం కానేరదు.

## గురువు-సద్గురువు

గురువును సద్గురువుగా చేసేది ఆయనలో భగవత్సన్నిధి జ్ఞానమే. అది ఉన్ననాడు, ఆయనను శిష్యుడు మానవునిగా తలపోసి ఆత్మసమర్పణ చేసుకున్నా ఆ దివ్యసన్నిధి దానిని సఫల మొనర్చగలదు.

## సద్గురువుల ఏకత్వం, భిన్నత్వం

నిక్కమైన గురువులంతా ఒక్కరే, - ఒకే సద్గురువు. కారణం వారంతా ఒకే ఈశ్వర స్వరూపులు. ఇది విశ్వజనీనమైన మౌలిక సత్యం. అయితే భేదాన్ని సూచించే మరొక సత్యంకూడా ఉన్నది. వేర్వేరు శిష్యులను వారి వారి ప్రత్యేక స్వభావాలకు, భవితవ్యాలకు అనుగుణంగా వేర్వేరు మార్గాలలో పరమగమ్యానికి వారిని నడిపించుకొని పోవడం కోసం ఈశ్వరుడు వేర్వేరు మనస్సులు, బోధలు, ప్రభావాలు గల వేర్వేరు వ్యక్తి విశేషములలో నివసిస్తున్నాడు.

## గురుభక్తి ఆవశ్యకత

గురువులందరూ ఒకే ఈశ్వరస్వరూపులన్న కారణాన, శిష్యుడు తన కుద్దిష్టమైన గురువును వదలి మరొక గురువు ననుసరించడం యుక్తమే యని భావించరాదు. భారత సంప్రదాయం ప్రకారం గురువునెడ భక్తి

విశ్వాసాలు ప్రతి శిష్యునికీ వుండితీరాలి. అందరూ ఒకటే అనే ఆధ్యాత్మిక సత్యాన్ని నీ యిచ్ఛవచ్చినట్లు ఆచరణలో పెట్టడానికి వీలులేదు.

## ఆధ్యాత్మిక విషయాల్లో మానసతర్కం ప్రమాదకరం

మానవులందరూ బ్రహ్మమే కదాయని, అందరియెడలా ఒకే తీరుగా వ్యవహరిస్తే, ఫలితం చాలఘోరంగా తయారవుతుంది. కర్కశమైన మానసికతర్కంలో వున్న చిక్కు ఇది. ఆధ్యాత్మిక విషయాల్లో మానసికతర్కం కడు తేలికగా బోల్తా కొట్టుతుంది. శ్రద్ధ, అంతర్బోధ. ఆధ్యాత్మిక హేతుస్ఫూర్తి,— ఇవే ఇచట ముఖ్యంగా ఏడుగడ కావలసినవి.

## శిష్యుని ఆత్మసమర్పణకే విశేష ప్రాధాన్యం

శిష్యుని హృత్పద్మం విచ్చుకొని, భక్తిశ్రద్ధలతో అతడు గురువునకు ఆత్మసమర్పణ మొనర్చుకోడమే కావాలి. అది జరిగినప్పుడు, గురువులో మానవ దౌర్బల్యాలు, లోపాలు కొన్ని ఉన్నా అవి శిష్యుని ఆధ్యాత్మికాభివృద్ధికి ఆటంకములు కానేరవు.

## గురుభక్తి విశిష్టత

గురువు తన వ్యక్తివిశేష, అనుభవసంపత్తి ప్రమాణము ననుసరించి, ఈశ్వరప్రతినిధిగా, ఈశ్వరశక్తి ప్రసారోపకరణంగా విలసిల్లుతూ వుంటాడు. కాని, ఆయన ఎట్టివాడైనా, ఆయనలోని ఈశ్వరతత్వాభిముఖంగా శిష్యుని హృత్పద్మం విచ్చుకొనేటప్పుడు, ఉపకరణపుశక్తి వలన కొంత జరిగేది జరిగినా, ఎక్కువ సత్ఫలితం ఆత్మార్పణరూపమైన శిష్యుని భక్తిప్రపత్తిని బట్టియే నిర్ణీతమవుతూ ఉంటుంది.

## ఆత్మార్పణ మహాత్మ్యం

భక్తి శ్రద్ధాపూర్వకమైన ఆత్మార్పణబుద్ధి సాధకునిలో వికసించినప్పుడు, ఇతరులదృష్టిలో ఏమంత గొప్ప ఆధ్యాత్మిక శక్తి సంపన్నుడుకాని గురువునుండి సైతం అతడు ముఖ్య సత్ఫలితా లనేకం పొందగలుగుతాడు. గురువులోని మానవవ్యక్తి ఇవ్వలేని సమస్తమూ అతనిలో దానంతటదే ఈశ్వరానుగ్రహం వలన ఆవిర్భవిస్తుంది.

## సరియైన భక్తి వుంటే –

ఆధ్యాత్మిక శక్తిసామర్థ్యములలో నీగురువు నీకంటెను, ఇతర గురువులకంటెను తక్కువవాడు కావచ్చును. కాని, నీలో గనుక సరియైన భక్తి ఉంటే, సరియైన ఆధ్యాత్మికదృష్టి ఉంటే, ఆయన ద్వారానే నీవుఈశ్వర సంస్పర్శను పొందవచ్చు, ఆధ్యాత్మికానుభవాలను, ఆధ్యాత్మిక సంసిద్ధినీ ఆయనకంటే ముందుగా సైతం బడయవచ్చు.

## గురువునకుండవలసిన ఆధ్యాత్మిక లక్షణం

ఆధ్యాత్మికలక్షణం బొత్తిగా లేనివాడు గురువే కాజాలడు. అట్టి వానిని మిథ్యాచారి అనవలసివుంటుంది. మిథ్యాచారినుండి నీకు అలవడేది మిథ్యాచారం మాత్రమే. తనద్వారా శిష్యుడు ఈశ్వర సంస్పర్శ పొందడానికి వీలుకల్పించే ఒకానొక ఆధ్యాత్మిక లక్షణమేదో గురువులో ఉండడం అవసరం. అది తనయందు ఏవిధంగా పనిచేసేదీ ఆ గురువు బాహ్య మనస్సుకు ఎరుకపడకపోవచ్చు.

## గురుశిష్యుల ఆంతరంగిక సంబంధాలకే విశేష ప్రాధాన్యం

ఆధ్యాత్మిక శక్తిసంపదలో ఒక గురువునకు మరొక గురువునకు విశేష భేధం ఉండవచ్చు ననేమాట నిజమే. కాని, గురుశిష్యుల అంతరంగిక సంబంధానికే విశేష ప్రాధాన్యం. గొప్ప అధ్యాత్మిక శక్తి సంపన్నుని చేరినా ఆయననుండి శిష్యుడు పొందేది అత్యల్పం కావచ్చు. అట్లే అంతకంటె తక్కువవానివద్దకు చేరినా ఆయననుండి శిష్యుడు ఆయన ఇవ్వగలిగినదేకాక ఇంకా ఎంతగానోకూడ పొందవచ్చు.

## గురుశిష్యుల మధ్య ఆదాన ప్రదానాలు

ఇచ్చేది స్వీకరించగల స్థితిలో శిష్యుడుంటే, ఇవ్వడానికి నిజమైన గురు వెప్పుడూ సిద్ధంగానే ఉంటాడు. స్వీకరించడానికి శిష్యుడు విముఖంగా ఉన్నా, లేక స్వీకరణకు అవరోధమైన విధంగా బాహ్యమునగాని, అంతరమునగాని అతని ప్రవర్తనమున్నా, లేక అంతశ్శుద్ధి అనునది అతనిలో లేకపోయినా గురు శిష్యులమధ్య ఆదాన ప్రదానాలు జరగడం దుష్కరం.

## గురువాద ప్రశస్తి

సాధనలో గురువు ఆవశ్యకతను ఉద్ఘాటించే గురువాదాన్ని ముక్త పురుషులెవ్వరూ ఇంతవరకు నిరాకరించి వుండలేదు. ప్రాణ, మనఃకోశాలలో నివసిస్తూ వాటికి సంబంధించిన స్వాతిశయప్రవృత్తి కలవారు మాత్రమే గురువు నంగీకరించడం తమ ఘనతకు లోపంగా భావిస్తారు.

## గురుకృప

గురుకృప సామాన్య విశేష భేదములచే రెండు రకాలు. సామాన్య కృప శిష్యునియందు గురువుకు ఎప్పుడూ వుండనే వుంటుంది. శిష్యునిగా స్వీకరించడంలోనే కృప ఉన్నది. పోతే, విశేషకృప శిష్యునికి తెలియకుండానే ఆకస్మాత్తుగా ప్రసరించునట్టిది. ఇట్టి కృపను పొందే యోగ్యత శిష్యునిలో తరచుగా దీర్ఘతపశ్చర్య ఫలితంగా ఏర్పడుతూ వుంటుంది. ఈ కృపాప్రసరణం శిష్యునిలోని మూల ప్రతిబంధాల నొక్కుమ్మడిగా విచ్ఛిన్నం చేస్తుంది.

## "మార్జాలకిశోర" పద్ధతి

గురుని విశేషకృపా ప్రసరణం 'మార్జాలకిశోర' న్యాయంగా హృదయాంతరమున ఆయనకు ఆత్మసమర్పణం చేసుకొన్నవానికి అవలీలగా లభిస్తుంది. అట్టి ఆత్మసమర్పణంద్వారా ఎరుకతో గురునిపై ఆధారపడ నేర్చినప్పుడు, మనఃప్రాణ ప్రవృత్తులనుసైతం అదుపులోనికి తేజాలిన దాని ప్రభావంవలన సాధనయందలి ముఖ్యప్రతిబంధకం పటాపంచలై పోకతప్పదు.

## తపశ్చర్యతో పనిలేని ఆత్మసమర్పణ

మార్జాలకిశోర న్యాయము ననుసరించి గురువునకు ఆత్మసమర్పణం చేసుకొనే పద్ధతిలో ఒకొక్కప్పుడు ఏ తపశ్చర్యనూ ఆశ్రయించవలసిన పని ఉండదు. తనను నడుపుతున్నట్లు భావించుకొనేశక్తికి తాను సర్వమూ నివేదించుకొంటూ దాని నిర్దేశము ననువర్తించడానికి సిద్ధంగా

వుండడం, సాధించవలసిన పరివర్తనను ఆ శక్తియే నెమ్మదిగానో త్వరగానో సాధించడం జరుగుతుంది. తపశ్చర్య అవసరమైన సందర్భంలో కూడా అదొక కఠినకార్యం కాదనెడి ఉత్సాహంతో సాధకుడు దానిని చేపట్టుతాడు.

## మర్కటకిశోర పద్ధతి

మార్జాలకిశోర పద్ధతిగా గాక, మర్కటకిశోర పద్ధతిగా గురువు నాశ్రయించేవా రెక్కువగా స్వతంత్రులు. స్వతంత్రాభిప్రాయాలు కలిగి స్వతంత్ర సాధన చేసుకుంటూ కొంత గురుసహాయ మర్థిస్తూ వుంటారు. ఇట్టివారి యెడ కూడా గురుకృప వుండనే వుంటుంది. కాని, అది వారి స్వప్రయత్నానికి విశేష ప్రాధాన్యమిచ్చి వారి స్వభావానుగుణంగా వారికి తోడ్పడుతూ వుంటుంది.

## మర్కటకిశోర పద్ధతిలో గురుకృప

మర్కటకిశోర పద్ధతి ననుసరించే శిష్యునికూడ గురుకృప కనిపెట్టియే ఉంటుంది, కష్టంలో ఆదుకొంటుంది. అపాయంలో కాపాడుతుంది. శిష్యుడు తనయందూ తన ప్రయత్నమందూ నిమగ్నుడై వున్న కారణాన అతనికి తరచుగా ఇదేమీ తెలియనే తెలియదు. కాని, ఇట్టి వారియెడ, మూలప్రతిబంధ విచ్ఛేదకమైన గురుని విశేషకృపా ప్రసరణకు మాత్రం కొంత దీర్ఘకాలమే పట్టక తప్పదు.

## శిష్యుడు విడనాడితేతప్ప గురువు విడనాడడు

ఏదో విధాన పనిచేస్తూ గురుకృప ఎల్లరి యెడలా ఉండనే ఉంటుంది.

తిరుగుబాటు చేసియో, స్వతంత్రతను ప్రకటించుకొనియో, తన అంత రాత్మనే తనకు దూర మొనర్చుకొనెడి విద్రోహ ప్రవృత్తి ఫలితం గానో, శిష్యుడే దానిని విడనాడితే తప్ప అది శిష్యు నెన్నడూ విడనాడ జాలదు. అప్పుడైనా చివరిదైన ఆత్మవిద్రోహం మితిమీరిపోయినప్పుడు దక్క గురుకృపను తిరిగి పొందడం అసాధ్యం కానేరదు.

## చేసిన తప్పులు గురువుతో చెప్పుకోవాలి

గురువుకు త్రికరణశుద్ధిగా ఆత్మసమర్పణ మొనర్చుకొను శిష్యుడు సాధ నకు సంబంధించిన ఏ ముఖ్య విషయాన్నీ గురువువద్ద దాచరాదు. చేసిన తప్పులు గురువుతో చెప్పుకోడంవల్ల చేతనయందలి ప్రతిబంధకాలు తొలగి ఆంతరంగిక విశుద్ధి ఏర్పడుతుంది. గురుశిష్యసంబంధం అత్యంత సన్నిహితమై ప్రభావసంపన్న మవుతుంది.

## సత్వరసిద్ధికోసం తొందర కూడదు

పూర్ణయోగసాధన కష్టబహుళమైనది. సత్వరసిద్ధి కలుగవలెనని తొందర పడరాదు. అవిరళ వేగంతోకూడిన మహత్తర పురోగతి దాని చరమ ఘట్టాలలో మాత్రమే గట్టి నిశ్చయంతో ఆశించడానికి వీలవుతుంది.

## దివ్యశక్త్యవతరణకై ఆరాటం తగదు

దివ్యశక్త్యవతరణం కోసమై ఆరాటం సాధకునకు తగదు. ప్రాణకోశం విశుద్ధి నొంది ఈశ్వరార్పితం గాకమునుపే దివ్యశక్త్యవతరణం ప్రమాద భరితం. కనుక అట్టి ఆరాటానికి బదులు అతడు తన అంతరంగం విశుద్ధం కావాలనీ, తనకు జ్ఞానసిద్ధి కలగాలనీ, తన హృదయాకాంక్ష

తీవ్రతరం కావాలనీ, తాను భరించగల ప్రమాణంలో దివ్యశక్తి తన యందు పని చేయాలనీ భగవంతుని నిత్యమూ వేడుకొనడం శ్రేయస్కరం.

## నేర్చుకోవలసిన మొదటి పాఠం

జీవితాన్ని, అందలి కష్టాలనూ సహనంతో దృఢంగా ఎదుర్కోగల ధీరత్వం లేనివాడు సాధనపథంలో అంతకంటె గురుతరమైన ఆంతరంగిక కష్టాలను ఎన్నటికీ ఎదుర్కొనజాలడు. ఈశ్వరునిపై భారంవేసి, అచంచలమైన చిత్తంతో, ధైర్యంగా జీవితకష్టాల నెదుర్కోడమే సాధనలో నేర్చుకొనవలసిన మొదటి పాఠం.

# సాధనకు : పునాదులు

—o—

## సాధనకు పునాది

మనస్సు చంచలంగా ఉంటే సాధనకు పునాది ఏర్పడజాలదు. కనుక మనస్సు చాంచల్యము నుడపడం సాధనలో మొట్టమొదట చేయవలసిన పని. నిశ్చలమైన మనస్సునందే ఉన్నతమైన ఆధ్యాత్మిక చేతన నివసిస్తుంది,

## మనస్సు శాంతం కావాలి

మనస్సులో స్థిరమైన శాంతినీ, నిశ్చల నీరవతనూ నెలకొల్పుకోడం సాధనలో చేయవలసిన మొట్టమొదటి పని. లేనియెడల నీ కొకవేళ అనుభవాలు కలిగినా ఏదీ స్థిరంగా వుండదు. శాంతమనస్సునందే సత్య చేతనను ప్రతిష్ఠించడం సాధ్యమవుతుంది.

## మనస్సు నిశ్చలం కావడమంటే—

మనస్సు నిశ్చలం కావడమంటే, ఏ ఆలోచనలూ, ఏ చిత్తవృత్తులూ లేకుండ పోవడమని కాదు. మనస్సు ఉపరితలంలో ఇవి వుంటాయి.

లోపల, వీటికంటే వేరై నీ నిజతత్వం నీకు స్ఫురిస్తూ వుంటుంది. వీటితోపాటు కొట్టుకొనిపోకుండా వీటిని నీవు వివేకంతో గమనిస్తూ, విసర్జించవలసిన దానినెల్ల విసర్జించి, సత్యచేతనానుభూతి యగుదాని నెల్ల గ్రహిస్తూ భద్రపరచుకొంటావు.

## ఈశ్వరస్పర్శకు మాత్రమే ఒదగనేర్చుకో

ప్రతిక్రియ లేక ఒదిగివుండేలక్షణం మనస్సు కలవడడం మంచిదే, కాని, ఆ ఒదిగివుండడం సత్యమునకు. ఈశ్వరశక్తి స్పర్శకు మాత్రం అయినప్పుడే అది శ్రేయోదాయకమవుతుంది అవరప్రకృతి ప్రేరణలకు నీవు ఒదగ నారంభించే యెడల, ఇక నీకు పురోగతి ఉండదు. యోగ మార్గంనుండి నిన్ను భ్రష్టుని చేయగల అహిత శక్తులపాలిట నీవు పడిపోతావు.

## మనోనిశ్చలతకు లక్షణం

ఒక ప్రశాంతసీమగుండా బాటసారులు ఎక్కడినుంచో వస్తూ కదలిపోతున్నట్లు, వాయు సంచలనంలేని ఆకాశంగుండా ఒక పక్షిగుంపు ఎక్కడినుంచో అలా సాగిపోతున్నట్లు, ఆలోచనలు వగైరాలను నీ మానసిక చేతన చూడగలుగుతూ వాటితో తాను తాదాత్మ్యం చెందకుండా వుంటే, అదే మనస్సు నిశ్చలమైనదాని లక్షణం – ఎన్నెన్ని రూపాలు, ఎటువంటి దారుణ సంఘటనలు ఆ విధంగా కదలిపోయినా నీ నిశ్చలతకు భంగం వాటిల్లదు.

## మనో మౌనం

మనో నిశ్చలతకంటె మనో మౌనం గొప్పది, ఆలోచనలను లోమనస్సు

నుండి పూర్తిగా బహిష్కరించడంద్వారా దీనిని సాధించవచ్చు. కాని, పైనుండి అవతరించినప్పు డిది మనలో ప్రతిష్ఠితం కావడం సులభం. ఏ రీతిగా ఇది పైనుండి అవతరించి మన చేతనను ముంచెత్తుతుందో మనం ప్రత్యక్షానుభవం ద్వారా తెలుసుకోవచ్చు.

## దివ్యజ్ఞానావతరణ

అచంచలమైన స్థిరత్వం సాధించిన మనస్సు ఎంత శక్తిమంతంగానైనా పనిచేయగలదు. కాని, అది తన స్థిరత్వాన్ని విడనాడక, తనంతట తానుగా దేనినీ సంకల్పించక, పైనుండి అవతరించేది దివ్యజ్ఞానాన్ని మాత్రం గ్రహిస్తూ, తద్గ్రహణ జనితానందంతో కూడిన ప్రశాంత వృత్తితో దానికి సముచిత మానసిక రూపం ధరింపజెయ్యడం అవసరం.

## నిశ్చల నీరవతాస్థితి

మనస్సు ఏ ఆలోచనలూ లేక నిశ్చల నీరవత గడించుకొన్నప్పుడే తరచుగా ఊర్ధ్వమునుండి విశాలశాంతి సంపూర్ణంగా అవతరించడం, మనస్సున కతీతమై సర్వత్రా విస్తరించుకొని వున్న ఆత్మతత్వ అనుభూతి కలుగడం జరుగుతూ వుంటుంది. కాని, అట్టి నీరవతాస్థితిలో అన్నమయ, ప్రాణమయ చిత్తవృత్తులు ఆ అవకాశంలోనికి చొరబడకుండా మాత్రం సాధకుడు జాగ్రత్త తీసుకోడం అవసరం.

## మౌన సంకల్పం

ధ్యానాభ్యాస కాలంలోనైనా సాధకుడు అన్నమయ, ప్రాణమయ చిత్తవృత్తుల నరికట్టి మనస్సును నిశ్చల, నీరవతా స్థితిలో నుంచుకోడానికి దృఢమైన మౌనసంకల్పబల సంపాదన అత్యంత సహాయకం. ఈ మౌన

సంకల్పం మనస్సుకు వెనుకనుండే పురుషునిది. మనస్సు నిశ్చల, నీరవతాస్థితి నందుకొన్నప్పుడు, ప్రకృతి క్రియాకలాపము కంటే వేరైన యీ పురుషుడు తెలియబడుతాడు.

## ధీరస్థిరతా సాధన

అంతరమున నున్న పురుషుని నుండి బాహ్య ప్రకృతిని విడదీయడం ధీరస్థిరతా సాధనకు అత్యంతావశ్యకం ఆలోచనల సుడులలో చిక్కుకొనడం, విషయ వాంఛలకు లోనుగావడం ధీరస్థిరతాసిద్ధికి ప్రతిబంధకాలు, వాటి నుండి తాను వేరు కాగలిగి అవి తనకంటె వేరనే అనుభవాన్ని సాధకుడు తప్పనిసరిగా సంపాదించుకోవాలి.

## నిక్కమైన వ్యక్తిత్వం

నీ నిక్కమైన వ్యక్తిత్వాన్ని గుర్తించి ప్రకృతియందు దానిని ప్రతిష్ఠించుకోవాలంటే రెండు పనులు అవశ్యం జరగాలి. మొదటిది, నీ హృదయానికి వెనుకనున్న హృత్పురుషుని గుర్తించడం. రెండవది, పురుషుడు ప్రకృతికంటె వేరని విడదీసి తెలుసుకోడం, ఏలనంటే, నీ నిక్కమైన వ్యక్తిత్వం బాహ్యప్రకృతి కార్యములచే ముసుగువడియున్నది.

## ఖాళీ నిశ్చలత

మనస్సుకు చేకూరిన నిశ్చలత మొదట్లో కొంతకాలం వట్టిఖాళీ నిశ్చలతగా వున్నా ఫరవాలేదు. చేతన ఒక విధమైన పాత్రవంటిది. అందలి పనికి రాని కల్తీ పదార్థాలను ఖాళీచేసి తిరిగి మంచిపదార్థాలతో నింపేవరకూ

దానిని ఖాళీగానే ఉంచిపెట్టడం అవసరం. అయితే అట్టి ఖాళీ మనస్సును తిరిగి వెనుకటి కల్తీ సరుకుతోనే నింపకుండా మాత్రం జాగ్రత్త పడాలి.

## శాంతి అవతరణకై ఆహ్వానం

మనస్సుకు నిశ్చలత చేకూరిన సమయంలోనే నీవు ఊర్ధ్వముఖంగా విచ్చు కొని, ఆ నిశ్చలతలోనికి పై నుండి శాంతి అవతరించగలందులకై నెమ్మదిగా, నిలకడగా, తొందరపాటు లేకుండ ఆహ్వానం చెయ్యాలి. శాంతి అవతరించిన అనంతరం నీలో అవతరించవలసినది ఆనందం, ఈశ్వర సన్నిధి.

## సిద్ధికి తొలిమెట్టు

మనస్సు నిశ్చలమై స్థిరత నొందడం సిద్ధికి తొలిమెట్టుగాని సాధనకు తొలి మెట్టు కాదు. సాధన ప్రారంభంలోనే ఈ లక్షణాలు అలవడడం ఎక్కడనోగాని జరగదు. వీటిని అనుభవానికి తెచ్చుకోడానికి సాధకుడు ఎంతో కాలం శ్రమచేయవలసి వుంటుంది. కలిగిన అనుభవం స్థిరం కావడానికి మరి కొంతకాలం పట్టకతప్పదు.

## శాంతి, సహనం

శాంతి, సహనం—రెండూ కలిసే వుంటాయి. ఎటువంటి ఒత్తిడులలో నైనా సహనం వహించడం శాంతి స్థాపనకు దోహదం చేస్తుంది. శాంతి అంతరంగ విశుద్ధికి సహాయకమౌతుంది. ఈశ్వరప్రభావానికి మాత్రమే

సుముఖమౌతూ తదితర ప్రభావాలకు విముఖగాఉండే స్థితియే అంతరంగ విశుద్ధి.

## పరచేతనలోని శాంతి

శాంతి అనునది అన్నమయ, ప్రాణమయ, మనోమయ చేతనల యందు సైతం లేకపోలేదు. కాని, ఈ మూడింటికీ అతీతమైన పరచేతన యందలి శాంతిలక్షణం వేరు—అదే పైనుండి క్రిందికి అవతరించవలసి వున్నది.

## పరమనీరవత

విశ్వమునకు వెనుకనుండే పరమ నీరవతయే విశ్వగతి కంతకూ ఆధారం. శాంతి ఆవిర్భవించునది ఆ పరమ నీరవతనుండియే. శాంతి ఎంత గంభీరమైతే అంత అది ఆ పరమనీరవతగా మారిపోతుంది. ఆ స్థితికి భంగపాటు లేకుండా కర్మ జరగవచ్చు ననడానికీ విశ్వగతియే తార్కాణం.

## రెండు దశలు

యోగానుభూతిలో రెండు దశలున్నాయి. సాధకుడు బయటకు యితరుల వలెనే ప్రవర్తిస్తూవున్నా లోపల ఏ వృత్తులూ లేకయుండెడి మౌనస్థితి ఒకదశ, లోపల నూతన చేతనయొకటి ప్రబుద్ధమై, జ్ఞానం, ఆనందం, ప్రేమ మొదలైన ఆధ్యాత్మికానుభవాలతో కూడిన అంతఃప్రవృత్తులున్న సమయంలో కూడా ఆమౌనస్థితికి భంగం కలుగని దశ రెండవది. సాధకుల అంతశ్చేతనావికాసానికి ఈ రెండూ కావలసినవే.

## నీలో నెలకొనవలసిన శాంతి లక్షణం

నీలో నెలకొనవలసిన శాంతి ఎంత లోతున నెలకొనాలంటే, వెలుపల నుండి ఏది వచ్చినా అది పైపైననే తరలిపోవాలి గాని లోననుండే శాంతిని భంగపరచరాదు ఒక కొండమీదికి రాళ్ళు విసరినప్పుడు, కొండకు చైతన్యముంటే ఆరాళ్ళ దెబ్బలు తనకు తగులుతున్నవని తెలిసినా దాని కది ఎంత తేలిక విషయంగా వుంటుందో, అట్టిదే ఈ . ంత్యనుభూతి కూడ.

## లోతైనదీ, విశాలమైనదీ కావాలి శాంతి

నీలో నెలకొనే శాంతి లోతైనదీ విశాలమైనదీ కావాలి. విశాలతలోనే వ్యష్టి సమష్టి ఆత్మానుభవం కలుగుతుంది. బాహ్యాభ్యంతరాల సమన్వయానికి ఆధారం చిక్కుతుంది ఆ అనుభూతి అంతస్సత్తకు సంబంధించినది. అంతస్సత్తనుండి పొర్లుకొనివచ్చిన శాంతిచే పూరించబడితే తప్ప బాహ్యసత్త సామాన్యంగా ఆ లోతును అందుకోజాలదు.

## శాంతి ఆవిర్భవించేది అంతస్సత్తలోనే

శాంతి ఆవిర్భవించేది అంతస్సత్తలోనే. ఆవిర్భవించి అది బాహ్యసత్త లోనికి సైతం పొంగి ప్రవహిస్తుంది. అట్లు ప్రవహించినప్పుడు, బాహ్యసత్తలోని అన్న, ప్రాణ, మనోమయ భూమిక లా శాంతిలో మునిగి పోతాయి. ఇంకనూ పరిపక్వదశ వచ్చినప్పుడు, ఆ భూమికలయందలి సకల ప్రవృత్తులూ అంతశ్శాంతి లక్షణోపేతములుగానే పరివర్తం చెందుతాయి.

## శాంతి సమతల ప్రాధాన్యం

మన లోపలి ఆధ్యాత్మిక వికాసం బాహ్య పరిస్థితులపైన ఆధారపడదు. ఆ పరిస్థితులకు మన లోపలినుండి మనం ప్రతిస్పందించే తీరుపైన ఆధారపడివుంటుంది. బాహ్య పరిస్థితులపై ఆధారపడని శాంతి సమత లలవరచుకోవలసిన అవసరం అందువల్లనే ఏర్పడుతున్నది. జీవితంలో సంప్రాప్తమయ్యే అఘాతములకు నిత్యము కలత చెందుతూవుండే బాహ్యమనస్సున నివసించడానికి బదులు, లోనికి అంతకంతకు చొరబారి ఆ లోతులనుండి బయటకు తిలకించే కౌశలసాధనం అత్యంతావశ్యకం.

## శాంతిసాధన

శాంతిని నీ శిరస్సుపైన, శిరఃప్రాంతమున నీవు అనుభూత మొనర్చుకోవాలి. దానిని నీవు అనుసంధానం చెయ్యి, అది నీలోనికి దిగివచ్చి, మనఃప్రాణదేహములను నింపి నిన్ను ఆవరించుకోవాలి. అపుడు శాంతియందే నీవు మనగలుగుతావు. నీలోని ఈశ్వరసన్నిధికి ఈ శాంతి ప్రధానచిహ్నం. ఇది నీకు లభిస్తే, తక్కినదంతా దీని ననుసరించే వస్తుంది.

## అంతర్మౌనస్థితి

మనస్సు అంతర్మౌనస్థితిని పొందినప్పుడే నిక్కమైన జ్ఞానం ఉదయిస్తుంది. సామాన్య మనఃప్రవృత్తిలో జరుగుతూవుండేది ఉపరితల భావసృష్టి మాత్రమే. అది నిక్కమైన జ్ఞానం కానేరదు. వాక్ప్రసంగాలలో ఉపరితల స్వభావముమాత్రమే సామాన్యంగా అభివ్యక్తమవుతూ వుంటుంది. కావున సాధకుడు అట్టి ప్రసంగాలలో మితిమీరి నిమగ్నుడు

కారాదు. నిక్కమైన జ్ఞానోదయానికి దోహదం చేయగల అంతఃస్రవ
జాని కది ప్రతిబంధకం.

## శాంతి సుస్థిరం కావాలి

బాహ్య సంసర్గలనుండి విమోచనం కల్పించి, భగవద్గీతలో చెప్పిన ఆత్మరతి చేకూర్చేదిగా వుండాలి నీవు సాధించే శాంతి. ఇతరులతో వ్యవహరించవలసి వచ్చినప్పుడు, చేతనకు సామాన్యంగా బయటకు పరుగెత్తే అలవాటు, క్రిందికి మామూలు స్థితికి దిగివచ్చే అలవాటు ఉన్నది. అందుచే శాంతి తనలో సుస్థిరమయ్యే పర్యంతం సాధకుడు కడు జాగరూకుడై వుండాలి. శాంతి సుస్థిరమైన పిమ్మట అది బాహ్య సంసర్గల నుండి తనను తానే రక్షించుకోగలదు.

## ప్రాణకోశ విశుద్ధి

నీవు మొదట శాంతిని సాధిస్తే,ఆపైన ప్రాణకోశ విశుద్ధిని సాధించడం నీకు సుకరమౌతుంది. అటులగాక, ప్రాణకోశాన్ని విశుద్ధ మొనర్చే పని మాత్రమే నీవు పెట్టుకుంటే నీ సాధన మందగించక తప్పదు. ఏలనంటే, ఎన్నిమారులు శుద్ధంచేసినా ప్రాణకోశం మరలమరల మలినమౌతూనే వుంటుంది. శాంతి అనేది స్వతస్సిద్ధంగానే విశుద్ధంగనుక, అది సిద్ధించిన వానికి ప్రాణకోశ శుద్ధిసాధన సులభం.

## హృదయ నాభి స్థానాలకు శాంతి అవతరణ

శాంతిని నీ హృదయస్థానంలోనికి, నాభిస్థానంలోనికి నీవు మొదటగా అవతరింపజేసుకోవాలి. అపుడు ఒకవిధమైన ఆంతరంగికస్థాయి నీకు

చిక్కుతుంది. పైన పేర్కొన్న స్థానాలయందు ఈశ్వరాభిముఖం కాని దంతనూ త్రోసిపుచ్చుతూ ప్రశాంతమైన దృఢసంకల్ప పూర్వకంగా ఆకాంక్షను ఉద్దీపింప చెయ్యడమే దానికి ఉపాయం.

## శాంతి సమతలు

శాంతి సమతలు సర్వావస్థలలో, సర్వవిభాగాలలో నెలకొనడం యోగ నిరూఢికి పునాది. అవి నెలకొన్న మీదటనే నీలో జ్ఞానంగాని, శక్తిగాని, ఆనందంగాని, నీ స్వభావానుగుణంగా ఆవిర్భావం పొంది సుస్థిరంగా నిలుస్తాయి.

## శాంతి : దివ్యప్రేమ

వేదాంత ప్రతిపాదితమైన శాంత్యనుభూతి చాలదనీ, దానికంటె భగవత్ప్రేమానందానుభూతి గొప్పదనీ వైష్ణవుల భావం. కాని, అవి రెండూ కలసి అనుభూత మొనర్చుకోవలసినవే. లేనియెడల, ప్రేమానందానుభూతి ఎంత గాఢమైనదైనా అశాశ్వతమై, అపమార్గానపడే అవకాశం కూడ వుంటుంది. శాంతిరూపమైన గట్టి పునాది చేతనకు ఏర్పడకపోతే దివ్యప్రేమలీలానుభూతికి సుస్థిరత్వ ముండదు.

## విశాలత

శాంతిని చిక్కబట్టుకొనే నీ చేతన విశాలం కావడం కూడా అవసరం. అది అంతటా వున్నట్లు, దానిలోనే నీవూ సమస్తమూకూడ వున్నట్లు నీకు అనుభూతం కావాలి, చేతన అంతకంతకు విశాలమైన కొలదీ పైనుండి పరమానుభూతులను పొందగలుగుతావు.

## బాహ్యవిషయాకర్షణ

బాహ్య విషయాలకు ఆకర్షితుడు కాకుండా వుండడం సాధకుడు పాటించ వలసిన ప్రాథమిక నియమాలలో ఒకటి. ఇది అతని అంతస్సత్తలో శాంతి నెలకొనడానికి దోహదం చేస్తుంది. అన్నిటియందూ ఈశ్వర దర్శనం చేయగలిగినప్పుడే బాహ్యవిషయాలకు యోగసాధనలో విలువ ఏర్పడుతుంది. అయితే ఆ విలువ వాటియందలి ఈశ్వరనిమిత్తంగా, ఈశ్వరకార్యనిమిత్తంగా ఏర్పడునదే కాని, కామనిమిత్తంగా ఏర్పడునది కాదు.

## సమతాసాధన

ఏమి సంప్రాప్తమైనా, ఎట్టి దూషణ భూషణ తిరస్కారాదులు నీవు పొందవలసివచ్చినా, నిశ్చలుడవై రాగద్వేష రహితంగా వాటిపైన నీ దృష్టిని సారించు. వాటికి కారణాలేమిటో, వాటినుండి ఏమి నేర్చు కోవాలో, నీ అంతరంగికాభివృద్ధికి ఏరీతిగా వాటిని ఉపయోగించుకోవాలో అవగాహనచేసుకోడానికి ప్రయత్నించు. ఇదే సమత సాధన.

## సమతా లక్షణం

ప్రాణకోశ ప్రవృత్తులు వశంలో నుండడమే సమతా లక్షణం. కోపం, స్వాభిమానం, గర్వం, కామం మొదలైనవి నీ అంతశ్శాంతికి భంగం కలిగించరాదు. నీ మాటలు, నీ చేతలు ఈ ఆవేగాలచే ప్రేరితములు గాక ఆంతరికమైన ఆత్మస్థాయిచేత మాత్రమే ప్రేరితములు కావాలి.

## మానవస్వభావ సమీక్ష

మానవులను, వారి స్వభావాన్ని, వారి చేష్టలను, వారిని నడిపే శక్తులను సమదృష్టితో అవలోకించడంకూడ సమతాసాధనలో భాగమే. చూచే చూపు నందేమి, చేసుకునే నిర్ణయాలయం దేమి వ్యక్తిగత రాగద్వేషాలను మనసునుండి త్రోసిపుచ్చి, వాటిని గురించిన సత్యాన్ని దర్శించడాని కది సహాయపడుతుంది.

## వ్యక్తిగత రాగద్వేషాలు

వ్యక్తిగత రాగద్వేషాలు మానవ చేష్టలను వాటి నిజస్వరూపంలో చూపక, లేని విషయాలేవో వాటి వెనుక వున్నట్లు కల్పన చేస్తాయి. లేనిపోని అపోహలు, అపనిర్ణయాలు వాటి ఫలితంగా ఏర్పడుతాయి. అల్ప విషయాలు చాల పెద్దవిగా వికృతరూపం ధరిస్తాయి. జీవితంలో సంప్రాప్తమయ్యే యిటువంటి అనర్థాలకు మూలకారణం చాలవరకు యిదే.

## అసత్ప్రవృత్తి నిర్మూలన

నీలోని ఏ విభాగమందు ఏ అసత్ప్రవృత్తి వున్నా అది గుర్తించడం నీ అంతరంగిక వికాసానికి మొదటిమెట్టు. అసత్ప్రవృత్తి అనగా తప్పు తలపు, తప్పు మాట, తప్పుచేత,—ఏదైనా కావచ్చు. సత్యంనుండి పంచేతననుండి, భగవత్పథంనుండి తప్పించేది ఏదైనా అది అసత్ప్ర వృత్తే అవుతుంది. దానిని గుర్తించిన అనంతరం, సమర్థింపులకు బూను కోక, దానికి బదులు సత్ప్రవృత్తిని ప్రవేశపెట్టగల భగవదనుగ్రహం కొరకై దానిని భగవంతునకు నివేదించడం ఆ తరువాత మెట్టు.

## శాంతి సమతల పరీక్ష

పరిస్థితులు నీ కెంత అననుకూలంగావున్నా, ఇతరుల నడవడి నీ కెంత సరిపడకపోయినా కలత చెందకుండా సంపూర్ణ శాంత భావంతో వాటి నెదుర్కొనడం నీవు నేర్చుకోవాలి. నీ సమతకు యివి పరీక్షలు. అన్నీ అనుకూలంగా వున్నప్పుడు శాంతి సమతలు కలిగి వుండడం సులభమే. కాని, శాంతి సమతలు పరీక్షలకు నిలిచి, బలపడి, సర్వసమగ్రం కావాలంటే, అది ప్రతికూల పరిస్థితులందే సాధ్యం,

## సమతా ప్రతిష్ఠకు కావలసినవి

సంపూర్ణమైన సమత నీలో ప్రతిష్ఠితం కావడం మూడు ముఖ్య విషయాలపై ఆధారపడివున్నది. ఒకటి. హృదయంలో భగవంతునకు ఆంతరంగికమైన ఆత్మసమర్పణ. రెండు, పై నుండి నీలోనికి ఆధ్యాత్మిక శాంతి స్థిరతల అవతరణ. మూడు, సమతా విరోధులైన అహంకారిక, రాజసిక భావాల నిరాకరణకు నీలో నిరంతర దృఢదీక్ష.

## సాధనలో వైఫల్యాలు

సాధనలో ఏ ప్రయత్నమైనా తాత్కాలికంగా విఫలమైనపుడు, అది ఈశ్వరేచ్ఛకు సూచన యని భావించి సాధకుడు ప్రయత్నమును విరమించరాదు. కలతచెందని సమతాదృష్టితో ఆ వైఫల్యమును స్వీకరించి, దాని కారణ మరసి, ఆంతర్యం కనుగొని విజయసిద్ధి పర్యంతం శ్రద్ధతో ప్రయత్నము నింకనూ కొనసాగించాలి.

## వ్యాధిగ్రస్తుడైనప్పుడు-

వ్యాధిగ్రస్తుడైనప్పుడు సాధకుడు ఆందోళన చెంది విహ్వాలించ రాదు. వ్యాధిని ఈశ్వరేచ్ఛగా భావించి ఆమోదించనూ కూడదు. దానినొక శరీరదోషముగా పరిగణించి, ప్రాణ, మనఃకోశ దోషపరిహారానికై ప్రయత్నించినట్లే దాని పరిహారానికి గూడ ప్రయత్నం చెయ్యాలి

## ఆత్మసమత-మానసిక సమత

యోగ సాధనయందు రక్షించబడే సమత ఆత్మసమతగాని, మానసిక సమతగాదు. అభివ్యక్తిలో ఏ భేదాలు, తారతమ్యాలు వున్నా అంతటా ఒకే ఆత్మను, ఒకే దైవాన్ని దర్శించడంపై అధారపడిన సమత అది. మానసిక సమత ఈ భేదాలను, తారతమ్యాలను, త్రోసిపుచ్చి, అంతా సమానమేనన్నట్లు వ్యవహరించడానికి, అంతా సమానం చేసివేయడానికి ప్రయత్నిస్తుంది.

## సత్యంకోసం సమరం సమతకు విరుద్ధంకాదు

యోగంలో సమత అంటే, ప్రతిదానియెడ ఉపేక్ష, ఔదాసీన్యంగా అర్థం చేసుకోరాదు. భగవద్గీత పూర్ణసమతను బోధిస్తూనే, యుద్ధంచేసి శత్రువును నిర్జించి జయం సాధించమని హెచ్చరిస్తున్నది. సత్యప్రతిష్ఠకోసమై సత్యపక్షం వహించి అసత్యశక్తులతో ఎంతమాత్రం రాజీపడనొల్లక తీవ్ర సమరం సాగించడం యోగసమతకు విరుద్ధంకాదు.

అసుర శక్తులతోడి ఆధ్యాత్మిక సమరంలో ఉపేక్షకు, ఔదాసీన్యానికి, రాజీకి అవకాశంలేదు. ఏలనంటే, అట్టి రాజీ ప్రవృత్తితో వాటికి చోటిచ్చేయెడల, సత్యధర్మాన్నే అవి అణచివేయజూస్తాయి. కావున, సాధకునకు ఆధ్యాత్మిక సమత ఎంత ఆవశ్యకమో, సత్యధర్మ పక్షావలంబనం కూడ అంత ఆవశ్యకమే.

# మానవసత్తయందలి విభాగములు - భూమికలు

—o—

## మానవుని అజ్ఞస్థితి

సర్వసామాన్యంగా మానవులకు తామెవరో తెలియదు. తమ సత్తలో ఏయే విభాగాలున్నాయో తెలుసుకోలేరు. మనోవృత్తిజ్ఞానంద్వారా వారికవి తెలియబడుతున్న హేతువుచేత అన్నిటినీ కలిపి మనస్సని పేర్కొంటూ వుంటారు. అందుచే తమస్థితులు, చేష్టలు వారికి అవగాహన కావు. ఒకవేళ అయితే అది పైపైన మాత్రమే.

## దృఢమైన పునాది

మన ప్రకృతి ఎంత మహాజటిలమో మనం తెలుసుకోవాలి. ఏయేశక్తులు దానిని నడుపుతున్నాయో స్పష్టంగా చూడ నేర్చుకోవాలి. విజ్ఞతాపూర్వకమైన నియమనంతో దానిని స్వాధీనానికి తెచ్చుకోవాలి. యోగసాధనకు పడవలసిన దృఢమైన పునాదిలో ఇదియొక ముఖ్యాంశం.

## మానవప్రకృతిలో విభాగాలు

మనలో అనేక విభాగాలున్నాయి. మన ఆలోచనలు, సంకల్పాలు,

ఇంద్రియజ్ఞానాలు, రసావేశాలు, కర్మ ప్రవృత్తులతో కూడిన మన చేతనావృత్తిసమష్టికి ప్రతి విభాగమూ ఏదో కొంత దోహదం చేస్తూ వుంటుంది. కాని, ఈ వృత్తులన్నీ యెక్కడనుండి ఏ విధంగా పుట్టు తున్నాయో మనం గుర్తించలేము. ఉపరితలంలో కలగాపులగంగా అభి వ్యక్తమయ్యే ఫలితాలను మాత్రమే తెలుసుకోగలుగుతూ వుంటాము.

## ఎరుక సిద్ధవస్తువు

సత్తు (ఉనికి)లో స్వతస్సిద్ధమై చిత్తు (ఎరుక) వున్నది. ఉపరితలంలో క్రియారహితమై అదృశ్యంగా వున్నప్పుడుకూడా అది అంతరమున సక్రి యంగానో నిష్క్రియంగానో వుండనే వున్నది. పైకి అచేతనంగా, జడంగా కనిపించే వస్తువులో లేనట్లు తోచే సందర్భంలో సైతం అది ఉన్నదనడానికి సందేహంలేదు.

## చేతన అనగా

చేతన యనగా స్వపర జ్ఞానశక్తిమాత్రమే కాదు, అది సృజనాత్మకమైన క్రియాశక్తికూడ. ప్రతిక్రియలను తాను సృష్టించనూగలదు. ఏ ప్రతి క్రియలూ లేకుండా వుండిపోనూగలదు, వెలిశక్తులకు తాను ప్రతిస్పం దించనూ గలదు. తనలోనుండి శక్తుల నుత్పాదన చేయనూగలదు. అది అది చిత్తేకాక చిచ్ఛక్తికూడ.

## చేతనాకక్ష్యలు

చేతన అంటే మనస్సేనని సామాన్యంగా అనుకోడంకద్దు. కాని, మనో మయచేతన మానవ కక్ష్యలోనిది మాత్రమే. చేతనాకక్ష్య లన్నిటికీ అది

వ్యాప్తం కాజాలదు. మానవ దృష్టి సకల వర్ణకక్ష్యలకు, మానవశ్రవణం సకల శబ్దకక్ష్యలకు ఎలా వ్యాప్తం కాజాలదో అట్లే ఇది కూడ. మానవునికి కనుపించనివీ, వినిపించనివీ వర్ణ, శబ్ద కక్ష్యలు ఏ రీతిగాఉన్నాయో అట్లే మానవకక్ష్యకు పైన, క్రింద కూడ, మానవునకు సామాన్యంగా అందుబాటులో ఉండని చేతనాకక్ష్య లున్నాయి.

## సాపేక్షిక పదాలు

పరచేతనా, అవచేతన, అచేతన—ఇవి సాపేక్షిక పదాలు. పరచేతన లోనికి మనం ఆరోహించగలిగినప్పుడు, అది మన మానవచేతనానుభవంలో ఉన్నతమైన దానికంటె ఉన్నతమైన చేతనయని తెలుసుకోగలుతాము. అట్లే అవచేతనలోనికి అవరోహించినప్పుడు, అది మన మానవచేతనకంటె క్రిందిదైన అట్టడుగు చేతనగా తెలియగలుగుతాము. అచేతన అనునదికూడ సమస్తమునూ తనలోపల కుంభించుకొని పైకి జడంగా కనిపించే చేతనావిశేషమేకాని వేరుకాదు.

## చేతనాభూమికలన్నీ విశ్వజనీన స్థితులు

చేతనాభూమికలన్నీ విశ్వజనీన స్థితులుగాని, పెషయి యగు వ్యక్తి దృష్టిపై ఆధారపడియున్నవికావు. పైపెచ్చు, వ్యక్తి దృష్టియే, పరిణామ క్రమంలో అది స్వీయస్వభావమునుబట్టి ఏ చేతనాభూమికయందు వ్యవస్థీకరించబడుతున్నదో తదనుసారంగా నిర్ణీతమవుతున్నది.

## చేతన కేంద్రీకృతమయ్యే తీరులు

చేతన ఎచ్చట కేంద్రీకృతమైతే దానితో అది తాదాత్మ్యం చెందుతూ

వుంటుంది. అహంకారమందు కేంద్రీకృతమైతే అహంకారంతో తాదాత్మ్యం, మనస్సునందు కేంద్రీకృతమైతే మనస్సుతో, బాహ్యమందు కేంద్రీకృతమైనప్పుడు బాహ్యసత్తతో తాదాత్మ్యంచెంది అంతస్సత్తను తెలియజాలని స్థితిలో వుంటుంది. అంతస్సత్తయందు కేంద్రీకృతమైనప్పుడు తాను అంతస్సత్తగానూ, అంతకంటె లోతుకుపోతే హృత్పురుషుని (చైత్యపురుషుని)గానూ తెలుసుకోగలుగుతుంది.

## ఆత్మజ్ఞాన భూమికలకు అధిరోహణం

ఎచ్చోట ఆత్మతన స్వేచ్ఛా విశాలతల ఎరుకను స్వతస్సిద్ధంగా కలిగి వుంటుందో అట్టి భూమికలలోనికి చేతన ఈ దేహంలో నుండి అధిరోహించగలిగినప్పుడు తాను ఆత్మననీ, దేహ ప్రాణ మనస్సులు కాననీ అది తెలుసుకో గలుగుతుంది. కనుక చేతన ఎచ్చట కేంద్రీకరించ బడుతున్నదనేదే సాధనలో ప్రధానాంశం.

## చేతన ఎచట ఏకాగ్రమైతే అచటనే అహంవృత్తి

వివిధ రీతులుగా కేంద్రీకృతం కావడానికి చేతనకు ప్రత్యేకమైన అహంకారమంటూ వుండవలసిన పనిలేదు. చేతన ఎచట ఏకాగ్రమైతే అచటనే అహంవృత్తి ఏర్పడి, తదనుసారంగా మానవుడు తనను అన్నమయ పురుషునిగానో, మనోమయ పురుషునిగానో, లేక మరియొక పురుషునిగానో భావించుకోడం జరుగుతుంది.

## చేతనాప్రవృత్తి : ఆరోహణావరోహణలు

చేతన అన్నమయ ప్రకృతిలోనికి క్రిందికి దిగివచ్చి మానవునిలోని

తక్కిన విభాగములను తాత్కాలికంగా మరుగుపరచుకొనవచ్చును. లేక, దేహ ప్రాణ మనస్సుల కతీతంగా శిరస్సుపైకి ఆరోహించి అఖండాత్మ స్వరూపంలో విలీనం కావచ్చును. లేక. క్రియాత్మకమైన విశ్వచేతన లోనికి విస్తరిల్లి దానితో తాదాత్మ్యం చెందవచ్చును. ఏమిచేసినా అహంకారమని పిలువబడేదానిపై ఆధారపడవలసిన అవసరం దానికి లేదు.

## "అసలు నేను"

నీలో 'నేను నేను' అని అనుకునే వ్యష్ట్యహంకారమే చేతన అనుకోరాదు. పరిచ్ఛిన్నమైన ఈ వ్యష్ట్యహంకారం 'అసలు చేతన' 'అసలు నేను' కాజాలదు. 'అసలు నేను' ఈవిశ్వమంత విశాలమైనది. అంతకంటె విశాలమైనది కూడ, దానిలోనే ఈ విశ్వమంతా ఇమిడివున్నది. అది అహంకారంకాదు, ఆత్మ.

## చేతనయే మూలవస్తువు

చేతనయే మూలవస్తువు. ఈ విశ్వమును, అందలి సర్వమును సృజించేడి శక్తి అదే. విశ్వమేకాక, అందలి ప్రత్యణువూ చేతన రూపొందించుకున్న వ్యవస్థావిశేషమే కాని వేరుకాదు.

## చేతనా సంభూతులు

చేతన ఒకానొక ప్రవృత్తియందు తనను దాను మరచినప్పుడు పైకి 'అచేతనం'గా కనిపించే శక్తిగా అవుతూవున్నది. అట్లే ఒక రూపు గైకొనడంలో అది తనను తాను మరచినప్పుడు పరమాణువుగా, అణువుగా, భౌతికవస్తువుగా అవుతూవున్నది.

## క్రమవికాసపూర్వకమైన రూపధారణ

పైకి అచేతనంగా కనిపించెడి శక్తియందు పనిచేసేదీ, రూపమును నిర్ణయించి తద్వికాసమునకు దోహదంచేసేదీ వాస్తవానికి చేతనయే. రూపధారణ ద్వారముననే క్రమ వికాస పూర్వకంగా జడత్వమునుండి ఆత్మ విముక్తి సాధించుకొన గోరినప్పుడు ఆ చేతనయే ప్రాణిగా, జంతువుగా, మానవుడుగా రూపు గైకొనడం జరుగుతూవున్నది.

## బాహ్యసత్తయందలి కలగాపులగపు స్థితి

దాగియున్నదానిని వెలువరించుకొనెడి వికాసక్రమంలో చేతన మానవునికంటె అతీతమైన స్థితిని సైతం అందుకొనగలదు. మానవునిలో ప్రస్తుతం అన్న, ప్రాణ, మనో, హృత్పురుష చేతనలు బాహ్యసత్తయందు కలగాపులగపు స్థితిలో ఉంటూ, వాటి నిజస్థితి మాత్రము అంతస్సత్తయందు మరుగువడి ఉంటున్నది.

## బహిర్ముఖ అంతర్ముఖత్వాలు

చేతన మనలో బహిర్ముఖంగా కేంద్రీకృతమై వుంటున్నందు వల్లనే బాహ్యసత్తయందు మనం నివసించడం జరుగుతూవున్నది. బాహ్యసత్తలో కలగాపులగపు స్థితిలో ఉండే అన్న, ప్రాణ, మనో, హృత్పురుషచేతనల నిజస్థితిని మనం పూర్తిగా తెలుసుకోవాలంటే, బహిర్ముఖ చేతనను అంతర్ముఖ మొనర్చి అంతస్సత్తయందు కేంద్రీకరించడం అవసరం.

## అంతర్జీవనారంభం

మనలోని చేతన సామాన్యంగా బాహ్యసత్తయందు కేంద్రీకృతమై వున్న హేతువుచేత దానికినీ అంతస్సత్తకునూ నడుమ ఒక తెరవంటిది, ఒక అడ్డు గోడ వంటిది ఏర్పడుతున్నది. చేతన ఇప్పుడా తెరను—ఆ అడ్డుగోడను భేదించి అంతస్సత్తయందు కేంద్రీకృతం కావడం అవసరం. అలా జరిగినప్పుడే మనలో నిక్కమైన అంతర్జీవనం ప్రారంభమవుతుంది.

## అంతస్సత్తలో దాగివున్న అఖండ రాజ్యసంపద

బహిరంతస్సత్తల నడుమగల అడ్డుగోడను భేదించి మనలోని చేతన అంతర్ముఖమై నిక్కమైన అంతర్జీవనం మనలో ప్రారంభమైనప్పుడు, బాహ్యసత్త కడు అల్పమై, అప్రధానమై మనకు గోచరిస్తుంది, అంతస్సత్తలో దాగివున్న అఖండ రాజ్యసంపదను మనం తెలియగలుగుతాము.

## పరభూమికలకు ఆరోహణ

బాహ్యాభ్యంతర సత్తలమధ్య అడ్డుగోడను కల్పించినట్లుగానే మనలోని చేతన పరావర భూమికల మధ్యకూడ ఒక అవరోధాన్ని కల్పించి వున్నది. హృత్పురుషుడు ఊతగాగల దేహప్రాణ మనస్సులే అవర భూమికలు. వీటికి ఊర్ధ్వమున గల పరభూమికలలో ఉత్కృష్ట నిత్య ముక్తమూ అనంతమూనై విరాజిల్లుతూ వున్నది. పైన పేర్కొన్న అవరోధాన్ని సైతం తొలగద్రోసి మనలోని చేతన ఆ పరభూమికల లోనికి ఆరోహించడం అవసరం.

## ఆరోహణ - అవరోహణ

పరావర భూమికల మధ్యగల అవరోధాన్ని భేదించుకొంటూ మనలోని చేతన పరభూమికలలోనికి ఆరోహించడం ద్వారా అనంతతేజోమయాత్మగా రూపాంతరం చెందనూ గలదు. ఆ పరచేతనానుభవపు ప్రతిచ్ఛాయలను మాత్రమే కాక, దాని సాక్షాత్సన్నిధిని సైతమూ క్రిందికి అవర ప్రకృతిలోనికి గొనివచ్చి దానిని రూపాంతరం చెందించనూ గలదు.

## అఖండచేతనా కల్పనలే చేతనా విభాగాలు

పురుషునిలోని మూలపదార్థం చేతన, స్వతస్సిద్ధంగా అందు ఏ విభాగాలూ లేవు. తాను అభివ్యక్తం చెయ్యగోరిన ఏ విభాగాలనైనా అదే కల్పన చేస్తుంది. పరాభూమికలనుండి అవరోహణక్రమాన వాటిని జడరూప పర్యంతమూ క్రిందికి సంకోచింపజేస్తూ వచ్చేదీ అదే, తిరిగి ఆరోహణ క్రమాన వాటిని పైపైకి వ్యాకోచింపజేస్తూ పోయేదీ అదే.

## అహంకార బంధవిముక్తులు

చేతన నీలో అహంకారం ద్వారా పనిచేయబూనితే, అహంకారమే సర్వమూ చేస్తున్నదని నీవు భావిస్తావు. ఆ పరిచ్ఛిన్న ప్రవృత్తినుండి విముక్తం కావడానికది మొదలిడినప్పుడు నీ అహంకారం క్రమక్రమంగా విస్తరిల్లుతూ తుదకు అనంతంలో లీనమై రూపుమాసిపోతుంది. లేదా, అహంకారం విగళితమైపోగా, నీలో ఆధ్యాత్మిక విశాలత విచ్చుకొని గుబాళిస్తుంది.

## భౌతికవాదులుచెప్పే చేతన

చేతన అని నేనంటున్నది భౌతికవాదులు చెప్పే చేతన కాదు. నేటి భౌతికశాస్త్రము ననుసరించి వారు చేతన జడంలోంచి పుట్టిందనీ, బాహ్యా పరిసరాలవల్ల కలిగిన ప్రతిస్పందన ఫలితమనీ అంటారు. కాని, ఆ ప్రతిస్పందన మొక చేతనారూప విశేషంకాని అసలు చేతన కానేరదు. సృష్టికి మూలమైన చేతనా స్వరూపము నది తెలియజేయజాలదు.

## సచ్చిదానందం

సచ్చిదానంద మనునది వస్తుతః ఒక్కటే. పరబ్రహ్మమునందు ఈ మూడును మూడుకావు, ఒకటే వస్తువు. సత్తే (ఉనికి) చిత్తు (తెలివి), చిత్తే ఆనందము. వాటిని విడదీయుటకు వీలు లేదు. విడదీయరానంతగా అన్యోన్యం అవి ఏకమైవున్నవి.

## సచ్చిదానందముల అభివ్యక్తి విశేషాలు

పరాభూమికలయందు అభివ్యక్తమైనప్పుడు, సచ్చిదానందములు ఒకదాని నుండి ఒకటి విడదీయరానివైనా ఒక్కొక్కదానికి విశేష ప్రాధాన్యంతో ప్రతికస్వరూపం పొందుతూవున్నవి. ఆ సచ్చిదానందములే అవరాభూమికలయందు అభివ్యక్తమైనప్పుడు, గర్భితవస్తు తత్వమున కాకపోయినా స్థూలదృష్టికి మాత్రం ఒకదానినుండి ఒకటి విడదీయదగి వుండి తక్కిన రెండూ లోపించిన ఏదో ఒకటిగ రూపొందడం జరుగుతూ వున్నది.

## అపరాభూమికల అభివ్యక్తి లక్షణం

అపరా భూమికలయందు అభివ్యక్తం కావడంలోనే సచ్చిదానందములు పరస్పరం వేరుపడినట్లై, చిదానందలక్షణ శూన్యమైన సత్తు, ఆనంద లక్షణశూన్యమైన చిత్తు మన అనుభవ గోచరమవుతున్నవి. అవి యిట్లు వేరుపడడమే లేకపోతే, అనృత, జడ, దుఃఖాదు లిచట అభివ్యక్తం కావడంగాని,సమష్టి జడాజ్ఞానంలోంచి పరిచ్ఛిన్న చేతన క్రమవికాసం చెందడంగాని జరగదు.

## అతిమానస విజ్ఞానం

సచ్చిదానందమునకూ, అపరా ప్రకృతికీ నడుమ అతిమానసమని పేర్కొన దగు విజ్ఞాన మున్నది. ఋతసృష్టిసాధనమైనది ఆ విజ్ఞానమే. అపరా ప్రకృతికి ఆధారమైవున్న సచ్చిదానందానుభవం పొందడ మనేది కూడా ఉన్నదిగాని, అపరాప్రకృతిని రూపాంతరం చెందించడం మాత్రం ఆ విజ్ఞానానికే సాధ్యం.

## ఆరోహణావరోహణలు

అపరా ప్రకృతికి చెందిన దేహ ప్రాణ మనస్సులను రూపాంతరం చెందించునది అతి మానస విజ్ఞానశక్తి మాత్రమే. నిష్క్రియకముగ సర్వమునకూ ఆధారభూతమైయుండు సచ్చిదానందము వలన ఆ పని జరుగదు. కాని, సచ్చిదానందానుభూతి ద్వారముననే ఆ విజ్ఞాన భూమికకు ఆరోహణము, తదనంతరం క్రింది భూమికలకు ఆ విజ్ఞానశక్తి అవతరణము సంభవమౌతాయి.

## అతిమానస విజ్ఞానానుభూతి

అతిమానస విజ్ఞానచేతనయందు ఏ సమస్యలూ ఉండవు. మనఃకల్పితమైన భేదజ్ఞానమునుబట్టియే సమస్య ఉత్పన్న మవుతాయి. అతిమానస విజ్ఞానానుభూతియందు అఖండమైన పూర్ణస్వరూపంతో సత్యసాక్షాత్కార మవుతుంది. ప్రతిదీ ఆ పూర్ణవస్తువులో అంతర్భాగమే.

## పూర్ణయోగలక్ష్యం

ఆధ్యాత్మిక మనస్సు ద్వారా సచ్చిదానందానుభూతిని పొంది దాని అచలాద్వయ స్థితియందు లీనంకావడం వెనుకటి యోగ పద్ధతుల లక్ష్యం. పూర్ణయోగపద్ధతియందు, ఆ సచ్చిదానందానుభూతినుండి అతిమానస విజ్ఞాన భూమికకు సాగిపోయి అచ్చోట దాని ఉపలబ్ధిని చిక్కబట్టుకోడం అవసరం.

## పరమ సచ్చిదానందం

విశ్వాతీతమగు పరమసచ్చిదానందం సకలమునకూ అతీతం—అతిమానసవిజ్ఞాన మనునది దాని శక్తియే,—ఆత్మజ్ఞాన, విశ్వజ్ఞానములతో కూడిన శక్తి అది. అందు విశ్వం తనకు వెలిగాగాక, తనలోనిదిగనే తెలియబడుతుంది. పరమసచ్చిదానందానుభూతి యందు నిమగ్నుడు కాగోరువాడు, ఈ అతిమానస విజ్ఞాన భూమికను దాటియే పోవలసి యున్నది.

## అతిమానస విజ్ఞానపు అనుభూతిలక్షణం

ఆధ్యాత్మమానసభూమిక కంటెనూ, దానికిపైన అతి మానస విజ్ఞాన

భూమికకు దిగువనుండే ఇతర భూమికల కంటెనూ అతిమానసవిజ్ఞాన భూమిక పూర్తిగా భిన్నమైనది. దానికి ఈ క్రింది భూమికల ధర్మము లేమాత్రము వర్తించవు. సచ్చిదానందమును గురించియు, విశ్వమును గురించియు అనుభూతిలక్షణ మచట కేవలం విభిన్నం.

## భూమికలనుబట్టి జ్ఞానభేదాలు

మనోభూమికయందలి జ్ఞానము భేదజ్ఞానము, అధిమానస భూమిక యందలి జ్ఞానము భేదమునం దభేదజ్ఞానము కాగా, అతిమానసభూమిక యందలి జ్ఞానము కేవల మభేదజ్ఞానమై వెలుగొందుతున్నది. అతిమానస విజ్ఞానానుభూతికి గల ప్రత్యేకతకు కారణం ఇదే.

## మనోభూమికలో సచ్చిదానందానుభూతి

అచ్చమైన సచ్చిదానందానుభూతి అన్ని భూమికలలోనూ ఒకటే. మనస్సు తరుచుగా ఆ అనుభూతితో తృప్తిచెంది, అదే కేవలం సత్యంగా పరిగణించి తక్కినదంతా మహామాయా విశేషంగా త్రోసిపుచ్చడం జరుగుతూ వుంటుంది.

## శక్త్యాత్మకమైన సచ్చిదానందానుభూతి

నిష్క్రియమైన అచ్చపు సచ్చిదానందానుభూతిగాక, శక్త్యాత్మకమైన సచ్చిదానందానుభూతి వేరొకటి ఉన్నది. ఆ దివ్యానుభూతియందు సత్య వస్తువు ఏకం-అనేకం, సగుణం-నిర్గుణం, పరిచ్ఛిన్నం – అపరిచ్ఛిన్నం మొదలైన యుగళాత్మక స్వరూపంతో సాక్షాత్కరిస్తుంది. పూర్ణ జ్ఞానోప లబ్ధికి అట్టి అనుభూతి అత్యంతావశ్యకం.

## శక్త్యాత్మకానుభూతిలో భేదాలు

శక్త్యాత్మకమైన అనుభూతి పై భూమికలలో నున్నట్లు క్రింది భూమిక లలో నుండదు. పై భూమికలలోనైనా అతిమానస విజ్ఞానభూమికలో నున్నట్లు దాని క్రింది భూమికలలో నుండదు. ద్వంద్వములను ఈ క్రింది భూమికలలో దగ్గరకు చేర్చి సమన్వయించడం మాత్రమే సాధ్యపడు తుంది. అతిమాన సవిజ్ఞానభూమికయందో, ఇవి విడదీయరాని విధాన ఒక్కటిగా మేళనం పొందుతాయి.

## శక్త్యాత్మకమైన సత్యసాక్షాత్కారం

జగత్తు శక్త్యాత్మకం, చలనాత్మకం. శక్త్యాత్మకం కాని అచ్చపు సచ్చిదా నందానుభూతి అచలం. శక్త్యాత్మకమైన జగత్, సచ్చిదానందముల నిజతత్వ సాక్షాత్కారం అతి మానస విజ్ఞాన భూమికయందు మాత్రమే సాధ్యమవుతుంది.

## సచ్చిదానందంలో రెండు తరగతులు లేవు

సచ్చిదానందంలో రెండు తరగతు లున్నవనుటకు వీలులేదు. అది ఎల్ల ప్పుడూ ఒక్కటిగానే వుండే సిద్ధవస్తువు. దానిని గురించిన జ్ఞానం మాత్రం అనుభూతిపొందే చేతనా భూమికనుబట్టి మారుతూ వుంటుంది.

## అతిమానస విజ్ఞాన అనుభూతి లక్షణం

ఏ సత్యచేతనచే ఈశ్వరుడు తన నిజతత్వ నేకాక, తన అభివ్యక్తియగు జగత్తును సైతం తెలుసుకొంటాడో అదియే అతిమానసవిజ్ఞానం. అభేద

జ్ఞానం దాని ముఖ్య లక్షణం. ఆత్మతత్వం, పరమాత్మతత్వమే కాక, తదభివ్యక్తియగు జగత్తత్వంకూడ తెలియబడే అనుభూతి అది. జగత్తు సైతం బ్రహ్మమేకదా, — 'సర్వం ఖల్విదం బ్రహ్మ'.

## మనస్సు- విజ్ఞానం

తెలుసుకోడం కోసం ప్రయత్నించే అవిద్యాసాధనం మనస్సు. తెలియబడేదీ తెలివీ తానేయైన జ్ఞాత అతిమానస విజ్ఞానం. కనుకనే తన నిజ తత్వపు వెలుగులో సకల వస్తువులనూ చూడగలుగుతుంది. అయ్యది అచలశక్తియేగాక సచలశక్తి, జ్ఞానమేగాక జ్ఞానమూలకమైన ఇచ్ఛ, సంకల్పం.

## అతిమానస విజానపు అభివ్యక్తి లక్షణం

అజ్ఞానావరణంచే ముసుగువడక ఏకత్వ జ్ఞాన ప్రభావిలసితమైన సత్య తేజో లోకమును సరాసరిగా అభివ్యక్త మొనరించగల శక్తి అతిమానస విజ్ఞానమున కున్నది. కావున అది సకలవిధాభివ్యక్తులకూ అతీతమై యున్నట్టిది కాదు. ప్రస్తుతం మన అనుభవంలో నున్న యీఅన్నప్రాణ మనోమయ త్రిపుటికి మాత్రమే అతీతం.

## చేతనావిశ్వ విభాగాలు

పరార్ధం, అపరార్ధం, అని చేతనావిశ్వం రెండు విభాగములు చెయ్యబడు తున్నది. సత్తు, చిత్తు, ఆనందం, మహస్సు—ఇవి పరార్ధం(పైసగం) లోనివి. అన్నం, ప్రాణం, మనస్సు—ఇవి అపరార్ధం (క్రింది సగం) లోనివి. అతిమానస విజ్ఞాన మనునది పరార్థములోనిదైన మహస్సే.

## అధిమనస్సు

చేతనా విశ్వపు పరార్థ, అపరార్థముల నడిమిగీతపై నున్నది అధిమనస్సు. పరార్థములోని మహస్సుకూ అపరార్థములోని మనస్సుకూ మధ్యస్థానం దీనిది. మహస్సునుండి తేజస్సు నందిపుచ్చుకొని యిది దానిపైన ఆధార పడివున్నా, దాని పూర్ణ తేజస్సును మాత్రం మనకు మరుగుపరచి దాని కవరోధమై ఉంటున్నది.

## అధిమనఃప్రవృత్తి

మహస్సునందలి అవిభాజ్య తేజస్సును అంది పుచ్చుకొన్నప్పుడు అధి మనస్సు దానిని నానాప్రకారములుగా విభజిస్తూ వున్నది మనోభూమి కలో చేతన మరింత సంకోచం పొందుతుంది కనుక, ఈ విభాగములలో ఏ ఒక్కదానినో మాత్రమే ముఖ్యసత్యంగా భావించి తక్కిన వాటిని అముఖ్యములుగా పరిగణించడాని కవకాశమున్నది. 'హిరణ్మయేనపాత్రేణ సత్యస్య అపిహితం ముఖం' 'ఋతేన ఋతం అపిహితం' అనెడి శ్రుతు లలో సూచితమైనది ఈ అధిమనఃప్రవృత్తియే యని చెప్పవచ్చు.

## 'విద్యా-అవిద్యామయీ' మాయాశక్తి వ్యాపారం

అధిమనస్సునందు ఒక విధమైన 'విద్యా-అవిద్యామయీ' మాయాశక్తి వ్యాపారం జరుగుతున్నదని చెప్పవచ్చు. ఈ ప్రప్రథమ విభజనాత్మక వ్యాపారము ననుసరించియే, మనస్సు 'నిర్గుణమే పరమసత్యం, సగుణం దాని మాయాచ్ఛాదనం' అనీ, లేక 'సగుణమే పరమసత్యం, నిర్గుణం దాని కళావిశేషం' అనీ భావించడం జరుగుతున్నది.

## పరస్పర విభిన్నమైన మతములకు మూలం

మనస్సుకు గోచరించిన ఒకానొక సత్యాంశము, ఒకానొక భగవన్మూర్తి తదితర సత్యాంశములకంటె, తదితర భగవన్మూర్తులకంటె గొప్పవిగా భావించడం మూలముననే పరస్పర విభిన్నములైన తత్వదర్శనములూ, మతములు ఉత్పన్నమవుతున్నవి. మానవుని మానసికజ్ఞానమునకంతకూ ఏడుగడగా ఉంటున్నది ఈ విభజనాత్మక ధర్మమే.

## మనస్సు కల్పించెడి ఏకత్వభావన

చరమమైన ఏకత్వం తాను కనుగొన్నట్లు మానవుడు భావించుకొనునప్పుడు కూడ అది సత్యముయొక్క ఒక పక్షమును ఆధారముగాగొని కల్పించిన ఏకత్వం మాత్రమే. సత్యమును రెండుగా విభజించి, పరభాగమును బ్రహ్మమనీ, అపరభాగమును మాయయనీ పేర్కొనుట ఇటువంటి ఏకత్వ కల్పనే అవుతుంది.

## మానసిక జ్ఞానపరిమితి

సత్యవస్తువునకు అధిమనస్సు కల్పించే విభాగములు అసంఖ్యాకములు. వాటినిబట్టియే, తత్వదర్శనములు, మతములు కూడ అసంఖ్యాకములు కావడానికి వీలున్నది. కనుకనే, మానసిక జ్ఞానం ఏ చరమపరిష్కారానికీ సాధనం కానేరదు.

## అధిమనస్సునందలి సామరస్యం

సత్యవస్తువునకు విభాగ కల్పన అధిమనస్సులో ప్రారంభమైనా, ఏకమైన ఆ సత్యవస్తువే అన్నిటికీ ఆధారభూతమై ఉన్నదనే జ్ఞానంకూడా దానికి

ఉంటుంది. అందుచే, జగల్లీలలో తన సహజధర్మము ననుసరించి అది తాను చేసే ప్రతి విభాగపు అభివ్యక్తికీ సంపూర్ణమైన అవకాశం ఇస్తూ వున్నా అందు సామరస్యమే తప్ప సంఘర్షణ యుండవు.

## ఏకత్వం మరుగుపడే క్రింది భూమికలు

అధిమనస్సులోని ఏకత్వజ్ఞానం దాని క్రింది భూమికలలో ఉండదు. క్రిందికి దిగివచ్చిన కొలదీ విభాగకల్పనాతీవ్రత మరింత హెచ్చుతుంది. అంతర్గతమైవున్న ఏకత్వం మనోభూమికలో అస్పష్టము, అనిరూప్యము అయిపోతుంది. స్పష్టంగా నిరూప్యమాణ మయ్యేది దృశ్యనానాత్వం మాత్రమే.

## మనస్సు : దివ్యానుభూతి

ఆధ్యాత్మిక సాధకులు, యోగులు అభిలషించే అపరోక్ష దివ్యదర్శన స్పర్శనానుభూతులు మనస్సుకు సాధ్యం కానేరవు. ఆత్మదర్శనమూ, సత్య దర్శనమూ సాక్షాత్తుగా పొందడానికి మనస్సు నిశ్చలమూ, నీరవమూనై వాటి వెలుగు కొంత తనలో ప్రతిబింబించుకోడం గాని, లేక తనను తాను అతిక్రమించి పరివర్తన చెందడంగాని జరగవలసి వుంటుంది. మనశ్చేతనలోనికి దివ్యతేజోవతరణంవలననో, దివ్య తేజస్సులోనికి మనశ్చేతనారోహణం వలననో మాత్రమే యియ్యది సాధ్యం.

## అన్నమయ భూమిక

మనోమయ భూమికనుంచి క్రిందికి అన్నమయ భూమికకు మనం దిగి

వచ్చినప్పుడు, విభాగకల్పనలో చరమసీమ చేరుకొన్నవార మవుతాము. ఏకత్వం అచటకూడా గర్భితమై వున్నా తెలియబడక పూర్తిగా మరుగు పడిపోతుంది. అచట సంప్రాప్తమయ్యేది సంపూర్ణమైన అజ్ఞానం, జడం మాత్రమే దీనిలోనుంచియే జ్ఞానం. చైతన్యం, వికాసం చెందడం జగద్విధానం.

## విజ్ఞానమయచేతన సృష్టిలక్షణం

విభాగకల్పన మొనర్చే అధిమనస్సు ద్వారమునగాక దానికి పైన ఉండే అతీతమనస్సు (దీనినే మహస్సు, విజ్ఞానమయచేతన అని కూడా పిలువవచ్చు) నుండి సరాసరిగా సృష్టి జరిగివుంటే, ఇప్పుడు మనం చూచే అజ్ఞానమయ ప్రపంచావిర్భావం అసంభవం. ఆదినుండి దివ్యతేజోమయ ప్రపంచావిర్భావమే అట్టి సందర్భంలో జరిగి వుండేది.

## యోగపర్యస వైవిధ్యం

వివిధ యోగపర్యాస విశేషముల మధ్య కచ్చితమైన అనురూపతను సర్వత్రా నిరూపించడానికి వలను పడదు. ఏలనంటే ఒక విషయాన్ని భిన్న దృక్పథాలనుండి చూచి, భిన్నరీతులుగా అనుభవాన్ని వ్యక్తీకరించడం వాటియందు జరుగుతుంది. దేని నిర్మాణ ప్రణాళిక దానిదే. దేని సాంకేతిక విధానములు దానివే.

## పరమతత్వం

పరమతత్వం సచ్చిదానంద మనెడి త్రికస్వరూపంగా ప్రాచీన భారత తత్వమీమాంసయందు వర్ణితమయింది. పరార్ధ సంజ్ఞతో ఈ సచ్చిదా

నందాన్ని పిలిచేటప్పుడు, సత్, చిత్, ఆనంద భూమికలుగా దీనిని పేర్కొన్నారు. ఈ మూడింటిపై ఆధారపడివుండే విజ్ఞాన (మహస్) భూమిక కూడా పరార్ధంలో చేరదగినదే.

## గుర్తించని రహస్యం

భారతీయ దర్శనములు మనోమయ, విజ్ఞానమయ చేతనల సరిహద్దురేఖపైనుండే అధిమనస్సు అని పిలువదగిన భూమికకూ విజ్ఞానమయ భూమికకూగల భేదమును గుర్తించడం జరగలేదు. కనుకనే, 'విద్యా-అవిద్యామయీ మాయా' స్వరూపమగు అధిమనశ్శక్తియే విశ్వకర్త్రియగు పరాశక్తిగా భావించి దానికంటె పైనిదగు విజ్ఞానమయచేతన ద్వారా జరుగగల దివ్యపరివర్తన రహస్యమును తెలియలేక పోయినవి.

## వివిధయోగదర్శనముల ధోరణులు

విద్యా-అవిద్యామయమగు మాయకు (అధిమనస్సుకు) అతీతమైన విజ్ఞానమయ చేతనను అందుకొనుటకు వైష్ణవ, తంత్ర యోగములు తడుములాడి, ఒక్కొకతరి విజయసిద్ధి దాపులవరకునూ పోయినవి. తక్కినవి మాత్రము అధిమనస్సు వెలుగులు అవతరించినట్లు తోచిన తోడనే అదియే విజ్ఞానమయ చేతనగా భావించి అంతటితో నిలిచిపోవడమో, లేక, దాని కావలనున్న నిశ్చలతత్వమున లీనమగుటయే పరమ లక్ష్యముగా భావించడమో జరిగినది.

## మూలతత్వత్రయం

భారతీయ యోగదర్శనముల ప్రకారము. ఈశ్వరుడు, శక్తి, జీవుడు,—

లేక, సచ్చిదానందము, మాయ, జీవుడు,—అనునవి ఇప్పటి జగదభివ్యక్తికి మూలమైయున్న తత్వత్రయం, ఇప్పటి జగదభివ్యక్తిని అతీతించగోరెడు పూర్ణయోగదర్శనమున గూడా ఇవి గ్రాహ్యములే అయినా, చేతనా భూమికల దృష్ట్యా, సత్—చిత్—పూర్వకమైన ఆనందము, విజ్ఞానము (మహస్సు), అధిమనస్సు అనువాటిని ఈ తత్వముగా పేర్కొన వచ్చును.

## అధిమనస్సుద్వారా విజ్ఞాన భూమికారోహణ

చేతనావిశ్వపు అపరార్ధమునకు శిఖరస్థానమున నున్నది అధిమనస్సు. పరార్ధములోని విజ్ఞానభూమికకు చేరుకొనవలెనంటే ఈ అధిమనస్సు ద్వారముననే పైకిపోవలసియున్నది. విజ్ఞాన భూమికకు పైన వుండేది సత్—చిత్—ఆనంద లోకములు.

## చేతనాభూమికల పరస్పర సంబంధం

వివిధ చేతనా భూమికలమధ్య ఏ అఖాతములూ లేవు. అవి అన్నీ ఒక దానితో నొకటి సంబంధం కలిగివున్నవే. సోపాన పంక్తివలె వాటిపైకి ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ పోవచ్చును. మానవ మనస్సుకూ, అధిమనస్సుకూ నడుమ అధికాధిక తేజోవంతములైన భూమికావిశేషము లనేకమున్నవి. అట్టడుగున ఉన్న ఒకటి రెండు తప్ప తక్కినవన్నీ మానవ మనస్సునకు సామాన్యముగ అందరానివే.

## సుషుప్తిగా వర్ణితమైన ఈశ్వరచేతన

తనకు అతీతమైన భూమికలలోని పరచేతనను మానవచేతన పరమ

అచేతనగా పరిగణించడంకద్దు. కావుననే ఒక ఉపనిషత్తులో ఈశ్వరచేతన సుషుప్తిగా వర్ణించబడింది. జాగ్రచ్చేతనను ఉన్నతస్థితికి పరివర్తనం చెందించ యత్నించని పరిస్థితిలో మానవుడు పరచేతనానుభూతిని సమాధి ద్వారా పొందవలసియుండుటే దీనికి కారణం.

## పురుషుని యందలి విభాగ వ్యవస్థ

పురుషుని యందలి విభాగవ్యవస్థ రెండు విధములుగా ఉన్నది. రెండూ ఏకకాలంలో ప్రవర్తిల్లుతూవున్నవే. ఒకటి, హృత్పురుషుడు కేంద్రముగా వివిధ కోశముల రూపమున ఏర్పాటైన వ్యవస్థ. మరియొకటి, సోపానపంక్తివలె ఎక్కుటకు, దిగుటకు, ఒకదానిపై నొకటిగ వివిధ భూమికల రూపమున ఏర్పాటైన వ్యవస్థ. ఈ సోపానపంక్తిలో విజ్ఞానమయ. అధిమనోమయభూమికలు మానవత్వము నుండి దివ్యత్వానికి పరివర్తనము నొందించుటలో ముఖ్యపాత్ర వహిస్తున్నవి.

## దివ్యపరివర్తనకు ఏకమార్గం

దివ్యపరివర్తనం సాధించడానికి ఒకటే మార్గమున్నది. ముందు హృత్కేంద్రములోని హృత్పురుషుని (చైత్యపురుషుని) కనుగొనుటకై లోలోపలకు చొచ్చి యాతనిని ముందునకు గొనితెచ్చుటతోపాటు దేహ ప్రాణ మనస్సుల అంతఃప్రకృతి విభాగములను గుర్తించాలి. పిమ్మట, ఊర్ధ్వ భూమికలలోనికి ఆరోహణ మొనర్చుచూ పోవుటతోపాటు మరల క్రిందికి గూడ దిగివచ్చుచూ క్రింది భూమికలను పరివర్తన మొందించుకోవాలి.

## అంతర్గమన, ఊర్ధ్వగమన ప్రయోజనాలు

లోలోపలకు చొచ్చి హృత్పురుష చేతనను ముందునకు గొనితెచ్చుట వలన అవరప్రకృతి యంతయూ దివ్యపరివర్తన కొరకు సన్నద్ధమగును. పిమ్మట ఊర్ధ్వగామి యగుటచే సాధకుడు మనస్సును అతిక్రమించగలిగి, ఒక్కొక్క మెట్టే పైపైకి పోవుచుండుకొలదీ ఒక్కొక్క నూత్న చైతన్యోపలబ్ధిని పొందనేర్చుటేగాక, ఆ నూత్న చైతన్య ప్రభావముచే నాతని ప్రకృతియెల్ల ప్రభావితమైపోవుటయూ జరుగును.

## ప్రదీప్త మనస్సు ద్వారా సంబుద్ధ మనస్సుకు

మనస్సుకుపైన ప్రదీప్త మనస్సు, దానికిపైన సంబుద్ధమనస్సు, దానికి పైన అధిమనస్సు, దానికిపైన అతీతమనస్సు (విజ్ఞానమయ చేతన)- ఈ రీతిగా అంతస్తులున్నవి. మనస్సును దాటి, ప్రదీప్త మనస్సు ద్వారా సంబుద్ధమనస్సును మనం చేరినప్పుడు, సమస్తమునూ మనం సంబుద్ధమైన సంకల్పం, భావావేశం, ఇంద్రియానుభవం, భౌతిక సంస్పర్శల ద్వారా దర్శించగలుగుతాము.

## సంబుద్ధమనస్సునుండి అధిమనస్సునకు

సంబుద్ధమనస్సునుండి అధిమనస్సునకు మనం ఆరోహించినప్పుడు, అచట నొక వినూత్న చైతన్య పరివర్తనం కలుగుతుంది. అధిమనశ్చైతన్య ప్రభావితమైన యోచన, సంకల్పం, భావావేశం, ఇంద్రియ సంవేదనం, భౌతిక సంస్పర్శ మున్నగువానితో కూడిన దేహ ప్రాణ మనస్సులతో సమస్తమూ దర్శించి అనుభవించ గలుగుతాము.

## అధిమనస్సునుండి అతీతమనస్సుకు

అధిమనస్సునుండి అతీతమనస్సుకు ఆరోహణం చెయ్యడంతో చైతన్య పరివర్తనపు చరమసీమను మనం చేరుకోగలుగుతాము. ఆ స్థితిలో మన సకల ప్రకృతియూ ఆ అతీతమనశ్చేతనతో ప్రభావితమైపోతుంది, అది అవిద్యను పూర్తిగా దాటిపోయినస్థితి-కనుక చైతన్యపరివర్తనముల ఆవశ్యకత ఇక ఉండనేరదు.

## అపరార్ధ విశ్వపు జగత్త్రియం

మనం చూచే భౌతిక జగత్తుకుపైన ప్రాణమయజగత్తువున్నది. ఈ రెండింటికీ పైన మనోమయజగత్తు వున్నది, మూడింటినీ మొత్తముమీద అపరార్ధ విశ్వపు జగత్త్రియంగా పేర్కొన్నారు. సృష్టి వికాసక్రమంలో పృథ్వీచేతనయందీ మూడునూ ప్రతిష్ఠితములై వున్నవి. కాని, సృష్టి వికాసమునకు పూర్వమందు కూడా పృథ్వీచేతనకు పైన వీనికి స్వతస్సిద్ధమైన ఉనికి కలదు.

## భౌతిక జగత్తులో ప్రాణాదుల వికసన

ఈ భౌతికజగత్తు, ప్రాణమయ చేతనా భూమిక ఒత్తిడికి లోనైన హేతువుచే ప్రాణమును, మనోమయ చేతనాభూమిక ఒత్తిడికి లోనైన హేతువుచే మనస్సును తనయందు వికసింపజేసికొన్నది. అదే విధముగా అతీతమానస (విజ్ఞానమయ) చేతనా భూమిక ఒత్తిడి కారణమున అతీత మానసమును తనయందు వికసింపచేసుకోవలెనని యిపుడు దాని ప్రయత్నం.

## విశ్వ, తైజస, ప్రాజ్ఞులు

మాండూక్యోపనిషత్తులో చెప్పబడిన విశ్వుడు బాహ్యచేతన, తైజసుడు అంతశ్చేతన. ప్రాజ్ఞుడు పరాచేతన. జాగ్రత్, స్వప్న, సుషుప్తులకు వీటిని వర్తింప జెయ్యడానికి కారణం: జాగ్రదవస్థలో సామాన్యంగా మానవుని బాహ్యచేతన మాత్రమే మేల్కొనివుండగా, అంతశ్చేతన ప్రచ్ఛన్నమైవుండి, నిద్రలోమాత్రమే స్వప్నాలుగా దర్శనాలుగా అనుభూత మవుతూ వుంటుంది. పరాచేతన (అతీతమనస్సు, అధి మనస్సు ఇత్యాది) ఈ అంతశ్చేతన కంటె అతీతమైనది. మనోదృష్టి కది గాఢ నిద్ర వంటిది మాత్రమే.

## బ్రహ్మచైతన్య స్థితులు

విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు, కూటస్థుడు,—యివి సర్వగత, సర్వాతీత, బ్రహ్మచైతన్యస్థితులను తెలియజేసే పదాలు. జాగ్రత్ (స్థూల) అవస్థకు ఆధారభూత చైతన్యం విశ్వుడు. స్వప్న (సూక్ష్మ) అవస్థకు ఆధారభూతమైన చైతన్యం తైజసుడు. సుషుప్తి (కారణ) అవస్థకు ఆధారభూతమైన చైతన్యం ప్రాజ్ఞుడు. ఈ మూడింటికీ అతీతమైన విశ్వాతీత చైతన్యం కూటస్థుడు.

## విశ్వుడు—విరాట్టు ఇత్యాది జంటపదాలు

విశ్వుడు—విరాట్టు, తైజసుడు—హిరణ్యగర్భుడు, ప్రాజ్ఞుడు — ఈశ్వరుడు,— ఇత్యాది జంటపదాల ఆంతర్యం ఒక్కటే. బాహ్యజగత్ చైతన్యం విశ్వుడు, లేక విరాట్. అంతరజగత్ చైతన్యం తైజసుడు, లేక హిరణ్యా

గర్భుడు. ఈ ఉభయ జగదతీత చైతన్యం ప్రాజ్ఞుడు, లేక ఈశ్వరుడు. ఈ ఈశ్వరుడే సర్వాధారుడు, సర్వనియామకుడు అయిన పరమాత్మ.

## విరాట్టు

బాహ్యజగత్తుగా అభివ్యక్తమైనదెల్ల 'విరాట్టు'. కాని, ఈ అభివ్యక్తికి వెనుక ఏది వున్నదో గుర్తించకుండ యిదే బ్రహ్మ మనుకోడం పొరపాటు. బ్రహ్మమీ బాహ్యజగత్తేకాదు. దానికి అతీతమై వున్నది కూడ.

## అతీత మనస్సు

ఈశ్వర ప్రకృతియొక్క సత్యచేతనయే అతీతమనస్సు, లేక విజ్ఞానం. అజ్ఞానానికీ విభాగకల్పనకూ అందు తావులేదు. సకలమనఃప్రవృత్తులకూ అతీతమైన జ్ఞానతేజస్సుతో నిత్యమూ నిండారియుండెడి దివ్య చేతనఅది.

## అభేదజ్ఞానంనుండి అవతరణ ప్రారంభం

మానవ మనస్సుకూ అతీతమనస్సుకు నడుమ ఎన్నో చేతనాభూమికలున్నవి. పైకి పోయినకొలదీ మనఃప్రవృత్తులకు మరింత తేజస్సునూ, శక్తినీ, విశాలతనూ సంతరింపగలుగుచుండెడి భూమికలివి. వీటికి శిఖరప్రాయమై బహుళ తేజశ్శక్తి సంపన్నమై యుండునదే అధిమనస్సు. అయితే, దానికంటె పైనిదగు అతీతమనస్సు దృష్ట్యా చూచినప్పుడు మాత్రం, పూర్ణమైన అభేదజ్ఞానం నుండి అజ్ఞానంవైపు అవతరణకు అదియే ప్రారంభం.

## భిన్న ముఖములుగా సత్యవిభజన

అధిమనస్సు గ్రహించినది అతీతమనస్సునందలి పరమసత్యమునే. కాని, ఆ పరమసత్యం భిన్నముఖములుగా వేరుపడడం అచట ప్రారంభమవుతుంది. అవి అన్నీ స్వతంత్ర సత్యములైనట్లుగా వ్యవహరించ మొదలుపెట్టుతాయి. మనోమయ, ప్రాణమయ, అన్నమయ భూమికల లోనికి క్రమముగా దిగివచ్చుటతో ఈ విభజనధోరణి పూర్తియై మూలమందలి అవిభాజ్య సత్యం ఖండఖండములుగా తుదకు విభక్తమైపోతుంది.

## విజ్ఞానమయ చేతనాలక్షణం

నిత్యమై, ఏకమై, అవిభాజ్యమై యుండు సత్యజ్ఞానం అతీత మనస్సు అనబడే విజ్ఞానమయచేతనా లక్షణం. మానవ మనఃకల్పితమైన విభాగాలూ వైరుధ్యాలూ అచట అంతరిస్తాయి. పరమసత్యం అఖండ పూర్ణ తేజస్సుతో సాక్షాత్కరిస్తుంది. దానికంటె క్రింది అంతస్తులోనిదగు అధిమనస్సులో అజ్ఞానంలోనికి పతన మింకా జరగకపోయినా, పతనమును అనివార్య మొనర్చే తొలి అడుగు పడినది అధిమనస్సులోనే.

## విజ్ఞాన భూమికలోని వ్యవహార సరళి

స్వీయశక్తులను మోహరించి వాటి అభివ్యక్తిని నిర్ణయించు ఏకమైన పూర్ణసత్యమే విజ్ఞానమయచేతన. సకలభూతాంతర్గతమై ఏకమైన ఈశ్వరసంకల్పానుసారం ఆశక్తులన్నీ పరస్పర వైరుధ్యంగాని, సంఘర్షణాని లేకుండ అత్యంత సామరస్యంతో ఒక్కటిగా పనిచేస్తూ ఉంటాయి.

## క్రింది భూమికలలోని వ్యాపారలక్షణం

విజ్ఞాన భూమిక యందలి సత్యశక్తులనే దాని క్రింది భూమిక యైన అధిమనస్సు స్వీకరించినా, అచట అవి వేర్వేరుగా వ్యవహరించ మొదలుపెట్టుతాయి. సామరస్యం కానవచ్చినా అది విజ్ఞాన భూమిక యందలి స్వతస్సిద్ధ సామరస్యం కాజాలదు. అటనుండి ఇంకనూ క్రింది భూమికలోనికి దిగివచ్చినకొలదీ, వేరుతనం బలపడుతుంది. సంఘర్షణలు వృద్ధిచెందుతాయి. అజ్ఞానం పెరుగుతుంది. ఒండొంటితో ఢీకొనెడి ఖండ సత్యముల మిశ్రమంగా వ్యాపారసరళి కొనసాగుతుంది.

## భూమికలు - సత్యములు

వేర్వేరు భూమికలకు వర్తించే సత్యములు వేర్వేరుగా వుంటాయి. క్రింది భూమికలకు వర్తించే కొన్ని సత్యములు పై భూమికలకు వర్తించవు. ఉదాహరణకు, కామము అహంకారము అనునవి మనోమయ, ప్రాణమయ, అన్నమయ, అజ్ఞాన భూమికలకు వర్తించే సత్యాలు. ఈ భూమికలను దాటి మనం పైకి పోగలిగినప్పుడు కామాహంకారముల సత్యత్వం అంతరించి, నిక్కమైన పురుషుని కప్పిపుచ్చే అసత్యములుగా అవి మనకు గోచరిస్తాయి.

## దైవాసుర శక్తుల సంఘర్షణ - దానిసత్యత్వం

అజ్ఞాన భూయిష్ఠమైన అన్న, ప్రాణ, మనోమయ భూమికలందు గోచరించెడి సత్యములలో దైవాసుర శక్తుల సంఘర్షణ మొకటి. ఇట నుండి ఊర్ధ్వ భూమికల కారోహించిన కొలదీ దీని సత్యత్వం క్రమేణా

తరిగిపోతూ విజ్ఞానమయ భూమికకు చేరుసరికి పూర్తిగా అంతరించి పోతుంది. అచట దానికి ఎంతమాత్రమూ ఉనికిలేదు.

## సగుణ నిర్గుణ భేదపు సత్యత్వ అసత్యత్వాలు

సగుణ నిర్గుణ భేదము అధిమనోభూమిక యందలి సత్యము. విజ్ఞాన భూమికయందు ఈ భేదమునకు సత్యత్వం లేదు. అచట అవి రెండునూ అవిభాజ్యంగా ఏకమై వున్నవి.

## విజ్ఞాన శిఖరారోహణ

అధిమనోభూమికయందలి సత్యములను చిక్కబట్టుకొని జీవితములో అనుసంధానించుకొనిననేతప్ప, విజ్ఞానభూమికయందలి పరమసత్యమును అందుకొనుటకు వీలులేదు. శిఖరమును చేరుకోడానికి ఒక్కొక్క మెట్టు పైనే స్థిరంగా కాలూనుకుంటూ మెట్లన్నీ యెక్కి పైకి పోవడం అవసరంకదా.

## విశ్వచేతనా వికాసం

అధిమనో భూమికయందలి శక్తియే ఒక్కొక్కప్పుడు ప్రత్యక్షంగానూ, ఒక్కొక్కప్పుడు పరోక్షంగానూ విభాగకల్పనా ప్రవృత్తి నుండి మనస్సునకు విమోచనం కల్పించి, విశ్వచేతనను సాధకునిలో వికసింప జేస్తుంది. సాధకుడపుడు విశ్వాత్మను, విశ్వలీలను తెలుసుకొన గలుగుతాడు.

## విజ్ఞానభూమికకు త్రోవ అధిమనస్సే

విజ్ఞానమయ చేతనను క్రిందికి గొనితెచ్చుటకుముందు, అధిమనస్సును చేరి దానిని క్రిందికి తీసుకొనిరావడం అవసరం. ఏలనంటే, మనస్సు నుండి విజ్ఞానభూమికకు చేరే మార్గం ఈ అధిమనస్సే.

## సృజనాత్మక సత్యపు నానారూప వ్యవస్థలు

భూతసృష్టికి మూలమైన పరమ సత్యపు నానారూప వ్యవస్థలు అధిమనస్సునుండియే ప్రారంభమై అటనుండి సంబుద్ధ మనస్సుకు, దానినుండి ప్రదీప్త మనస్సుకు, దాని నుండి మనస్సుకు చేరడం సంభవిస్తూన్నది. ఇట్లు క్రింది భూమికలకు క్రమముగా దిగిరావడంలో వాటి శక్తి సామార్థ్యాలు అంతకంతకు తగ్గిపోవడ మనేది సహజం.

## మనోభూమికలోని జ్ఞానలక్షణం

మనోభూమికకు దిగివచ్చే సరికి, పరమసత్యపు నానారూప వ్యవస్థలు సాక్షాద్దర్శనమందలి తమ పూర్వపు శక్తి విశేషాన్ని పూర్తిగా కోల్పోవడం జరుగుతుంది. ఊహాకల్పితమైన భావసముదాయంగా మాత్రమే. మానవబుద్ధికి అవి అచట గోచరమౌతాయి.

## విజాన భూమికలోనికి ప్రవేశార్హత

అధిమనస్సులోని సత్యమును ధ్యానమందు, అంతరనుభూతియందు అనుభూత మొనర్చుకొనుటచేగాక, నిత్యజీవితంలో, వాక్కులో, కర్మలో, బాహ్యేంద్రియ ప్రవృత్తిలో సైతం విషయీభూత మొనర్చు

కోగలిగివుండాలి సాధకుడు. అట్లు చేయలేనంతవరకూ నిక్కమైన విజ్ఞానభూమికలోనికి (ఒక విధమైన సమాధ్యవస్థలో తప్ప) అతడు ప్రవేశింపజాలడు.

## విజ్ఞానమంటే బుద్ధికాదు

తైత్తిరీయోపనిషత్తులోని పంచకోశ వివరణంలో పేర్కొనబడిన 'విజ్ఞానం' బుద్ధికాదు. బుద్ధిగా దానిని అన్వయించడం పొరపాటు. విజ్ఞానమంటే, బుద్ధికి అతీతమగు 'ఋత' మనీ, —ఆధ్యాత్మిక సత్యమనీ, ఆ ఉపనిషత్తునందు సుస్పష్టంగానే వున్నది.

## పూర్ణయోగంలోని "కేంద్ర పురుషుడు."

మనలో, ఇతరమునకెల్ల ఆధారమైవుంటూ, జననమరణములందెల్ల శేషించి యుండెడి ఈశ్వరాంశమునే పూర్ణయోగము 'కేంద్రపురుష' నిగా పేర్కొనుచున్నది. ఈ కేంద్రపురుషునికి రెండు రూపములు. పైన జీవాత్మ, క్రింద చైత్య పురుషుడు.

## జీవాత్మ - చైత్యపురుషుడు

జీవాత్మ మన నిజస్వరూపం. అది దేహమనఃప్రాణములతో కూడిన ఈ జీవితాభివ్యక్తికి పైగా, దానికి అధ్యక్షస్థానం వహించి వున్నది. దేహ మనఃప్రాణములకు ఊతగా వుంటూ ఈ జీవితాభివ్యక్తికి వెనుకగా నిలిచియుండునది చైత్యపురుషుడు.

## చైత్య పురుషుని సహజ భావన

తనను ఈశ్వర పుత్రునిగా, భక్తునిగా భావించుకొనడం చైత్య పురుషుని సహజలక్షణం. వస్తుతః అతడు ఈశ్వరునిలో భాగమే. కాని అభివ్యక్తి నిమిత్తంగా జరిగెడి లీలలో, తాదాత్మ్యభావమందు సైతం ఇచట ఒక విధమైన భేదస్థితి ఉన్నది.

## జీవాత్మ స్థితి

జీవాత్మస్థితి చైత్యపురుషుని స్థితికంటె భిన్నమైనది. పరమేశ్వరుని తోడి యేకత్వ భావనలో జీవాత్మ నిమగ్నమై, లీనమై పోగలదు. అయిననూ అభివ్యక్తి నిమిత్తమైన లీలకు అధ్యక్షత వహించునపుడది తానే సాక్షాత్తూ పరమేశ్వరుడని భావించు కొనక, బహుళ రూపుడగు పరమేశ్వరుని ఒకానొక కేంద్రంగా తనను తాను భావించుకొనును.

## గుర్తుంచుకోవలసిన విశేషం

అభివ్యక్తి నిమిత్తమైన లీలకు అధ్యక్షత వహించునప్పుడు జీవాత్మ తానే సాక్షాత్తూ పరమేశ్వరుడనని భావించుకొనక, పరమేశ్వరుని అనంత కేంద్రములలో తానొక కేంద్రముగా భావించుకొను ననుటలోగల విశేషమును బాగుగా గుర్తించుకోడం అవసరం. ఏలనంటే, అహంకార లేశం ఏమాత్రమున్నా సాధకుడు తానే అవతారమని తలపోయ నారంభించడం జరుగవచ్చు.

## జీవాత్మ లక్షణం

వ్యక్తిత్వసహితమై జన్మపరంపరద్వారా జీవుని వికాసమునకు ఆధార

ఘాతమై యుండునది జీవాత్మ. ఇది సనాతనమైన ఈశ్వరాంశమని గీతలో అలంకారికంగా వర్ణించబడివున్నది. అంశమంటే విభాగం కాదు. విభాగకల్పన రూపమునకు వర్తిస్తుంది కాని, రూపరహితమైన ఆత్మకు వర్తించదు.

## జీవాత్మ - చైత్యపురుషుడు

సృష్టికి పూర్వమే పరమేశ్వరుడు నానాకేంద్ర విలసితుడై ఉన్నాడు. సృష్టిలోని జీవుని ఆత్మగా జీవాత్మగా ఆ పరమేశ్వరుడే అభివ్యక్తమవుతున్నాడు. జీవాత్మకు మార్పు, వికాసం అనేవి ఉండవు. జీవాత్మస్థితి వాటికీ అతీతమైనది. సృష్టివికాస లీలలో జీవాత్మకు ప్రాతినిధ్యం వహిస్తూ ఇతర ప్రకృతికెల్ల ఆధారభూతమైయుండు చైత్యపురుషునికి మాత్రమే వికాసమనేది ఉంటుంది.

## సృష్టి వికాసక్రమం

సృష్టి వికాస క్రమంలో క్రమ వికాసము నొందుచుండెడి ఆత్మచైతన్య రూప విశేషమే చైత్యపురుషుడు. జడంలో తొలుత ప్రాణం, పిమ్మట ప్రాణంలో మనస్సు వికాసము నొందినది ఈ వికాసక్రమము ననుసరించియే. ఇదే రీతిని క్రమంగా తుదకు మనస్సులో అధిమనస్సు, అధిమనస్సులో అతీతమనస్సు (విజ్ఞానం) వికసించవలసియున్నది.

## పరాపర ప్రకృతులు

అపరాప్రకృతి, పరాప్రకృతి—అని ప్రకృతి రెండు విధములు. విశ్వలీలలో ఈ దేహప్రాణమనస్సులను అభివ్యక్తమొనరించు బాహ్యప్రకృతియే అపరాప్రకృతి. దాని వెనుక దాగియున్న పరాప్రకృతి

సాక్షాత్తూ పరమేశ్వరుని చిచ్ఛక్తియే. దానివలననే, అనంత కేంద్రవిల సితుడగు పరమేశ్వరుడు అనేకముగా అభివ్యక్త మవుతున్నాడు, ఆ అనేకమే నిత్యములైన జీవాత్మలు.

## పరాప్రకృతి-జీవాత్మలు

పరమేశ్వరుని పరాప్రకృతియందు, అనేకము నిత్యాత్మల రూపంలో స్వతస్సిద్ధంగా భాసిస్తూ వున్నది. జగల్లీలలో ఇవియే క్షరపురుషుడుగా పేర్కొనబడు భూతజాలపు వికాసక్రమమునకు ఆధారమైన జీవాత్మలుగా ప్రతీయమాన మగుచున్నవి.

## జీవాత్మలు - జీవరాసులు

జీవాత్మలు సృష్టితో సంబంధం కలిగివున్నా, వాటికి అతీతములు, సృష్టియందలి నర,మృగ, పక్షి, సరీసృపములు వేరు, వాటి యందలి ఆత్మలు వేరు. ఆత్మ ఎన్నడూ నరుడుగాని, మృగముగాని, పక్షిగాని, సరీసృపముగాని కాక, ఈ మార్పులయందెల్ల తా నెట్టి మార్పూ లేనిదై విరాజిల్లుతున్నది.

## "పరాప్రకృతిర్జీవభూతా"

సనాతనమైన సద్వస్తువు తన పరాప్రకృతియందు ఏకకాలముననే ఏకము, అనేకము కూడ. సనాతనమైన ఈ అనేకత్వమే జగల్లీలలో సర్వభూతములకూ వెనుక నిలిచినపుడు జీవాత్మగా తోచుచున్నది (అగుచున్నది). 'పరాప్రకృతిర్జీవభూతా' అని వర్ణించినది దీనినే.

## జన్మలేని జీవాత్మ

జన్మ పరంపరకు అధ్యక్షత వహించునది జీవాత్మ. స్వతః దానికిమాత్రం జన్మలేదు. ఏలనంటే, జన్మించే జీవికి అది ఊర్ధ్వమున నుండునేగాని లోనికి అవరోహించదు. ఊర్ధ్వమున నుండియే అది దేహ ప్రాణ మనోమయ జీవిని ధారణ చేస్తుంది.

## చైత్యాత్మ

జీవాత్మ వేరు, చైత్యాత్మ వేరు. జీవాత్మవలె జీవికి ఊర్ధ్వమునగాక. హృదయస్థానం వెనుక దేహ ప్రాణ మనస్సులకు ఆధారంగా చైత్యాత్మ వుంటుంది. కాని, దేహ ప్రాణ మనస్సులచేనది విశేషముగ ముసుగుపడియున్న హేతువుచే, సాధనయందు కొంత ఉత్తీర్ణత లభించిన పిమ్మట గాని దేహ ప్రాణ మనస్సులపైన దాని ప్రాభవం వ్యక్తం కానేరదు.

## జీవాత్మ ప్రతినిధులు

జన్మము, పరిణామము లేని జీవాత్మ జన్మపరిణామముల కధ్యక్షత వహిస్తూ ప్రతి చేతనాభూమిక యందూ తన ప్రతినిధిని నిలుపుతుంది. అన్నమయ, ప్రాణమయ, మనోమయ పురుష లిట్టి ప్రతినిధులే. అజ్ఞానంలో ఉన్నంతకాలం ప్రతిజీవి తాను ప్రధానంగా నివసించే భూమికను బట్టి ఒక్కొక్క పురుషుని ఆశ్రయించుకొని వుంటాడు. జీవాత్మకు నిక్కమైన ప్రతినిధి మాత్రం అన్న ప్రాణమనో భూమికలకు వెనుక మరుగు పడియున్న చైత్యపురుషుడే.

## చైత్యపురుషుడు సాధన చేపట్టేస్థితి

అంతర్జ్ఞానోదయం కలుగ నారంభించుసరికి మనలోని చైత్య పురుషుని మనం తెలుసుకో గలుగుతాము. చైత్యపురుషుడే ముందుకువచ్చి సాధనను స్వయంగా నడిపిస్తాడు. ఎవరి ప్రతినిధిగా చైత్యపురుషుడు హృదయ స్థానమున నున్నాడో అట్టి జీవాత్మను సైతం మనం తెలుసుకో గలుగుతాము.

## పూర్ణయోగ లక్ష్యం

శిరస్సుపైనగల ఆధ్యాత్మిక భూమికలలోనికి ఆరోహించడం, శిరస్సుపైననే స్థిరవాస మేర్పరచుకొనడం పూర్ణయోగ లక్ష్యసాధనకు ముఖ్యంగా కావలసియున్నది. ఏలనంటే, శిరస్సు పైనగల విజ్ఞానమయ చేతనానుసారంగా పురుషుని పూర్ణవిమోచనం, పూర్ణ పరివర్తనం సాధించడమే కదా పూర్ణయోగ లక్ష్యం ?

## లక్ష్యం-సాధన విధానం

అంతర్గమనం, ఊర్ధ్వగమనం.—ఈ రెండూ లేనిదే పూర్ణయోగ లక్ష్యసిద్ధి కరతలామలకం కానేరదు. ఈ సాధన విధానం ఉపనిషదాది గ్రంథాలలో సూత్రప్రాయంగా వున్నదేగాని కొత్తదికాదు. ఈ యోగలక్ష్య మామోదించినవారు తప్ప యితరు లీవిధానం ఆమోదించవలసిన పనిలేదు.

## శిరస్సుపైన చేతనా ప్రతిష్ఠ

అంతః ప్రకృతినెల్ల అవలోకన మొనర్చి, ఊర్ధ్వమునకు ఆరోహించడం

ద్వారా చేతనను శిరస్సుపైన ప్రతిష్ఠించడం జరిగినప్పుడు సాధకుని దృష్టే పూర్తిగా మారిపోతుంది. వస్తుజాత మచట క్రిందనుండి చూచి నప్పుడు కనిపించే మాదిరిగా కనిపించదు,

## జీవాత్మ స్వరూపం

తాను జన్మలేనిదై, జన్మలెత్తెడి వ్యక్తివికాసమునకు అధ్యక్షత వహించు నది జీవాత్మ. వ్యక్తితోడను, వ్యక్తివికాసముతోడను సంబంధం కలిగి వున్నా వాటికి అతీతమైనది. స్వభావతః తనను వ్యక్తిగనేగాక సర్వగత, సర్వాతీతముగా నెరుంగునది. తనమూలము, తన నిజతత్వము, తన ఏడుగడ-సమస్తమూ పరమాత్మయేయని గుర్తించునది.

## జీవాత్మ చైతన్య స్థితి

పరమాత్మలో నిత్యమూ నిమగ్నమై ఆయనతో ఏకత్వం భజించివుం టుంది జీవాత్మ. తనశక్తి, తన అభివ్యక్తి ఆ పరమాత్మదే. తనకు ఆధారం ఆ పరమాత్మయే అని ప్రేమానంద పారవశ్యమున మునిగి తేలడం దాని లక్షణం. దాని చైతన్యస్థితి మనోమయ చైతన్య స్థితికంటే అతీతం.

## జీవాత్మ అనంతత్వం

అనంతమగు బ్రహ్మచైతన్యమే జీవాత్మ చైతన్యంకూడ. తత్వంచేతనే గాక శక్తిచేసైతం అది అనంతమే. అన్నీ తాననెడి ఎరుక కలిగివుండీ కూడ తాను తానుగానే తేజరిల్లుతూ వుంటుంది.

## జీవాత్మానుభూతి

జీవాత్మానుభూతిని విశుద్ధమైన 'నేను'గా అభివర్ణించడం బొత్తుగా చాలదు. 'నేను' అనే పదంలో వేరుతనపు అహంవృత్తి ధ్వని అంతర్గతంగా వున్నది. జీవాత్మ దర్శనంలో ఈ వేరుతనం లేదు. జీవాత్మగానున్న పురుషుడు ఏకము, అద్వితీయమైన బ్రహ్మస్వరూప మండలి యొక శక్తి కేంద్రం

## జీవాత్మ, దాని ప్రతినిధులు

అన్న, ప్రాణ, మనోమయ పురుష రూపమునను, హృదయ కేంద్రమున చైత్యపురుషరూపమునను వ్యష్టి ప్రకృతిని ధారణచేయునది జీవాత్మ ప్రతినిధియైన శక్తి విశేషమే. కావుననే ఈ పురుషులే జీవాత్మయని భావించుట కవకాశమున్నది. సమగ్రము, శక్తిమంతమునైన ఆత్మజ్ఞానానుభూతి నభిలషించెడి సాధకుడు ఈ భేదమును చక్కగా గుర్తించడం అవసరం.

## జీవాత్మ, చైత్యపురుషుడు

జననమప్పుడు శరీరమున ప్రవేశించునది, మరణ మప్పుడు శరీరము నుండి నిర్గమించునది జీవాత్మ ప్రతినిధియైన చైత్యపురుషుడు. పైనుండి యీ పురుషాభివ్యక్తిని ధారణచేయు జీవాత్మకు మాత్రం జన్మలేదు. జీవాత్మ చైత్యపురుష రూపమున జన్మయెత్తుతున్నదని చెప్పినా చెప్పకోవచ్చుగాని. రెండింటికిగల భేదం గుర్తించనిచో ఆత్మస్వరూపం సరిగా తెలియక తికమక యేర్పడుతుంది.

## జీవాత్మానుభూతి సహజ లక్షణాలు

ప్రకృతి కార్యముల పరిణతికి ఆధారభూత మౌతూనే వాటియం దేమాత్రమూ తగులువడక వాటి కతీతమై యుండు జీవాత్మానుభవం కలిగి నప్పుడు, విశాలత, నీరవత, విశుద్ధత, స్వతంత్రత, ప్రభుత, విశ్వాత్మ భావుకత, మొదలైనవి ఆ అనుభూతికి సహజ లక్షణములుగా దీపి స్తాయి,

## చైత్యపురుషానుభూతి

హృదయ కేంద్రమునకు వెనుకవుంటూ దేహ, ప్రాణ, మనస్సుల ప్రకృతి పరిణామమునకు ఆధారభూతమైయుండే చైత్యపురుషుని అను భవము కలిగినప్పుడు, భక్తిభావం, ఆత్మార్పణ బుద్ధి. సకలప్రవృత్తులను ఈశ్వరాభిముఖంగా త్రిప్పడం, సత్యం, శివం, సుందరములనే వరించి తద్వ్యతిరిక్తములైన వాటిని త్రోసిపుచ్చడం, ప్రేమ సహానుభూతుల ద్వారమున సకల భూతములతో తాదాత్మ్యభావన మొదలైనవి ఆ అను భూతికి సహజ లక్షణములై ప్రకాశిస్తాయి.

## అహంకార కల్పన

బాహ్యచేతనను కేంద్రీకరించి దానికి వ్యక్తిత్వ మిచ్చుటకై అహంకార మనుదానిని ప్రకృతి కల్పన చేసినది, ఈ అహంకారం దేహ ప్రాణ మనస్సులు మూడింటి యందునూ ఏక కాలమున వ్యవస్థితమై యున్నది. మనలోని నిక్కమైన పురుషుని మనం గుర్తించగలిగినప్పుడు దీని అవ సరమిక లేదు గనుక ఇది అంతరించడం అవసరం. దీని స్థానమున ఆ నిక్కమైన పురుషుని స్ఫూర్తియే మనకుంటుంది.

మనలోని నిక్కమైన పురుషుని ఆత్మగానూ, అంతరాత్మగానూ, అనగా జీవాత్మగానూ చైత్యపురుషునిగానూ, రెండువిధాలుగానూ తెలుసుకోవచ్చు. మొదట జీవాత్మను తెలుసుకొని పిమ్మట చైత్యపురుషుని తెలుసుకోడమున్నది, మొదట చైత్యపురుషుని తెలుసుకొని పిమ్మట జీవాత్మను తెలుసుకోడమున్నది, పూర్ణయోగ సాధనకు ఈ రెండు అనుభూతులూ ఆవశ్యకములే.

## పరాపర ప్రకృతులలో ఆత్మాభివ్యక్తి

ఏకమైన బ్రహ్మములో నానాత్వం నిత్యగర్భితమై వున్నది. దాని అభివ్యక్తియే పరాప్రకృతి రూపమైన జీవాత్మ. అది ఆ పరబ్రహ్మపు సనాతనాంశ. అపరాప్రకృతియందా సనాతనాంశయే ఆత్మజ్యోతిస్ఫులింగముగా గోచరించి, దేహప్రాణ మనోనశ్చైతన్య వికాసమున కాధారభూతమవుతున్నది. జ్యోతిగా వర్ధిల్లిన ఆ స్ఫులింగమే చైత్యపురుషుడు.

## విభిన్నరూపాలలో ఒకే వస్తువు

పరాప్రకృతియందలి జీవాత్మ. అపరాప్రకృతియందలి ఆత్మస్ఫులింగము చైత్యపురుషుడు..ఈ మూడూ ఒకేవస్తువు యొక్క విభిన్నరూపాలు. సాధకుడు వీటిని కలగాపులగం చెయ్యరాదు. అలా చేసేయెడల అతని అంతరంగికానుభూతి విస్పష్టతను కోల్పోయి తికమక యేర్పడుతుంది.

## చైత్యపురుష వికాసం

జీవాత్మవలె అంతరాప్రకృతికి అతీతస్థాయిలో నుండక, సృష్టివికాసక్రమమునకు ఆధారభూతంగా అపరా ప్రకృతిలోనికి దిగివచ్చేది ఆత్మస్ఫులింగం సకల జీవరాసులలోనూ వున్నది. వికాసక్రమంలో ఆ ఆత్మస్ఫులింగముచేత రూపొందించబడినదే చైత్యపురుషుడు. మొదట ఈ చైత్యపురుషుడు దేహ ప్రాణ మనస్సులచే మరుగుపడియుండి, వికాసము పొందిన మీదట ముందుకు వచ్చి వాటిపై ఆధిపత్యం వహింపనేర్చును.

## చైత్య పురుష ప్రాబల్యం

సామాన్య మానవునిలో చైత్య పురుషుడు దేహ ప్రాణ మనస్సులపై ఆధారపడివుండి వాటిని స్వేచ్ఛగా ఉపయోగించలేని స్థితిలో వుంటాడు. సాధనవలన చైత్య పురుషుడు దేహప్రాణ మనస్సులపై ప్రాబల్యం వహించగల స్థితికి వచ్చినప్పుడు, పశుత్వ మానవత్వ లక్షణోపేతంగా అంతవరకూ నడిచిన జీవితం దివ్యత్వాన్ని సంతరించుకో నారంభిస్తుంది. దేహ ప్రాణ మనస్సుల విమోచనమే కాక దివ్య పరివర్తనం సైతం కడకు సాధ్యపడుతుంది.

## జీవిత పరివర్తనము : చైత్యపురుషుడు

జననమరణములకు అతీతమై, విశ్వాత్మతో తాదాత్మ్యం చెందివుండు జీవాత్మానుభూతి ముక్తిభావాన్ని ప్రసాదిస్తుంది. జీవితము, అవరప్రకృతి పరివర్తనం చెందాలంటే మాత్రం చైత్యపురుషుడు నేల్కొని ప్రకృతిని పరిపాలించడం అవసరం. చైత్యపురుషుడు జీవాత్మతో తాదాత్మ్యభావం కలిగి వుంటున్నా జీవాత్మగా మారిపోడు.

## ఆత్మ, పురుష ప్రకృతులు

యోగానుభవంలో ఆత్మ పరమాత్మలు వస్తుతః ఒక్కటే. లేక, పరమాత్మ అంశమే ఆత్మ. అభివ్యక్తియందు మాత్రం ఇది పురుషుడు, ప్రకృతి అను రెండు రూపాలు ధరిస్తున్నది. ప్రకృతియందు పరమాత్మ ముసుగుపడి యున్నాడు. అవిద్యారూపమైనది అవర ప్రకృతి. పురుషుడు వస్తుతః దివ్యుడైనా అవర ప్రకృతియందు బహిర్ముఖుడై బాహ్య రూపమున దానికి వశుడుగా ఉంటున్నాడు.

## ఆత్మ, చైత్యపురుషుడు

పరాప్రకృతి యందలి జీవాత్మకు ప్రతినిధిగా సృష్టి వికాస క్రమంలో అవరా ప్రకృతియందు ప్రవేశించిన ఆత్మయందు దివ్యత్వమెల్ల గర్భితమై వున్నది. అట్టి ఆత్మకు ప్రతినిధిగా రూపొందించబడిన చైత్య పురుషుడు మాత్రం తొలుత ప్రకృతి దోషములతో కూడియుండి, ప్రకృతియందే క్రమ వికాసము నొందుచూ తుదకు నిజతత్వమును గుర్తించి జీవాత్మతో ఏకత్వమును భజింపనేర్చును.

## వివిధ భూమికలలోని పురుషులు

పురుషుడంతటా ఒక్కడే. కాని, ప్రకృతియందలి ఒక్కొక్క భూమికలో అతడు ఆ భూమిక స్వభావాన్నిబట్టి ఒక్కొక్క రూపం ధరిస్తున్నాడు. మనోమయ, ప్రాణమయ, అన్నమయ పురుషులు యిట్టి రూపములే. తైత్తిరీయోపనిషత్తు మరిరెండు భూమికలలలోని పురుషులను గూర్చి పేర్కొన్నది. కాని, ఆ భూమికలు మనస్సున కతీతమైన పరచేతనకు సంబంధించినవి. వాటి ప్రభావ విశేషములు క్రిందికి ప్రసరిం

చెడుమనేది వుంటూవున్నా, వాటి స్వభావం మాత్రం యిచట ఈ క్రింది భూమికలలో యింకనూ వ్యవస్థీకరించబడలేదు.

## పరాశక్తియెడ భక్తి ఆవశ్యకత

శక్తిమంతమైన సిద్ధిని సాధించడానికి ప్రకృతి బంధమునుండి పురుషుని విముక్తు నొనరించుటొక్కటే చాలదు. అజ్ఞాన శక్తుల ఖేలనకు తావలమైన అపరాప్రకృతియెడ పురుషునికుండే భక్తిని జగన్మాతయైన పరాశక్తియందు నిష్ఠం చేయడం అత్యంతావశ్యకం.

## అపరాప్రకృతి జగన్మాత కానేరదు

అపరా ప్రకృతినే పరాప్రకృతియైన జగన్మాతనుగా భావించడం తప్పు. అపరా ప్రకృతి అనునది అవిద్యా సృష్టి, వికాస కార్యకలాపం నిమిత్తమై రూపొందించబడిన ఒక యంత్రవిశేషం మాత్రమే. అన్న, ప్రాణ, మనోమయ పురుషుడు ఈశ్వరుని వలన ఏర్పడినవాడైనా ఈశ్వరుడెట్లు కానేరడో అట్లే అపరా ప్రకృతి చిచ్ఛక్తి రూపిణియైన పరాప్రకృతి కానేరదు. పూర్ణసిద్ధికి మన మాశ్రయించవలసినది ఆ పరాప్రకృతినే.

## పురుషచేతనోపలబ్ధి

ప్రశాంతమూ, బంధరహితమూనై గుణప్రవృత్తులలో తగులు వడక వాటిని అనాసక్తితో తిలకిస్తూవుండే పురుష చేతనోపలబ్ధి ముక్తిసాధన కొక ఉపాయం. ఆ ప్రశాంతిని, అనాసక్తతను, ఆత్మరతిని మనస్సులోనికేగాక, ప్రాణ, అన్నమయ భూమికలలోనికి కూడా తీసుకొని రావడం. అవసరం అలా తీసుకొని వచ్చినప్పుడే ప్రాణేంద్రియోద్వేగము లిక నిన్నేమి చేయజాలవు.

దివ్యజ్ఞానానంద క్రియాశక్త్యవతరణం

ప్రశాంతి, అనాసక్తి, ఆత్మరతి,- ఇవి మనః ప్రాణ అన్నమయ భూమికలలోనికి దిగిరావడం పరాశక్తి తొలి అవతరణంమాత్రమే. దీని తర్వాత దివ్యజ్ఞానానంద క్రియాశక్త్యవతరణం జరగవలసి యున్నది. ఎంతటి సత్వగుణ సంపన్నమైనా అపరాప్రకృతియందిట్టి దివ్యత్వం భాసింపనేరదు.

## పరాపర ప్రకృతులు

జగముల రూపొందించి నడిపే చిచ్ఛక్తి బాహ్యరూపమే ప్రకృతి. ఈ బాహ్యరూపం గుణాదుల విలసనతో యిచట యంత్రప్రాయంగా గోచరిస్తున్నది. అపరాప్రకృతి, పరాప్రకృతి అని ప్రకృతి రెండు విధములు. అవిద్యావశమై ఈశ్వరుని ఎరుకలేకుండే మనఃప్రాణ దేహముల ప్రకృతి అపరా ప్రకృతి. అవిద్యారహితమై ఈశ్వరుని ఎరుక నిత్యమూ కలిగి విజ్ఞానశక్తియుతమైన సచ్చిదానంద ప్రకృతి పరాప్రకృతి.

## ఆరోహణావరోహణలు

అజ్ఞానంలో వున్నంతకాలం మానవుడు అపరాప్రకృతికి వశుడుగానే వుంటాడు. ఆధ్యాత్మిక వికసనం ఫలితంగా అతడు పరాప్రకృతిని గురించిన ఎరుకగలిగి దాని సంస్పర్శ పొందడానికై ప్రయత్నిస్తాడు. పరాప్రకృతిలోనికి అతడు ఆరోహించడం, అతనిలోనికి పరాప్రకృతి అవరోహించడం—ఈ రెండునూ జరగడానికి వీలున్నది. ఇట్టి ఆరోహణావరోహణలే మనఃప్రాణదేహముల అపరాప్రకృతిని రూపాంతరం చెందించ గలుగుతాయి.

## చైత్యపురుషుడు

మన హృదయకోశం వెనుకనున్న చైత్య పురుషుడు ఈశ్వరాంశ. అయితే, మనస్సున కతీతమైన విజ్ఞానకోశంతో సాక్షాత్సంస్పర్శ చైత్య పురుషునికి ఉంటుందనరాదు. జంతువులయందు, మానవులలో అత్యధిక సంఖ్యాకులయందు ఇట్టి సంస్పర్శను కానము. కాని, మానవ చేతనకు విజ్ఞాన భూమికతో సంస్పర్శ ఏర్పడు స్థితివచ్చినప్పుడు, దేహ, ప్రాణ మనస్సుల కంటె విశేషంగా అట్టి సంస్పర్శకు ప్రతిస్పందింప సిద్ధమై యుండునది చైత్య పురుషుడే.

## చైత్యపురుషస్థానం

మనఃప్రాణములు వేరు, చైత్యపురుషుడు వేరు. హృదయ స్థానమున మనః ప్రాణములు కలిసే చోట వాటికి వెనుకగా చైత్యపురుష డున్నాడు. మానవులు సామాన్యంగా హృదయమని పిలుచునది భావావేశ ముల స్థానము. మానవ భావావేశములు తరచుగా మనఃప్రాణ ప్రవృత్తు లేగాని. చైత్యపురుష ప్రేరితములు కావు.

## చైత్యపురుషశక్తి

మనః ప్రాణములకంటె వేరై, వాటివెనుకనున్న ఆత్మయే చైత్య పురుషుడు, మరుగుపడియున్న ఈ చైత్యపురుషశక్తి వెలికి వచ్చి నప్పుడు మనఃప్రాణ దేహములను ప్రభావితం చెయ్యగలదు. మన ఆలోచనలను, భావావేశములను, ఇంద్రియానుభూతులను, కర్మకలా పములను విశుద్ధ మొనరించ గలదు.

## చైత్యపురుషుడు చిత్తముకాదు

చైత్యపురుషుడు చిత్త మెంతమాత్రమూ కాదు. మన బాహ్య చేతనకు సంబంధించిన తత్త్వవిభాగము (బుద్ధి, మనస్సు, చిత్తము, ప్రాణము వగైరా) లోనిది చిత్తము. దీనిని తెలియుటకు మన బాహ్యప్రకృతిని గడచి ఆవలకు పోనక్కరలేదు. చైత్యపురుషతత్త్వము కేవలము మరి యొక తత్త్వవిభాగము (అన్నము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము, చైత్యపురుషుడు) లోనిది, మన బాహ్యాభ్యంతర ప్రకృత్తులు రెండునూ ఈ విభాగములో చేరియున్నవి.

## చైత్యపురుషుని వలన జరిగే దోహదాలు

చైత్యపురుషుని వలన ప్రధానంగా అయిదు విధములైన దోహదం సాధకునకు కలుగుతుంది. (1) పరమేశ్వరుని యెడ అహేతుక భక్తి (2) అంతరంగంలో జగన్మాత సంస్పర్శ, సన్నిధి, (3) సర్వతో భద్రమైన మార్గదర్శకత్వం, (4) అన్న, ప్రాణ, మనోమయ ప్రవృత్తుల విశుద్ధి, (5) ఊర్ధ్వమునుండి ఉన్నతాధ్యాత్మిక చైతన్య మవరోహించుటకు వీలుగా అపర చైతన్యం త్రోవ యిచ్చేటట్లు చేయడం.

## ఆరోహణమునకు ఉత్తమపద్ధతి

సాధకుడు తన చేతనను మనః ప్రాణములనుండి పైకి ఆరోహింపజేసి పైనుండి శక్తిని, తేజస్సును, జ్ఞానమును, ఆనందమును క్రిందికి గొనితే వచ్చు ననుమాట నిజమే. కాని, యిది మిక్కిలి కష్టముతో కూడిన దగుటయే గాక, తగిన సత్వశుద్ధి లేనప్పుడు అపాయకరముకూడ. ఈ

నిమిత్తమైన ఆరోహణము చైత్య పురుష సమేతముగ జరుగుటయే ఉత్తమపద్ధతి.

## చేతనను చైత్యపురుష వశమొనర్చే ఉపాయం

కామప్రధానమైన ప్రాణమయ పురుషునికీ, మనోమయ పురుషునికీ వశమై వర్తిలుచుండెడి మానవచేతన చైత్యపురుషునికి వశమైవర్తిలునట్లు చేయవలెనంటే, సామాన్యచేతననుండి మనలోలోతులలోనికి ప్రవేశింప నేర్చుకోడం అవసరం. పూర్ణయోగపు ప్రధాన లక్ష్యములలో ఇది ఒకటి. ప్రాణమయ పురుషుడు చేతనకు ఉపకరణం కావలెనుగాని ఏలిక రాదు.

## అహంకార స్వరూపం

అహంకారం ప్రాణమయ పురుషుడు కాదు. అది మన దేహ, ప్రాణ, మనస్సులు మూడింటికీ సంబంధించిన బాహ్యసత్తతో తాదాత్మ్యం చెంది యున్నది. ఈ బాహ్యసత్తయే తాననుకొనుచు, ఊర్ధ్వమున మన నిజాత్మస్వరూపమును, అంతరమున మన చైత్యపురుష స్వరూపమును తెలియకుండుట దాని లక్షణం.

## అంతస్సత్తలోనికి ప్రవేశించడం అవసరం

చైత్యపురుషుడు, మనోమయ పురుషుడు, ప్రాణమయ పురుషుడు, అన్నమయ పురుషుడు—ఈ పురుషులందరూ ఒక విధంగా ఆత్మయొక్క విస్తరణలే. కాని, మన యథార్థస్వరూపం మనకు తెలియవలెనంటే,

మన బాహ్యసత్తనుండి అంతస్సత్తలోనికి మనం ప్రవేశింప నేర్చు కోడం అవసరం.

## నిక్కమైన అన్నప్రాణమనోమయ పురుషుడు

అవిద్యావశమైన బాహ్యసత్తయందు అన్న, ప్రాణ, మనోమయ ప్రకృతికార్య ప్రాబల్యంచేత పురుష స్వరూపం ఒక విధంగా వికృతమై కన్పట్టుతుంది. దీని వెనుక అంతస్సత్తయందు ప్రచ్ఛన్నమైయుండే మన నిక్కమైన అన్న, ప్రాణ, మనోమయ పురుష స్వరూపం మనకు తెలియదు. జ్ఞానోపలబ్ధి కలిగే పర్యంతమూ అన్న ప్రాణ మనోమయాహంకారమునే మన నిజ స్వయాపంగా మనం తలపోస్తూ వుంటాము.

## ఆత్మ - చైత్యపురుషుడు

ఆత్మ, చైత్యపురుషుడు వస్తుతః ఒక్కటే. చైత్యపురుషుడు వికసించని వస్తుజాతమందుకూడా ఆత్మయని పిలువదగిన పరమాత్మ జ్యోతిస్ఫులింగమున్న హేతువుచే రెంటిని వేర్వేరుగా పేర్కొనడం జరుగుతున్నది. సృష్టి వికాసక్రమంలో ఆ జ్యోతి స్ఫులింగం చెందిన వికసనమే చైత్యపురుషుడు, లేక హృత్పురుషుడు.

## ప్రకృతి పురుషులు

ప్రకృతి పురుష విభాగం సాంఖ్య సిద్ధాంతంలోనిది. ప్రకృతి కార్యములను సాక్షిగా తిలకించే చైతన్యం పురుషుడు. కర్తృత్వాహంకారం విడనాడినప్పుడు సకల కర్మలూ ప్రకృతే చేస్తున్నదనెడి అనుభవం కలుగుతుంది, ఇదీ ప్రకృతి పురుషతత్వజ్ఞానం. అయితే, ఈ పురుషుడు

వేరు, చైత్యపురుషుడువేరు. ఈ పురుషుడు 'మనోమయ పురుషః ప్రాణ శరీరనేతా' అని ఉపనిషత్తు వర్ణించిన మనోమయుడు.

## మనోమయ పురుష, చైత్యపురుష కార్యములు

మనోమయ పురుషుడే నీలో జరిగేది అంతా తిలకిస్తూ, పరిశీలిస్తూ, నిర్ణయాలు చేస్తూవుంటాడు. చైత్యపురుషు డీ రీతిగా సాక్షివలే తిలకిస్తూ పరిశీలన చేయడు. సహజమైన తన దివ్యస్ఫూర్తి చేతనే సాక్షాత్ జ్ఞానంతో దీపిస్తూ తన ప్రచ్ఛన్న స్థితినుండి ముందుకు వచ్చినప్పు డెల్ల నీలోని సత్ప్రవృత్తులనూ, అసత్ప్రవృత్తులనూ, సద్యఃకాలంలో ప్రకాశింపచేస్తూ ఉంటాడు.

## మానవ సత్తయందలి తత్వవిభాగములు

మానవసత్త ఈ క్రింది తత్వములతో కూడుకొని యున్నది;— (1) అన్నిటికీ ఆధారభూతముగా లోలోపల వసించియున్న చైత్యపురుషుడు. (2) ఆ పురుషునికి ఈవలగా అంతస్సత్త యందు మనఃప్రాణ అన్నమయ పురుషులు, (3) ఆ పురుషుల అభివ్యక్తికి ఉపకరణముగా బాహ్యసత్తయందు మనఃప్రాణ దేహ ప్రకృతి. కాని, ఈ అన్నింటికి పైగా, అన్నింటినీ తన అభివ్యక్తికి ఉపకరణంగా ఉపయోగించుకొను ఈశ్వరాంశమైన జీవాత్మ ఉన్నది.

## నిక్షిప్తమైన ఆధ్యాత్మిక ప్రాభవ ప్రతిష్ఠ

ప్రాణమయ, మనోమయాహంకార ప్రధానుడై మెలగు బాహ్యమానవునికి అతని నిజస్వరూపం మరుగుపడి వుంటుంది. ఊర్ధ్వమునగల

జీవాత్మకు సాక్షాత్ప్రతినిధిగా అంతరాంతరమున నుండెడి చైత్యపురుష తత్వం వికసించినప్పుడే, తన జీవాత్మ చైతన్యస్పర్శ నాతడు పొంద నారంభిస్తాడు. ప్రకృతి వ్యాపారములను జీవాత్మ చైతన్యం తన సంకల్ప శక్తిచే నియమించ దొడగినప్పుడుకాని, మానసిక, నైతిక ప్రాభవము లను సైతం మించి నిక్కమైన ఆధ్యాత్మిక ప్రాభవం అతనియందు ప్రతిష్ఠితం కానేరదు.

## చైత్య, మనోమయ పురుషుల సంబంధం

చైత్యపురుషుడు రాజ్యాంగ బద్ధుడూ, సౌమ్యుడూనైన రాజు వంటివాడు కాగా, అతని ప్రధాని వంటివాడు మనోమయ పురుషుడు. ప్రకృతి తన వ్యాపారములకు ఈ మనోమయ పురుషుని ఆమోదమునే పొంద జూస్తూ వుంటుంది. మనోమయ పురుషుడు 'ప్రాణ శరీరనేత' అని ఉపనిషత్తు పేర్కొనిన ఈస్థితి మానవదశకు మాత్రమే చెల్లుతుంది. జంతుదశలో ప్రాణమయ పురుషుడు మనశ్శరీరనేత.

## సాధనలో ముఖ్యంగా జరగవలసినది

విభిన్న వ్యక్తిత్వాలతో కూడిన అనేక తత్వ విభాగాలు మానవసత్తలో ఉన్నవి. ఒక కేంద్రపురుషుని ప్రధానంగా వికసింపజేసుకొని అతనితో తక్కిన విభాగములకు సామరస్యం కల్పించుకోడం యోగసాధనలో ముఖ్యంగా జరగవలసిన పని. ఇట్లు వికసింపజేసుకొనే కేంద్ర పురుషుడు చైత్యపురుషుడైతే దరువాతి సాధనలో ఏమంత కష్టముండదు. అట్లుగాక మనోమయ పురుషుడైన పక్షములో ఈశ్వర సంకల్పశక్తితో నిత్యసంస్పర్శ ఆ మనోమయ పురుషునికి లేనియెడల తరువాతి సాధన లో కష్ట మధికం.

## బాహ్యాంతశ్చేతనలు

బాహ్యచేతన, అంతశ్చేతన—అని రెండు విభిన్నచేతనలు సర్వదా మానవసత్తలో ఉన్నాయి. సామాన్యంగా బాహ్యచేతనయందే అతని నివాసం. అంతశ్చేతన మరుగున ఉన్నందువల్ల దానినిగురించి అతని కేమీ తెలియదు. సాధన వలన అంతశ్చేతన విచ్చుకొన నారంభించగా అతడు లోనికి ప్రవేశించి అనేక విధములైన అనుభూతులను పొంద గలుగుతాడు. సాధన ముందుకు సాగినకొలదీ ఈ అంతరారామత్వ మెక్కువై బాహ్యచేతన నిస్సారముగ గోచరిస్తుంది.

## అంతశ్చేతనానుభూతి

అంతశ్చేతనయందు ప్రవేశింప మొదలిడిన ప్రారంభదశలో సాధకునకు అంతశ్చేతన స్వప్నతుల్యము, బహిశ్చేతన వాస్తవమునై గోచరిస్తూ వుంటుంది, క్రమేణా ఇది మార్పుచెంది, అంతశ్చేతనయే వాస్తవము, బహిశ్చేతన స్వప్నతుల్యముగా అతడు చూడగలుగుతాడు. అగాధమైన శాంతికి, వెలుగుకు, ఆనందానికి అంతశ్చేతన నిలయమనే సంగతి అతనికి గ్రాహ్యమవుతుంది.

## బహిశ్చేతన పరివర్తనం

అంతర్బహిశ్చేతనలను రెంటినీ గుర్తించ గలుగుతూవుండే స్థితి సాధనలో ఒక ముఖ్యమైనదశ, ప్రగాఢమైన శాంతికి, వెలుగుకు, ఆనందానికి, ప్రేమకు, ఈశ్వర సాన్నిహిత్య సన్నిధులకు అంతశ్చేతన నిలయ మని సాధకుడు తెలియగలిగిన మాత్రముననే చాలదు. బహిశ్చేతన

కూడా ఈ శాంత్యాది లక్షణములతో నిండారునట్లు దానిని పరివర్తన మొందించుకోడం ఆ తరువాత జరుగవలసిన పని.

## అంతశ్చేతనలోనికి ప్రవేశం

అంతశ్చేతన లోనివారే మనోమయ, అన్నమయ పురుషులు. చైత్య పురుషుడు వీరికంటె లోపలగా నున్నవాడు. చైత్యపురుషుని చేరవలె నంటే వీరిని దాటియే పోవలసియున్నది. అంతశ్చేతనలోనికి ప్రవేశించునప్పు డనేకులు, తొలుత ప్రాణమయ పురుషునిలోనికి ప్రవేశించగా. కొందరు మనోమయ పురుషునిలోనికి, కొందరు అన్నమయ పురుషుని లోనికి మొదటగా ప్రవేశించుటయూ కలదు.

## అంతశ్చేతనలోనికి ఎరుకతో ప్రవేశం

అంతశ్చేతనలోనికి ఎరుకతో ప్రవేశించడం అత్యంతావశ్యకం. అలా ఎరుకతో ప్రవేశించి అంతశ్చేతనయందలి విభాగములను జాగరితం చెయ్యనియెడల, చైత్యపురుషునకు తగిన ఉపకరణములుగా అవి ఉపయోగపడనేరవు. బహిర్మనః ప్రాణశరీరములు కడు సంకుచితములగుటచే ఈ పనికి బొత్తుగా అసమర్థములు.

## అంతశ్చేతన—ఉన్నతచేతన

అంతశ్చేతన యనగా అంతర్మనః ప్రాణ అన్నమయ పురుషులు. వీరికి వెనుకగా లోలోపల ఉన్నవాడు చైత్యపురుషుడు. అంతర్మనస్సు ఉన్నతమనస్సు కాదు. బాహ్యమనస్సు కంటే విశాలమూ, గంభీరమూనై విశ్వశక్తుల సంస్పర్శ కలిగి ఉన్నత చేతనకు అభిముఖం

కాగలిగిఉన్నా వస్తుతః అది బాహ్యమనస్సు వంటిదే. ఉన్నత చేతన లక్షణం దీనికంటె విలక్షణమైనది. ఉన్నతమనస్సు, దీప్తమనస్సు, సంబుద్ధమనస్సు, అధిమనస్సు—ఈ సోపానక్రమమున మనోగతమగు విజ్ఞానమయ చేతన సరిహద్దువరకూ వ్యాపించియుండు తత్వమది.

## చైత్యపురుష విమోచన

అజ్ఞానమయమగు మనఃప్రాణ జడములచే ముసుగువడి యుండుటవలన చైత్యపురుషుడు ప్రస్తుతము అజ్ఞాన ధర్మానుసారముగనే వాటిద్వారా తప్పనిసరిగా వ్యవహరించ వలసి వస్తున్నది. ఈ ముసుగునుండి విమోచన మాతనికి కలిగించినయెడల, స్వీయ ధర్మానుసారముగా అప్పుడతడు అప్రతిహతమైన ఆకాంక్ష, ఉన్నత చేతనతో సాక్షాత్ సంస్పర్శ, అజ్ఞానమయ ప్రకృతిని పరివర్తనమొందింపగల శక్తి సామర్థ్యములతో వ్యవహరింప నేర్చును.

## విశ్వచేతనగా వ్యక్తి విస్తరణ

వరిమితమైన నీ వ్యక్తిచేతన విశ్వచేతనగా (వ్యష్టిచేతన సమిష్టిచేతనగా) విశాలత గాంచుటకు వీలున్నది. అట్లు విశాలత నొందినపు డది ఆ విశ్వచేతనా వ్యాపారముల ఎరుక గలిగి దానితో ఆదాన ప్రదానములు జరుపగలుగుటేగాక. దానితో సమానమై దానిని తనయం దంతర్భూత మొనర్చుకొనగల్గును కూడ. బ్రహ్మాండము నీలోనే ఉన్నదనెడు పూర్వయోగ విధానముల పరిభాషకు అర్థమిదియే.

## విశ్వచేతన

విశ్వచేతన యనగా విశ్వము యొక్క చేతన, విశ్వమునందలి సమస్త

జీవుల, సమస్త శక్తులతో కూడిన విశ్వాత్మయొక్క, విశ్వ ప్రకృతి యొక్క చేతన, వ్యష్టి యెట్లు ప్రత్యేకముగా చైతన్యవంతమో, అట్లే విశ్వమంతయూకూడ సమష్టిగా మరియొక విధమున చైతన్యవంతము. వ్యష్టిచేతన యీ విశ్వచేతనలోని భాగమే అయినా, తాను వేరనెడి భావమే దానియందు కాననగుచుండును.

## విశ్వచేతనతో తాదాత్మ్యం

వ్యష్టి చేతనలో కానవచ్చుననునది చాలవరకు విశ్వచేతననుండి నిరంతరము వచ్చి పడుచుండునదే. కాని, అజ్ఞాన మూలకమైన వేరుతనపు అడ్డుగోడ యొకటి వాటి మధ్యగా నిలిచియున్నది. ఇది కూలిపోవడం జరిగినప్పుడు, విశ్వాత్మను, విశ్వప్రకృతి చేతనను, విశ్వప్రకృతియందు క్రీడించెడి సమస్త శక్తులను వ్యష్టిచేతన భౌతిక వస్తుజాలము నిప్పుడు తెలియగలుగుతున్నమాదిరిగానే తెలియగలుగుతూ, విశ్వాత్మతో తాదాత్మ్యమును పొందుతుంది.

## ఏకం - అనేకం

పరతత్త్వం ఏకమయ్యునూ అనేకం. ఏకనుయొక్క అనేకత్వాంశమే జీవాత్మ. పృథ్వీ ప్రకృతియందు వికాసము చెందుటకై ఆ జీవాత్మ ప్రతినిధిగా ప్రవేశపెట్టబడినదే చైత్యపురుషుడు. అనేకత్వ సహితమైన ఏకముగా తననుతాను జీవుడు తెలియగలుగుటే ముక్తి.

## ముక్తివైవిధ్యం

ముక్తి అనేకవిధాలు, జీవుడు ఏకమునందు నిమగ్నమై అందు దాగుకొనవచ్చు (అద్వైతం). ఏకత్వానుభవం పొందుతూనే అనేకంలో భాగముగా

పరమాత్మతో ఆనందించవచ్చు (భేదాభేదం). అనేకత్వానికి విశేష ప్రాముఖ్య మిస్తూ, పరమాత్మకు శేషభూతుడై వుండవచ్చు (విశిష్టాద్వైతం) నిత్యబృందావనంలో కృష్ణపరమాత్మతో నిత్యక్రీడలు సలుపుతూ వుండ వచ్చు (ద్వైతం). ముక్తుడైకూడా ఇచ్చవచ్చినప్పుడెల్ల విశ్వలీలలో పాల్గొనడానికి దిగివస్తూవుండవచ్చు. పరమాత్మ మానవకల్పిత సిద్ధాంతాలకు కట్టుబడి యుండువాడు కాదు.

## ఆధ్యాత్మిక చేతన

ఆధ్యాత్మికచేతన అనగా నేమి? ఏ చేతనయందు మనము ఆత్మ పరమాత్మల ఎరుకగలిగి, సకలవస్తువులలోను నిజతత్వ మాపరమ సత్య మేననీ ఆ పరమసత్యము నుండియే సమస్త దృశ్యములూ సమస్త శక్తులూ ఆవిర్భవించుచున్నవనీ దర్శించగలుగుదుమో అదియే ఆధ్యాత్మిక చేతన.

## విశ్వచేతన

విశ్వచేతన అనగా నేమి? ఏ చేతనయందు వ్యక్తిగతాహంకార మనశ్శరీర పరిమితు లదృశ్యమై, విశ్వాత్మమయమైన విశాలతయూ, విశ్వ మనః ప్రాణ జడశక్త్యాదుల సాక్షాత్ క్రీడయూ ఎరుకలోనికి వచ్చునో అదియే విశ్వచేతన. అయితే, ఇవన్నియూ సమష్టిగా ఒకేసారి ఎరుకపడవు. విశ్వ చేతనావిష్కారం సామాన్యముగా క్రమశః జరుగుతూ వుంటుంది.

## విశ్వచేతనానుభూతి లక్షణాలు

విశ్వచేతనానుభూతిలో వ్యక్తిగత అహంకారం, మనస్సు, శరీరం

పూర్తిగా అదృశ్యమై పోతాయనికాదు. అవి తనలో కడు స్వల్పాంశమై నట్లు ఆ అనుభూతిలో సాధకునికి తోస్తూ వుంటుంది. ఇతరులు సైతమూ తనలోని అంశమే అయినట్లూ, తనయొక్క నానావిధ ప్రతికృతులే అయి నట్లూ, తనఆత్మయే వివిధ శరీరములలో ప్రకృతిచేత వివిధ రూపముల భాసింప జేయబడుచున్నట్లూ అతడు భావింపనారంభిస్తాడు. విశాలమైన విశ్వాత్మయందు తాను నివసిస్తూ అదే తన పృథుతర స్వరూపమని గుర్తింప మొదలిడుతాడు.

## జాగరూకత అవసరం

విశ్వచేతానుభూతియందు సాధకుడు తనలో విస్తృతాహంకారమూ, అసుర శక్తులూ, అవిద్య ప్రాబల్యం వహించకుండ జాగరూకత వహించడం అవసరం. విశ్వచేతనలోనికి ప్రవేశించి క్షేమంగా దానిని దాటిపోవలె నంటే, అహంకార వివర్జితమైన శ్రద్ధాసమాహితత్వంతోపాటు చైత్య పురుష నేతృత్వం కూడా మిక్కిలి అపేక్షణీయం.

## సాధారణ చేతన

ఏ చేతనయందు విషయజాతం ప్రధానంగా బుద్ధి, బహిర్ముఖ మనస్సు, ఇంద్రియములచేత మాత్రమే తెలియబడుతూ వుంటుందో, ఏ చేతన యందు వివిధ శక్తులను గురించిన యెరుక వాటి బాహ్యాభివ్యక్తియందు మాత్రమే కలుగుతూ తక్కిన దెల్ల అనుమాన ప్రమాణ జన్యమో అదియే సాధారణచేతన. ఎడనెడ, మానసిక అంతస్ఫురణ, చైత్యదృష్టి, ఆధ్యాత్మిక ప్రేరణ — మొదలైనవి ఇంచుక పొడసూపుతూవచ్చినా దాని మూలలక్షణం మాత్రం వాటివలన మార్పు చెందనేరదు.

## ప్రాణమయసత్త, కామము

ప్రాణమయసత్తకు, కామమునకు అవినాభావ సంబంధము లేదు. కామం లేకుండా కూడా ప్రాణమయసత్త వుండవచ్చు. ప్రాణమయసత్తలోనికి ప్రవేశించిన విశ్వప్రకృతి వ్యక్తిగత ప్రకృతి రూపమున చేయు ప్రతిస్పందనఫలితములే కామములు. వాటిని నిరాకరించి త్రోసిపుచ్చడం జరిగినను ప్రాణమయసత్తకు భంగము వాటిల్లనేరదు.

## కామప్రవృత్తులకు పురుషుని ఆమోదము

ప్రాణమయసత్త యందు కామప్రవృత్తులు కలిగేవిధంగా ప్రతిస్పందించే అలవాటును విశ్వప్రకృతి ప్రేరేపించగా పురుషుడు దానిని ఆమోదిస్తున్నాడు. బాధ్యత అనునది ఈ ఆమోదంవలననే ఏర్పడుతున్నది. పురుషుడు ఆమోదించనూవచ్చు నిరాకరించనూవచ్చు. జంతువులోని ప్రాణమయసత్త సామాన్యజీవితతరంగాలకుమాత్రమే ప్రతిస్పందిస్తుంది. మానవునిలో అట్లు ప్రతిస్పందించినా మనస్సుచే అతడు దానిని నిగ్రహించ గలడు. మనోమయపురుష దతనిలో మేల్కొనుటవలన, కామ ప్రవృత్తులను అనుగమించుటో, అతిక్రమించుటో_ ఏదైననూ చేయ గలడు.

## విశ్వసంకల్ప క్రియా కలాపముల అవగాహన

వ్యక్తిగత మనస్సు తన వ్యక్తిత్వపు గిరిలో బద్ధమై వున్నంత కాలం విశ్వసంకల్ప క్రియాకలాపములను అవగతం చేసుకోజాలదు. మానవ శరీరంలోని జీవాణువునకు ఎరుక ఉంటే, అది తనవంటి జీవాణువుల క్రియాకలాపసంబంధ సమష్టి ఫలితమే మానవుడూ అతని క్రియా కలాపములు అనీ, అతనికి ప్రత్యేకమైన ఐక్యాత్మస్వరూపం

లేదనీ తలపోయవచ్చు. విశ్వచేతనలోనికి ప్రవేశింప నేర్చినప్పుడే విశ్వాత్మ, విశ్వమనస్సు, విశ్వసంకల్ప క్రియాకలాపములు తెలియ మొదలు పెట్టుతాయి.

## జ్ఞానాజ్ఞానముల వ్యష్టిసమష్టులు

వ్యష్టియందలి అజ్ఞానంసమష్టి అజ్ఞానంలో భాగమేకాని వేరుకాదు. పరమ సత్యమునుండివేరుపడి, అసత్యముచేత దానినిమరుగుపరుస్తూవక్రింపజేసెడి విశ్వచేతనపు సమష్టిప్రవృత్తియే సమష్టి అజ్ఞానంకాగా, దాని పరిచ్ఛిన్న రూపమే వ్యష్టియందలి అజ్ఞానం, అటుల వక్రదృష్టిలేక, యథార్థదర్శనం కలిగి, ఆయా వస్తువులకు ఒండొంటితోడనూ, ఈశ్వరునితోడనూ గల సంబంధమును తెలియనేర్పెడి విశ్వచేతనపు సమగ్రదృష్టియే సమష్టి జ్ఞానం.

## మనఃప్రాణ ప్రవృత్తులు

సాధకుడు మనఃప్రవృత్తులకూ ప్రాణ ప్రవృత్తులకూ గల భేదమును కడు జాగరూకతతో గుర్తించడం అవసరం. బాహ్యచేతనయం దీ ప్రవృత్తులు రెండునూ కలగాపులగంగా మిశ్రితమై వుంటాయి బాహ్య చేతనకు వెనుకనుండే అంతశ్చేతనలోనికి ప్రవేశింప నేర్చిన పిమ్మటగాని ఆ రెండిటి భేదమూ తెలిసి తద్వారా బాహ్యతలమిశ్రమాల స్వరూప వివేచనం కుదురనేరదు.

## మనఃప్రవృత్తులు

పూర్ణయోగ పరిభాషలో 'మనస్సు', 'మానసిక' అను పదములు మనలోని

జ్ఞానానికీ బుద్ధికీ సంబంధించిన ప్రకృతి విభాగమును సూచించడానికై వాడబడుతున్నవి. బుద్ధిలోనివే అయిన భావనలు, బోధలు, విషయజాతము, పట్ల చింతనా ప్రతిస్పందనలు, మానసిక దర్శనములు, ఇచ్చలు మొదలైనవన్నీ ఈ విధముగా మానసిక ప్రవృత్తులే.

## ప్రాణ ప్రవృత్తులు

ప్రాణమయ ప్రకృతికి చెందిన కామనలు, ఆవేగములు, సంవేదనలు, అనుభవములు, కర్మలిప్సలు, కామాత్మ ప్రతిస్పందనలు, మమకారాత్మకములైన కామక్రోధ భయలోభాదులు - ఇవన్నియూ ప్రాణప్రవృత్తులే. ప్రాణమయ ప్రకృతిలో సైతం మనస్తత్వం కొంత పెనవేసుకొని వున్నా. మనఃప్రాణములకుగల ఈ భేదమును సాధకుడు గుర్తించడం అవసరం.

## మనఃప్రాణచేతనల వైరుధ్యం

మనోమయచేతన పరమేశ్వరునిగాని, యోగలక్ష్యమునుగాని అంగీకరించి తదభిముఖమై యుండగా, ప్రాణమయచేతన అట్టి అంగీకారమును చూపక సామాన్య జీవనముపట్ల ఆసక్తితో తన మామూలు కామ వ్యాపారములందే విశేషకాలం తగుల్కొని వుండడం సంభవించవచ్చు. మనః ప్రాణచేతనల ఈ వైరుధ్యమే సాధనకుగల ప్రతిబంధకములలో ముఖ్యమైనది.

## అపోహలు

మనస్సు, ఆత్మ ఒక్కటేననీ, ఎల్లచేతనయూ మనస్సే కనుక అది

ఆధ్యాత్మిక లక్షణోపేతమనీ, దేహం మాత్రం తద్భిన్నంగా అచేతనమూ జడమూ గనుక అది ఆధ్యాత్మిక లక్షణోపేతం కాదనీ,—ఈ అపోహలు సామాన్యంగా అనేకులకు కలుగుతూ వుంటాయి. సాధకుడు వీటికి లోను గాక యథార్థస్థితిని గుర్తించడం అవసరం.

## మనస్సు, ఆత్మ

మనస్సు, ఆత్మ వేర్వేరు తత్వాలు. రెండూ ఒక్కటేనని భ్రమించ రాదు. యోచించడం, గ్రహించడం పనిగా గల ఒక పనిముట్టు మనశ్చే తన. ఆత్మచేతనకు ఆ రీతిగా మానసేంద్రియముల పద్ధతిని యోచించే అవసరంగాని, గ్రహించే అవసరంగాని లేదు. స్వయంప్రకాశ మానమైన సాక్షాత్ జ్ఞానం దానిది.

## మనస్సులోని విభిన్న విభాగాలు

మనస్సులో పెక్కు విభాగములున్నవి. ఏ విభాగపు శక్తి సామర్థ్య ప్రవృత్తి ప్రయోజనములు దానివే. ఉదాహరణకు, ఒక విభాగం ఆధ్యాత్మికభావ ప్రభావితమై ఈశ్వర చింతనానురక్తం కాగా, వేరొక విభాగం తర్కమునందో, సాహిత్యమునందో అభినివేశం కలిగి ఆయా శిక్షణ స్వభావముల కనుగుణమైన విశ్వాసములు, సంశయములు, అభిరుచులు, ఆసక్తులు మున్నగువానికి ఆలవాలమై వుండవచ్చును.

## మనఃప్రాణ ప్రవృత్తుల పరస్పర వైరుధ్యం

మనఃకోశంలోని విభిన్న విభాగములే పరస్పర విరుద్ధ ప్రవృత్తులు కలిగి ఒకదానికొకటి లోబడక యుంటున్నప్పుడు, మనఃకోశ, ప్రాణకోశ

ప్రవృత్తులు పరస్పర విరుద్ధములుగా నుండడంలో వింత ఏమీలేదు. మానవబుద్ధి ఎంత అసమగ్రస్థితిలో నైననూ హేతువాదము ననుసరిస్తూ ఉండగా, అతనియందలి ప్రాణకోశ ప్రవృత్తిమాత్రం కామప్రధానమై మమకారభూయిష్ఠ భోగలాలసతతో చరిస్తూ ఉంటుంది. దుఃఖం సైతం జీవితభోగంలో భాగంగానే గ్రహించి; జీవితాన్ని విడనాడనొల్లని ప్రబల ప్రవృత్తి అది.

## ప్రాణతత్వ ప్రాబల్యం

ప్రాణతత్వం కంటె బుద్ధితత్వం ఉదాత్తము, జ్ఞానవంతము అయినందు వల్ల ప్రాణతత్వమును అది అనుశాసింపగలిగి యుండవలె ననుమాట నిజమే. బలమైన సంకల్పముంటే అట్లు అనుశాసింపగలదుకూడ. కాని, ఎంతో ఆత్మసంయమంపై ఆధారపడిన ఈ అనుశాసనం అస్థిరము, అసమగ్రమునని చెప్పక తప్పదు. ఏలనంటే, బుద్ధితత్వం కంటె ప్రాణ తత్వం పృథ్వి కత్యంత సన్నిహిత స్థితిలో ప్రాబల్యం వహించి వుండ దంచేత దేహముపై దాని ప్రభావ మత్యధికం.

## ప్రాణతత్వ ప్రధాన మనోలక్షణం

ప్రాణతత్వంలో కూడ ఒక విధమైన మనస్తత్వ మున్నది. కామ ప్రధాన మైన భావనలు, ఆలోచనలు, సంకల్పాలు చెయ్యడం దీని స్వభావం. హేతువాదాన్ని సైతం ఇది తనకు అనుకూలంగా మలచుకొంటుంది. తన ప్రవృత్తులను సమర్థించగల సాకుల నెన్నో అది తనకు అందిస్తూ వుండే టట్లు చేసుకుంటుంది.

## కామశక్తి ప్రాబల్యం

ప్రాణతత్వానికి ముఖ్యాధారమైన కామం ప్రబలశక్తి సమన్వితం. దాని ఉరవడి హేతువాద ప్రజ్ఞనుసైతం హరించి వేయగలదు. భగవద్గీత దీనినే పెనుతుఫానులో చిక్కిన నావ పరిస్థితితో పోల్చింది.

## మనశ్శరీరముల సంబంధం

మనస్సుకు శరీరం ఎల్ల విషయాలలోనూ యింత్రప్రాయంగా విధేయమై వుండదు. విధేయమగునట్లుగా తగిన శిక్షణ పొందియున్న సందర్భాలలో మాత్రమే ఆవిధంగా విధేయమవుతుంది. శరీరానికి సైతం ప్రత్యేకమైన చేతన ఉన్నది. అగుటకది అస్వతంత్ర చేతనయే అయినా అవిధేయతను గూడా అది ప్రదర్శించగలదు.

## మనస్సు కెదురుతిరిగే శరీర ప్రవృత్తులు

ఆరోగ్య అనారోగ్యాదికమైన పెక్కు విషయాల్లో శరీరం తనకుతానై వర్తిస్తుందేకాని మనస్సుకు విధేయమై వర్తించదు. తాను అలసట పొంది నప్పుడు మనస్సంకల్పాని కెదురు తిరిగి సహాయ నిరాకరణం చేస్తుంది. తమస్సుచేతను, జడత్వంచేతను మనస్సును ముసుగువడచేసి అది పని చేయకుండేటట్లు సైతం చేయగలుగుతుంది.

## శరీరంచే మానస ఆదేశాల నిర్వహణ

ఒక సరళరేఖను గీయమనిగాని, లేక సంగీతం వాయించమనిగాని నీ చేతిని నీవు మొదటగా ఆదేశించినప్పుడు, వెంటనే అది ఆపని చేయ

లేదు, చేయదు. తగిన శిక్షణ ఇచ్చిన తరువాత మాత్రం ఆ చేయమన్న పని అది యంత్రప్రాయంగా చేసివేస్తుంది. శరీరానికి కూడా చేతన ఉన్నదనీ, దానిని మేల్కొలిపి శిక్షణయొసగి మంచి ఉపకరణంగా తయారుచేసినప్పు డది మనస్సు ఆదేశాలను నెరవేర్చగలదనీ ఈ విషయం నిరూపిస్తున్నది.

## చైత్యమనస్సు

సత్యస్వరూపుడగు పరమేశ్వరుని కభిముఖమై యుండి తత్సంస్పర్శ తోడను, తత్సంబంధమైన ప్రతిస్పందనలతోడను ఒప్పారుచుండెడి మనస్సును చైత్యమనస్సని పేర్కొనవచ్చును. చైత్యపురుష ప్రభావ ఫలితముగా మనోభూమికయందు ఉత్పన్నమగు పరిణామ విశేషమది.

## ఆధ్యాత్మిక మనస్సు

ఆత్మను గురించిన ఎరుక గలిగి, దాని స్వభావమును, సృష్టితో దానికిగల సంబంధమును గుర్తించుచు, దాని సంస్పర్శచేత ప్రశాంతము, విశాలము ప్రబుద్ధమునైన మనస్సును ఆధ్యాత్మిక మనస్సని పేర్కొనవచ్చును. పూర్ణ వికాసం పొందినప్పుడు దీని కేంద్రస్థానం శిరస్సున కుపరిభాగమున నున్నట్లును, అటనుండియే దాని ప్రభావం క్రిందికీ వెలుపలకూ వ్యాపించు చున్నట్లునూ తోచును.

## ఉన్నతమనస్సు, అంతర్మనస్సు

సామాన్య మనస్సుకు పైన ఉన్న ఆధ్యాత్మిక మనోభూమికలయందలి మొదటి భూమికయే ఉన్నత మనస్సు. అంతర్మనస్సనున్నది బాహ్య

మనస్సుకు వెనుకగా నున్నది. బాహ్య మనస్సున తత్వమీమాంస, కవిత్వం, ఆదర్శవాదం మొదలైన రూపములలో తోచునవి దీని వృత్తులే. వెలినివాసపు అలవాటు వదలి లోనికి చొరబారు అభ్యాసంద్వారా అంతర్మనస్సును నేరుగా అనుభూతమొనర్చుకోవచ్చును.

## మనఃకోశ విభాగాలు

మనఃకోశంలో మూడు విభాగము లున్నవి. ఒకటి, భావకల్పనలకు, జ్ఞానమునకు సంబంధించినది. రెండవది, ఆ భావసిద్ధికోసమై మానసిక శక్తుల నుద్దీపింప జెయ్యడానికి సంబంధించినది. మూడవది, వాగ్రూపము ననే గాక, ఇతరవిధముల పైతం వాని వ్యక్తీకరణకు సంబంధించినది. ఒకవిధంగా ఇవి మూడూ మనఃకోశపు జ్ఞానేచ్ఛా క్రియాశక్తులుగా పేర్కొనవచ్చును.

## ప్రాణకోశపు మనస్సు

ప్రాణకోశంలో కూడా ఒక విధమైన మనస్సున్నది, ప్రాణకోశపు కామనలు, ప్రేరణలు — మొదలైనవానికీ మనఃకోశానికీ ఇది ఒక రకమైన అనుసంధానకర్త. ప్రాణకోశపు కామనలు, ప్రేరణలు, ఆవేగములు, తీవ్రాకాంక్షలు, మమతావృత్తులు - మొదలైనవాటి నిది వ్యక్తీకరించి వాటికి మనోవృత్తి రూపకల్పన చేస్తుంది. తమ భోగైశ్వర్య సుఖాలను గురించి మానవులు కనే కలలన్నీ దీని ప్రవృత్తి రూపములే.

## అన్నకోశపు మనస్సు

ప్రాణకోశంలో మనస్సున్నట్లే అన్నకోశంలో కూడా మనస్సున్నది,

ప్రాణకోశ మనస్సు ప్రాణేంద్రియ దృష్టికి పరిమితంకాగా, అన్నకోశ మనస్సు బాహ్య జీవన సంసర్గఫలితమగు భౌతిక దృష్టికి పరిమితం. అయితే, వ్యవహారంలో ఈ ఉభయ మనఃప్రవృత్తులూ కలగా పులగంగా కలిసిపోయి వుండడమే పరిపాటి.

## ప్రాణేంద్రియ వృత్తులకు నౌకరు

మానవులను నడిపించేది బుద్ధికాదు, బుద్ధికంటె వారి ప్రాణేంద్రియ ప్రవృత్తులే వారి నడవడియందు విశేషంగా ప్రాబల్యం వహిస్తూవుంటాయి. జీవనరంగమున అత్యధిక సంఖ్యాకుల బుద్ధి వారి ప్రాణేంద్రియ ప్రవృత్తులకు నౌకరుగా మాత్రమే పనిచేస్తూ వుంటుంది.

## ప్రాణమయసత్తలో విభాగాలు

ప్రాణమయసత్తలో నాలుగు విభాగము లున్నవి. (1) ప్రాణసంబంధమైన ఆవేగము లిందు మనోవాగ్వ్యాపారాది రూపంలో ప్రకటన మవుతాయి. (2) ఇది ప్రేమ, ద్వేషం, సంతోషం, దుఃఖం మొదలైన ఆవేశాలకు నిలయం, (3) ఇది కీర్తికాంక్ష, అధికార వాంఛ, గర్వం, కామం మొదలైన తీవ్ర ప్రవృత్తులకు నెలవు (4) ఇది భోజనప్రీతి. ధన వాంఛ, నానావిధములైన స్వల్పకామనలు మొదలైనవాటికి తావలం. వరుసగా వీటిస్థానాలు (1) కంఠమునుండి హృదయం వరకూ గల ప్రదేశం, (2) హృదయం. (3) హృదయంనుండి నాభివరకూగల ప్రదేశం, (4) నాభికి దిగువభాగం.

## ప్రాణకోశ మనస్సు పనిచేసే తీరు

మన ప్రకృతిలో ప్రాణకోశ మనస్సని నేను పేర్కొను విభాగమొకటి

ఉన్నది. మనఃకోశప్రు బుద్ధివలె విపేచించడం, తర్కించడం, వస్తు విమర్శ చేయడం దీని పనికాదు. సాధింపదగుదానిని గురించి కలలు గనడం, ఊహాకల్పన జేయడం దీనిపని. అవకాశం లభిస్తే భావి కాలంలో సాధింపదగు పథకాలను ఇది అల్లుతుంది. కర్మప్రధానులైన పురుషులయందిది ప్రస్ఫుటం. గొప్ప గొప్ప కర్మవీరులంతా దీని ప్రాధాన్యం మిక్కుటంగా కలవారే.

## కర్మవీరులు కానివారి ప్రాణకోశమనోవిలసనం

గొప్ప కర్మవీరులు కానివారిలో సైతం ప్రాణకోశ మనఃప్రవృత్తి విలసనం కనిపించవచ్చు. అట్టివారిలో అది పెద్ద యెత్తున గాక చిన్న యెత్తున పనిచేస్తుంది. ఒక వేళ కొంత విస్తృతిని ఆపేక్షించేపక్షంలో, అసాధ్యమని యెరిగికూడా గాలిలో మేడలు కట్టనారంభిస్తుంది. తానే కథానాయకుడుగా గొప్పగొప్ప గాథలను, సాహసకృత్యాలను సృష్టి చేస్తుంది.

## కృత్రిమానుభూతుల కల్పనా ప్రమాదం

ప్రాణకోశ మనో విభ్రమాలకు తాను వైవసమైపోకుండ సాధకుడు జాగరూకత వహించడం అత్యంతావశ్యకం. అనుభూతు లనునవి సాధనలో కలుగ నారంభించునప్పుడు ముఖ్యంగా ఇట్టి జాగరూకత లేని పక్షంలో ఈ ప్రాణకోశ మనస్సు తన స్వభావానుసారం కృత్రిమాను భూతులను కల్పించి, ఇవే నిక్కమైన అనుభూతులనీ, వీటి నిర్దేశములే అనుసరణీయములనీ అతనిని భ్రమింపజేయగల ప్రమాదమున్నది.

## పెడమార్గం పట్టించే అనుభూతులు

అనృతశక్తుల ప్రేరణచే ప్రాణకోశమనస్సు కల్పించేడి కృత్రిమానుభూతుల ఫలితంగానే కొందరు, అధ్యాత్మిక, సాంఘిక, రాజకీయాది రంగాలలో తామెంతో మహత్కార్యములు సాధించవలసియున్నట్లు భ్రమించి తుదకు విఫలురై ఆశాభంగం చెందడం కద్దు. సాధకుడు వీటి తత్వమెరిగి వీటిని నిరాకరింప నేర్చినగాని మహత్తరాధ్యాత్మికానుభూతులాతనిలో ఆవిర్భవించి విస్తరిల్లనేరవు.

## శాంతి అవతరణం

సాధనాక్రమమందు కలిగే ప్రధాన అనుభూతులలో సామాన్యంగా మొట్టమొదటిది శాంతి అవతరణం. ఈ అనుభూతి యందు బుద్ధి, దాని వృత్తులు చాలవరకు విశ్రాంతిని పొందినా అట్టి అవకాశంలో, ప్రాణమయ, అన్నమయ కోశ మనః ప్రవృత్తులు మొదలైనవి చొరబాటె ఆ శాంతికి భంగపాటు కలిగించడం తరచుగా జరుగుతూ వుంటుంది.

## అవర ప్రవృత్తుల శోధనావశ్యకత

శాంతి అవతరణానంతరం దివ్యశక్తి జ్ఞానానందముల అవతరణం ప్రారంభమవుతుంది. కాని, ఇవన్నీ సాధకునియందు స్థిరపడవలెనంటే, ప్రాణమయ, అన్నమయ కోశములకు చెందిన అవర ప్రవృత్తుల శోధన జరగడం అత్యంతావశ్యకం. లేనియెడల, గొప్పగొప్ప అనుభూతులు పొందిన సాధకులు సైతం విస్తృతాహంకారాది వైపరీత్యములలో తగుల్కొనడం చూస్తూ వుంటాము.

## భావావేశకేంద్రం : చైత్యపురుష కేంద్రం

హృదయస్థానమున భావావేశ కేంద్రమునకు వెనుకగా నున్నది చైత్య పురుష కేంద్రం. సాధకులకు పెక్కుండ్రకు ఈ భావావేశ కేంద్రం ద్వారా చైత్యపురుష కేంద్రాన్ని చేరడమే అత్యంత సులభం. రెండిం టికిగల సాన్నిహిత్యాన్నిబట్టి అనేకులీ భావావేశకేంద్రమే చైత్యపురుష కేంద్రమని భ్రమిస్తూ వుంటారు. కాని, రెండింటికీ హస్తిమశకాంతరం వున్నది. భావావేశములు సామాన్యంగా ప్రాణకోశ ప్రకృతికి సంబం ధించినవిగాని చైత్యప్రకృతికి సంబంధించినవి కావు.

## హృదయభావావేశములు, ప్రాణకోశఅవరప్రవృత్తులు

హృదయ భావావేశములకూ, ప్రాణకోశ అవర ప్రవృత్తులకూ అవి జన్మించే చోటునుబట్టి విభేదం చేయవలసియున్నది. కోపం, భయం, అసూయ, — ఇవి హృదయపర్యంతం వ్యాపించ గలిగినా వీటి పుట్టుక చోటు మాత్రం నాభి, ఆంత్రప్రదేశాలు. ప్రేమ, విశ్వాసం, దయ— అనునవి ప్రధానంగా హృదయస్థానంలో జన్మించే వృత్తులు.

## దేహప్రాణ మనస్సులు, చైత్యపురుషుడు

దేహం లేనిదే భౌతిక జీవనంలేదు, ప్రాణశక్తిలేనిదే దేహం నిలువదు. కాని, ప్రాణమునకు మాత్రం తనకు తానుగా నిలువగల ప్రత్యేక సత్త ఉన్నది. అట్లే మనస్సుకు కూడా ప్రత్యేక సత్త కలదు. ఈ త్రివిధ వ్యవస్థనూ కలిపి ధారణ చేస్తూవున్నది చైత్యపురుషుడు.

# అన్న ప్రాణ మనోభూమికల ప్రత్యేక చేతనలు

మన సత్తయందలి అన్న, ప్రాణ, మనోమయ భూమికలు, పరస్పర సంబంధం కలిగివున్నవే అయినా దేని చేతన దానికి ప్రత్యేకముగా ఉన్నది, జాగ్రదవస్థలో మన బాహ్యేంద్రియ మనస్సుల అనుభవానికి మాత్రం ఇవన్నీ కలగాపులగమై గోచరిస్తూ వుంటాయి. ఉదాహరణకు, శరీరానికి స్వతం ప్రత్యేక చేతన ఉన్నది. మానసికేచ్ఛతో నిమిత్తంలేకుండా, పైపెచ్చు దానికి విరుద్ధంగాకూడా పనిచేయగల దాని యెరుక బాహ్యమనస్సుకు అత్యల్పం.

## భౌతికచేతన

శరీరచేతన వ్యష్టిభౌతికచేతనలో భాగం, వ్యష్టి భౌతిక చేతన సమష్టి భౌతికచేతనలో భాగం. భౌతిక జగత్తులో తన అభివ్యక్తికై జీవాత్మ ఈ వ్యష్టి భౌతికచేతననే ఊతగా గైకొంటున్నది. భౌతికచేతనా భూమిక ఇతర భూమికల నుండి సైతం ఆ యా శక్తులను గ్రహించి తన కనుగుణమైన రీతిని మార్చుకుంటూ ఉంటుంది. భౌతికమనస్సు అనునది ఇట్లేర్పడినదే.

## భౌతిక మనోలక్షణం

భౌతిక విషయములందు, భౌతిక సంఘటనలందు లగ్నమై, వాటి స్వభావానుసారంగా వాటితో వ్యవహరించుచుండునది భౌతిక మనస్సు. కష్టము మీదగాని అది తన కతీతములైన ఉన్నతశక్తుల ప్రభావానికి ప్రతిస్పందించనేరదు. ఉన్నత శక్తుల ఉనికిని శంకించడం సామాన్యంగా

దాని స్వభావం. ఆధ్యాత్మికానుభవాలు కలిగినా వాటి నది వెంటనే మరచిపోతూ వుంటుంది.

## అతీత శక్తులచే భౌతిక మనోద్దీపన

భౌతికమనస్సును దాని కతీతమైన ప్రాణమనఃకోశ శక్తులచే నుద్దీపింప చెయ్యడంలో మానవసభ్యత, నాగరికత, పురోగతి ప్రధాన పాత్ర నిర్వహిస్తూ వచ్చినవి. ఆ ప్రాణ మనః కోశ శక్తులకంటె అతీతమైన ఆధ్యాత్మిక, అతిమానస భూమికల చేతనచే దాని నుద్దీపింప చెయ్యడం పూర్ణయోగ సాధనకు ఒక ముఖ్య లక్ష్యం.

## అంతశ్చేతన సంకీర్ణ స్వరూపం

మన జాగ్రచ్చేతనకు వెనుకనున్న అంతశ్చేతన ఒక మహా సముద్రం. జాగ్రచ్చేతన దానిపైన లేచే అలవంటిది మాత్రమే. సంకీర్ణ స్వరూపంగల ఈ అంతశ్చేతనను ఏ ఒక పదంచేతను వర్ణించడానికి వీలులేదు. దానిలో కొంత జాగ్రచ్చేతనకు దిగువస్థాయిలో ఉంటుంది. కొంత సమస్థాయిలోనే, వెనుకగా ఉంటుంది. కొంత ఎగువ స్థాయిలో ఉంటుంది.

## అంతర్మనఃప్రాణ శరీర చేతనలు

మన మనఃప్రాణ శరీరములుగా మనం పిలుచుకొనునవి వీటికి వెనుకగా వీటికంటె విశాలమై యున్న అంతర్మనఃప్రాణశరీర చేతనల బాహ్య రూపములు మాత్రమే, అంతరమున నున్నవాటిని మనం తెలుసుకో వలెనంటే అంతర్ముఖులమై అంతరంగమున ప్రవేశించడం అవసరం.

## రెండు భిన్నార్థాలలో "అంతర్" పదప్రయోగం

అంతర్మనఃప్రాణ శరీర (భౌతిక) చేతన లనువానిలో 'అంతర్' అను పదం రెండు భిన్నార్థములలో వాడబడుతూ వుంటుందనేది గుర్తుంచుకోడం అవసరం. ఒక్కొక్కప్పుడది మన బాహ్యసత్తకు వెనుక విశ్వమనః ప్రాణ భౌతిక శక్తులతో సాక్షాత్స్పర్శగల అంతశ్చేతనను సూచన చేయగా, మరియొక్కొక్కప్పుడది అంతకంటే లోపలిదై ఆత్మ సామీప్యములో నుండెడి అంతరాంతర చేతనను సూచన చేస్తుంది.

## యథార్థ మనః ప్రాణ భౌతిక చేతనలు

అంతరాంతర మనఃప్రాణ భౌతిక చేతనలు యథార్థ మనఃప్రాణ భౌతిక చేతనలను పేరునగూడా పిలవబడుచున్నవి. ఈశ్వరజ్ఞానశక్తి ప్రభావానికి కడు సులభంగా ప్రతిస్పందించగల యోగ్యతా విశేషం ఈ యథార్థ మనః ప్రాణ భౌతిక చేతనల కుంటుంది.

## అంతఃప్రవేశావశ్యకత

అంతశ్చేతనలోనికి ప్రవేశించనంతవరకూ ఏ యోగమూ సాధ్యంకాదు. పూర్ణయోగ మనునది అసలే సాధ్యపడదు. మనల నావరించియుండి మన ద్వారా పనిచేసెడి విశ్వశక్తుల విలసనమును సాక్షాత్తుగా గుర్తెరుగుటకు గాని మన అంతరాంతరమునగల ఈశ్వరుని సంస్పర్శను పొందుటకుగాని ఈ అంతఃప్రవేశ మత్యంతావశ్యకం.

## అంతఃప్రవేశం లేని అనుభవ లక్షణం

అంతర్ముఖులమై అంతఃప్రవేశ మొనర్చి అంతశ్చేతనను గుర్తించ లేక

పోతే బాహ్యసూచనలు, బాహ్యఫలితములద్వారా మాత్రమే ఈశ్వర స్పర్శను మనం పొందగలుగుతాము. పెశ్వాసం బలపడుతుందేతప్ప జ్ఞానోపలబ్ధి కలుగదు. ఈశ్వరుని నిత్యసన్నిధి గుర్తించే ప్రత్యక్షానుభవం పొందలేకపోతాము,

## వ్యాధిని ముందుగా పసిగట్టే ప్రజ్ఞ

కేవలం బాహ్య భౌతిక చేతనయందే మనం నివసిస్తూ వుండేయెడల, ఏదైనా వ్యాధి మనకు సంప్రాప్తించనున్నప్పుడు, దాని లక్షణాలు శరీరంలో స్పష్టంగా గోచరమయ్యేపర్యంతం అది మనం తెలుసుకొనలేము. అట్లుగాక, అంతర్భౌతిక చేతనను మనలో వికసింపజేసుకొనగలిగినప్పుడు, మనల నావరించియుండే సూక్ష్మభౌతిక వాతావరణాన్ని మనం గుర్తింపనేర్చి, తద్వారా మనలను సమీపించనున్న రోగశక్తులనుసైతం అల్లంతదూరంలో ఉండగానే పసిగట్టగలము.

## మనలో అణువణువునా ఈశ్వరానుభూతి

అంతరాంతరమున నుండే యథార్థ భౌతికచేతన మనలో మేల్కొనినప్పుడు మన శరీరమందలి వివిధ అవయవాలలో, నరాలలో, రక్తంలో సకలధాతువులలో, ఉచ్ఛ్వాసనిశ్వాసలలో – అంతటా కూడా ఈశ్వర జ్ఞానానంద శక్తి ప్రవాహానుభూతిని పొందే యోగ్యతను మనం అలవరించుకొంటాము. ఈశ్వరుని దివ్య సాన్నిధ్యానందం మన అణువణువునా చిందులాడుతుంది.

## స్థూల, సూక్ష్మ, భౌతిక సత్తలు

బాహ్యేంద్రియాత్మక మనస్సుచేతను బాహ్యేంద్రియముల చేతను తెలియ

బడు స్థూలశరీర సత్తయె స్థూల భౌతికసత్త. ఇదిగాక, సూక్ష్మ భౌతిక చేతనతో సూక్ష్మ భౌతిక సత్తకూడ వేరుగావున్నది. ఇది శరీరమునుండి దూర ప్రదేశమునకు సైతం వ్యాపించి విషయ గ్రహణం చేయగలిగి వుంటుంది.

## అవచేతన

అంతశ్చేతన గాక, అవచేతన యనెడి విభాగ మొకటి మనలో ఉన్నది. జాగ్రచ్చేతనలో నుండెడి సుసంగత చింతనాదులు ఇందుండవు. దీని యందే మన పూర్వసంస్కారాలన్నీ అంతర్లీనమై వుండి, మన స్వప్నావస్థలోనికి, జాగ్రదవస్థలోనికిగూడ అసంగత అవ్యవస్థిత రూపాలలో పెల్లుబికి వస్తూవుంటాయి.

## అవచేతన ఉండేస్థానం

ప్రకృతియందలి ఇతర ముఖ్యవిభాగాలవలెనే అవచేతనకూడా వ్యష్టి సమష్ట్యాత్మకం. ఈ పృథ్వియందలి సమస్తమూ అచేతనమని పిలువబడు దానిపైన ఆధారపడి ఉన్నది. వాస్తవమునకిది సంపూర్ణముగ ముకుళించుకొనివున్న చేతనయేగాని అచేతనమెంతమాత్రమూకాదు. అనభివ్యక్తంగా సమస్తమూ దీనిలో అంతర్లీనమై ఉన్నది. అవచేతన ఇట్టి అచేతనకూ దేహప్రాణ మనశ్చేతనకూ నడిమిస్థానంలోనిది.

## అవచేతనయందలి గుప్త సంస్కారాలు

అచేతన భౌతిక పదార్థమునుండి తెమల్చుకొని వచ్చెడి ఆదిమజీవన ప్రతిస్పందనలన్నీ ప్రదీభూత స్థితిలో అవచేతనయందు గుప్తములై

వుంటాయి. మానవుల జాగ్రచ్ఛేతనానుభవాలు ఈ అవచేతనలోనికి ఇంకబారి సంస్కారరూపంలో దాగి వుండడం కూడా జరుగుతుంది స్వప్న ముల రూపంలో గాని, యాంత్రికప్రాయంగా పునః పునః ప్రవర్తమాన ములగు ఇతర ప్రవృత్తుల రూపంలోగాని తరుచుగా బహిర్గతమవుతూ వుండేవి ఈ సంస్కారములే.

## మరల మరల తలయెత్తే ప్రవృత్తులకు కారణం

మనలో నానావిధ ప్రవృత్తులూ మరల మరల పొటమరిస్తూ వుండడానికి కారణం అవచేతనయే. శాశ్వతంగా మనం వదల్చుకొనగోరిన గుణాలు సైతం దీనిమూలంగానే మాటిమాటికీ మనలో తలయెత్తుతూవుంటాయి. మృత్యువు, వ్యాధి, అజ్ఞానం,— వీటికికూడ ఇదియే పట్టుగొమ్మ. పూర్తిగా నిర్మూలించబడక అణచివేయబడినవన్నీ ఇందులో బీజరూపంలో అణగి వుండి ఏ క్షణంలోనైనా మరల మొలకెత్తవచ్చు.

## అజ్ఞానపు గూడు

ప్రకృతికంతకూ మూలాధారం అవచేతనయే అని తలపోయరాదు. అది ప్రధానంగా బాహ్య, అన్న, ప్రాణచేతనలపై ప్రభావం గలిగిన ఒక అజ్ఞానపు గూడు. ఈ బాహ్య, అన్న, ప్రాణచేతనలు అంతకంటె ఉన్నతమైనప్రకృతి విభాగములపై తమ ప్రభావం చూపుతూ వుంటాయి. అవచేతన స్వరూప స్వభావాలను సాధకుడు తెలుసుకోడం మంచిదే అయినా, దీనికే విశేష ప్రాధాన్యమిచ్చి దీనితోనే సతమత మవుతూ కూర్చుండరాదు.

## అవచేతన వేరు, తాను వేరు

అవచేతన తనకంటె వేరైనదనీ, అది తన యథార్థ సత్తను ముసుగువడ జేసెడి అజ్ఞాన కల్పిత అసత్ప్రకృతి విశేషమనీ సాధకుడు గుర్తింప నేర్చుకోడం అవసరం. అంతస్సత్తయే అతని యథార్థసత, ముఖ్యంగా అతని అంతరాంతర సత్తయైన చైత్యాత్మ వస్తుతః దివ్యం, విశుద్ధం, సత్యం, శివం, సుందరం.

## అంతస్సత్త బాహ్యసత్తను కైవసం చేసుకోవాలి

అంతస్సత్త బాహ్యసత్తను కైవస మొనర్చుకొని, అవచేతన ప్రకృతికి గాక ఈశ్వర ప్రకృతికి ఉపకరణంగా దానిని మలచుకోవలసి యున్నది. ఇది నిత్యమూ గుర్తులో నుంచుకొని ఊర్ధ్వముఖంగా ప్రకృతిని ఉన్మీలన మొనర్చినప్పుడే ఈశ్వరచేతనోపలబ్ధి కలిగి ఆ ఈశ్వరచేతన మన బాహ్యాభ్యంతర సత్తలయందంతటా నిండారునట్లుగా క్రిందికి అవతరించడం జరుగగలదు.

## అవచేతన దోషాలకు ప్రాధాన్య మీయరాదు

అవచేతనయందు, అందు కానవచ్చే దోషములయందు మాత్రమే దృష్టిని లగ్నం చేసుకోడం సాధకుడు అలవాటు చేసుకుంటే అదిఅతనిని క్రుంగ దీస్తుందిగనుక దాని కతడు అవకాశ మీయరాదు. గుణములకే ప్రాధాన్య మిచ్చి వాటిని స్వీకరించడం, నిరాకరించి పరివర్తింపజేసే లక్ష్యంతో మాత్రమే దోషములను గుర్తించడం అతడు అభ్యాసం చెయ్యాలి.

## అవచేతన : పరచేతన

అవచేతన మన స్థూలవ్యాపారాల కన్నింటికీ దిగువను ప్రచ్ఛన్నంగా దాగివుండి పనిచేస్తూ వుంటుంది. పరానుభూతికి సంబంధించిన విషయాలు ఎగువనున్న పరచేతననుండి క్రిందికి దిగివచ్చునట్లే, మన శరీర చేతనకు దిగువనుండే అవచేతనముండి అందలి సంస్కారాలు పైకి మన దేహ ప్రాణమనః ప్రకృతిలోనికి పొటమరించుకొని వస్తూవుంటాయి.

## పరచేతనావచేతనల నెరిగే ఉపాయం

పరచేతన మనకు పరమున నుండి మన ఆధ్యాత్మిక వికాసమున కంతకూ ఆధారభూతమగునటులే, అవచేతన మన భౌతిక సత్తకు పునాదిగా నుండి మన భౌతిక ప్రకృతిలోనికి పైకి పొటమరించుకొని వచ్చేదిదానికంతకు ఆధారభూతమౌతున్నది. మానవులకు సామాన్యముగా ఈ రెండు భూమి కలుగూడ అజ్ఞాతములే. సాధనవలన మాత్రం అవి తెలియబడుచున్నవి.

## కలల రూపంలో అవచేతన సంస్కారాలు

జీవితంలోని పూర్వానుభవ సంస్కారాలన్నీ అవచేతనలోనే గుప్తమై వుంటాయి. కలలరూపంలో అవి అక్కడనుంచి సాధారణంగా పైకి పొటమరిస్తూవుండవచ్చు. మామూలు నిద్రలో వచ్చే కలలన్నీ చాలవరకు ఇలా అవచేతనలోని సంస్కారాలచే రూపొందినవే.

## అసంబద్ధములైన అలవాటులపుట్ట

అసంబద్ధములైన అలవాట్లతో నిండివుంటుంది అవచేతన. ఒకే విధమైన ప్రవృత్తి మాటిమాటికీ ప్రబలంగా మన భౌతిక చేతనయందు తల

యెత్తుతూ వుండడానికి మూలాధార మె అవచేతనయే. కావుననే ఈ అల వాట్లను వదిలించుకోడం చాలా కష్టం.

## త్యక్త సంస్కారాల గమనాగమనాలు

మన ప్రకృతియందలి నానా విభాగములనుండియూ త్రోసిపుచ్చబడిన సంస్కారాలు మనలను పరివేష్టించివుండే పరిసర చేతన లోనికి పోయి, అటనుండి తిరిగి మనలోనికి ప్రవేశింప యత్నింపవచ్చు. లేదా, మన భౌతిక చేతనకు దిగువ నుండే అవచేతన లోనికి ఇంకబారి దీర్ఘకాలం మనలను వదలి పోయినట్లే తోచి, మరల పైకి పొటమరించుకొని రానూవచ్చు.

## భౌతికచేతన మార్పుకు ముఖ్య ప్రతిరోధం

భౌతిక చేతన పరివర్తనం పొందేటప్పుడు ముఖ్యమైన ప్రతిరోధం అవ చేతననుండియే సంప్రాప్తమవుతుంది. భౌతిక మనఃప్రాణ శరీర ప్రకృ తుల జడత్వం, మూఢత్వం, దుర్బలత్వం, కామం, క్రోధం, భయం, అనారోగ్యం, మాంద్యం, దుఃఖం— ఇవన్నీఅవచేతనలో దాగివుండియే తిరిగి భౌతికచేతన నాక్రమించడానికి ప్రయత్నిస్తూ వుంటాయి,

## భౌతికచేతన నెలవు

మూలాధార చక్రమే భౌతిక చేతనకు నెలవు. శరీరంలో దానికి దిగువ నుండేదంతా భౌతిక చేతనకు సంబంధించినదే, అవచేతన అనునది ఇంకనూ దిగువనున్నది. పరచేతన యథార్థ స్థానం శరీరానికిపైన వున్నటులే. అవచేతన యథార్థస్థానం శరీరానికి క్రింద కలదు.

## కర్మప్రవృత్తికి గల గుహ్యామూలములు

మన కర్మప్రవృత్తికి మూడు గుహ్యమైన మూలములు కలవు. ఒకటి-పరాచేతన, రెండు—ప్రచ్ఛన్న చేతన, మూడు—అవచేతన. వీటిలో ఏదీ మన స్వాధీనంలో వుండదు. కనీసం వీటిని ఎరుగనైనా ఎరుగము. మనం ఎరిగినదెల్ల ఉపకరణమాత్రమైన బాహ్యసత్తను మాత్రమే.

## అన్న ప్రాణకోశ వృత్తుల ప్రధానమైన ప్రాపు

అలవాటుగా తలయెత్తుతూవుండే ప్రవృత్తులకు—ముఖ్యంగా అన్నమయ, ప్రాణమయకోశ ప్రవృత్తులకు, ప్రధానమైన ప్రాపు అవచేతనమే. ఈ కోశములనుండి ఏదైనా వెలుపలకు త్రోసివేయబడినప్పుడు, సామాన్యంగా అది అవచేతనలోనికి దిగజారుకొని బీజరూపంలో అచట దాగివుండి వీలైనప్పుడెల్ల తిరిగి పైకిరావడం జరుగుతూవుంటుంది. కనుకనే ఈ ప్రవృత్తుల నిర్మూలన మత్యంత కష్టసాధ్యం

## అవచేతన పరివర్తనం పొందాలంటే

అసంబద్ధంగా, యంత్రప్రాయంగా, పునః పునః ప్రవర్తమాన మయ్యే లక్షణం అవచేతన యందలి ప్రవృత్తుల కుంటుంది. హేతువాదాన్ని, మానసిక సంకల్పాన్ని అవచేతన లక్ష్యపెట్టదు. పరాచేతన యందలి తేజస్సును, శక్తిని దానిలోనికి గొనివచ్చినప్పుడు మాత్రమే దానిలో పరివర్తనం సాధ్యమవుతుంది.

## ప్రకృతిచే నిక్షిప్తమైన అలవాటులు

వివిధ వ్యక్తులలో వివిధ వ్యష్టి రూపములు ధరించేది విశ్వ ప్రకృతియే సమస్తమునకూ మూలం. ఇదియే పలువిధములైన శీల స్వభావ గతి విశేషములతో కూడిన కొన్ని అలవాటులను మనలో విక్షేపిస్తూవున్నది. ఇవి ఇప్పుడు రూపొందినవి కావచ్చు లేక మనం పుట్టకముందు రూపొందినవి కావచ్చు. వీటినే మనముగా మనం చెలామణి చేసుకుంటున్నాము.

## సంసార ప్రవృత్తులపై ప్రకృతి ప్రభావం

విశ్వప్రకృతి మనలో నిక్షేపించిన సంస్కార సముదాయంలో కొంత భాగం మనఎరుకలోనుండే బాహ్యచేతనా విభాగమున ప్రవర్తమానమౌతుండగా, విశేషభాగం ఈ బాహ్యతలమునకు క్రింద, వెనుక, మన ఎరుకలోలేని చేతనా విభాగములందే మరుగుపడివుంటుంది. బాహ్యతలమందలి ప్రవృత్తులు ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని మనలోనికి వచ్చిపడుతూ వుండే విశ్వప్రకృతి తరంగములచే నిత్యమూ ప్రభావితమవుతూ వుంటాయి.

## మనస్సు గుర్తింపలేని విశ్వప్రకృతి తరంగాలు

మన ఎరుకలోనుండే బాహ్యచేతనా విభాగంలోనికి నేరుగా వచ్చిపడు విశ్వప్రకృతి తరంగముల మూలస్థానమును గుర్తింప నేరని అజ్ఞస్థితిలో నుంటుంది మన మనస్సు. వాటికి తానే మూలస్థానమని, తనలోనుండియే అవి పుట్టుతున్నవనీ దాని భావం.

## త్యక్త సంస్కారాల పునఃప్రవేశ పరిశీలన

త్రోసివేయబడిన సంస్కారాలు తిరిగి మనలోనికి ప్రవేశించడమనే విషయం పరిశీలించేటప్పుడు, అవి ఎక్కడికి త్రోసివేయ బడినవనేది ముఖ్యంగా విచారించాలి. అన్న, ప్రాణ, మనోమయ కోశములనుండి త్రోసివేయబడిన సంస్కారాలు సామాన్యంగా విశ్వప్రకృతి యందలి తమ తమ పూర్వ విభాగాలను చేరుకొని, మనలను పరివేష్టించివున్న పరిసర చేతనలో వుంటూ వీలువెంబడి తిరిగి మనలోనికి ప్రవేశించడం జరుగుతూ వుంటుంది.

## త్యక్త సంస్కారాల అవరోహణక్రమం

మనస్సు త్రోసిపుచ్చినదానిని ప్రాణమయ చేతన బలపరుస్తూ వుండే యెడల, అది మనస్సును వదిలినా ప్రాణకోశంలోనికి దిగజారి అచట చెలరేగుతూ తిరిగి మనస్సులోనికి ఎగసివచ్చి దానిని వశపరచుకొన ప్రయత్నిస్తుంది. ప్రాణమయ చేతన కూడా దానిని త్రోసిపుచ్చినప్పు డది అన్నమయ చేతనలోనికి, అటనుండి కూడ త్రోసిపుచ్చ బడినప్పుడు అవచేతనలోనికి దిగజారుకొనడం జరుగుతూ వుంటుంది.

## వంశపారంపర్య లక్షణప్రభావం పరిమితం

మనముగా మనం చెలామణి చేసుకొనే మన సంస్కారాలు, విశ్వప్రకృతి కార్యకలాపానికి మనలో ద్యోతకమయ్యే ప్రతిక్రియా ధోరణులు,— ఇవన్నీ చాలావరకు మన పూర్వజన్మల నుండి మనం తెచ్చుకొన్నవే. వంశ పారంపర్య సంబంధమైన లక్షణాల ప్రభావం బాహ్యసత్తపై మాత్రమే పనిచేస్తుంది. అదైనా మనముగా రూపొందవలసియున్న దానికి అనుగుణంగా వుండునంత మేరకే.

## సూక్ష్మసంస్కార ప్రతిష్ఠకై అవచేతనకు శిక్షణ

అణచివుంచబడిన పూర్వసంస్కారాలను పట్టుదలతో మాటి మాటికీ, అవకాశం చిక్కినపుడెల్లా పైకి పొటమరింపజేస్తూ వుండడం అవచేతన కున్న సహజలక్షణం. ఆ పూర్వసంస్కారాలనది త్రోసిపుచ్చి క్రొత్త సంస్కారాలను సరియైనవాటిని స్వీకరించేటట్టు చేయవలెనంటే, అంత కంటె ఎక్కువ పట్టుదలతో మనలోని ఉన్నత చేతనా విభాగములు దానికి తదనుగుణమైన పద్ధతిలో శిక్షణ నీయవలసి ఉంటుంది

## అవచేతనకు ఆదేశం

ఆలోచనను ఒక విషయంపైన, చూపును ఒక బిందువుపైన ఏ రీతిగా ఏకాగ్రం చేయవచ్చునో, అల్లే సంకల్పశక్తిని శరీరంలోని ఒక ప్రత్యేక భాగంపై ఏకాగ్రంచేసి అచటి చేతనకు ఆదేశమీయవచ్చును. ఆ ఆదేశం అవచేతనకు చేరుతుంది.

## చక్రసప్తకం

యోగ విజ్ఞానానుసారం చక్రములు ఏడు. (1) శిరస్సుపైన సహస్రదళ పద్మం, (2) ఫాలమధ్యమున ఆజ్ఞాచక్రం, (3) కంఠస్థానమున విశుద్ధం, (4) హృదయ స్థానమున హృత్పద్మం లేక అనాహతం, (5) నాభి స్థానమున నాభిపద్మం లేక మణిపూరకం, (6) నాభికి దిగువను స్వాధిష్ఠానం, (7) ఇంకనూ దిగువను మూలాధారం.

## చక్రములు సూక్ష్మ శరీరంలోనివి

మూలాధారంనుండి సహస్రారం వరకూ గల చక్రాలన్నీ శరీర మధ్యం లో వున్నాయి. వెన్నెముకతో సంబంధం కలిగి ఉన్నట్టు తలంచబడుతూ

వున్నా వాస్తవానికవి సూక్ష్మ శరీరంలోనివి. అయితే, చేతన మనలో ప్రబుద్ధమైనప్పుడు, వాటి వ్యాపారములు స్థూలశరీరంలో జరుగుతున్నట్లే మనకు అనిపిస్తుంది.

## చక్రముల వ్యాపారములు

అన్నమయ చేతనను, దాని దిగువనున్న అవచేతనను పాలించునది మూలాధారచక్రం. ప్రాణమయచేతన క్రింది విభాగమును స్వాధిష్ఠానం, పైభాగమును మణిపూరకం పాలిస్తాయి అనాహతం భావావేశాలను పాలించే కేంద్రంవిశుద్ధం బహిర్ముఖాభివ్యక్తి సాధనమైన మనఃకేంద్రం కాగా, ఆజ్ఞాచక్రం శక్తిమంతమైన ఆలోచనకు, దర్శనమునకు, సంకల్పమునకు కేంద్రం. సహస్రారం ఉన్నత మనస్సును, దానికంటె పైనిదగు ప్రదీప్త మనస్సును, అంతకంటె పైనిదగు ప్రబుద్ధ మనస్సును పాలనచేస్తుంది.

## చక్రముల వన్నెలు

నాలుగురేకుల మూలాధారం వన్నె ఎరుపు. ఆరురేకుల స్వాధిష్ఠానం వన్నె ఊదాకలిసిన ఎరుపు. పదిరేకుల మణిపూరకం వన్నె ఊదా. పన్నెండురేకుల అనాహతం వన్నె బంగారుచాయ కలిసిన గులాబి. పదహారురేకుల విశుద్ధ చక్రానిది గోధుమవన్నె. రెండురేకుల ఆజ్ఞా చక్రం వన్నె తెలుపు. వేయిరేకుల సహస్రారం వన్నె చుట్టూ బంగారు కాంతితో కూడిన నీలం.

## స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత లక్షణాలు

స్వాధిష్ఠానం చిన్న చిన్న కామ, క్రోధ, లోభాది ఇంద్రియ ప్రవృత్తు

లకు స్థానం కాగా, మణిపూరకం విస్తృతమైన ప్రాణశక్త్యావేశములకు స్థానం. హృదయ కేంద్రమైన అనాహతం రెండుశక్తులతో ఒప్పారు తున్నది. ఇందు, ముందువైపున నున్నది భావావేశచేతన కాగా, వెనుక వైపున దాగివున్నది అంతరాత్మ. లేక చైత్యపురుషుడు.

## సహస్రారం మెదడుకాదు

ఉన్నత, దీప్త మనస్సులకు స్థానమై, ప్రబుద్ధ, అధిమనస్సులలోని దారి యిచ్చే సహస్రారం, మెదడేనని కొందరు భ్రమించడం కద్దు. కాని, మెదడు సహస్రార, ఆజ్ఞా చక్రములమధ్య సమాచారవాహికగా ఉప యోగపడేటందు కేర్పడిన ఒక ఉపకరణం మాత్రమే.

## శూన్య చక్రం

సహస్రార చక్రమునకే శూన్య చక్రమనే పేరుకూడా ఉన్నది. శరీరం లోగాక, శరీరానికి పైన శూన్యప్రాయంగా తోచెడి స్థానంలో దాని ఉనికి కావడం ఇందుకు కారణం. మరొక కారణం ఏమంటే, శిరస్సును దాటి పైకి వెళ్ళినప్పుడు, మొట్టమొదటగా అనుభవానికి వచ్చేది ఆత్మ యొక్క నిశ్చల నీరవతాస్థితి.

## ప్రాణమయ చేతన రాజ్యం

శక్తిమంతమైన ప్రాణమయ చేతనకు ముఖ్యస్థానం మణిపూరకం (నాభి) కాగా, దాని విస్తృతి అటు అనాహతం (హృదయం) నుండి ఇటు మణి పూరకం వరకూ ఉన్నది. కావున ఈ మూడుచక్రాలూ ప్రాణమయ

చేతన రాజ్యంలోనివి. అనాహతం వెనుకనున్న చైత్యపురుషుడు విశుద్ధ భావావేశములద్వారా బహిర్గతుడు కాగలుగుతాడు.

## మనోమయచేతన రాజ్యం

అనాహతానికి పైనిదంతా మనోమయచేతన రాజ్యం. ఇందులోనూ మూడు చక్రాలు (విశుద్ధ, ఆజ్ఞా, సహస్రారములు) వున్నవి. కంఠ మండలి విశుద్ధం బహిర్ముఖ మనస్సుకూ, ఫాలమండలి ఆజ్ఞాచక్రం దర్శన, సంకల్ప శక్తులకూ, శిరస్సు పైని సహస్రారం దీప్త, ప్రబుద్ధ అధిమనస్సులకు స్రోతవయైన ఉన్నత మనస్సుకూ స్థానములు.

## అంతఃప్రవేశం వలన కలిగే ప్రయోజనం

మన బాహ్య ప్రకృతిలో అన్న ప్రాణ మనోమయ చేతనాదులు కలగా పులగంగా, మిశ్రితములై వుండడంచేత, మన ప్రకృతి స్వరూప స్వభావాలు, వివిధ భాగముల పరస్పరసంబంధాలు గుర్తించడానికి ఎంతో నిశితమైన పరిశీలన, తీవ్రమైన ఆత్మవిమర్శ, వివిధ ప్రవృత్తుల ఉప సంహారణం అవసరమవుతాయి. అట్లు గాక మనం అంతఃప్రవేశ మొనర్చగలిగేపక్షంలో మన బహిర్వ్యాపారపు మూలస్థానము లన్నిం టినీ వేనికవి విడివిడిగా తెలుసుకో లుగుతాము.

## అంతశ్చేతన విభాగములు

నిచ్చెనమెట్లవలె ఏర్పాటైవున్న అంతశ్చేతనలో అయిదు ప్రధాన విభాగములున్నాయి. శిరస్సుకు పైన ఉండే భూమికలు (పరాచేతన) మన ఎరుకలో నుండవు. అవి సాధనవలన తెలియబడుతాయి. పోతే,

శిరస్సునుండి కంఠంవరకు (మనోమయచేతన). కంఠం నుండి నాభి వరకూ (ఉన్నత ప్రాణమయ చేతన), నాభి నుండి వెన్నుపూస కొన వరకూ (అపర ప్రాణమయ చేతన), వెన్నుపూస కొననుండి పాదముల వరకూ (అన్నమయ చేతన) పాదముల నుండి క్రిందికి (అవచేతన)– ఇవీ అయిదు విభాగముల స్థానములు.

## ఆలంకారిక ప్రయోగములు

మూలాధారాది చక్రములు సూక్ష్మశరీరం లోనివిగాని స్థూల శరీరం లోనివి కావు. గాఢసమాధిలోనూ, మరణసమయంలోనూ పురుషుడు ఈ సూక్ష్మశరీరంలోనికే ప్రవేశిస్తున్నాడు. అయితే, సూక్ష్మశరీరం స్థూలశరీరంలోనికి చొచ్చి దానితో పెనవేసుకొని వుండడంచేత ఈ చక్రములకూ, స్థూలశరీరంలోని కొన్ని స్థానాలకూ ఒకవిధమైన సంబంధం ఏర్పడుతున్నది. అందుచేతనే, వివిధ స్థానాలలోని పురుషులని మనం చేసే ప్రయోగాలు కేవలం ఆలంకారికములు.

## ఆనందాది అనుభూతుల తీరుతెన్నులు

సూక్ష్మ శరీరానికీ, స్థూలశరీరానికీ ఏర్పడివున్న సంబంధం కారణముననే, ఆనందంగాని, మరేదైనాగాని మనలోనికి దిగివచ్చినప్పుడు, అది వ్యాపించడం సూక్ష్మశరీరంలోనే అయినా స్థూలశరీరానికి కూడా దాని ప్రభావం ప్రసరించి స్థూలశరీరంలో అది వ్యాపించినట్లు అనుభూతమవుతుంది. అంతేతప్ప, దీనిని బట్టి ఆత్మచైతన్యం స్థూలశరీరంలోని ఏ గ్రంధియందో నిహితమైవున్నట్లు భావించడం సరికాదు.

## ఆత్మలోపలనే శరీర మున్నది

ఆత్మవస్తువు శరీరంలోని ఒక జడగ్రంధి లోపల బిడాయించబడి వుండడం ఎలా సాధ్యం? ఆత్మ శరీరంలోపల పరిమితమై లేదు, శరీరమే ఆత్మ లోపల పరిమితమై ఉన్నది. పూర్ణమైన ఆత్మానుభవం మనకు కలిగి నప్పుడు, దాని నొక విశాల చేతనగా మనం గ్రహిస్తాము. శరీరం ఆ చేతనలో ఒక చిన్నవస్తువుగా గోచరిస్తుంది.

## చక్రములు వికసించేది సాధనవలననే

చక్రములను గురించిన ప్రస్తావన యోగసాధనలోనే వస్తుంది. సామాన్య మానవులలో చక్రములు ముకుళించుకొని వుంటాయి. సాధన చేసినమీదట గాని వికసించవు. అవి సూక్ష్మశరీరానికీ అంతశ్చేతనకూ సంబంధించి నవి. సామాన్య మానవులలో బాహ్యచేతన ప్రాబల్యం వహించి వుంటుంది.

## సహస్రదళ పద్మం

సహస్రదళపద్మం శిరస్సునకు పైనవున్న సప్తమచక్రం. చక్రము లన్నింటికీ అది పైది. శరీరంలోవున్న చక్రములనే గణించేవారు సామా న్యంగా సహస్రారమును వదలివేసి షట్చక్రములనే లెక్కిస్తారు. ప్రబుద్ధ, ప్రదీప్త, అధిమనస్సుల కిరణ ప్రసారం ఈ సహస్రార ద్వారముననే జరుగుతుంది.

## విజ్ఞానమయచేతన అవతరణకు దారి

అతిమానస మైన విజ్ఞానమయచేతన శరీరంలో వ్యవసీకరించబడని

హేతువుచేత దానికి ప్రత్యేకంగా ఏ చక్రమూ ఏర్పాటైలేదు. కాని, మనస్సుకు ఊర్ధ్వమునుండి వచ్చునదియెల్ల సహస్రారచక్రమునే తనకు మార్గంగా ఉపయోగించుకొంటుంది. దాని అవతరణకు దారి సహస్రారంలోనే విచ్చుకుంటుంది.

## పరాపర చేతనలకు సేతువు

మనఃప్రాణ చేతనలతో కూడిన శరీరచేతనకూ, శరీరానికి ఊర్ధ్వమున గల పరాచేతనకూ నడుమ సేతువువంటిది కపాల స్థానం. ఈ ఉభయ చేతనలూ ఒండొంటిని కలుసుకొనేది ఇచ్చటనే.

## సహస్రార, ఆజ్ఞాచక్ర వికసన ప్రయోజనాలు

కపాలస్థానమందలి సహస్రదళపద్మం విచ్చుకుంటే. పరాచేతనకూ, సాధారణ మనస్సుకూ నడుమనున్న అచ్ఛాదనం తొలగించబడినట్లవుతుంది. భ్రూమధ్యమందలి ఆజ్ఞాచక్రం కూడా విచ్చుకుంటే పరాచేతనకూ, అంతర్బహిర్మనస్సులకూ సుస్పష్టమైన అనుసంధానం ఏర్పడే అవకాశం కలుగుతుంది. జ్ఞానోపలబ్ధికీ, మనఃప్రకాశన పరివర్తనములకూ ఇది అత్యంతావశ్యకం.

## హృదయపద్మ వికసన ప్రయోజనం

అనాహతమని పిలువబడే హృదయపద్మం విచ్చుకొన్నప్పుడు, అందు అంతర్గతుడై వున్న చైత్యపురుషుని ప్రభావం ప్రాణమయ చేతనపై పని చేయ నారంభిస్తుంది. మరుగుననుండే చైత్యపురుషుడు ముందుకు రావడమే పర్యవసానంలో దీనివలన కలిగే ప్రయోజనం.

## మెదడు స్వరూపలక్షణం

మెదడు అన్నమయ స్థూలచేతనా కేంద్రం మాత్రమే. స్థూల మనస్సులో మనం నివసిస్తూ దేహంతో తాదాత్మ్యం చెందివున్నంతకాలం మెదడే మనకు స్థావరమైనట్లు భావిస్తూ వుంటాము. దేహతాదాత్మ్యం తొలగి దేహంలో మనం నివసించడం లేదని తెలుసుకొన్నప్పుడు, మెదడు మన స్థావరమగుటకు బదులు సహస్రారం నుండి జరిగే ప్రసారణలకు వాహక మాత్రంగా మారిపోతుంది.

## ఆజ్ఞాచక్ర వికసన ప్రయోజనం

భ్రూమధ్యమునగల ఆజ్ఞాచక్రం విచ్చుకొనిన వానికి అంతర్దృష్టి కలుగుతుంది. సకల వస్తువులయు, వ్యక్తులయు. ఆంతర స్వరూపాల నతడు చూడగలుగుతూ, బయటినుండిగాక లోపలనుండి వాటి నవగాహన చేసుకొన నారంభిస్తాడు. ఆంతరికంగా వాటిపై తన ప్రభావం నెరపగల సంకల్పశక్తి అతనిలో పెంపొందుతుంది. సామాన్య మానసిక దృష్టికి అతీతమైన యోగదృష్టి అతనిలో వికసించడాని కది ప్రారంభం.

## ఆజ్ఞా సహస్రారములు, చైత్యపురుషుడు

ఆజ్ఞాచక్రం విచ్చుకొన్నదంటే, సహస్రారంకూడా తనకంటె పైనుండి ప్రసరించే శక్తికి దారియిచ్చే నిమిత్తం కొంతవరకైనా విచ్చుకొని వుండక తప్పదు. చైత్యపురుషస్థానం విచ్చుకొనడమనేది వేరు విషయం. అది చక్రములకు వెనుకగా వున్నది, అది విచ్చుకొనే సమయం సాధకుల తత్వాలనుబట్టి మారుతూ వుంటుంది. నిజానికది చక్రం విచ్చుకొనడం కాదు, చైత్య పురుషుడే ముందునకు రావడం.

## చక్రాల వికసనక్రమం

పూర్ణయోగంలో చక్రాల వికసనం సాధారణంగా పై నుండి క్రమశః క్రిందికే, ప్రారంభదశలో దీనికి ఒక్కొక్కప్పుడు మార్పులుండవచ్చు. ఉదాహరణకు, మొట్టమొదట హృదయపద్మం పాక్షికంగా వికసించవచ్చు, కొందరిలో మొదట నాభిపద్మం వికసించడం ఉన్నది. కాని, ఇందులో కష్టం చాల ఎక్కువ.

## విశుద్ధచక్రవికసన ప్రయోజనం

ఫాలమందలి ఆజ్ఞాచక్రం సూక్ష్మ మనస్సుకు స్థానంకాగా కంఠ మందలి విశుద్ధచక్రం స్థూలమనస్సుకు స్థానం. వాక్కులో బహిఃప్రకటనకు, స్థూలవిషయాలతో మానసిక వ్యవహారానికి అది సాధనం. అది వికసించడం జరిగినప్పుడు, స్థూలమనస్సు తన మామూలు బహిర్ముఖ, మానసిక వ్యాపారంలో నిమగ్నమై వుండడానికి బదులు దివ్యచైతన్య తేజఃప్రసారానికి దారి ఇవ్వగలుగుతుంది.

## మణిపూరక, స్వాధిష్ఠానాలు

ప్రాణమయ చేతనకు ప్రధానకేంద్రం నాభిపద్మం (మణిపూరకం)కాగా, దాని దిగువనున్న స్వాధిష్ఠానం అల్పములైన ప్రాణమయ ప్రవృత్తులకు కేంద్రం. ఈ అవసర ప్రాణశక్తియే మెదడులోనికి చొరబారి దానిని కలవర పెట్టడంద్వారా మనస్సంయమం తప్పేటట్టు చేయడమో, లేక మనస్సును తన బానిసగా నొనర్చుకొని తన ఉద్వేగాల సమర్థనకు హేతువాద ప్రజ్ఞను వినియోగించుకోడమో జరుగుతూ వుంటుంది.

## హృత్పద్మం - చైత్యపురుషుడు

భౌతిక హృత్పిండం యెడమ ప్రక్కన వుండగా, యోగపరిభాషయందలి హృత్పద్మం వక్షోమధ్యభాగాన వున్నది. అది చైత్యపురుషుని స్థానం. ఈ చైత్యపురుషుడే జన్మ కలిగినప్పుడెల్ల క్రొత్త దేహ, ప్రాణ, మనస్సులను సృష్టించుకొంటూ వుంటాడు.

## ప్రాణమయప్రవృత్తులకు నెలవులు

కడుపు, గుండె, ప్రేవులు ప్రాణమయ ప్రవృత్తులకు నెలవులుగాని, అన్నమయ చేతనకుగాదు. కోపం, భయం, రోగం, ద్వేషం—మొదలైన జంతు ప్రవృత్తులన్నీ ఇచ్చటనే చెలరేగుతూ శారీరికంగానే కాక నైతికంగా కూడా మనకు అజీర్ణం తెచ్చిపెట్టుతూ వుంటాయి.

## అన్నమయ చేతనకు నెలవు

వెన్నుపూస కొననున్న మూలాధారమే అన్నమయ చేతనకు నెలవు. స్త్రీ పురుష సంబంధమైన కామప్రవృత్తి కేంద్రంకూడా మూలాధారమే. కామం అచ్చటనుండియే పొటమరించి కర్మేంద్రియాన్ని నడిపిస్తుంది.

# కామవిజయసాధన

—o—

## కామవిజయావశ్యకత

అన్నమయ, ప్రాణమయ కోశములపై స్త్రీ పురుష సంబంధమైన కామ ప్రవృత్తి దాడి చేయడానికి పూర్ణయోగసాధకుడు ఎంతమాత్రమూ సంది వ్వరాదు. ఈ కామప్రవృత్తినతడు పూర్తిగా జయించని పక్షంలో శరీరము నందు దివ్యచేతన, దివ్యానందం కుదురుకొనడం అసంభవం.

## సాధనను అపమార్గం పట్టించే ప్రవృత్తి

ఈశ్వరునిపట్ల అనన్యప్రేమకు మాత్రమే పూర్ణయోగంలో స్థానం. మానవులు సామాన్యంగా ప్రేమయని పిలిచేది భౌతిక సుఖానికీ, ఇంద్రియ సుఖానికీ సంబంధించిన అన్యోన్య కామసంతృప్తి నిమిత్తమగు ఆదాన ప్రదానవృత్తి మాత్రమే. సాధకులమధ్య ఈ విధమైన ఆదానప్రదానం కూడదు. ఇది సాధనను అపమార్గం పట్టిస్తుంది.

## పూర్ణయోగ పరమాశయ సిద్ధికి అవరోధం

ఈశ్వరునకే సర్వసమర్పణ మొనర్చుకొని, ఈశ్వరశక్తితో ఏకత్వం పొందడం ద్వారా అతిమానసమైన తేజస్సును, శక్తిని, విశాలతను,

శాంతిని, ఆనందాన్ని, క్రిందికి గొనితేవడమే పూర్ణయోగ పరమాశయం గనుక, ఇందు ఇతరులతో ఇంద్రియసంబంధమైన సంసర్గలకూ, ఆదాన ప్రదానములకూ ఎంతమాత్రం తావులేదు. ఇవి ఆత్మను అవరచేతనతో బంధించి పైన పేర్కొన్న ఆశయసిద్ధికి అవరోధం కలిగిస్తాయి.

## కామోపభోగం ఏరూపంలోనూ కూడదు

సాధకుల నడుమ ఇంద్రియ సంబంధమైన అదానప్రదానం స్త్రీ పురుష సంబంధమైన కామోపభోగరూపం గైకొనడం మరీ ప్రమాదకరం. ఇట్టి ఆదానప్రదానం బాహ్యకర్మను వర్జించిన సందర్భంలో సైతం కూడనిదే. స్థూలరూపంలోనే కాక, ఏ సూక్ష్మరూపంలోకూడా సాధకులు దీనికి అవకాశ మీయరాదు.

## ఊర్ధ్వరేతస్కత కావాలి

ఊర్ధ్వరేతస్కులు కాజాలనంతవరకూ సాధకులు స్త్రీపురుష సంబంధ మగు కామప్రవృత్తిని పూర్తిగా జయించినట్టు కానేరదు. ఆ విధాన కామజయం సాధించినవారి రేతస్సు ఓజస్సుగా మారుతుంది. ఇందుకు భిన్నంగా ఏ సూక్ష్మరూపంలోనో కామోపభోగానికి తవు కల్పించుకొని అది కూడా సాధనలో భాగమే అని అనుకోడం మహా ప్రమాదకరం.

## కామోపభోగానందం దివ్యానందం కానేరదు

కామోపభోగమందలి ఆనందం దివ్యానందపు భ్రష్టరూపం అవుతుందే కాని నిక్కమైన దివ్యానందం కానేరదు. భౌతిక చేతనలో నిక్కమైన దివ్యానందాభివ్యక్తియొక్క లక్షణమే వేరుగా ఉంటుంది. కేవలం

ఈశ్వరునితో ఆంతరంగికైక్యాన్ని ఆధారం చేసుకొని ప్రకటితమయ్యే ఆనంద మది.

## విశ్వప్రేమలో కామోపభోగానికి తావులేదు

ఇంద్రియ సంబంధమైన కామోపభోగం దివ్యప్రేమలో అంతర్భాగం కానేరదు. దివ్యప్రేమ అన్నమయ కోశానికి దిగిరావడం సంభవించినప్పు డది ఇంద్రియసంబంధమైన నీచ ప్రవృత్తుల నెంతమాత్రమూ మేలుకొలుపదు. నీచ ప్రవృత్తులకు తావీయడం జరిగితే ఆ దిగివచ్చిన దివ్యప్రేమ తిరిగి అందరాని శిఖరాలకు తరలిపోవడం తథ్యం.

## దివ్యప్రేమావతరణకు ఏకమార్గం

ఈశ్వర సంబంధమైన దివ్యప్రేమ నీలోనికి అవతరించాలంటే, నీ హృదయాంతర్గత చైత్యపురుషుడు మరుగు వీడి ముందుకు రావడం తప్ప వేరు మార్గంలేదు. దివ్యప్రేమావతరణకు ఇంద్రియ సంబంధమైన కామప్రవృత్తి మిక్కిలి ప్రతిబంధకం. దానిని నీవు త్రోసిపుచ్చక తప్పదు.

## కామప్రవృత్తికేంద్రపు రూపాంతరీకరణ

స్త్రీ పురుష సంబంధమైన కామప్రవృత్తికేంద్రం శరీరంలోని అన్న, ప్రాణ, మనోమయ ప్రకృతిశక్తుల కన్నింటికీ ఆధారభూతంగా వుంటున్నది. కావున, శరీరసిద్ధికి ఈ కేంద్రాన్ని రూపాంతరం చెందించడం అత్యంతావశ్యకం. అతిమానసమైన దివ్యతేజశ్శక్త్యానందములను ఈ కేంద్రంలోనికి అవతరింప జేసినప్పుడే ఇది సాధ్యమవుతుంది.

## రూపాంతరంచెందిన కామప్రవృత్తి లక్షణం

కామ ప్రవృత్తికేంద్రం అతిమానస దివ్యతేజశ్శక్త్యానందములచే రూపాంతరం చెందించబడినప్పుడు, దాని ప్రవృత్తిలక్షణం సత్యజ్ఞాన దర్శనానికి అనుగుణమైనదిగా వుంటుంది గాని కామేచ్ఛాభోగములను ప్రేరేపించెడి అజ్ఞానాంధతమస్సుతో కూడినదై వుండదు. ప్రాణశక్తులను కూడగట్టి నిష్కామంగా స్వచ్ఛంద ప్రసారం చెయ్యడం ఆ సిద్ధావస్థలో జరుగుతుందిగాని, వాటిని వెలికి త్రోసిపుచ్చి నష్టపరచడం ఎన్నటికీ జరుగదు.

## పశుత్వవిస్తరణ కాదు కావలసినది

దేహేంద్రియ కామనల ఘనతర సంతృప్తియే అతిమానస దివ్యజీవన లక్షణమని భ్రమించబోకు. మానవుని యందలి పశుత్వాన్ని ఈ రీతిగా గొప్పచేయ నభిలషించడం అతిమానస దివ్యజీవనావతరణకు అత్యంత ప్రతిబంధకం. మనకు కావలసినది పశుత్వ, మానవత్వముల విస్తరణ కాదు, మానవత్వమునుండి దివ్యత్వములోనికి పరివర్తనం.

## కామప్రవృత్తి అంతరించని ఆధ్యాత్మికాభివృద్ధి

ఆంతరంగికానుభవానికీ, బాహ్యచేతనకూ ఒక విధమైన వేర్పాటును కొనసాగిస్తూ సాధకుడు బాహ్యచేతనను రూపాంతరం చెందించడానికి గాక అదుపులో పెట్టడానికిమాత్రం ప్రయత్నిస్తూ వుండే పరిస్థితిలో కామప్రవృత్తి తనలో పూర్తిగా అంతరించకపోయినా ఆధ్యాత్మికానుభవాలను పొందుతూ అతడు అభివృద్ధిని సాధించ వీలున్నమాట నిజమే. కాని ఈ విధమైన సాధనను సమగ్రంగా కొనసాగించగలవారు చాలా కొలదిమంది మాత్రమే.

## కామప్రవృత్తిని ఉపేక్ష చేయరాని పరిస్థితి

సాధకుని అంతరంగికానుభవాలు మనోమయ భూమికకు పరిమితమై ఉన్నంతకాలం కామప్రవృత్తి ఉపేక్ష చేయబడినా, ఆ అనుభవాలు ప్రాణమయ, అన్నమయ భూమిలకు విస్తరించడం మొదలైనప్పుడు మాత్రం దానిని ఆ రీతిగా ఉపేక్ష చేయడానికి వీలులేదు. ఏలనంటే, ఆ పరిస్థితి యందు కామప్రవృత్తి సాధనను ఎంతైనా చీకాకుపరచి చిందరవందర చేయగలదు.

## ప్రధాన పతనహేతువు

అహంకారమూలకమైన గర్వాదులవలెనే స్త్రీపురుష సంబంధమైన కామప్రవృత్తి కూడా ఆధ్యాత్మిక సాధనలో పెక్కండ్ర పతనానికి ప్రధానంగా హేతుభూతం కావడం నే నెరుగుదును. ఆ ప్రవృత్తికి పూర్తిగా ఉద్వాసన చెప్పకుండ దానితో నిస్సంగంగా వ్యవహరించవలెననెడి ప్రయత్నం వితథంకాకతప్పదు. అట్లే, ఆ ప్రవృత్తికి ఆధ్యాత్మికోన్నతి కల్పించి దానితో వ్యవహరించవచ్చుననెడి ప్రయత్నంకూడా మహా ప్రమాదకరం.

## ప్రమాదభూయిష్ఠమైన పద్ధతి

ఆధ్యాత్మికతనూ, కామప్రవృత్తినీ మిశ్రమం చేయడంవలన కలుగగల అనర్థం ఇంతా అంతాకాదు. వైష్ణవ మధుర భావంలోవలె, భగవదున్ముఖ మొనరించడంద్వారా కామప్రవృత్తికి ఉన్నతికల్పించేప్రయత్నంలోసైతం మిక్కుటమైన ప్రమాదమున్నది. ఈపద్ధతివక్రమార్గంపట్టి విపరీత ఫలితాల నిచ్చిన సందర్భా లనేకం.

## కామప్రవృత్తిని పూర్తిగ జయించకపోతే—

పరమేశ్వరుని నిజతత్వానుభూతిని పొందటమే కాక, మన యావత్ప్రకృతినీ రూపాంతరం చెందించడం పూర్ణయోగ లక్ష్యంగనుక, ఈ యోగ సాధనలో కామప్రవృత్తిని సంపూర్ణంగా జయించడం అత్యంతావశ్యకం. లేనియెడల మన ప్రాణమయచేతన దోషదూషితంగానే ఉండిపోయి ఊర్ధ్వముఖంగా మన శరీరశక్తుల ఉన్మీలనం తన్మూలంగా నిరుద్ధం కావడం సంభవిస్తుంది.

## నిక్కమైనకామవిజయసాధన హానికరంకాదు

కామప్రవృత్తిని పైకిమాత్రం అణచివేసి లోపల ఇతర విధాలుగా దానిని అనుభవింపజూచేయెడల అది పెక్కు వ్యాధులకు దారితీసేమాట నిజమే. అట్లుగాక దానిపై సంపూర్ణవిజయం సాధించాలనెడి లక్ష్యంతో నిక్కమైన ఆధ్యాత్మిక కృషి యొనర్చెడివారికి మాత్రం దానివలన ఎట్టి హానియు కలుగబోదు.

## కామవిజయానికి సాధనప్రక్రియ

అసంగత్వము, నిరాకరణము,— ఈ రెండింటినీ జతగూర్చిన సాధన ప్రక్రియద్వారా కామవిజయమును సాధించవలసి వున్నది. కామ ప్రవృత్తినుండి చేతన వేరై నిలవబడి అది తనకు పరాయి వస్తువని తలంచడం అసంగత్వం, అట్లు పరాయి వస్తువుగా తలంచినదానికి తన సమ్మతినీ అనుమోదాన్నీ ఇవ్వ నిరాకరించడం నిరాకరణం.

## కామవిజయసాధనలో దశలు

అసంగత్వంతో పాటు నిరాకరణం కూడా జరుగుతున్న ప్రతిసారీ కామ

ప్రవృత్తి అంతకంతకు వెలికి నెట్టివేయబడుతూ వుంటుంది. తొలుత మనోమయచేతన దానినుండి విముక్తమవుతుంది. పిమ్మట కామప్రవృత్తికి ముఖ్యాధారమగు ప్రాణమయ చేతనకూడా దాని ప్రభావంనుండి వైదొలగుతుంది, తుదకు అన్నమయ చేతన సైతం దానికి బలమీయడం మానివేస్తుంది. స్వప్నంలో అవచేతనచే అది మేల్కొలుపబడకుండేటంత వరకూ కూడా ఈ సాధన ఇట్లు సాగవలసినదే.

## కష్టసాధ్యమేకాని అసాధ్యం కాదు

కామప్రవృత్తిని పూర్తిగా నిర్మూలించడం సాధనయం దత్యంత కష్టసాధ్య విషయములలో నొకటియనే మాట నిజమే. కావుననే, దానికి కొంతకాలం పట్టక తప్పదని గ్రహించి సాధకుడు ఓపికపట్టడం అవసరం. అవచేతననుండి సకృత్తుగా ఉద్భవించే స్వప్నవృత్తుల రూపంలో మినహాయించి మరి యెచ్చటనూ ఈ కామప్రవృత్తి పొడ కాన రాకుండేటట్లు దీనిని నిర్మూలించిన సాధకులు మిక్కిలిగానే వున్నారు.

## అవరప్రకృతిలోని పొరపాటువృత్తి

కామప్రవృత్తి అనేది ఆదేదో భయంకరమైన పాపవృత్తి యనిగాక, అవరప్రకృతిలోని ఒక పొరపాటు వృత్తియని భావించి. దానిని నీవు పూర్తిగా త్రోసిపుచ్చడం నేర్చుకోవాలి. ఇందుకు నీవు దానితో పెనుగులాడవలసిన పని ఏమీలేదు. నీకు వెలియైన ప్రకృతిశక్తిచే నీపై విధించబడిన పరాయి వస్తువుగ దానిని పరిగణిస్తూ దానినుండి వేరుపడి దానికి నీ సమ్మతినొసగ నిరాకరించడమే నీవు చేయవలసినది.

## పట్టువీడని ప్రయత్నం అవసరం

నీ ప్రాణమయ చేతనలోని ఏ భాగమైనా కామప్రవృత్తికి సమ్మతి నివ్వడం జరుగుతూ వుండేయెడల అట్టి సమ్మతిని ఉపసంహరించుకునే టట్లుగా ఆభాగముపై నీవు ఒత్తిడి తీసుకురావడం అవసరం. ఈశ్వర శక్తి సహాయంకూడా అర్థించుకుంటూ నెమ్మదిగా, ఓపికతో పట్టు వీడ కుండా ఈ కామవిజయ సాధనము నీవు కొనసాగించే పక్షంలో తుట్ట తుదకు నీ ఆంతరంగిక సంకల్పమే జయించి తీరుతుంది.

## నిద్రలో కామప్రవృత్తిని జయించే ఉపాయం

జాగ్రదవస్థలో పరిత్యక్తమైన కామప్రవృత్తి నిద్రావస్థలో తలయెత్తుతూ వుండడమనేది సర్వసామాన్య విషయమే. ఈ పరిస్థితిని చక్కదిద్దడానికి. జాగ్రత్తులోవలె నిద్రలోకూడా సాధన తీరుతెన్నులు గుర్తించగలుగుతూ వుండే అంతశ్చేతన ద్వారా నిద్రలోసైతం అంతకంతకు ఎరుకను వృద్ధి పొందించుకుంటూ జాగ్రత్తులోని సంకల్పశక్తి నిద్రలో శరీరంపైన పని చేసేటట్లు చేసుకోడం అవసరం.

## నిద్రించేముందు దేహానికి సూచన ఇచ్చే పద్ధతి

జాగ్రత్తులోని సంకల్పశక్తి నిద్రలో శరీరంపైన పనిచేసేటట్లు చేయా లంటే, నిద్రపోయేముందు కామసంబంధమైన కలలు రాగూడదంటూ దేహానికి బలవత్తరమైన సూచన ఇవ్వడం ఒక మంచి ఉపాయం. కామ ప్రవృత్తికేంద్రాన్ని లక్షిస్తూ ఈసూచనను ఎంతసూటిగా చెయ్యగలిగితే అంత మంచిది. దీని ఫలితం వెంటనే మొదట్లో కనిపించకపోయినా,

సూచన ఎట్లా చెయ్యాలో కుదిరే పక్షన తప్పక అది తుదకు విజయ సాధకం అయితీరుతుంది.

## సకాలంలో అంతశ్చేతన మేల్కొలుపు

నిద్రలో కామసంబంధమైన కలలు రాగూడదంటూ నిద్రపోయేముందు శరీరానికి చేసిన సూచన, ఒకవేళ అట్టి కలలను నివారించేటంతటి బలం కలిగినది కాకపోయినా, అంతశ్చేతనను సకాలంలో మేల్కొలిపి తద్వారా వాటి దుష్ఫలితాలను నివారించడం తరుచుగా జరుగుతూవుంటుంది. ఇదికూడా సాధనలో ఒక ముఖ్య పరిణామమే.

## సాధనకు తీవ్రప్రమాదం

కామప్రవృత్తికి మనోమయ, ప్రాణమయేచ్ఛల సమ్మతి లభిస్తూవున్నంత కాలం సాధనకు తీవ్ర ప్రమాదం ఉన్నట్లే భావించవలసి వుంటుంది. ఒకవేళ కామప్రవృత్తికి మనస్సు తన సమ్మతి నీయ నిరాకరించి త్రోసి పుచ్చినా ప్రాణకోశం దాని నామోదించడం జరిగేయెడల, ప్రాణమయేచ్ఛా రూపమైన పెద్ద కెరటంగా అది పొంగివచ్చి తన ఉరవడిలో మనస్సును సైతంవూడ్చిపెట్టడానికి ప్రయత్నించడం సహజం.

## ప్రాణకోశ విభాగములనుండి త్రోసిపుచ్చబడినప్పుడు

ప్రాణమయకోశపు ఊర్ధ్వాధో విభాగములలో ఊర్ధ్వవిభాగము నుండి కామప్రవృత్తిత్రోసిపుచ్చబడినప్పుడది అధోభాగము నాశ్రయించి అచట

చిన్నచిన్న ప్రేరణల రూపంలో పొడసూపుతూ వుంటుంది. అక్కడ నుంచి కూడా అది త్రోసిపుచ్చబడినప్పుడు, ఇంకనూ క్రిందికి అన్నమయకోశంలోనికి దిగజారుకొని, అచటి కామప్రవృత్తి కేంద్రమున యంత్రప్రాయమైన స్పందనల రూపంలో ద్యోతకమవుతూవుండడం దాని స్వభావం.

## అధోభూమికలందు దాగే కామప్రవృత్తి స్వభావం

అన్నమయకోశం నుండి కూడా త్రోసిపుచ్చబడిన కామప్రవృత్తి అవచేతనలోనికి తిరోగమించి అటనుండి స్వప్నముల రూపములో బహిర్గతం కావడం జరుగుతూ వుంటుంది. ఇలా ఎక్కడెక్కడకు తిరోగమించినా అక్కడక్కడినుండియే సాధకుని కలవరపెట్టుతూ అతనిలోని ఉన్నత విభాగముల సమ్మతిని తిరిగి సంపాదించడానికి ప్రయత్నించడం దాని స్వభావం. అవచేతననుండియేకాక పరిసరచేత ననుండి కూడా అది త్రోసిపుచ్చబడినప్పుడే దానిపై సంపూర్ణవిజయం సాధకునికి సిద్ధించినట్లు.

## ప్రేమరాజ్యంలో కామానికి చోటీయరాదు

హృదయపద్మంలోనుండి నిస్సృతమయ్యే ప్రేమ ప్రవృత్తిని సాధకుడు ప్రాణకోశ నిష్ఠమగు కామప్రవృత్తిచే ఎంతమాత్రం కలుషితం కానివ్వరాదు. ప్రేమరాజ్యానికి కామం తీవ్రమైన విఘాతం కల్పిస్తుంది. దివ్యశక్తి అవతరణం జరిగినప్పుడు వ్యక్తిగత స్వార్థముల నెట్లు తలయెత్త నివ్వరాదో అట్లే ప్రేమావిర్భూతియందు కామ ప్రవృత్తికి చోటివ్వడం ముమ్మాటికీ తగదు.

## ప్రాణాయామంవలన
## కామం నిర్మూల మౌతుందనలేము

యోగాసనాలు, ప్రాణాయామం మొదలైన అభ్యాసములు కామ ప్రవృత్తిని తప్పనిసరిగా నిర్మూలం చేస్తాయని చెప్పవలనుపడదు. శరీరంలోని ప్రాణశక్తి విస్తారంగా పెరగడానికి దోహదమై ఒక్కొక్కప్పుడవి కామ ప్రవృత్తిని నిర్మూలించడానికి బదులు విపరీతంగా ప్రకోపింప చెయ్యడంకూడా జరగవచ్చు.

## మొదట చేయవలసినది

కామప్రవృత్తిని జయించగోరు సాధకుడు మొదట ఆ ప్రవృత్తి నుండి వేరై తన అంతరాత్మను గుర్తించుకొని అందు కుదురుకొనడం నేర్చుకోవాలి. అలా చేసినప్పుడు, కామ ప్రవృత్తి ఇక తనదిగాగాక, బాహ్య ప్రకృతిచే ప్రేరితమైన పరాయివృత్తిగా గోచరమవుతుంది. కామప్రవృత్తిని త్రోసిపుచ్చడంగాని నిర్మూలించడంగాని అటు తర్వాత సులభం.

## తిండి తగ్గింపు పరిమితప్రయోజనకారి మాత్రమే

తిండి తగ్గిస్తే కామం పూర్తిగా జయించబడుతుందనుకోడానికి వీలులేదు. తిండి తగ్గింపువలన శరీరశుద్ధి కొంత కలిగినట్లయి, ఒడలు తేలికపడి, కొన్నిరకాల తమస్సు పలుచన కావడం జరగవచ్చు. కాని, తిండి తగ్గిన పరిస్థితియందుకూడా చక్కగా చోటుచేసుకోగల సామర్థ్యం కామానికున్నది. కామజయం చేతనలో మార్పువలన సాధించబడవలసినదేకాని యిట్టి భౌతిక సాధనలవలన కాదు.

వట్టి మానసిక సంకల్ప బలంచేత కామప్రవృత్తిని పూర్తిగా నిర్మూలించడం ఎన్నటికీ సాధ్యంకాదు. జీవితాన్ని రూపాంతరం చెందించడం గాక జీవితంనుండి ఉపసంహరించడం మాత్రమే యోగసాధన లక్ష్యమైనప్పుడు ఆ లక్ష్యసాధన మేరకు కామప్రవృత్తిని మానసిక సంకల్ప బలంచేత అదుపులోపెట్టి నిద్రావస్థలో నుంచడం ప్రయోజనకారిమే కావచ్చు.

## కామప్రవృత్తిని వ్యయింప జేయదలచే సాధన

కొందరు సాధకులు తమలోని కామ ప్రవృత్తి దానంతటదే వ్యయించిపోగలదనెడి దృష్టితో దానిని అణచివేయ యత్నించక కొనసాగనిస్తూ దాని తగులం తమకేమీ లేదని ప్రకటించుకొనడం కద్దు. పూర్వసంస్కార బలంచేత ప్రవర్తిల్లే ఆ ప్రవృత్తి శరీరపతనంతో తుదకు తానుకూడ రాలిపోతుందని వారి నిశ్చయం.

## కొందరు సాధకుల ద్వంద్వజీవితం

ఒక వైపున ఆధ్యాత్మికానుభవాలతోనూ, వేరొక వైపున కామ ప్రవృత్త్యాది రూపక దౌర్బల్యాలతోనూ కొందరు సాధకులు ఆంతరంగికంగా ఒకవిధమైన ద్వంద్వజీవితం గడుపుతూ వుండడం కద్దు. ఆధ్యాత్మికానుభవాలకే విశేష ప్రాధాన్య మిచ్చుకుంటూ దౌర్బల్యాలను అంతగా పాటించకుండే అభ్యాసం వీరు చేస్తూవుంటారు.

# ఒక్కటే మార్గం

కామాది అవరప్రవృత్తులపై సంపూర్ణ విజయం సాధించి వాటిని రూపాంతరం చెందించాలంటే ఒక్కటే మార్గమున్నది. నీలోని చైత్యపురుషుని నీవు పూర్తిగా మేల్కొననివ్వాలి. అట్లు మేల్కొన్న చైత్యపురుషుడే ఏలికయై నీలోని సమస్తమునూ ఈశ్వరశక్తిసంస్పర్శకు ఉన్ముఖమొనర్చి, తన అనన్య భక్త్యాకాంక్షలతో నీ బుద్ధినీ, హృదయాన్నీ, ప్రాణ ప్రవృత్తులనూ సంపూర్ణంగా ప్రభావితం చెయ్యనివ్వాలి. 'నాన్యః పంథా విద్యతేఽయవాయ.'

# అనుభూతులు : సాక్షాత్కారాలు

—: o :—

## అనుభవము - సిద్ధి

అనుభవమనే పదం యోగసాధనలో సంభవించే ఘటనలకు అన్నింటికీ సామాన్యంగా వర్తిస్తుంది. అనుభవం స్థిరపడినప్పుడు దాని కిక అనుభవ మనే పేరుండదు. అది సిద్ధిలో అంతర్భాగం అవుతుంది. ఉదాహరణకు, శాంతి అనేదానికి రాకపోకలున్నంతవరకూ అది అనుభవం. అదే స్థిర పడిన యెడల సిద్ధి.

## సాక్షాత్కారం

దేనిని నీవు ఆకాంక్షిస్తున్నావో అది నీకు సత్యమై పొడగట్టినప్పుడు అదియే సాక్షాత్కారం. ఉదాహరణకు, భగవంతుడు అంతటా ఉన్నాడనే భావం ఉన్నది. మొదట్లో అది ఒక విశ్వాసము, నమ్మిక మాత్రమే. అట్లుగాక భగవంతుడు అంతటా ఉన్నట్లు నిక్కముగా నీకు పొడగట్టి నప్పుడు, భగవంతుని అంతటా నీవు నిక్కముగా చూడ గలిగినప్పుడు, అది సాక్షాత్కారం.

## పరిపూర్ణ సాక్షాత్కారంగా అనుభవాల పరిణతి

దేహప్రాణ మనశ్చేతనలయం దెచ్చటనైనా ఒక సత్యం యొక్క అను భవం కలిగితే అది దాని సాక్షాత్కారానికి ఆరంభదశ. శాంతి అనే అను

భవం నాకు కలిగినప్పుడు, దాని సాక్షాత్కారం నేను పొందసాగించా నన్న మాట. అనుభవం పునరావృత్తమైనకొలదీ సాక్షాత్కారం బలపడుతూ వుంటుంది. అనుభవం స్థిరపడిపోయినప్పుడు ఆ చేతనా విభాగంలో దాని సాక్షాత్కారం పరిపూర్ణమౌతుంది.

## ఆధ్యాత్మికత

అహంకారంకంటె వేరైన ఒకానొక చేతనను గురించిన యెరుక నీలో వికసింపనారంభించి, దాని ప్రభావంలో నీ వంతకంతకు నిమగ్నుడ వౌతున్నట్లయితే, అదియే ఆధ్యాత్మికత. విశాలము, అనంతము, స్వయం భువము, అహంకార వివర్జితమునైన ఆ చేతనయే ఆత్మయని (బ్రహ్మ మనీ, ఈశ్వరుడనీ) పిలువబడుతున్నది. కావున ఆధ్యాత్మికత అనుదాని లక్షణం ఇదేయని చెప్పక తప్పదు.

## ఆధ్యాత్మికానుభూతులు

ఆధ్యాత్మికానుభూతులు అనేక విధములు. అంతా బ్రహ్మమయమైనట్లు, ఏదో శక్తి తనలోనికి ప్రవేశిస్తున్నట్లు, తన లోపలగాని వెలుపలగాని ఈశ్వరుడు సన్నిధి చేసియున్నట్లు, ఏదో తేజస్సు తనలోనికి అవతరిస్తు న్నట్లు, అట్లే శాంతి, లేక ఆనందం తనలోనికి దిగివస్తున్నట్లు, తాను సువిశాలుడై తన శరీరం ఆ విశాలతలో అల్పాంశమైనట్లు—ఈ మొద లైన స్ఫురణలు, దర్శనాలు సాధకునకు కలుగుతూ వుండేయెడల ఇవన్నీ ఆధ్యాత్మికానుభూతులే.

## అంతఃస్ఫురణలరూపంలో యోగానుభూతులు

చేతనావికాసస్ఫురణం సాధకులకు హృదయస్థానంలో కలుగవచ్చు.

శిరఃస్థానంలో కలుగవచ్చు. ప్రాణమయ, అన్నమయకోశస్థానాలలో కలుగవచ్చు. ఈ రీతిగా నానావిధములైన స్ఫురణలూ యోగానుభూతులే. కానైతే ఇవి అంతఃస్ఫురణలుగాని శీతలవాయు స్పర్శలవంటి బాహ్య స్ఫురణలుకావు. కాని, యీ అంతఃస్ఫురణలు గంభీరమైన కొలదీ బాహ్య స్ఫురణలకంటె కూడా స్పష్టతరమై గోచరిస్తాయి.

## ఈశ్వరసాక్షాత్కారములకై తొందరపాటు కూడదు

ఈశ్వరసాక్షాత్కారం, అక్షరబ్రహ్మ సాక్షాత్కారం, ఆత్మసాక్షాత్కారం వంటివి సామాన్యంగా సాధనారంభ దశలోనే ఎవరికోతప్ప కలుగవు. అవి త్వరలో కలగాలని సాధకుడు తొందరపాటు చెందడం మంచిది కాదు. సాధనయందభివృద్ధి తొలిసంవత్సరాలలో నెమ్మదిగా కలుగడమే శ్రేయస్కరం. ప్రకృతిని సన్నద్ధం చేసి పూర్తిగా ఈశ్వరాయత్త మొనర్చినప్పుడే సాక్షాత్కారాలు సహజంగానే కలుగుతాయి.

## అనుభూతుల వివేచన

తనకు కలిగే అనుభూతులు నిక్కమైనవో కావో సాధకుడు వివేచించుకో గలిగి వుండడం అవసరం. ఇందుకు అతనిలో చిత్తశుద్ధి అనేది ముఖ్యంగా ఉండాలి. ఈశ్వరదర్శనం చేయడం, ఈశ్వర చైతన్యమందు నెలకొనడం వంటి లక్ష్యములందభినివేశంకంటె, తాను మహాయోగి కావాలనెడి అహంకార మతనిలో ప్రాబల్యం వహించేయెడల, మిథ్యానుభూతులెన్ని అయినా అతనికి కలుగడానికవకాశం ఉన్నది.

## అనుభూతులకోసం అత్యాతురత కూడదు

అనుభూతులకోసమై అత్యాతురత చెందవద్దు స్థూల మనస్సుకూ, సూక్ష్మ

భూమికలకూ మధ్యనున్న అడ్డుగోడ ఛేదించబడినప్పుడు. అనుభూతులు ఎలాగూ వాటంతటవే కలుగుతాయి. అనుభూతులను స్వీకరించే చేతన నీలో అందుకుతగిన యోగ్యతను పెంపొందించుకొనేటట్లు జాగరూకత వహించడమే నీవిప్పుడు ముఖ్యంగా చేయవలసినది.

## ఆధ్యాత్మికానుభూతులను తట్టుకొనే యోగ్యత

బుద్ధియందు సదసద్వివేకం. నీ లోపలా బయటా జరిగే సమస్తమునూ నిర్లిప్తతతో తిలకించే సాక్షిత్వం, సహనం, గర్వరాహిత్యం, అన్నిటి కంటె ముఖ్యంగా అంతరాత్మను ఉన్మీలన మొనర్చుకొనడం, అట్టి ఆత్మోన్మీలనపూర్వకమైన భక్తి ప్రపత్తులు — ఈ అన్నింటిలోనూ నీ చేతన పదనుదేరినప్పుడు, ఆధ్యాత్మిక భూమికలనుండి కట్టలు త్రెంచు కొని వచ్చే వెలుగులను, శక్తిని, అనుభూతులను అది బాగుగా తట్టుకుని సుస్థిరమై నిలువగలుగుతుంది.

## అనుభూతులు కలగడంలో రెండు పద్ధతులు

అనుభూతులు కొందరు సాధకులకు వారి ప్రకృతి విభాగములు విశుద్ధ ములై తగిన యోగ్యతను సంపాదించుకొనక ముందే కలుగుతాయి. ఇతరుల కవి అట్టి విశుద్ధకార్యక్రమం దీర్ఘకాలం కొనసాగిన పిమ్మట గాని కలుగనేరవు. ఈ ఉభయ పద్ధతులలోనూ మొదటిదానికంటె రెండ వదే సాధకుని కెక్కువ క్షేమకరం.

## ఆధారశుద్ధి, ప్రశాంతి అత్యంత ముఖ్యం

దర్శనాలు, అంతర్వాణులు, శక్తులు,—వీటికంటె, సాధనారంభదశ యందు ముఖ్యంగా కావలసినది ఆధారశుద్ధి, ప్రశాంతి. అపరిశుద్ధమై,

అశాంతినిలయంగావున్న చేతనస్థంపు కలిగేదర్శనాది అనుభూతులు సాధారణంగా దోషసమ్మిశ్రితములై వుంటాయి.

## మానసిక సాక్షాత్కారాలు

మానసికసాక్షాత్కారాలు ప్రారంభదశలో ఆధ్యాత్మికానుభూతులకు పూర్వరంగంగా ఉపయోగకరములే. కాని, ఒక్కొక్కప్పుడవి ప్రతిబంధకములు కూడా కావచ్చు. సాధకుడు వివేకశూన్యుడై మానసిక సాక్షాత్కారాలతోనే నిలిచేపోయే యెడల అసలైన సత్యసాక్షాత్కారమతనికి కడుదూరంలోనే ఉండిపోతుంది.

## సాధకలోకపు సామాన్యానుభవం

హృదయంలో వినమ్రత, ఈశ్వరేచ్ఛ ఎలావుంటే అలా జరగనిమ్మనే ప్రవృత్తి నీలో ప్రతిష్ఠించుకో. ఈశ్వరునియెడ భక్తి విశ్వాసములు మొదలైనవి తరువాత వాటంతటవే నీలో బలపడుతాయి. వాటి వరప్రసాదంగానే ఆత్మజ్యోతి, ఆత్మానందం నీలో భాసిస్తుంది. ఆ స్థితిని ఇక ఏ ఇతరశక్తులూ భంగపరచలేవు. ఇది సర్వసామాన్యంగా సాధకుల అనుభవం.

## హృదయపారిశుద్ధ్యసాధన

హృదయ పారిశుద్ధ్య సాధనకు నిర్దుష్టమైన నిజాయితీ అత్యంతావశ్యకం. సాధకుడు ఆత్మవంచనకెంతమాత్రమూ పాల్పడరాదు. తన యెదుటగాని, భగవంతుని యెదుటగాని గురువు ఎదుటగాని, దాచుకునేదేదియూ

నుండకూడదు. తన అంతరంగ ప్రవృత్తు లన్నింటినీ సూటిగా కను పెట్టుతూ వాటిని చక్కదిద్దుకోడానికి సూటిగా పూనిక వహిస్తూ వుండాలి. ఈశ్వర సాక్షాత్కారమే జీవితలక్ష్యంగా పెట్టుకొని యీ సాధన చేస్తున్నప్పుడు ఫలసిద్ధికి ఎంతకాలం పట్టినా చింతించవలసిన పనిలేదు.

## ఈశ్వరుడు సంతుష్టుడయ్యే పరిస్థితి

పరిశుద్ధ హృదయంతోనూ, సత్యసంకల్పంతోనూ సమ్యగ్వైఖరి నవలం బించి సాధనయందు నీవు నిష్ఠుడవైనప్పుడు, ఆధ్యాత్మిక స్ఫురణలూ, సంకేతాలూ నీ లోపలనుండి పొటమరించి అంతకంతకు పరిస్ఫుట మవుతూ నీ యందు దీపించ నారంభిస్తాయి. వాటిని గ్రహించి అను సరించే సామర్థ్యం పైతం నీలో వృద్ధిచెందుతుంది. అట్టి పరిస్థితుల యందే ఈశ్వరుడు నీయెడ సంతుష్టుడై నిన్ను ఆవరించియుండిన ముసుగును క్రమంగా తొలగించడం మొదలుపెట్టుతాడు.

## సంపూర్ణ సమర్పణ

భయంతోగాని, విధి నిర్వహణ దృష్టితోగాని చేసే సమర్పణ, సమర్పణ కానేకాదు. సమర్పణకూ ఈ లక్షణాలకూ ఎలాంటి సంబం ధమూ లేదు. సంపూర్ణ సమర్పణ సామాన్యంగా అందరూ అనుకునే టంత తేలికకాదు. నీవు చేసే సమర్పణలో నీకు తెలియకుండానే ఏవో మినహాయింపులు ఉంటూనే ఉంటాయి. సంపూర్ణమైన ప్రేమ, భక్తి అలవడినప్పుడే సంపూర్ణమైన సమర్పణ సాధ్యమవుతుంది.

## దివ్యచేతనకు దారియైన ఖాళీస్థితి

మురికినీటితో నిండిన గిన్నె వంటిది మానవ ప్రకృతి. దానిని దివ్యామృతంతో నింపవలెనంటే, మురికినీటిని ఆవల పారబోసి గిన్నెను ఖాళీగా, పరిశుభ్రంగా వుంచవలసి వుంటుంది. అయితే, మానవుని స్థూల చేతనకు ఈ ఖాళీస్థితిని భరించడం చాల దుస్సహంగా వుంటుంది. దివ్యచేతనకు దారియనేడి నిశ్చయంతో సాధకుడీ ఖాళీస్థితిని భరించ నేర్చుకోడం అవసరం.

## అనుభూతిని గోప్యంగా ఉంచాలనే నియమం

సాధన కొనసాగుతున్నప్పుడు, సాధకుడు తన అనుభూతిని గురువుకు తప్ప మరి ఎవ్వరికీ చెప్పరాదనే నియమం సామాన్యంగా యోగులు విధిస్తూ వుంటారు. అలా చెప్పడంవల్ల, అనుభూతి వ్యర్థమవుతుందనీ తపస్సు క్షయిస్తుందనీ వారి ఉద్దేశం. అందుచే, గీతంలో ఏనాడో కలిగిన అనుభూతులను గురించి మాత్రం సాధకుడు ఇతరులతో తగుమాత్రంగా ముచ్చటించడం జరుగుతూవుంటుంది.

## శిష్య పరిగ్రహణం

శిష్యులను పరిగ్రహించేవాడు తన కష్టాలతోపాటు తన శిష్యుల కష్టాలను గూడ తనమీద వేసుకొంటాడని యోగులు చెపుతూవుంటారు. అందుచేతనే, సిద్ధుడైనవాడు తప్ప శిష్య పరిగ్రహణం చెయ్యరాదని హెచ్చరిక చెయ్యబడింది. అప్పుడైనా శిష్యులను పరిగ్రహించవలసిందిగా ఈశ్వరాదేశం వచ్చినప్పుడే.

## అనుభూతి సిద్ధిగా మారినప్పటి విశిష్టత

అనుభూతులను పొందుతూవుండే సాధకుడు వాటిని ఇతరులకు వెల్లడించినప్పుడు ఆ అనుభూతి ప్రవాహం ఆగిపోయిన సందర్భాలనేకం వున్నమాట నిజమే. కాని, అనుభూతి స్థిరమైన సాక్షాత్కారంగా — సిద్ధిగా మారి, శాశ్వతమైన పరిణామ విశేషంచే చేతన దీపించేటప్పుడు ఈ నియమం అచట ఎంతమాత్రమూ వర్తించదనియే చెప్పవచ్చు.

# దర్శనములు : ప్రతీకలు

—o—

## 'దర్శనాల' రూపంలో యోగానుభూతులు

యోగసాధనలో 'దర్శనాలు' అనబడేవన్నీ ఏదో ఒక విశేషార్థం కలవిగానే ఉంటాయి. ఈ దర్శనశక్తి సాధనలో అత్యంత ముఖ్యమైనది కాకపోయినా (అత్యంత ముఖ్యమైనది చేతనలో పరివర్తనం) ముఖ్యమైన వాటిలో ఒకటే గనుక ఇట్టివాటిని సాధకుడు త్రోసిపుచ్చక, సాధనకుపయోగించే యోగాంగములుగానే పరిగణించి నిస్సంగుడై వికసింపచేసుకోడం అవసరం.

## సాధనారంభదశలోని దర్శనాలు

సాధనారంభదశలో కలిగే దర్శనాలు విశేషభాగం మనో భూమికయందు రూపొందినవిగా వుంటాయి. ఇట్టి దర్శనాలు ఆయా సాధకుల మనోలక్షణాన్ని విశేషంగా ఆశ్రయించి వుంటాయిగనుక, వీటియందు నిష్కృష్టమైన విశేషార్థదర్శనం చెయ్యడం సర్వత్రా సాధ్యంకాదు పరిణామదశలో పెంపొందిన దర్శనశక్తి మాత్రమే సాధనలో విశేష ప్రాముఖ్యం వహిస్తుంది.

## సాధనలో కనిపించే వెలుగులు

సాధకునికి సాధనలో తరచుగా వెలుగులు కనిపించడం ఏమి సూచి

స్తుంది: ఆ వెలుగులను చూచేవాడు కేవలమూ బాహ్యచేతనకూ, జాగ్రచ్చేతనకూ పరిమితుడు కాదనీ, అంతశ్చేతనానుభవ భూమికల లోనికి ప్రవేశించగల శక్తి అతనిలో గర్భితమై వున్నదనీ అది సూచి స్తుంది. యోగాభ్యాసం ఆ శక్తిని అతనిలో వికసింపజెయ్యడానికే,

## అంతరాంతర చేతనలోనికి ప్రవేశం

అంతశ్చేతనానుభవ భూమికలలోనికి ప్రవేశించడమే ఆధ్యాత్మిక జీవనం కానేరదు. ఆధ్యాత్మిక జీవనానికి సాధకుడు ఇంకనూ లోనికి— అంత రాంతర చేతనలోనికి ప్రవేశించడం అవసరం. అట్టి అంతరాంతర చేతనానుభూతియందే అతనికి ఆత్మదర్శనం, బ్రహ్మదర్శనం, ఈశ్వర దర్శనం కలుగుతుంది.

## దర్శనాల వివేచన

దర్శనాలు కలగడం మంచిదే. కాని, అన్ని దర్శనాలూ భౌతిక జగత్తులో నిజమవుతాయని ఆశించరాదు. కొన్ని నిజమవుతాయి, చాలభాగం కావు. మరికొన్ని కేవలం పరా భూమికలకు చెంది అచటి సత్యాలను సూచిస్తాయి. సాధకుని జీవితంపై వీటి ప్రభావం ఏరీతిగా ఉంటుందనేది దర్శనం స్వభావంపైన, సాధకుని సంకల్పంపైన ఆధారపడి వుంటుంది.

## అంతర్లోకాల సంస్పర్శ, ప్రవేశం

అంతర్లోకాల సంస్పర్శకొక సాధనమైన కారణాన దర్శనాలకు జనులు విలువ ఇస్తూవుంటారు. ఈ భౌతికజగత్తుకంటే ఎంతో సుసంపన్న మైన లోకాలవి, అయితే కేవల దర్శనాలవలన సంస్పర్శయేకాని

ప్రవేశం లభించదు. దర్శనశక్తికి శ్రవణ స్పర్శనాది ఇతర సూక్ష్మం క్రియ శక్తులుకూడా తోడైనప్పుడు ఆ శక్తి విస్తరిల్లి ప్రవేశాన్నికూడా కలిగిస్తుంది.

## దర్శనశక్తి ముఖ్యోపయోగం

అంతర్లోక సంస్పర్శకంటెకూడ ముఖ్యంగా ఈశ్వరుని మూర్తివిశేష ముల, శక్తి విశేషముల తొలిసంస్పర్శ కలిగించేది కావడం మూలాన దర్శనశక్తికి జనులు ఎక్కువగా విలువ ఇస్తూవుంటారు. ఈశ్వరుని సంస్పర్శ పొందుటకు, ఈశ్వరాదేశం అంతర్వాణి రూపంలో వినుటకు, ఈశ్వర సన్నిధిని హృదయకోశంలో అనుభవించుటకు మార్గం కాగల యోగ్యత ఈ దర్శనశక్తికున్నది,

## తృతీయనేత్రోన్మీలనము, సూక్ష్మదర్శనము

యోగానుభూతి తరచుగా, భ్రూమధ్యమందలి తృతీయనేత్రం కొంత ఉన్మీలనం కావడంతోనూ, లేక ఒకవిధమైన సూక్ష్మదర్శనం అలవడి క్రమేణా విస్తరిల్లడంతోనూ ప్రారంభమవుతుంది. ఈ సూక్ష్మదర్శనం మొదట అప్రధానమైనదిగ కన్పట్టినా, గాఢతరానుభూతికి పూర్వరంగం వంటిది. ఒక్కొక్కప్పుడీ గాఢతరానుభూతి నేరుగా ముందే కలిగి పిమ్మట దానికి ఉపోద్బలకంగా ఈ సూక్ష్మదర్శన పాటవం పెంపొంద వచ్చు.

## సూక్ష్మదర్శనాల తీరులు

సూక్ష్మదర్శనాలు ఆత్మజ్ఞానానికిగాని, వివిధ విషయములకూ వ్యక్తులకూ సంబంధించిన జ్ఞానానికిగాని సహాయపడే సంకేతాలతో కూడుకొని

వుండవచ్చు. వాస్తవిక జీవితంలో నిజం కావడం సంభవించీ, జరగ నున్నవాటిని ముందే దర్శించడం, వాటినిగురించి ముందే హెచ్చరికలు పొందడం వంటి శక్తుల వికసనకు దారి తీయవచ్చు. అప్రధానము లైనప్పటికీ యోగికి ఇవన్నీ మిక్కిలి ఉపయోగకరములే.

## అంతులేని ఇంద్రియగోచర విషయప్రపంచ పరిధులు

బాహ్యస్థితమైన ఈ స్థూల విషయ ప్రపంచమేగాక ఇంద్రియ గోచర విషయప్రపంచ పరిధు లింకా అపారంగా ఉన్నవి. వాటిని మనం సమాధిలో, నిద్రలో, నిద్రయని తలంచబడే ఒకవిధమైన ఆంతరంగి కావస్థలో, జాగ్రదవస్థలోకూడా గుర్తించడానికీ, చూడడానికీ, వినడానికీ స్పృశించడానికీ, రుచి చూడడానికీ, ఆఘ్రాణించడానికీ వీలున్నది.

## సహజమైన శక్తియేకాని అసహజంకాదు

బాహ్యస్థిత స్థూలవిషయ ప్రపంచంకంటే అతీతమైన విషయ ప్రపంచ విశేషాలను గుర్తించడమేకాక, స్థూల విషయముల వలెనే వాటిని బాహ్యేంద్రియ గోచరమగునట్లు సైతం చేసుకొనేశక్తి అసహజ మేమీ కాదు. మానవు లందరిలోనూ ఇది సహజంగా వున్నదే. అత్యధిక సంఖ్యాకులయం దది గర్భితమై మరుగుపడి యుండగా, కొందరిలో ఎడనెడ బహిర్గతమౌతూ, కడు కొలదిమందిలో మాత్రం సహజ ప్రవృత్తియై దీపించడం సంభవిస్తుంది.

## కొంత సాధన, శిక్షణవుంటే సాధించ వీలైనదే

కొంత శిక్షణతో భౌతిక విజ్ఞానశాస్త్రం నేర్చుకొని, మన పూర్వులదృష్టికి

అప్రాకృతము లనిపించే పనులను చెయ్యడం నేడు ఎవరికైనా ఎలా సాధ్యమో, అలాగే, కొంత ఏకాగ్రతా సాధనతోను, శిక్షణతోనూ, స్థూల భౌతిక ప్రపంచాతీత విషయదర్శన శక్తిని పెంపొందించుకోడానికి కూడా వీలున్నది. యోగసాధన క్రమంలో ఈ శక్తి తరుచుగా సాధకునికి తెలియకుండానే కూడా అతనిలో తొలుత పెంపొందుతూ వుండడం కద్దు.

## సూక్ష్మభౌతిక దర్శనశక్తి వికసించే తీరులు

స్థూల భౌతికముల కతీతమైన సూక్ష్మభౌతికముల దర్శించ గలిగే శక్తి సాధకునిలో కనులు తెరచి చూస్తున్నప్పటికంటె మూసుకొని వున్నప్పుడు సులభంగా వికసిస్తుంది. అట్లని అది కనులు తెరచి వున్నప్పుడు వికసించదని కాదు. రెండు విధములుగా కూడా ఆశక్తి వికసింపగలదు.

## వెలుగుచుక్కలు, బింబములు మున్నగువాని దర్శనం

సూక్ష్మభౌతికవస్తుదర్శన శక్తి వికసనం సాధకునిలో సాధారణంగా మొదట చిన్నచిన్న వెలుగుచుక్కలు చూడడంతో ప్రారంభమవుతుంది. పిమ్మట, గుండ్రనైన వెలుగు బింబములు కనబడ నారంభిస్తాయి. తరువాతిఘట్టం రంగులు కనిపించడం అయితే, వీటి క్రమం ఎప్పుడూ ఇదేతీరున ఉంటుందనే నియమం నేడు

## త్రాటకసాధన

సూక్ష్మభౌతిక వస్తుదర్శన శక్తిని వికసింప చేసుకోడానికి భారతదేశం

లోని యోగులు సాధారణంగా త్రాటకసాధన చేస్తూవుంటారు. ఒకే బిందువుపైన, లేక వస్తువుపైన దృష్టిని ఏకాగ్రం చెయ్యడమే త్రాటకం. ఆ వస్తువు తేజోవంతమైనదైతే ఉత్తమం.

## పొలిమేరలకు మాత్రమే సంబంధించినవి

సూక్ష్మ భౌతిక వస్తు దర్శనశక్తిని వికసింపజేసుకో. కాని, యీ తొలి దర్శనములు పొలిమేరకు సంబంధించినవి మాత్రమే. ఎన్నో అనుభవ జగత్తులు వీటికి ఆవల నున్నవి, పృథ్వీచేతనకూ అనంతునకూ నడుమ విస్తృతంగా వ్యాపించివున్న జగత్తులవి.

## అంతర్దర్శనముల యాథార్థ్యం

అంతర్దర్శనములు కూడా బాహ్యదర్శనములంత యథార్థములే కావచ్చు. బాహ్యదర్శనములు భౌతిక జగత్తుకు సంబంధించిన యథార్థములుకాగా అంతర్దర్శనములు సూక్ష్మభౌతికముల వరకూగల ఇతర భూమికలకు చెందినవి. భూత భవిష్యద్వర్తమానము లందలి ఏ యథార్థమునకూ సూచకంకాని భావనా పూర్వక మానసిక కల్పనలు మాత్రమే అయథార్థములు.

## అంతర్దర్శన శక్తివికాసం కలిగేతీరులు

అంతర్దర్శనశక్తి కొందరికి అప్రయత్నంగా దానంత టదే అలవడు తుంది. కొందరిలో కొలది ప్రయత్నంతోనే వికసిస్తుంది. అయితే ఈ శక్తి ఆధ్యాత్మికసిద్ధికి సూచకమనడానికి వీలులేదు. యోగాభ్యాసం చేసే సాధకుడు తనలోనికి తాను ప్రవేశించడం, తనలో తాను నివసించడం ప్రారంభించినప్పుడీ శక్తి కొద్దిగనో, గొప్పగనో వికసించడం జరుగుతూ

వుంటుంది. కాని, బుద్ధియందు, బహిర్ముఖ ప్రాణమయచేతనయందు నివసించే వారిలో ఇది వికసించడం అంత సులభం కాదు.

## దర్శనం, అనుభూతి, సిద్ధి

నీ లోపల వెలుగును నీవు చూస్తే అది దర్శనం. వెలుగు నీ లోపలికి ప్రవేశిస్తున్నట్లనిపిస్తే అది అనుభూతి. వెలుగు లోపల కుదురుకొని నిన్ను జ్ఞానసంపన్నునిగ జేస్తే అది సిద్ధి. కాని, సామాన్యంగా దర్శనములుకూడ అనుభూతులనియే పిలువబడుతూ వుంటాయి.

## ఉన్నత భూమికల దర్శనం

అవరప్రకృతి రూపాంతరం చెందడానికి చాలాకాలం ముందే ఉన్నత భూమికల దర్శనం సాధకునికి కలుగవచ్చు. ఏలనంటే, అవరప్రకృతి దానంతటదే రూపాంతరం చెందదు. ఉన్నత భూమికల దర్శనం క్రమేణా వృద్ధిచెందుతూ వాటికి సంబంధించిన ఉన్నత చేతన క్రిందికి అవతరించడం జరిగినప్పుడే ఈ పరివర్తనం సాధ్యం. ఉన్నత భూమికల దర్శనానికి దారి తీసేవి ఆకాంక్ష, ఆత్మోన్మీలనము.

## మనోభూమికలోనికి ఉన్నతచేతనావతరణం

దర్శనంద్వారా ఆవరణవిచ్ఛేదం కలుగకుండానే ఉన్నతచేతన మనోభూమిక లోనికి అవతరించి, శాంతి, విశాలత, విశ్వశక్తుల పరిజ్ఞానం, విశ్వచేతనానుభూతి, ఈశ్వరోపలబ్ధి మొదలైనవాటిని ఆ భూమికకు సంతరింపజేయడం లేకపోలేదు. కాని, సామాన్యంగా అత్యధిక సంఖ్యాకులకు మొదట కలుగునది దర్శనమే.

## సాధనలో అభివృద్ధిని సూచించే స్థితి

ధ్యానసాధనారంభ దశలో మొట్టమొదట కలిగే అవరోధం నిద్ర. దానిని దాటగలిగిన అనంతరం, కనులు మూసివున్న సమయంలోనే పలురకములైన దృశ్యాలు, వ్యక్తులు నీ లోపల నీకు కనబడే స్థితి ఒకటి వస్తుంది. అది మంచిలక్షణమే కాని చెడ్డదేమీ కాదు. నీ సాధన అభివృద్ధి చెందుతున్న దనడానికి అదొక మంచి గుర్తు.

## లోచూపు శక్తిసామర్థ్యాలు

బాహ్యవస్తువులను జూచెడి బాహ్యదృష్టియేకాక, అంతరదృష్టి అనే దొకటి మనలో ఉన్నది. మన మెన్నడూ చూడని విషయాలు, ఎరుగని విషయాలూ ఈ లోచూపు చూడగలుగుతుంది. దేశాంతరాలకు, కాలాంతరాలకు సంబంధించినవే కాక. లోకాంతరాలకు సంబంధించిన విషయాలను సైతం చూపగల సామర్థ్యం దానికున్నది.

## అంతర్దర్శనములపట్ల అవలంబించదగిన వైఖరి

ఇహలోక, లోకాంతర విషయరూపములను దర్శించే అంతర్దర్శనశక్తి ఉపయోగకరమైనదే. కాని, వాటిపట్ల సాధకుడు సక్తుడు కాకుండా శాంతచిత్తంతో వాటిని సాగిపోనివ్వడం అవసరం. వాటియందతడు మగ్నుడూ కారాదు, వాటిని పారద్రోలడానికి ప్రయత్నించనూ కూడదు. సాధనకు భంగకార్యులై పరిణమించే బాహ్య మనః ప్రవృత్తులు మాత్రమే నిరాకరించబడవలసినవి.

## నిశ్చలతా సాధనలోని ఒక మెలకువ

మనోనిశ్చలతకై నీవు యత్నించే టప్పుడు అప్రసక్తంగా అనేక విధములైన ఆలోచనలు నీలో అలవాటు చొప్పున యంత్రప్రాయంగా పైకి వస్తూవుండడం కద్దు. వాటికి ప్రాధాన్యమివ్వకుండా వాటిని అలా సాగిపోనిచ్చేయెడల తుద కవి వాటంతటవే అంతరించిపోతాయి. అలా కాకుండా వాటితో ఘర్షణ పెట్టుకొని వాటిని నిరోధించబూనడం నిష్ప్రయోజనం. వాటి నిరాకరణ కడు సౌమ్యంగా జరగవలసివుంటుంది.

## చైత్యపురుషస్థానంనుండి బయలుదేరే ఆలోచనలు

మనో నిశ్చలతకై నీవు యత్నించేటపుడు నీలో బయలుదేరే ఆలోచనలు నీ అంతరాంతరంనుండి— చైత్యపురుషస్థానం నుండి బయలుదేరుతూ, భగవత్ప్రేమానందములకు సంబంధించినవైతే, అట్టి ఆలోచనలు తప్పక రానివ్వదగినవే, నీ సాధన చైత్యపురుష ప్రాబల్యంతో ముందుకు సాగడానికి అవి సహాయకారులవుతాయి.

## ప్రాణమయ భూమికయందలి స్వప్నములు, దర్శనములు

ప్రాణమయ భూమికయందలి స్వప్నములు, దర్శనములు సామాన్యముగా మూడు విధములు, 1. సాంకేతిక లక్షణోపేతములు, 2. ప్రాణమయభూమికలోని యథార్థ ఘటనలు, 3. ప్రాణమయ మనఃకృత కల్పనలు. ఈ కల్పనలు స్వాప్నికునివి గావచ్చు. లేక స్వప్నమునందతనితో సాంగత్యము పొందు ఇతరులవి కావచ్చు. ఏమైనా సాధకుడు ఈ విధమైన అనుభవములపై ఎక్కువగా ఆధారపడ

రాదు. వీనిలో మొదటివి సూచనామాత్ర పరిమిత ప్రయోజనం కలవీ కాగా, తక్కినవి రెండూ మనలను తరచుగా పెడదారి పట్టించడంకద్దు.

## ప్రాణమయ భూమికలోని దర్శనాల అప్రాధాన్యం

ప్రాణమయ భూమికయందు సాధకునికి కలిగే దర్శనములు కొల్లలు. ఏలనంటే. మానవునియందలి చేతనావిభాగములన్నీ క్షేత్రములవంటివి కాగా, ఆ క్షేత్రములలోనికి విశ్వప్రకృతి యందలి ఆయా చేతనా విభాగములనుండి శక్తిప్రవాహములు నిరంతరం వచ్చిపడుతూ సాగిపో తుంటాయి. ఏమైనా ఇవి అప్రధానములైన అనుభవాలు గనుక సాధకుడు వీటికి విశేష ప్రాధాన్య మీయకుండా అసక్తుడై వీటిని గమ నించ నేర్చుకోడం శ్రేయస్కరం.

## జంతుశిరస్సులతో దర్శనములు

ప్రాణమయ భూమికయందే సాధారణంగా జంతుశిరస్సులు, ఆకృతు లతో ప్రాణమయ లోకవాసుల దర్శనాలు కలుగుతూ వుంటాయి. కుక్క తలతో కూడిన మానవరూపం భౌతికమైన కామకశ్శక్తికి సూచన. బ్రహ్మచర్యముచే రేతస్సును ఓజస్సుగా రూపాంతరం చెందించడానికి వీలున్నట్లే, ఇట్టి శక్తులను ఏదైనా ఒక భౌతిక సత్వస్థితిలోనికి రూపాంతరం చెందించి కామగంధ వివర్జితములుగా చేయడానికి అవ కాశం లేకపోలేదు.

## ప్రతీకలు

ఒక భూమికయందలి రూపం వేరొక భూమికకుచెందిన సత్యానికి

చిహ్నమై భాసిస్తున్నట్లయితే అది ఆ సత్యానికి ప్రతీక. ఉదాహరణకు పతాకం ఒక జాతికి ప్రతీక. కాని, సామాన్యతః రూపములన్నీకూడ ప్రతీకలే. మన ఈ శరీరం మన నిజస్వరూపానికి ప్రతీక. అట్లే ప్రతిదీ ఒకానొక ఉన్నత సత్యానికి ప్రతీకయే.

## అంతశ్చేతనోన్మీలనకు సూచనలు

ఘంటానాదములు వినిపించడం, జ్యోతులు, వర్ణాలు కనిపించడం అంతశ్చేతన ఉన్మీలనం పొందడాన్ని సూచిస్తాయి. అన్నమయ భూమిక కతీతమైన ఇతర భూమికల నాదములకు, దృశ్యాలకు కూడా ఈ ఉన్మీలనం దారితీస్తుంది. ఘంటానాదములు, కీచురాళ్ళ ధ్వనులు మొదలైనవి ఉన్మీలనకు సహాయకారులు కావడం కూడా ఉన్నది. 'బ్రహ్మణ్యభివ్యక్తికరాణి యోగే' అని ఉపనిషత్తు వీటిని వర్ణించింది.

## జ్యోతులు చూడడానికి కావలసినది

జ్యోతులు చూడడానికి మనస్సు నిశ్చలం కానక్కరలేదు. దానికి కావలసినది భ్రూమధ్యమందలి సూక్ష్మదృష్టి వికసించడం. పెక్కుమంది కిది సాధన ఆరంభించిన వెంటనే కలుగుతుంది. కొందరిలో ఈ లక్షణం జన్మతః సూక్ష్మంగా వుండి యోగసాధన లేకపోయినా ఏకాగ్రతవలన అభివృద్ధి చెందుతుంది.

## స్థానభేదములతో వెలుగు అనుభూతులు

నీలపువెలుగు ఊర్ధ్వభూమికలనుండి ప్రసరించే ఆధ్యాత్మికశక్తి విశేషానికి సూచన కాగా, బంగారు వెలుగు సత్యజ్యోతిని సూచనచేస్తుంది.

వెలుగు నీ వెలుపల గోచరిస్తే అది సూచించేది శక్తిస్పర్శ నీకు కలిగినదని అర్థం. వెలుగు నీలోపల కనిపిస్తే ఆ శక్తి నీలోనికి ప్రవేశించి నీ ప్రకృతియందు ప్రతిష్ఠిత మవుతున్నదన్నమాట. నీకు ఊర్ధ్వమున గోచరమైన వెలుగు నీ మనస్సులోనికి దిగివచ్చేది శక్తికి సూచనకాగా, నీకు చుట్టూ కానవచ్చే వెలుగు ఆ శక్తి ప్రభావం నిన్ను ఆవరించుకొనడాన్ని సూచన చేస్తుంది.

## సూర్యదర్శనాదులు

వెలుగు సాధారణంగా భ్రూమధ్యమందు ఆజ్ఞాచక్రానికి ఎట్టయెదుట గోచరిస్తూ వుంటుంది. సూర్యుడు సత్యజ్యోతికి చిహ్నం. ఆ సత్య జ్యోతియే అజ్ఞానమయమగు సామాన్య చేతనపై సూక్ష్మరూపాన తన ప్రభావం ప్రసరింపజెయ్యడాన్ని సూచన చేస్తుంది. నక్షత్ర కాంతి. రాత్రి అనునది సామాన్య చేతనకు సూచకం.

## వివిధ భూమికలలో సూర్యజ్యోతి దర్శనం

ఏ భూమికలోనైనా సాక్షాత్తుగా దర్శించబడిన సత్యానికి చిహ్నం సూర్య జ్యోతి, వస్తుతః అది మనస్సున కతీతమైన విజ్ఞానమయచేతనకు ప్రతీకయేకాని, ఆ సత్యజ్యోతి క్రింది భూమికలకు దిగివచ్చినప్పుడు ఆయా భూమికల తత్వానుసారంగా కొంత మార్పును చెందుతుంది. అయినప్పటికీ అది అచట సాక్షాత్తుగా దర్శించబడు సత్యజ్యోతియే.

## వేర్వేరు భూమికలలో వేర్వేరు సూర్యులు

వేర్వేరు భూమికలయందు వేర్వేరు రంగులలో వేర్వేరు సూర్యులను

దర్శించడం ఉన్నది. రంగులలో సాదృశ్యమున్నా క్రింది భూమికల లోని సూర్యులకంటె పై భూమికలలోని సూర్యులు అధిక తేజో వంతులు. క్రింది సూర్యుల తేజశ్శక్తులు పైసూర్యులనుండి సంక్ర మించినవే.

## ఎర్రని సూర్యుడు

ఎర్రని సూర్యుడు జ్ఞానదీప్తమగు యథార్థ అన్నమయ చేతనకు ప్రతీక. మానవుడు ప్రస్తుతం అజ్ఞానమయమైన ఆయథార్థ అన్నమయ చేతనలో నివసిస్తున్నాడు. దానికి బదులు జ్ఞానదీప్తమైన యథార్థ అన్నమయచేతన ఆతనియందు అభివ్యక్తం కావలసివున్నది. ఎరుపురంగు అన్నమయ తత్వానికి సూచకం.

## చంద్రదర్శనం

చంద్రదర్శనం మనస్సును ప్రభావిత మొనర్చే ఆధ్యాత్మిక చైతన్యాన్ని సూచిస్తుంది. మనస్సునందు ఆధ్యాత్మికానంద ప్రసారానికి సైతం అది సూచకమే. అట్టి ఆధ్యాత్మిక మనస్సునందు సత్యజ్యోతులు ప్రతిబింబిత మౌతాయి. సూర్యుడు సాక్షాత్తుగా సత్యజ్యోతికి చిహ్నంకాగా, చంద్రుడు ఆ వెలుగులను ప్రతిబింబింపజేయువాడు మాత్రమే.

## నక్షత్ర దర్శనం

నక్షత్ర దర్శనం జ్ఞానజ్యోతి అవతరించ నున్నదనేదానికి సూచన. జ్ఞాన జ్యోతి అవతరించినప్పుడు ఆ నక్షత్రం సూర్యుడుగా మార్పు చెందు తుంది.

## బంగారు వెలుగు

బంగారు వెలుగు మిక్కిలి చిక్కనై కనిపించినప్పు డది అతిమానసము నుండి ప్రసరించిన సత్యతేజస్సును సూచిస్తుంది. సామాన్య స్థితియందు మాత్రము ఆ వెలుగు అతిమానసమునకు క్రింది మెట్టులోనిదగు అధిమానస సత్యమునకు సూచకము,

## పసుపు, ఊదా, గులాబి

పసుపురంగు మనోమయకోశానికీ, ఊదారంగు ప్రాణమయ కోశానికీ సంబంధించిన ప్రధానశక్తులను సూచన చేస్తాయి. గులాబిరంగు చైత్య పురుష విభాగసంబంధమైన ప్రధానశక్తికి సూచన. ప్రాణమయకోశంలో ఊదారంగుతోపాటు ఆకుపచ్చ, ముదురు ఎరుపుల విలసనం కానరావడం కూడా కద్దు.

## తెల్లని వెలుగు

బంగారువెలుగు ఉన్నత భూమికలయందలి దివ్యసత్యానికి ద్యోతకంకాగా, తెల్లని వెలుగు శుద్ధచైతన్య శక్తికి ద్యోతకం. ఈ శుద్ధ చైతన్య శక్తి నుండియే తక్కినవన్ని ఆవిర్భవిస్తాయి. తెలుపు శుద్ధత్వశక్తికి ద్యోతకం.

## వెలుగు - సూర్యుడు

వెలుగు అనే పదం చేతనయొక్క, సత్యంయొక్క, జ్ఞానం యొక్క వెలుగును సూచన చేస్తుంది. సూర్యుడు అనే పదం ఆ వెలుగు పుంజీభూతమైవున్న మూలస్థానానికి సూచకం.

## రంగు - వెలుగు

రంగుకు, వెలుగుకు చాల సన్నిహితత్వం వున్నది. రంగు ప్రధానంగా

తత్వద్యోతకం కాగా, వెలుగు శక్తి స్ఫోరకం. రంగు జ్వలించినప్పుడది వెలుగుగా మారుతుంది.

## నీలపు వెలుగు

వివిధచ్ఛాయలలో నీలపు వెలుగులు శిరస్సుపైన అధిమనస్సు పర్యంతమూ గల ఊర్ధ్వభూమికలను సూచన చేస్తాయి. ఉన్నతమనస్సు, దీప్తమనస్సు, స్ఫురితమనస్సు, అధిమనస్సు అని యీ భూమికలకు పేర్లు.

## వివిధ భూమికల సమష్టి స్వరూపం

ఒకదానిపై నొకటిగా అంతస్తులవలె నున్న వివిధ భూమికలను మొత్తం మీద మనం పరికించినప్పుడు, అదంతా ఒక మహనీయమైన సంకీర్ణగతి విశేషంగా పొడగడుతుంది. క్రింది భూమికలలో అభివ్యక్తికై పైభూమికలు తమ ప్రభావాన్ని క్రిందికి ప్రసరింపజేస్తూ వుంటాయి. క్రింది భూమికలు ఆ ప్రభావానికి ప్రతిస్పందిస్తూ తదనురూప లక్షణాలను తమ చట్రాని కనుగుణమైనరీతిలో అభివ్యక్త మొనరిస్తూ వుంటాయి.

## కొంచెంగా ఎరుపుకలిసిన నీలపువెలుగు

కొంచెముగా ఎరుపుకలిసిన నీలపువెలుగు దివ్యకృపనూ, కృష్ణానుగ్రహాన్నీ సూచన చేస్తుంది. నీలం ప్రత్యేకంగా కృష్ణ సంబంధమైనది. ఆయన అవిర్భవించేటప్పుడు ఆయన దివ్యపరివేషపు రంగు నీలమే. కావుననే ఆయనను నీలకృష్ణుడన్నారు. ఆ విశేషణానికి అర్థం ఆయన స్థూలశరీరపురంగు నీలమనీ నలుపనీ కాదు.

## ముదురు ఎరుపు, నీలం కలసిన ఎరుపు

ముదురు ఎరుపు సామాన్యంగా అన్నమయ చేతనాశక్తికి ద్యోతకంకాగా, నీలం కలిసిన ఎరుపు ప్రాణమయచేతనాశక్తికి ద్యోతకం. ముదురు ఎరుపు ఈ ఉభయచేతనల అనురాగ శక్తికిగూడ ద్యోతకమే. ఈ రెండు రంగులూ ఊర్ధ్వమున గోచరమైనప్పు డవి ప్రాణమయ చేతనాశక్తులకు కారణమైన మూలశక్తులను ద్యోతకం చేస్తాయి.

## ఆకుపచ్చ

ఆకుపచ్చ క్రియాప్రధానమైన ప్రాణమయ చేతనాశక్తికి ద్యోతకం. ప్రాణమయ కోశపు భావావేశ విభాగమునందు ఆకుపచ్చ వెలుగు కాన వచ్చినప్పుడది ఒక విధమైన భావోదాత్తతను తెలియజేస్తుంది. ఆ వెలుగే ప్రాణమయకోశపు జడ విభాగమున గోచరమైనప్పు డది ఆరోగ్యసంధాయకశక్తిని సూచిస్తుంది.

## ఆకాశం

ఆకాశం సామాన్యంగా మనోమయచేతననుగాని, దానికి పైనగల ఉన్నత చేతనా భూమికలనుగాని సూచిస్తుంది. అనంతత్వమునకు సైతమూ అది సూచకమే. ఉన్నతచేతనా భూమికలు సాధారణంగా ఆకాశరూపంలోనే చూడబడుతూ వుంటాయి. ఉన్నతచేతన ప్రాణమయచేతనా ద్వారమున అనుభూతమగునప్పుడది తరచుగా సముద్రరూపాన గోచరమౌ తుంది.

## ఆకాశ, అర్ణవ రూపములలో చైతన్యపు టంతస్తులు

భూః, భువః, స్వః. మహః, జనః, తపః, సత్యం — అనే సప్త వ్యాహృతుల రూపంలో వేదమునందు జడము, ప్రాణము, మనస్సు, విజ్ఞానము, ఆనందము, చిత్తు, సత్తు — అనే ఏడు భూమికలు వర్ణితమైనవి. పూర్ణయోగ సాధనలో గోచరమయ్యే చైతన్యపు టంతస్తులు అనేకం, ఆకాశములుగానో, సముద్రములుగానో ఇవి దృశ్యమాన మవడం వున్నది.

## రాత్రి - ఉషస్సు

వెలుగు సత్యానికీ, జ్ఞానానికీ చిహ్నమైనట్లే రాత్రి అవిద్యకూ అజ్ఞానానికీ చిహ్నం. రావలసినది రానున్నదని సూచించే ఒక విధమైన ఉన్మీలనను తెలియజేస్తుంది ఉషస్సు.

## పర్వతం

పృథ్విపైన కుదురుకొని ఈశ్వరునిదెసకు ఊర్ధ్వముగా పెరిగే సశరీర చేతనకు చిహ్నమే పర్వతము. సత్తారూపమైన ఈ పర్వతమును అధిరోహిస్తూ పోగా ఈశ్వరోపలబ్ధి కలుగునది శిఖరస్థానమున.

## అర్ణవం, నది, తటాకం

జలం అపారంగా విస్తరించుకొని వున్నట్టు కనిపించినప్పుడే అది ఒక చేతనా భూమికకు సూచకం అవుతుంది, నది, తటాకము ఇవి చేతనా భూమికకు సూచనములు కానేరవు. నగి చేతనయొక్క ఒకానొక గతి విశేషానికి సూచకం.

## వర్షం, ఇంద్రచాపం, మేఘాలు

వర్షం దివ్యానుగ్రహ ప్రసారమునుగాని, ఉన్నతచేతనావతరణనుగాని సూచిస్తుంది. ఇంద్రధనుస్సు శాంతికి, విముక్తికీ సూచకం. మేఘాలు అజ్ఞానావరణను సూచన చేస్తాయి

## పక్షి, వృక్షము

పక్షిదర్శనము సాధారణంగా ఆత్మను సూచిస్తుంది. వృక్షం సంసారానికి సూచకం. అశ్వత్థవృక్షం సామాన్యతః ఈవ్యక్త జగత్తుకు సూచకమైనదే.

## పువ్వులు - పళ్లు

పువ్వులు చైతన్యం పుష్పించి వికసించడాన్ని సూచనచేస్తాయి. ఒక్కొక్కప్పుడవి ప్రధానంగా హృత్పురుష చైతన్య వికాసానికి. అట్టి చైతన్య వికాసంచే ప్రభావితమైన అన్న, ప్రాణ, మనోమయ చైతన్య వికాసానికీ గూడ సూచకం కావచ్చు. పళ్ళవలన సూచించబడేవి సాధన ఫలితాలు.

## ఆవు - పాలు

ఆవు చైతన్యజ్యోతికి చిహ్నం. తెల్లని ఆవు విశుద్ధ ఆధ్యాత్మిక చైతన్యజ్యోతిని సూచిస్తుంది వేదంలో గోశబ్దం దివ్యజ్యోతికి ప్రతీకగానే వాడబడింది. పాలు ఆ దివ్యజోతినుండి ప్రసరించే శక్తి జ్ఞానములు.

## గుఱ్ఱము - గాడిద

గుఱ్ఱము సాధారణంగా ప్రాణశక్తికి ద్యోతకం. జవసత్వములతో కూడినదిగా గోచరిస్తే అది మనశ్శక్తికి తపస్సునకూ గూడ ద్యోతకంకావచ్చు. గాడిద శరీరంలోని జడత్వాన్ని స్థిరత్వాన్ని ద్యోతకం చేస్తుంది.

## ఏనుగు – సింహం

ఏనుగు బలాన్ని ద్యోతకం చేస్తుంది. ఇది ఒక్కొక్కప్పుడు తేజస్సుతో కూడిన బలం కావచ్చు. వేరొక్కప్పుడు అవరోధాలను తొలగించే బలం కావచ్చు. సింహం ఉదాత్త ప్రాణమయ చైతన్య శక్తికి ధైర్యానికి చిహ్నం.

## పెద్దపులి

పెద్దపులి ప్రాణమయ ప్రకృతి సంబంధమగు శక్తికి చిహ్నం. అయితే, భయంకరంగా, క్రూర ప్రవృత్తితో కనుపించినప్పుడే అహిత శక్తిగా దానిని సాధకుడు పరిగణించవలసి వుంటుంది. లేనిచో అది అనుకూల శక్తియే.

## ఆబోతు, ఎనుబోతు, ఎలుగు, మేక, కుక్క, లేడి

ఆబోతు శక్తికి బలానికి చిహ్నం. ఎనుబోతు దురుసైన క్షుద్రప్రాణ ప్రవృత్తులను సూచిస్తుంది. ఎలుగుబంటి రాజసబలద్యోతకం. మేక తరచుగా కామప్రవృత్తిని తెలియజేస్తుంది. కుక్క భక్తి విశ్వాసాలకూ, విధేయతకూ సూచకం. లేడి ఆధ్యాత్మిక పురోగమనమున వేగాన్ని తెలుపుతుంది.

## తామరపువ్వు, హంస, పావురము, నెమలి

తామరపువ్వు అంతశ్చక్రోన్మీలనకు సూచకం. హంస జీవాత్మను సూచన చేస్తుంది. పావురం శాంతికి చిహ్నం. నెమలి విజయసూచకమైనది.

## శిశుదర్శనం

శిశుదర్శనం—ముఖ్యంగా నూతనముగా జన్మించిన శిశుదర్శనం—బాహ్యప్రకృతియందు చైత్యపురుషోదయమును సూచన చేస్తుంది. అట్లు చైత్యపురుషసూచకము గాని సందర్భములలో అది సాధారణముగా సాధకుని చేతనలో ఏదో ఒక విభాగమున ఏదో ఒక నూతనావిర్భావమునకు సూచకం.

## వేణువు, శంఖం, వీణ, కిరీటం, ముత్యం

వేణువు ఆధ్యాత్మిక ప్రేరణనూ భగవానుని పిలుపునూ సూచిస్తుంది, శంఖం ఆధ్యాత్మిక ప్రేరణకే కాక విజయ ప్రకటనకు గూడా సూచకం కావచ్చు. వీణ సామరస్య చిహ్నం. కిరీటం సాఫల్యాన్ని తెలియజేస్తుంది. ముత్యం వ్యష్టిలోని సమష్టినీ అణువులోని మహత్తునూ తెలియజేసే 'బిందువు'నకు ప్రతీక.

## ప్రయాణదృశ్యాలు

బండి, మోటారుకారు, స్టీమరు, పడవ, విమానం మొదలైన వాటిలో ప్రయాణం సాధనలో ప్రగతిని సూచిస్తుంది. విమానం, రైలు, స్టీమరు సత్వర ప్రగతికి చిహ్నాలు. సాధకునకు తాను ఎగురుతున్నట్లు దృశ్యమైనప్పుడు, ఆ యెగిరేది ప్రాణమయ జగత్తులో సూక్ష్మశరీరమందలి ప్రాణమయ పురుషుడు.

# అంతశ్చేతనానుభూతులు : విశ్వచేతనానుభూతులు

—o—

### అంతర్గమనం, ఊర్ధ్వగమనం

బాహ్యచేతనకూ అంతఃపురుషునికీ మధ్యనున్న యవనికను ఛేదించడం యోగసాధనలో జరగవలసిన అతిముఖ్య ప్రయత్నములలో నొకటి. యోగమంటే ఈశ్వరునితో సంయోగమనియేకాదు. మొదట నీ అంతరాత్మను, పిమ్మట పరమాత్మను తెలియవలెనని కూడా అర్థం. ఒకటి అంతర్గమనం కాగా, రెండవది ఊర్ధ్వగమనం.

### అంతఃపురుషుని అవబోధావశ్యకత

అంతఃపురుషుడు మేలుకాంచి ముందుకు రావడం ద్వారానే పరమేశ్వరునితోడి కలయిక సాధ్యం. బాహ్యపురుషుడు తనంతట తానుగా ఈ కలయికను సాధింపజాలడు. మతధర్మ సంబంధమైన కొన్ని భావములు, స్ఫుర్ణలు, సూచనలు అతనిలోఅప్పుడప్పుడు పొడసూపుతూ వుండవచ్చు. కాని, అవైనా అంతశ్చేతననుండి వచ్చునవే కాని బాహ్యచేతన నుండి వచ్చునవి కావు.

### రెండువిధములైన నడకలు

ఒకదాని నొకటి అందిపుచ్చుకునే రెండువిధములైన నడకలున్నవి సాధనలో. అంతఃపురుషుడు ముందుకువచ్చి బాహ్యచేతనపై తన ప్రభా

వమును ప్రసరింపచేయుట యొకటి. బాహ్యచేతననుండి అంతర్భూమికల లోనికి, అంతరాత్మలోనికి చొచ్చి అంతర్విభాగములందు మేల్కొనుట మరియొకటి. ఇట్లు లోనికి దుముకడం నీకు కుదిరిననాడు, ఆధ్యాత్మిక, యోగ జీవనానికి నీలో సజ్జత ఏర్పడినదన్నమాటే.

## అంతర్ముఖమైన నడక పలుతెరగులు

అంతర్ముఖమైన నడక పలుతెరగులుగా ఉంటుంది. ఒక్కొక్కప్పుడు, లోనికి పూర్తిగా దుమికిన సమస్త లక్షణాలతోనూ ఒప్పారే సంకీర్ణానుభవం సాధకునకు కలుగవచ్చు. అంతకంతకు లోనికి పోతూవున్నట్లూ, లోతుకు దిగుతూ వున్నట్లూ అతనికి తోచడం ఉన్నది. అవయవములన్నీ మొద్దుబారి, సుఖకరమగు ఒకవిధమైన తిమ్మిరి శరీరాన్ని ఆవహిస్తున్నట్టుగా తరచు అనిపించడం కూడా కద్దు.

## ఊర్ధ్వమునుండి ఒత్తిడి

అవయవాలు మొద్దుబారి సుఖకరమైన తిమ్మిరి ఆవహిస్తున్నట్లుగా తోచడం ఊర్ధ్వమునుండి కలిగిన ఒత్తిడిచే చైతన్యం శరీరమునుండి లోపలికి మరలుతున్నదానికి చిహ్నం. ఈ విధంగా పైనుండి కలిగిన ఒత్తిడి అంతరజీవితానికి ఆధారమగునట్లుగా శరీరాన్ని స్థిరసుఖమైన ఆసన రూపంలో నిశ్చలంగా నిలువరించడానికి సహాయకారి అవుతుంది

## శిరస్సువరకూ వ్యాపించే తరంగాల పొంగు

చైతన్యం శరీరంనుండి లోనికి మరలే సందర్భంలోనే సాధకుడు తనలో తరంగాలపొంగువంటిది పైపైకి లేస్తూ శిరస్సు వరకూ వ్యాపించడమనే అనుభవాన్ని పొందడ మున్నది. వెలుపల అచేతనత్వము, లోపల అవబోధము ఈ అనుభవంవల్ల కలుగుతుంది. ఆధారంలోని అపరచేతన

ఊర్ధ్వమునగల పరచేతనతో అనుసంధానం నిమిత్తమై కాపించెడి ఆరో హణ మిది.

## కుండలినీ జాగరణమును పోలిన అనుభూతి

తరంగాల పొంగువంటిది శిరస్సు వరకూ పైకిలేచే అనుభవం తాంత్రిక సాధనలో కుండలినీజాగరణమును పోలినదే. మూలాధారంలో చుట్టలు చుట్టుకొనివుండి, వెన్నుపూసవెంట వివిధ చక్రములద్వారా బ్రహ్మరంధ్ర మును భేదించి పరమాత్మనుచేరు శక్తియే కుండలినిగా పేర్కొనబడి దాని జాగరణకై తంత్రంలో ప్రత్యేక విధానం రూపొందించబడింది. పూర్ణ యోగ సాధనలలో ఇది అవరచేతనయొక్క, సహజోత్సరణం కావడమే కాక, పైనుండి పరచేతన క్రిందికి దిగిరావడమనేది కూడా వున్నది.

## పరచేతనావతరణం

పరచేతన క్రిందికి దిగివచ్చే అనుభవం పెక్కురీతులు, శాంతి. ఆనందం, తేజస్సు, శక్తి, విశాలత, జ్ఞానం, స్వాతంత్ర్యం. దైవసాన్నిధ్యం,— వీనిలో ఏ ఒక్కటియో, లేక ఏ కొన్నియో. లేక అన్నీ ఒక్కుమ్మడి గానో, ప్రవాహ రూపంలో పైనుండి నీలోనికి వచ్చిపడుతున్నట్లుగా తోచడం ఈ అనుభూతి లక్షణం.

## ఆరోహణానుభవపు భిన్న లక్షణాలు

పరచేతన క్రిందికి అవతరించే అనుభవలక్షణాలకంటె, అవరచేతన పైకి ఆరోహించే అనుభవలక్షణాలు భిన్నంగా ఉంటాయి. తాను శరీరంలో నుండక దానికి పైగానున్నట్లో, విశాలతయే రూపంగా గల తన కసలు శరీరమే లేనట్లో, ఉన్నా అది ఆ విశాలతలో నొక చిన్న బిందుమాత్రమై

ఉన్నట్లో తోచడమనేది ఈ ఆరోహణానుభవ లక్షణాలలో నొకటి కావచ్చు.

## శరీరం వెలుపలికేగి సంచరించడం

అవరచేతన ఊర్ధ్వమున కారోహించే సందర్భములో, శరీరమందలి పురుషుడు పూర్తిగాగాని, లేక అతనిలోని ఒక విభాగముగాని శరీరం వెలుపలికేగి ఎచ్చటనో తిరుగాడుట అనే అనుభవం సాధకునకు కలుగుటకూడా కలదు. ఇట్టి సన్నివేశంలో సాధారణంగా ఒకవిధమైన పాక్షిక సమాధియందో, పూర్ణ సమాధియందో అతడు ఉండిపోవడం జరుగుతూ వుంటుంది.

## ఆరోహణంవల్ల కలిగే మరొక ఫలితం

అవరచేతనఊర్ధ్వమునకు ఆరోహించడ మనేదాని ఫలితంగా సాధకుడు తన యందలి అన్న, ప్రాణ, మనోమయ ప్రకృతుల లోనికి చొర బారి, తన అన్న, ప్రాణ, మనోమయాత్మ స్వరూపాన్ని, అంత కంటెనూ లోపలిదై హృదయాంతర్గతమైన చైత్యాత్మ స్వరూపాన్ని తెలియగలిగే శక్తిసంపన్నతను బడయవచ్చు. అంతేకాదు, ఈ అంతః ప్రకృతి విభాగములతో సంబంధముగల వివిధ లోకములందు సంచరించే యోగ్యతా విశేషంకూడా ఈ సందర్భంలో అతనికి అలవడ వచ్చు.

## ఆరోహణావరోహణల ప్రత్యేక ఫలితాలు

అవరచేతన ఎడతెగక మరల మరల పైకి ఆరోహించడంవల్లనే సాధకుని అన్న ప్రాణ మనోమయ ప్రకృతులు అతిమానస పర్యంతమైన ఉన్నత భూమికల సంస్పర్శ పొంది, వాటి తేజోబలాదులచే ప్రభావిత

ములు కొగలుగుతాయి, అట్లే, పరచేతన ఎడతెగక మరల మరల క్రిందికి అవరోహించడంవల్ల, అతని సకల ప్రకృతియూ రూపాంతరం చెందడం సాధ్యమౌతుంది.

## పరచేతనావతరణం పరిపాటి అయినప్పుడు

పరచేతనావతరణం పరిపాటిగా అనుభవానికి వచ్చినప్పుడు, జగన్మాత దివ్యశక్తి ఇక నీలో, పైనుండి, తెరచాటునుండి మాత్రమేగాక, జాగ్రచ్చేతనావస్థయందు సైతం నేరుగా పనిచేయ మొదలుపెట్టుతుంది. సకల ప్రతిబంధకాలనూ ఎదుర్కొంటూ తానే స్వయంగా యోగసాధనను కొనసాగిస్తుంది.

## అంతఃప్రవేశ సాధనలో కడకు జరిగేది

బాహ్యచేతనకూ అంతఃపురుషునికీ మధ్యనున్న సరిహద్దును చివరకు దాటుతాడు సాధకుడు. ఈ అనుభవం నిద్రకాదు. చైతన్యమును కోల్పోవడమూ కాదు. చైతన్యం ఎప్పుడూ ఉండేదే. కాని, ఈ నూతనానుభవంలో అది బాహ్యవృత్తుల నుండి మరలి బాహ్యవస్తువులకు వెలిదై అంతఃపురుష విభాగములలోనికి ప్రవేశించడం జరుగుతుంది.

## ఉభయగతి విశేషాలూ కావలసినవే

అంతఃపురుష విభాగములలోనికి ప్రవేశించిన చేతన అచట అనేక విధములగు అనుభూతులను పొందుతుంది. వానిలో కొన్ని అనుభూతులను జాగ్రదవస్థయందు సైతమూ తెలుసుకోడానికి వీలున్నది. అలా తెలుసుకోవడం అవశ్యకం కూడ. ఎలనంటే, అంతఃపురుషుడు ముందుకు రావడమూ బాహ్యచేతనలోనికి పోవడమూ అనే ఈ ఉభయగతివిశేషములూ కావలసినవే.

## వెలినుండి లోనికి పయనం తప్పనిసరి

వెలినుండి లోని కేగడ మనునది సాధనలో పెక్కు ప్రయోజనముల నిమిత్తం తప్పనిసరిగా జరగవలసి వుంటుంది. వెలిచేతనకూ లోపురుష నకూ మధ్యగల అడ్డుగోడ ఛేదించ బడినప్పుడు, అంతులేని అనుభవ సంపత్తికీ, నవజీవనానికీ దారితీసే ఎరుక సాధకునియందు వికసింప నారంభిస్తుంది. లోనికి దుముకుటకూ, లోప్రపంచంనుండి జాగ్ర దవస్థలోనికి తిరిగి వచ్చుటకూ నడుమ సాధకుడు పొందగలిగే అనుభవ జ్ఞానసంపద అపారం.

## కలలూ కల్పనలూ కావు యథార్థములు

వెలినుండి లోనికి పయనించిన సాధకునకు గలిగే అనుభవాలు యథార్థ సంఘటనలే కాని కలలూ, కల్పనలూకావు. వేర్వేరు అనుభవాల విలువలు వేర్వేరుగా ఉన్నా, లోన కలిగే ప్రతి అనుభవమూ నిక్కమని చెప్పదగినదే. లోని ఆత్మ, లోని భూమికలతోపాటు ఇవికూడా యథార్థములు.

## అంతశ్చేతనా భూమికలపై ఆధిపత్యావశ్యకత

బాహ్యజీవనమందలి మన ప్రవృత్తులన్నీ తెరవెనుకనుండే మన అంత శ్చేతనాభూమికలలో పుట్టువు నొందినవే. కావుననే జీవితమును రూపాంతరం చెందించగోరెడి యోగ పద్ధతి యందు ఈ భూమికలలో జరిగేదానిని గురించిన ఎరుక, వాటిపైన ఆధిపత్యము మున్నగు వాటికి విశేషప్రాధాన్య మివ్వడం అత్యంతావశ్యకం.

## ఈశ్వర సాయుజ్యము : అంతశ్చేతనానుభూతి

ఈశ్వరునితో సాయుజ్యం సాధించనిదే జీవితాన్ని రూపాంతరం చెందిం

చడం సాధ్యంకాదు. జీవితాన్ని రూపాంతరం చెందించాలనే లక్ష్యం లేకుండా కేవలం ఈశ్వర సాయుజ్య మభిలషించే యోగపద్ధతులయందు సైతం అంతశ్చేతనా భూమికల లోనికి ప్రవేశ మత్యంతావశ్యకమే. ఈశ్వరసాయుజ్యం బాహ్యచేతనయందే తగుల్కొని బాహ్యేంద్రియ మనఃప్రవృత్తులకు కట్టువడియుండుటచే సిద్ధించేది కాదు.

## చైత్యపురుషుడే ఆధ్యాత్మిక ప్రేరణకు మూలం

ఆధ్యాత్మిక ప్రేరణం నీ బాహ్యసత్త వలన జనించునది కాదు. నీ అంతరమంతలి చైత్యపురుషుడే ఈశ్వరసాయుజ్యమునూ, ఆనందమునూ అన్వేషించెడి భక్తుడు. బాహ్యాభ్యంతరముల నడుమనుండే అడ్డుగోడ తొలగి చైత్యపురుషుడు ముందుకు వచ్చినప్పుడు, బాహ్యసత్త కూడా ఆధ్యాత్మిక ప్రేరణచే ప్రభావితం కాగలుగుతుంది.

## చైత్యపురుష వికాసపు సత్ఫలితాలు

చైత్య పురుషుడు తాను ముందునకు రావడముగాని, లేక బలముగా తన వైపునకు చేతనను ఆకర్షించుకొనడము గాని జరిగినప్పుడు, శాంతి, ఆనందము, స్వాతంత్ర్యము, విశాలత సాధకునిలో పాదుకొన నారంభిస్తాయి. జ్యోతిఃప్రసారమునకు కవాటం విచ్చుకొని, పరతర జ్ఞాన వికాసం అతనిలో కడుసహజంగానూ కలగడం మొదలు పెట్టుతుంది.

## అంతశ్చేతనా వికసనావశ్యకత

అంతశ్చేతనను వికసింపజేయకయే బాహ్యచేతనయందు పరివర్తనం సాధించడం దుస్సాధ్యం. అన్న, ప్రాణ, మనోమయ రూపములు గల అంతశ్చేతన ఊర్ధ్వమునగల పరచేతన నందుకో గలుగుటయేగాక, అంతర్వర్తి యగు చైత్య పురుషునితో సైతం సామరస్యమున మెలగ

జాలియున్నది. అట్లు మెలగ నేర్చినప్పుడు, బాహ్యచేతనతో మనకు తాదాత్మ్యం తొలగి, బాహ్యతలమం దెచ్చటనో అది మనకు కడుదవ్వున నున్నట్లుగా అనుభవం పొందుతాము.

## హృదయకోశంలోనికి ఉపసంహారణ

ఒక చేతననుండి ఇంకొక చేతనలోనికి మార్పు సహజంగా కొంత కాలం తీసుకొంటుంది. బాహ్యవిషయములనుండి వెనుకకు ఉపసంహరించుకొనుచూ నీ చేతన హృదయకోశమును చొచ్చి చైత్యపురుషుని ప్రేరణతో అటనుండి చూడనేర్చినప్పుడు, భావగాంభీర్యం అంతకంతకు నీలో స్థిరపడుటేగాక, అచంచలమైన విశ్వాసాన్ని సైతం నీ యందు వెలార్చుకోగలుగుతావు.

## సిద్ధికి కావలసినది అంతర పురుషావబోధం

ఈశ్వరునియెడ భక్తి, విశ్వాసం, ప్రేమ, పూజ్యభావం బాహ్య పురుషునిలో వర్ధిల్లుటకు వీలున్నమాట నిజమే. (వాస్తవమునకు, అవి కూడా అంతరమునుండియే వచ్చుచున్నవి) కాని సిద్ధి, సాక్షాత్కారము అనునవి మాత్రము అంతరపురుషుడు మేల్కాంచి, అజ్ఞాతమై యున్నవాని దర్శనస్పర్శనాదులను పొందనేర్చినప్పుడే కలుగుతవి.

## అంతర్మౌనస్థితి

మౌనస్థితి అంటే ఏ అనుభూతులూ లేకుండేస్థితి అని అర్థం చేసుకోరాదు. అంతర్మౌనస్థితియందు ఎట్టికలతకూ తావీయకుండానే సకలానుభూతులూ కలుగవచ్చు. కనుక సాధకుడు ఆ స్థితిలో తనయందు పొడమెడి రూప ప్రదర్శనములను త్రోసిపుచ్చడానికి ప్రయత్నించరాదు.

## అంతశ్చేతనా భూమికల అనుభూతులు

పూర్ణయోగసాధకుడు తనలోపలనుండే అన్న, ప్రాణ, మనోమయ భూమికలనూ వాటికంటెనూ లోపలిదగు చైత్యపురుష చేతనాభూమికనూ అనుభవ పూర్వకంగా తెలుసుకోగలిగి వుండవలెను. వివిధరూప ప్రదర్శనలతో కూడిన అనుభూతులు ఈ చేతనాభూమికల ఉన్మీలనకు సూచకములే. వాటిని అవరోధించడం చేతనావికాసాన్ని అవరోధించడమే అవుతుంది.

## లోపురుషుడు మేల్కొంటే

లోపలఉన్న పురుషుడే నిక్కమైన పురుషుడు. అతడు మేల్కొన మొదలిడినప్పుడు, మన సమస్తచైతన్యంలోనూ మార్పు రానారంభిస్తుంది. ఒక క్రొత్త చూపుతో బయటి ప్రపంచాన్ని తిలకిస్తాం. అంతే కాదు, లో ప్రపంచాన్ని చూచే నేర్పుకూడా మనకు అలవడుతుంది. అదే అంతర్దృష్టి.

## ప్రవృత్తియందు సైతమూ ప్రశాంతి

ప్రవృత్తియందు సైతమూ ప్రశాంతిని విడనాడకుండడం అంతశ్చేతన ముఖ్యలక్షణాలలో నొకటి. సాధకుడు ఈ చేతనయందు ఏకాగ్రతను పెంపొందించుకొన్నకొలదీ ప్రశాంతి అతనిలోవృద్ధిపొందుతూ వుంటుంది. లోపల ఎన్నెన్ని విధములైన విశేషములు సంభవించినా అంతరంగమున ప్రశాంతి ఉన్నట్లు తోచడానికి ఇదే కారణం.

## బాహ్యచేతనపై అంతశ్చేతనా ప్రభావక్రమం

అంతశ్చేతనయందు సంభవించే విశేషములు బాహ్యచేతన యందు అభివ్యక్తం కాకుండడమే తొలుత సామాన్యంగా జరుగుతూ వుంటుంది.

క్రమేణా అంతశ్చేతన బాహ్య తనయందు కొన్ని మార్పులను సాధింప నారంభించి, కడకు తానే బాహ్యోపకరణములనెల్ల తనకు వశంవద మొనర్చుకో గలుగుతుంది.

## అంతః పరివర్తనలో ఒక ముఖ్యఘట్టం

నీలో ఒకవైపున ఆలోచనలు రేగి నిక్షేపానికి అవకాశ మేర్పడుతున్న తరుణంలోనే, వేరొక వైపున ఒకవిధమైన శాంతి, స్థిరత నిన్ను విడ నాడకుండడ మనేది చాల మంచిలక్షణం. అంతశ్చేతన నీయందలి ఒక విభాగంలో కుదురుకొంటూ వున్నదని దాని అర్థం. సాధనక్రమంలో జరగవలసిన అంతః పరివర్తనయందు ఇది ఒక ముఖ్యఘట్టం.

## అంతఃపరివర్తనకు మరొక సూచన

బయటి విషయాలపై ఆధారపడని ఒక విధమైన ఆనందం స్వతస్సిద్ధంగా నీలో ద్యోతకం కావడం కూడా అంతఃపరివర్తనకు సూచకమే. శాంతితో మిళితమైన సంతోషం ఈ ఆనంద లక్షణం. ఇంద్రియసంబంధమైన విషయసుఖంలో నుండే ఉద్రేక ప్రవృత్తి ఇందుండదు. కాని, గాఢత్వ మున ఇది దానికంటె ఎంతో మిన్న.

## కర్తృత్వభావరాహిత్యం

'ఈపని నాది' అనెడి కర్తృత్వభావం అంతరించడం కూడా అంతః ప్రవర్తనను సూచించెడి మరియొక ముఖ్యలక్షణం. ఈ స్థితియందు ఏపనినైనా బాహ్యచేతనతో చెయ్యడం జరుగుతూ వుండగా అంతశ్చేతన దానియందు లగ్నంకాకుండా ఉండిపోతుంది.

## ముక్తిభావస్ఫూర్తి

అంతరమున చైత్యపురుషోన్మీలనముగాని, ఊర్ధ్వమున ఆత్మ సాక్షాత్కా

రము గాని కలిగినప్పుడు, బంధిఖానానుండి విడుదలపొందిన భావం వంటిది దానితోపాటుగా నీకు కలుగుతుంది. దీనినే ముక్తియని అన్నారు. ఈ విడుదల శాంతిలోనికి సుఖంలోనికి, అజ్ఞానమయమైన బాహ్యజీవిత బంధనసహస్రముల కట్టువడని స్వేచ్ఛలోనికి విడుదల.

## ఆలోచనలు కట్టువడే అంతశ్చేతనానుభూతి

అంతశ్చేతనానుభూతిలో ఆలోచనలు సహజంగా కట్టుపడిపోతాయి. వస్తుజ్ఞానానికి ఆలోచనా ప్రక్రియపై ఆధారపడవలసిన అవసరం నీరవమైన అంతశ్చేతనకు లేదు. సరియైన దర్శనజ్ఞానములు దానికి స్వతసిద్ధంగా లోపలనుండియే కలుగుతాయి. అట్టి జ్ఞానస్ఫూర్తితోనే భాషణములు, కర్మలు నడుస్తవి.

## పూర్ణమౌనం

లోపల అంతటా నిశ్చలత్వం ఏర్పడి, తానుమాత్రం సాక్షిగా వుంటూ, తన చేతనయందేదో పరచైతన్యవిశేషముల అవతరణకై ఆకాంక్షిస్తూ వుండే పరిస్థితియే పూర్ణమౌనం. మనఃప్రాణ శరీరములపైన పరచైతన్యపు పూర్ణశక్తి ఒత్తిడి ఏర్పడినప్పుడు ఈ పూర్ణమౌనం సిద్ధిసుంది.

## అంతర్విషయ దర్శంన

బాహ్యవిషయములవలెనే అంతర్విషయములనుకూడా విస్పష్టంగా చూచుటకు వీలున్నది ఆ చూడడం సూక్ష్మదర్శనంద్వారా ఒక బొమ్మను చూచినట్లుగా కావచ్చు లేక, అతకంటెగూడా సూక్ష్మమూ, శక్తిమంతమూనైన దర్శనం ద్వారా వాటి అంతస్సారమును కనుగొన్నట్లుగా కావచ్చు ఏమైనా ఈదర్శనములు పటిష్ఠములు కావడానికి ఈశక్తులన్నీ బాగుగ వికవించడం అత్యంతావశ్యకం.

## అంతః పురుషుడు మేల్కొనసారంభించినప్పుడు

అంతఃపురుషుడు మేల్కొన నారంభించినప్పుడు, ఈ క్రింది లక్షణాలు సాధకునిలో కనిపిస్తాయి. (1) ఏదిసంభవించినా ఆసక్తి లేకుండా తిల కించెడి ఒకవిధమైన సాక్షిభావం. (2) సుఖదుఃఖములకు అతీతమగు ప్రశాంతస్థితి. (3) ఏది సంభవించినా దానికంటే తాను వేరనియెడి బుద్ధి. (4) వస్తువులయెడ, వ్యక్తులయెడ, సంఘటనలయెడరాగబంధరాహిత్యం.

## ఉండగూడని లక్షణాలు

ఇతరులు మాట్లాడుతూవుంటే ఏవగించుకోడం, ఓరిమి చూపక పోవడం, కోపగించుకొనడం సాధకునిలో ఉండగూడని లక్షణాలు. అట్టి సందర్భమందు నిర్లిప్తమైన ఆంతరగిక ప్రశాంతితో అతడు మెలగ నేర్చు కోవాలి. ఏమి జరుగుతున్నదీ, తానేమి చేస్తున్నదీ తెలియరాకుండ శరీరం వెలికి పోవడంకూడా తగదు. శరీరంకంటె తాను వేరనేది భావం వున్నా తనలోనూ తన చుట్టుపట్లనూ ఏమి జరుగుతున్నదో అతడు పూర్తిగా తెలుసుకోగలిగి వుండాలి.

## ఒక మజిలీ మాత్రమే

నిర్లిప్తమైన ఆంతరంగిక ప్రశాంతి, శరీరంకంటె తాను వేరనియెడి బుద్ధి, సాక్షిభావం—ఈ మొదలైన లక్షణాలతో కూడిన స్థితి ఒక మజిలీ మాత్రమే. ఒక విధమైన విముక్తస్థితిని ఇది కల్పిస్తుంది, దీని తర్వాత ఈ ప్రశాంతస్థితి యందు ఈశ్వరసాన్నిధ్యాన్ని, దివ్యానందాన్ని సాధకుడు పొందవలసి వుంటుంది. శిరస్సు, హృదయం – ఈ రెండింటియందునూ ధ్యానైకాగ్రతవలన ఈ ఫలితములు సులభముగా సిద్ధించ గలవు.

## సాధనలో నొక ముఖ్యదశ

సకలవృత్తులూ ఆత్మతో సంబంధములేని శుష్కవృత్తులుగా తోచేస్థితి బాహ్యచేతననుండి అంతశ్చేతనలోనికి తిరోగమించే ప్రయత్నంలో ఒక దశ. అంతశ్చేతనలోనికి ప్రవేశించడం జరిగినప్పుడు, అది బాహ్య ప్రకృతికంటే వేరై ఏవృత్తియూలేని ప్రశాంత శుద్ధసత్తగా సాధకునకు అనుభూతమవుతుంది. వృత్తులనుండి వేరుపడ నేర్వడంచే కలిగే ఈ ఫలితం సాధనలో చాలా ముఖ్యమైనది.

## నిక్కమైన ఆధ్యాత్మికతకు శుభసన్నివేశం

వృత్తులనుండి వేరుపడ నేర్చినందువల్ల కలిగే తొలిఫలితం చలనరహిత మైన ప్రశాంతస్థితి కాగా, అటుపిమ్మట ఆ ప్రశాంతి ప్రశాంతిగా ఉండ గానే దానియందు చైత్యపురుషావబోధప్రవృత్తి మొదలైన అంతః ప్రవృత్తులు తొణికిసలాడ నారంభించి, బాహ్యజీవనమునకు వెనుక నొక నిక్కమైన అంతరంగిక, ఆధ్యాత్మిక, జీవనానికి శుభసన్నివేశం కల్పి స్తాయి. బాహ్య జీవనంలో పరివర్తనం సాధించడం ఆటుతరువాత సులభం.

## సాక్షిచేతన

సాక్షి చేతనయే మూలచేతన; అదియే నిక్కమైన పురుషుడు. ఏ భూమిక యందు అభివ్యక్తమైనా అది ఆ నిక్కమైన పురుషుని అంశమే.

సామాన్య మానవప్రకృతియందు మాత్రం అది అహంకారంచేతనూ, ప్రకృతిగత అజ్ఞానఖేలనం చేతనూ కప్పబడి, కానరాని సాక్షిచేతనగా మరుగుపడి ఉంటుంది. ఆ మరుగు తొలగి అది అభివ్యక్తమైనప్పుడు ప్రకృతి ఖేలనతో తాదాత్మ్యం చెందని ప్రశాంత మూలచేతనగా దానిని నీవు అనుభూత మొనరించుకుంటావు.

## పురుషుడు - ప్రభువు

పురుషచేతన మరుగువీడి వెలికి రావడమే విమోచనమునకు మొదలు. క్రమేణా ఈ పురుషచేతన ప్రభుతను సైతం వెలయించుకోగల స్థితికి వస్తుంది. క్రమేణా ఎందుచేతనంటే, అహంకారప్రవృత్తికి, అవర ప్రవృత్తుల ఖేలనకు ఈ పరివర్తనము గిట్టదు. అయినా పురుషచేతన అవరప్రవృత్తుల స్థానమున ఏ పరప్రవృత్తులు విలసిల్లవలెనో నిర్దేశిస్తూ, ఆ నిర్దేశం కార్యరూపం ధరించునట్లు క్రమేణా అనుశాసించగలదు,

## సాక్షిచైతన్య దృష్టి - ఏకాంతవాసము

అంతరమున సాక్షిచైతన్యదృష్టి పెంపొందడానికి, సాధకుడు బాహ్యమున ఏకాంతవాసాన్నిగూడ కల్పించుకోడమనేది ఉన్నా అట్టి ఏకాంతవాసాన్ని తప్పనిసరిగా కల్పించుకోవాలన్న నియమమేమీ లేదు. సాక్షిచైతన్యదృష్టి పెంపొందడం అవరప్రకృతినుండి విమోచనం పొందడానికి సహాయ పడుతుంది, బయటి విక్షేపాలకు చలించకుండా వేరై తిలకించే విభాగమొకటి నీలో అభివ్యక్తమైన కారణాన సంపూర్ణమైన శాంతి స్థిరతలు నీయందు పాదుకొంటాయి.

## సాక్షిచైతన్యదృష్టి ; ఆరోహణావరోహణలు

సాక్షిచైతన్యదృష్టి పెంపొందడంద్వారా అవరప్రకృతినుండి విమోచనం కలిగి, బయటి విక్షేపాలకు చలించకుండా తిలకించెడి విభాగమొకటి నీలో అభివ్యక్తమై, సంపూర్ణమైన శాంతి స్థిరతలు నీయందు పాదు కొన్నప్పుడు, పరచేతనలోనికి ఆరోహణము, పరచేతన అవతరణము-అనేవికూడా అటుపిమ్మట సుగమములే అవుతాయి.

## సాక్షిచైతన్యదృష్టి : సమర్పణభావము

సమర్పణభావము సాక్షి చైతన్య దృష్టికి విరుద్ధము కాదు. మీదుమిక్కిలి, సామాన్య ప్రకృతినుండి విమోచనం కల్పించడం మూలమున ఈసాక్షి చైతన్యదృష్టి పరాశక్తికి సర్వసమర్పణ మొనర్చుకొనే ప్రవృత్తిని మరింత సుగమం చేయగలుగుతుంది కూడ.

## పరచేతనాహ్వానము - సాక్షిచైతన్యదృష్టి

సాక్షిచైతన్యదృష్టి పెంపొందకుండానే పరచేతనను సాధకుడు తనలోనికి ఆహ్వానించుకోడం, ఆ ప్రయత్నం సఫలం కావడం ఒక్కొక్క ప్పుడు జరుగుతూ వుంటుంది. అట్టి సందర్భాలలో ఆ పరచేతన మొట్ట మొదటగా సాధించెడిముఖ్యకార్యములలో నొకటి సాక్షిచైతన్యదృష్టిని పెంపొందించడమే. అవరప్రకృతి వృత్తుల అవరోధం లేకుండా పరచేతన అతనిలో పనిచేయడానికి ఇది చాలా అవసరం.

## శాంత్యాదుల అవతరణ

పరచేతననుండి శాంతి మున్నగునవి తొలుత అంతఃపురుషునిలోనికి అవతరిస్తాయి. శాంతినిష్ఠమై, అవరప్రకృతివృత్తులస్పర్శలేక, జ్ఞానతేజో మయమై దీపించు ఈ అంతఃపురుష స్వరూపమును సాధకుడు తనలో

స్పష్టముగా సాక్షాత్కరించుకొనవచ్చు. ఇదేసమయమున, అపరప్రకృతి వృత్తులకు వశమై వర్తిల్లు బాహ్యపురుషుని గురించిన ఎరుకసైతమూ ఆతనిలో ప్రవర్తిల్లుటకు వీలున్నది.

## అంతఃపురుష, బాహ్యపురుష చేతనల అనుభూతి

అంతఃపురుషుడంటే సూక్ష్మ, అన్న, ప్రాణ, మనోమయ చేతనలతో కూడిన చైత్యపురుషుడని అర్థం. సాధకులలో అత్యధిక సంఖ్యాకులు అంతఃపురుష, బాహ్యపురుష చేతనలను ఏకకాలముననే విడివిడిగా అనుభూతమొనర్చుకొనడం కద్దు, అట్టి సందర్భమందు కార్యనిశ్చయ మొనర్చే సంకల్పం అంతఃపురుషునిదే కాని, బాహ్యపురుషునిది కాదు. బాహ్యపురుషునిపై అవరప్రవృత్తుల దాడిప్రభావము కార్యముపైన ప్రసరించబోదు,

## ప్రకృతి పరివర్తనకు అనుకూలఘట్టం

అంతఃపురుష, బాహ్యపురుష చేతనలను ఏకకాలముననే విడివిడిగా అనుభూత మొనర్చుకొనేఘట్టం ప్రకృతిని రూపాంతరం చెందించడ మనెడి లక్ష్యసాధనకు చాలా అనుకూలం. ఈస్థితియందు అంతఃపురుషుడు ప్రకృతికార్యమునందు తగులుపడకయే దానిని తిలకించుచూ, తత్పరివర్తనకు తనలోని పరచైతన్యశక్తి నంతనూ వినియోగించి, యంత్రమునువలె దానిని పూర్తిగా తీర్చిదిద్దడానికి వీలౌతుంది.

## వేదాంతు లనేకుల దృక్పథం

అంతఃపురుషుడు ప్రకృతిపరివర్తనమునకై తనయందలి పర చైతన్య శక్తిని వినియోగించుట అనెడి లక్ష్యసాధనను వేదాంతులు పెక్కుమంది అనావశ్యకంగా భావిస్తారు. అంతఃపురుషుడు ముక్తుడనీ, తక్కినదెల్ల

ప్రారబ్ధకర్మానుసారం ప్రకృతి వశమున సాగిపోతూ శరీరపతనంతో పాటు రాలిపోగా తుదకు నిర్వాణమే మిగులుతుందనీ వారి ఉద్దేశం.

## సాక్షిత్వానుభూతిలో ఆగిపోరాదు

సాక్షిపురుషచైతన్యమును సాధకుడు తనలో వికసింపజేసుకొనడం మంచిదే. కాని, అంతటితో అతడు ఆగిపోరాదు. సాక్షిత్వమే సర్వస్వమనుకొని, అవరప్రవృత్తిని దాని యిచ్చవచ్చినట్లు ప్రవర్తించనిస్తూ వుండేమెడల, ఆ అవరప్రకృతి ధోరణులు ఎప్పటికైనా అంతరించవలసిన పనియేమున్నది?

## పురుషుడు - ముక్తిసాధన

ప్రకృతినుండి వేరుపడడం ద్వారా పురుషుడు ఆత్మవిముక్తి సాధించుకోవలసి వున్నదనీ, ప్రారబ్ధ కర్మానుసారం జీవితాంతం వరకూ పనిచేసి శరీరపతనంతోపాటు ప్రకృతికూడా విగళితమైపోగా పురుషునకు నిర్విశేష పరబ్రహ్మమున లయం సిద్ధిస్తుందనీ చాలామంది మతం. కాని ముక్తి అనునది అంత సులభసాధ్యమైన విషయంకాదు.

## సాక్షి - అనుమంత

పురుషుడు ప్రకృతికార్యములను తిలకించే సాక్షిమాత్రమేకాదు. వాటికి అనుమతి నొసగే అనుమంతకూడ. ఆ అనుమతి నతడు ఉపసంహరించుకోనూ గలడు. ఏ ప్రకృతి కార్యములోనైనా తగులువడక వేరుగా నిలిచి అతడా రీతిగా దానికి తనఅనుమతిని నిర్విరామంగా నిరాకరిస్తూ వచ్చినప్పుడు, మొదట అది పూర్వాభ్యాస వశాన కొంతకాలంపాటు అట్లే కొనసాగినా క్రమేణా పట్టుతప్పి బలహీనమై తుట్టతుదకు రూపరి అంతరించిపోక తప్పదు.

## అవరప్రకృతివృత్తులకు అనుమతినిరాకరణ

సాక్షిగానేకాక అనుమంతగా కూడా పురుషచైతన్యం సాధకునిలో పెంపొందడం అవసరం. విక్షేపకారులైన అవర ప్రకృతివృత్తులకు అనుమతిని నిరాకరిస్తూ దివ్యప్రకృతికి చెందిన శాంతి, విశుద్ధత మున్నగువాటిని మాత్రమే అనుమతించడమనేది జరగవలసి వున్నది. అనుమతి నిరాకరించడమంటే అవరప్రకృతితో ఘర్షణ పడడమని కాదు. ప్రశాంతము, నిర్విరామము, సంగరహితమునైన నిరాకరణ మది.

## పురుషోత్తమాశ్రయం అత్యంతావశ్యకం

అవరప్రకృతిని దివ్యప్రకృతిగా రూపాంతరం చెందించగల శక్తి అక్షర పురుషునికి (అవ్యక్తాత్మకు) లేదు. అట్టిరూపాంతరీకరణమునకు అక్షర పురుషునికంటె అతీతుడైన పురుషోత్తముని సాధకుడు ఆశ్రయించవలసి వుంటుంది. క్షరాక్షరపురుషులు రెండునూ తానేయై ఈ ఉభయులకంటె అతీతుడైనవాడా పురుషోత్తముడు.

## అక్షరపురుషానుభూతి ప్రయోజనాలు

అక్షరపురుషునిలో (అవ్యక్తాత్మలో) నివసించడం నీ వభ్యసించి అందొక విధమైన స్థిరత్వం అలవరచుకోగలిగినప్పుడు, శాంతి, సమత, విశుద్ధత, నిస్సంగత నీలో పెంపొంది, అవరప్రకృతివృత్తుల తగులములేని ఆంతరంగికస్వేచ్ఛను నీ వనుభవించగలుగుతావు. అనంతరం అక్షర పురుషునికంటె అతీతస్థితికి పోయి అవరప్రకృతిని దివ్యప్రకృతిగా రూపాంతరం చెందించుకోవలసి వచ్చినప్పుడీస్థితి నీకు మిక్కిలి సహాయకారి అవుతుంది.

## సాక్షిత్వభావ ప్రయోజనం

సాధకుడు సాక్షిత్వభావం పెంపొందించుకోవలసినది, తనలోని దోషముల బాధ్యత విడనాడి ఆ నెపాన వాటిని సరిదిద్దుకొనక నిరాకరించడం కోసమైకాదు. ఆత్మజ్ఞానాన్ని ఒకవైపున కలిగిస్తూ, వేరొకవైపున ప్రకృతికి లోబడని నిస్సంగ స్థితినుంచి అవరప్రకృతివృత్తులకు అనుమతి నిరాకరించడం ద్వారా వాటిస్థానే ఆంతరమునుండిగాని ఊర్ధ్వమునుండిగాని సత్యచేతనావ్యాపారమును ప్రవర్తింపజేయడం కోసం ఉద్దేశించబడింది సాక్షిత్వభావం.

## అంతరమునసే నివాసం, అంతరమునుండే వ్యవహారం

నిన్ను నీవు సుస్థిరంగా నీ లోపలికి కూడదీసుకొనడం ఆత్యంతావశ్యకం. అంతర్వలయమును వీడి నిరంతరమూ వెలికేగుతూ విక్షేపాలు పొందుతూ వుండేయెడల, బాహ్యప్రకృతికి చెందిన అల్పత్వమున తిరుగాడుతూ తత్ఫలితములకు నీవు అగ్గముకాక తప్పదు. అంతరమున నివసిస్తూ పరదేవతతో నిత్యానుసంధానము అంతరము నుండియే నిత్యమూ వ్యవహరించడం నేర్చుకో.

## సుప్రతిష్ఠితం కావలసిన క్రొత్త అలవాటు

ప్రాణకోశమందలి ప్రాతఅలవాటే మాటిమాటికీ నిన్ను వెలిచేతన వైపునకు లాగుతూ వున్నది, దానికి వ్యతిరేకంగా నీవు అంతశ్చేతనయందు నివసించే అలవాటును పట్టువీడని ప్రయత్నంతో ప్రతిష్ఠించి, అచ్చటనుండియే సమస్తమునూ తిలకించడం నేర్చుకోవాలి. సమ్యగ్భావన, సమ్యగ్దర్శనం, స్వపర వస్తు స్వరూపజ్ఞానం—అంతా నీకు అచ్చటనుండియే లభిస్తాయి.

## బాహ్యమునగాక అంతరమున మేల్కొన్న స్థితి

ఒక విధమైన అంతశ్చేతనలోనికి ప్రవేశించినప్పుడు, బాహ్యమునగాక అంతరమున నీవు మేల్కొనేవుంటావు. బాహ్యవిషయములు గాక అంతర్విషయములు మాత్రమే నీవు తెలుసుకో గలిగే స్థితి అది. ఆ స్థితియందు, అంతకుపూర్వం నీ బాహ్యమనస్సుకు అత్యంత శ్రమ సాధ్యములుగానున్న పనులను సైతం నీ అంతశ్చేతన అవలీలగా సాధించుటకు వీలున్నది.

## అంతశ్చేతనా భూమికలోనికి ప్రవేశించేటప్పుడు

బాహ్యచేతననుండి ఏ అంతశ్చేతనాభూమికలోనికైనా ప్రవేశించేటప్పుడు కొందరు సాధకులకు శరీరం బిర్రబిగిసి కొయ్యబారిపోతుంది. మరి కొందరికి శరీరం చల్లబడడం కద్దు.

## అంతఃప్రవేశము, భౌతిక వస్తుదర్శనము

చేతన అంతఃప్రవేశ మొనర్చినప్పుడు, భౌతికవస్తువులు దూరాన ఉన్నట్లుగా తోస్తాయి. మరొక భూమికలోనికి ప్రవేశించి అటనుండి భౌతిక వస్తువులను చూచేటప్పుడుకూడా అలాగే తోస్తుంది. లోనికి పూర్తిగా పోయినప్పుడు భౌతిక వస్తువులు అదృశ్యంకాగా, వాటితో కొంత సంబంధం పెట్టుకున్నప్పు డవి దూరంగా గోచరిస్తాయి,

## బాహ్యాభ్యంతర చేతనలు ఒకేసారి పనిచేసే స్థితి

అంతశ్చేతనలోనికి ప్రవేశించినప్పుడు వెలుపలనున్న భౌతిక వస్తువులు అదృశ్యం కావడం, లేక దూరంగా వున్నట్లు తోచడం, అనేస్థితి తాత్కాలికం మాత్రమే. బాహ్యాభ్యంతర చేతనలు రెండూ ఏకకాలము

ననే పనిచేయుస్థితి ఆ తరువాత వస్తుంది. అప్పుడు, సాధకుడొకవైపున తనలో చైత్య పురుష తత్వమున నిష్ఠుడై తదనుభూతులను పొందుతూ వున్న సమయంలోనే, వేరొకవైపున అతని బాహ్యచేతన ఆ చైత్య పురుషప్రభావ పురస్సరముగ భౌతిక వస్తువులతో వ్యవహరించడం సైతం జరుగుతుంది.

### సాధకుని కుండవలసిన లక్ష్యం

ప్రాణమయ చేతనాపరిధిలోని అనుభవాల నతిక్రమించి స్వచ్ఛమైన ఆధ్యాత్మికానుభూతులలో నివసించడమే సాధకుని లక్ష్యంగా వుండాలి. ఇతరుల కెవ్వరికీ తనలోని కతడు ప్రవేశ మివ్వరాదు. అట్లు ప్రవేశ మివ్వడం అవరభూమికలలోంచి అతడు బయటపడలేని అయోమయ స్థితిని కల్పిస్తుంది. ఒక్క ఈశ్వరుని మాత్రమే అతడు తనలోని కాహ్వానించుకోవలసినది.

### ఈశ్వరుని నీలోపలకు ఆహ్వానించుకోడమంటే

ఈశ్వరునిమాత్రమే నీ లోపలికి—నీ ఆధారం లోపలికి—ఆహ్వానించుకోవాలంటే, నీ వ్యక్తిత్వాన్ని ఈశ్వరునియందు లయంచెయ్యాలని కాదు, నీవే ఈశ్వరత్వం సాధించాలనీ కాదు. ఈ రెండు పద్ధతుల లోనికీ పోక, అహంకారాన్ని నిర్జించి, నీ ఆత్మ ఈశ్వరశక్తి విలసనమునకు సాధనంగా, ఉపకరణంగా నిలిచిపోవడమే ఇచట జరుగవలసినది

### అన్యవ్యక్తులకు నీ లోపల ప్రవేశ మీయరాదు

సర్వమూ ఈశ్వరమయ మనేటి దృష్టితో, విశ్వజనీనత నొందింప

బడిన నీ చేతనయందు అన్యవ్యక్తులను గుర్తించి వారి ప్రవృత్తులను తెలుసుకుంటూ, వారితో సామంస్యమున నీవు మెలగడం నేర్చుకొనవచ్చు. అంతేనేకాని, నీ ఆధారం లోపలకు వారిని ఆహ్వానించి వారికి నీలో ప్రవేశమివ్వడం మాత్రం కూడదు. అట్లు ప్రవేశమిచ్చినట్లయితే ఆ విధంగా ప్రవేశం పొందినవారి రూపమున ప్రాణమయశక్తులు కొన్ని నీ లోపలకు దండెత్తివచ్చి నిన్ను ఆక్రమించే ప్రమాదమున్నది.

## అజాగ్రత్త మూలమున కలిగే ప్రమాదం

సాధకుడు తన మూలచేతనను ప్రశాంతము, నీరవము, విశుద్ధము గావించుకొని, అందు దేనికి ప్రవేశం ఇవ్వవలెను. దేనికి ఇవ్వరాదు. అనువిషయమున పూర్ణసంయమంతో, జాగరూకతతో, మెలగ నేర్చుకోడం అవసరం. లేనియెడల, కలగాపులగమైన అనుభవాల కతడు ఆకరమై, నానావిధ మనోమయ ప్రాణమయశక్తులయూ. వ్యక్తులయూ చేతులలో కీలుబొమ్మ కాగల ప్రమాదమున్నది. ఒక్క ఈశ్వరశక్తి పాలనప్రభావములకు దక్క మరి ఏ ఇతర పాలనప్రభావములకునూ అతడు తన ఆధారమున చోటీయరాదు.

## సాధకునిలో ఈశ్వరశక్తి పనిచేసే తీరు

సాధకుని ఆధారమును (అంతశ్శరీరోపకరణమును) మొట్టమొదట్లోనే కైవసమొనర్చుకోడానికి ఈశ్వరశక్తి ఉద్యమింపదు. చేతనను విశుద్ధమూ. విశాలమూ నొనర్చి సత్యజ్యోతి కభిముఖముగా దానిని విచ్చుకొనేటట్లు చెయ్యడానికీ. హృదయాంతర్గతుడైన చైత్యపురుషుడు మేల్కొనేటట్టు చెయ్యడానికీ అది మొదట కృషి చేస్తుంది. అటు

తర్వాతనే, సాధకుని ఇచ్ఛాపూర్వక ఆత్మసమర్పణద్వారమున ఆతని ఆధారమును కడు నెమ్మదిగా క్రైవస మొనర్చుకోడాని కుపక్రమిస్తుంది.

## వ్యామోహజనకమైన అనుభవాలు

మానసిక గుణప్రవృత్తుల నతిక్రమించకుండానే వ్యక్తిగత చేతననుండి సాధకుడు విశ్వచేతనలోనికి ప్రవేశించెడి మార్గమధ్యములో వ్యామోహ జనకమైన అనుభవాలనేకం కలుగుట కవకాశంకలదు గనుక వాటి విషయమున నతడు అప్రమత్తుడై వుండడం అవసరం. అవిద్య ఇంకనూ దట్టముగా పేరుకొని వుండే ఆ స్థితిలో ఊర్ధ్వమునుండి వచ్చెడి వెలుగురేఖలు సైతం వక్రతనుపొందే ప్రమాదమున్నది.

## నడిమి మండలమును సులువుగా దాటే ఉపాయం

వ్యక్తిగత సామాన్యచేతనకూ, విశ్వచేతనకూ నడిమిమండలాన్ని దాటడంలో ఉండేచిక్కులు ప్రతిసాధకుడూ పొందవలసిన పనిలేదు. ఆత్మ విశుద్ధిని సాధించుకొన్నవాడు, విపరీతమైన స్వాతిశయ ప్రవృత్తికి అహంకారమునకూ లోనుగానివాడు, అప్రమత్తతతో నిరం తర జాగరూకుడై మెలగేవాడు, చైత్యపురుషావబోధమును పొందిన వాడు ఈ మండలమును అవలీలగానే దాటి దివ్యసత్యముతో సాక్షా త్సంసర్గగల వరచేతనా భూమికలను నిరపాయముగా చేరుకోగలడు.

## నిక్కమైన నడిమిమండలములు

ఉన్నతమనస్సు, దీప్తమనస్సు, సంబుద్ధ మనస్సు, అధిమనస్సు, అనెడి ఉన్నతమండలములద్వారా మాత్రం, సంసిద్ధి నాకాంక్షించెడి ప్రతిసాధ కుడూ తప్పనిసరిగా ప్రయాణము చేయవలసినదే. వ్యక్తిగత సామాన్య

చేతనకూ, అతిమానసముగ పేర్కొనబడే విజ్ఞానమయచేతనకూ మధ్య నుండే నిక్కమైన నడిమిమండలములు ఇవే.

## చైత్యపురుష సహకారం ప్రమాద నివారకం

వ్యక్తిగతచేతనకూ విశ్వచేతనకూ మధ్యనుండే యవనిక తొలగిపోయే ముందు సాధకునిలో చైత్యపురుషావబోధం జరిగి, సాధనకు చైత్యపురుష సహకారం లభించడం శ్రేయస్కరం. వ్యక్తిగత చేతనకు ఆవలిదైన నడిమిమండలంలోని చిక్కుల ప్రమాదం సాధకున కప్పుడు అంతగా వుండనేరదు.

## ఆదేశరూపమైన అనుభవాలు

యోగసాధనయం దొక దశలో, ఆదేశరూపమైన అనుభవాలు సాధకునికి కలుగుతూ వుంటాయి. కాని, యీ ఆదేశాలు పరమోన్నతస్థానంనుండి వస్తున్న వనడానికి వీలులేదు గనుక అతడు తొందరపడి వీటిని విశ్వసించరాదు, ఒక్కొక్కప్పుడు, ఏదైనా నడిమిభూమికలోని వ్యక్తులు తమ ఆశయములకొరకై ఈ ఆదేశాల మూలమున అతనిని ఉపయోగించు కొన యత్నించడం జరగవచ్చు.

## లోచెవికి వినిపించే ధ్వనులు, వాణులు

వెలిచూపుగాక లోచూ పొకటి ఉన్నట్లే, వెలిచెవిగాక లోచెవి యొకటి ఉన్నది, ఇతర దేశకాలములకు, ఇతర లోకములకు, అభౌతికవ్యక్తులకు సంబంధించిన ధ్వనులను, వాణులను అది వినగలదు. కాని, ఇచట సాధకుడు బహుజాగరూకుడై మెలగడం అవసరం. పరస్పర విరుద్ధము

లైన వాణులు అతనిని కర్తవ్యాకర్తవ్యములకు ప్రేరేపించేటప్పుడు అతడు వాటిని వినిపించుకొనరాదు, వాటికి జవాబీయరాదు.

## నిశ్చల నీరవ మౌనమే ఉపాసించదగినది

'వాణులు' ఎవరికైనా వినిపిస్తాయి. సాధకుని ప్రకృతివృత్తులే, వాణీ రూపం ధరించి అతనికి వినిపించడం జరగవచ్చు. పరరకాం అభౌతిక వ్యక్తులు వినోదంకోసమో లేక ఒక ప్రయోజన ముద్దేశించియో తమ వాణులతో అతనిపైకి దాడి వెడలవచ్చు. కనుకనే, ఈ వాణులంత ప్రమాదకర మైనది మరిలేదు. వాణుల గొడవలోకి దిగక నిశ్చల నీరవ మౌన ముపాసిస్తూ సాధకుడు వివేకవంతమైన మెదడు కలిగివుండడం శ్రేయస్కరం.

## అంతర్మౌన, బాహ్యకర్మల సమతూకం అపేక్షణీయం

వివేకవంతమైన మెదడుగలిగి, ఒక విధమైన ఆధ్యాత్మిక సంశయ వృత్తితో కూడినవాడు సాధనలో బాగుగా నెగ్గుకొని రాగలడు. వివేక హీనులు అపమార్గంపట్టి, అహంకారవశులై తమ అనుభూతులే గొప్ప విగ భావించుకొంటూ. ఏకాంతవాస ప్రీతిని పెంచుకొని తత్ఫలితంగా ఇంకనూ అదే ధోరణిలోపడి కొట్టుకొనిపోతూ వుంటారు. కనుకనే సాధకుడు పూర్తిగా ఏకాంతవాసనిష్ఠ కోరక, అంతర్మౌనాన్నీ, బాహ్య కర్మనూ సమతూకంలో అనుష్ఠించడం మేలు.

## ఏకాంత జీవన పద్ధతి అన్ని వేళలా కూడదు

ప్రగాఢమైన ఆంతరంగిక శాంతి ననుభవించేటప్పుడు, ఎవరితోనూ

సంబంధం పెట్టుకోకపోవడం, మాట్లాడకపోవడం యుక్తమే. కాని, ఇతర వేళలలో కూడా ఏకాంతజీవనపద్ధతి ననుసరించడం అనవసరం. బాహ్యజీవనపు వాస్తవికతకు వెలికాకుండానే పూర్తిగ అంతరమున నివసించగలవారికి మాత్రం ఈ పద్ధతి అపాయకరం కానేరదు. ఇతరులు సముచితరీతిని అన్యులతో కలసి మెలసి తిరగడం లేక, ఏదైనా కర్మ చెయ్యడం — మొదలైన బాహ్యప్రవృత్తిమార్గము లనుసరించడం శ్రేయస్కరం.

## ఆత్మనివాసమే సరియైన ఏకాంతవాస లక్ష్యం

ఆత్మలో నివసించడమే ఏకాంతవాసానికి సరియైన లక్ష్యం. ఆత్మనివాసం ఉన్నతమైన అనుభూతులకు దోహదం చేస్తుంది. సాధన కది సహాయకారిగాని అపకారం కాదు. కాని, లక్ష్యశుద్ధి తప్పినప్పుడు, తీవ్రమైన ఏకాంతవాసనిష్ఠ అపకారంగా పరిణమిస్తుందనేదికూడా మరువరాదు. సాధకుని స్వభావాన్నిబట్టీ, మౌననిష్ఠలో అతనికి గల లక్ష్యశుద్ధిని బట్టీ తీవ్రైకాంతనిష్ఠ మేలుకీడులు నిర్ణయమవుతాయి.

## విశ్వచేతన పరివ్యాప్తి

విశ్వచేతన అనునది ప్రత్యేకించి అతీత మనస్సునకు - అనగా విజ్ఞానమయచేతనకు దిగువ పొలిమేరలోనిదైన అధిమనస్సుకు మాత్రమే సంబంధించినది కాదు. మనోభూమికతోపాటుగా ఎల్లభూమికలతోనూ విశ్వచేతనకు సంబంధమున్నది.

మానవుడు ప్రస్తుతం వ్యక్తిగత బాహ్యచేతనయందు బద్ధుడై, బాహ్యేం ద్రియమనఃప్రవృత్తుల ద్వారా బాహ్య ప్రపంచమును తెలుసుకుంటు న్నాడు. యోగసాధనవలన విశ్వచేతనతో తాదాత్మ్యం చెందగల విశిష్ట చేతన యొకటి అతనిలో వికసించే అవకాశ మున్నది. అప్పుడతడు విశ్వపురుషునీ, విశ్వశక్తినీ, విశ్వమనః ప్రాణ జడభూతములనూ, సాక్షాత్తుగా తెలియనేర్చి, ఎరుకతో కూడిన సంబంధములు వాటితో పెట్టు కొన గలుగుతాడు. అట్టి స్థితియే విశ్వచేతనానుభూతిగా పేర్కొనబడు తున్నది.

# విశ్వసత్యముల దర్శనము, ఏకమైన విశ్వపురుష, విశ్వశక్తి సాక్షాత్కారము

—o—

## విశ్వచేతన ద్విముఖం

విశ్వచేతనకు రెండు ముఖములున్నవి. ఒకదానియందు సామాన్య విశ్వశక్తులయూ, వాని వెనుకనుండెడి వ్యక్తులయూ ఎరుకద్వారా వాటితో సంబంధం ఏర్పడుతుంది. దీనినే నేను విశ్వాజ్ఞానంగా (విశ్వ-అజ్ఞానంగా) పేర్కొన్నాను. రెండవ దానియందు విశ్వసత్యముల దర్శనము, ఏకమైన విశ్వపురుష, విశ్వశక్తి సాక్షాత్కారము కలుగుతాయి. ఏకంలో అనేకం, అనేకంలో ఏకం, అనెడి వేదాంతసత్యముల అనుభూతి ఇచట కలుగుతుంది.

## భద్రతమమైన మార్గం

సాధకుని చేతన విశాలత నొందినంతనే విశ్వచేతనానుభూతి కలుగుతుందని భావించరాదు. అనేకులు ఆ విశాలతద్వారా మొదట విశ్వాతీత చేతనానుభూతినిపొంది, పిమ్మట విశ్వచేతనానుభవములను సవిస్తరముగా పొందుట కలదు. ఒక విధముగా ఇదే భద్రతమమైన మార్గము.

## విశ్వచేతనానుభూతియందలి విశేషాలు

విశ్వచేతనానుభూతి పొందిన సాధకునికి విశ్వాత్మయే తన ఆత్మగా గోచరిస్తుంది. విశ్వంలోని ఇతర జీవులతో అతడు తాదాత్మ్యం చెందుతాడు. విశ్వప్రకృతియందలి శక్తులన్నీ తనలోనే కదలాడుతున్నట్లూ, విశ్వంలోని సకలాత్మలూ తానే అయినట్లూ అతనికి తోస్తుంది. ఎందుచేత అనే ప్రశ్నకు తావులేదు — అంతా ఒక్కటే కనుక.

## ఆత్మలోనే సమస్తమూ ఉన్నది

ఆత్మలోనే సమస్తమూ ఉన్నది. విశ్వాత్మతో నీవు తాదాత్మ్యం చెందినప్పుడు, సమస్తమూ నీలోనే నీకు గోచరిస్తుంది. విశ్వం ప్రతి అణువునందూ తననుతాను అంతర్భూతం చేసుకొంటున్నది. కనుక, సమస్తమూ బాహ్యచేతనయందు అభివ్యక్తం కాకపోయినా (కాజాలక పోయినా) ప్రతిదానియందూ సమస్తమూ కలదు.

## ఆత్మానుభవ స్వరూపము

ఆత్మ అనునది అన్నిటిలోనూ ఏకమైవున్న చైతన్యరూప సత్తగాని ఒక ప్రత్యేక జీవికాదు. ఆత్మ విశ్వాత్మకం. వ్యష్ట్యాత్మ అనునది ఒక వ్యష్టిరూప కేంద్రంనుండి అనుభూత మొనర్చుకోబడిన విశ్వాత్మయే కాని వేరుకాదు. అన్నిటిలోనూ ఏకమై వున్నదిగా అనుభూతంకానిది ఆత్మానుభూతి అని చెప్ప వీలులేదు.

## సర్వగత ఏకాత్మానుభవం

విశ్వచేతనానుభూతియందు వ్యష్ట్యహంకారం అదృశ్యమై సర్వగత ఏకాత్మానుభవం కలుగుతుంది. అప్పుడు మిగిలివుండే 'నేను' వ్యష్ట్యాత్మక

మైన 'నేను' కాదు. విశ్వంతోనూ, విశ్వాత్మతోనూ తాదాత్మ్యం పొందిన విశ్వాత్మకమైన 'నేను'

## మోక్షసిద్ధి లక్షణం

మోక్షసిద్ధి కలిగినప్పుడు మిగులునది అహంకారం కాదు_ జీవాత్మయని పిలువబడే కేంద్ర పురుషుడు. అంతటా, అన్ని జీవులలోనూ ఈశ్వర సాక్షాత్కారం ఈ కేంద్ర పురుషునికి ఉంటుంది. అది ఈశ్వరుని దివ్య నానాత్వమునందు తానొక కేంద్రము ననెడి అనుభూతిగాని, ఒక ప్రత్యే కాహంకారానుభూతికాదు.

## విముక్తి : విశ్వచేతనానుభూతి

ఆత్మస్థమైన శాంతి స్వేచ్ఛా విశుద్ధతలలో నివసించడానికి మొదట విముక్తి ఆవశ్యకం. విముక్తితోపాటు గాని, తదనంతరము గాని విశ్వ చేతనకూడ సాధకునిలో వికసించేయెడల స్వేచ్ఛకలిగి వుంటూనే అతడు సకల భూతములతోడనూ ఏకత్వము పొందగలడు. విముక్తిలేని విశ్వ చేతనానుభూతియందు స్వేచ్ఛలేకపోగా విశ్వగత నానావిధ శక్తుల కతడు క్రీడారంగమయ్యే ప్రమాదమున్నది.

## సంకుచితత్వం : విశాలత

చేతన సంకుచితమూ వ్యక్తిగతమూనై శరీరంలో బంధించబడి వున్నంత కాలమూ ఈశ్వరునినుండి నీ వేమియూ గ్రహింపజాలవు. చేతన విశాల మైనకొలదీ ఈ గ్రహణశక్తి నీలో పెరుగుతుంది. చేతన విశ్వమంత విశాలమై తనలోనికి ఈశ్వరుని పూర్తిగా గ్రహించే సమయం సాధ నలో ఒకప్పటికి రావలసివున్నది.

## అనంతంగా విస్తరణ

యోగానుభూతియందు చేతన దశదిశలకూ–అన్నివైపులకూ గూడా అనంతంగా విస్తరిల్లుతుంది. విముక్తచేతనుడైన యోగి నివసించేది ఒక శరీరంలో కాదు. ఈ అనంత విశాలతలోనే విశ్వమూ అతని నివాసం. అంతులేని నీరవత ఈ విశాలతకు పునాది. దీనియందే శాంతి, ఆనందం, శక్తి, తేజస్సు, జ్ఞానం,అన్నీ అభివ్యక్తమవుతాయి. దీనినే సామాన్యంగా ఆత్మచేతన అని పిలుస్తారు.

## విశాలతారూపమైన అనుభూతి క్రమం

విశాలతారూపమైన అనుభూతి మొదట్లోనే స్థిరత్వం చెందదు. తొలుత అప్పుడప్పుడు క్షణమాత్రంగా తోచి అదృశ్యమవుతుంది. పిమ్మట తరచుగా కలుగ మొదలిడి ఎక్కువకాలం నిలుస్తూవుంటుంది. తుట్టతుదకు స్థిరత్వం పొందగా ఆపైన ఇక చేతన ఎల్లకాలమూ సువిశాలంగానే ఉండి పోతుంది.

## భయపడగూడని శూన్యత్వానుభూతి

విశాలతలో తోచెడి శూన్యత్వానుభూతికి సాధకు డెంతమాత్రమూ భయపడరాదు. ఆ శూన్యత్వం ఆత్మానుభూతికి దారితీయగల నీరవతాస్థితి. శరీరంలో బంధించబడిన క్షుద్రాహంకారముగా గాక, విశ్వవిశాలమైన ఆత్మగా అతడు తనను ఆ స్థితిలో తెలుసుకో గలుగుతాడు. అచట లయము, చేతనను ఆవరించిన ఆవరణలకుగాని, చేతనకు గాదు.

## దివ్యపరివర్తనకు శుభారంభం

విశాలతలో తోచెడి శూన్యప్రాయమైన నీరవతాస్థితియందు. ఏ చిత్త

వృత్తులూ కొంతకాలంపాటు లేకుండా పోవచ్చును. నిరవధికమైన విశాలత తప్ప, ఇంకేదియూ నచట గోచరించక పోవచ్చును. కాని, అట్టి నీరవతా స్థితిలోనికే పైనుండి విస్తారమైన శాంతి, వెలుగు, ఆనందం, విజ్ఞానం అవతరించడం జరిగి, ఈశ్వరునితో ఏకత్వానుభూతిని నీవు పొందగలుగుతావు. అవరప్రకృతి దివ్యపరివర్తనకది శుభారంభం. అందు భయపడవలసిన దేమీ లేదు.

## విశాలత : చైతన్యపురుషావబోధము

సాధకుడు వ్యష్టిచేతన నతిక్రమింప నారంభించి సమష్టిచేతన (విశ్వచేతన) వైపునకు విస్తరించినప్పుడు విశాలత అనుభవంలోకి వస్తుంది. అయితే, చైత్య పురుషావబోధం వ్యష్టిచేతనయందు సైతం కలుగవచ్చును.

## చైత్యపురుషుడు – విశ్వచేతన

జగత్సృష్టి విధానమున వ్యష్టి వికాస క్రమమునకు ఆధారభూతుడైనవాడు చైత్యపురుషుడు. సమష్టి చేతనతో (విశ్వచేతనతో) అతనికి సాక్షాత్తుగను, మనః ప్రాణ దేహముల ద్వారమునను,– ఉభయత్రా కూడా సంబంధము కలదు.

## సాక్షిత్వము – నటత్వము

ఈశ్వరలీలలో సాక్షిత్వము, నటత్వమూ– రెండూ మిశితమై ఉన్నవి. ఈశ్వరుడు తానే సాక్షి, తానే నటుడు. సాధకుడు మొదట ఈశ్వరుని సాక్షిత్వమును అనుభూత మొనర్చుకొంటాడు. పిమ్మట ఆయన నటత్వం సైతం అతని అనుభవానికి వస్తుంది. అట్లు వచ్చినప్పుడే అతని అనుభూతి సమగ్రత నందుకొన్నదవుతుంది.

వ్యక్తిత్వాన్ని రూపొందించడంకోసమూ, వ్యక్తిని విశ్వశక్తులకు ఉపకరణంగా చేయడంకోసమూ అహంకారమనేది విశ్వప్రకృతియంత్రములో ఒకభాగంగా రూపొందించబడింది. ఈ విశ్వప్రకృతి కతీతమైన ఉన్నతప్రకృతి స్పర్శను పొందనేర్చినప్పుడు మాత్రమే మానవుడు అహంకార ప్రాభవము నతిక్రమించి, విశ్వశక్తుల ప్రాబల్యమునుండి విముక్తి పొందగలుగుతాడు.



## ఉపకరణభావంచాటున దాగే అహంకారం



తన సర్వసామర్థ్యములూ విశ్వశక్తులనుండియే సంక్రమించుచున్నవనెడి దృఢానుభవం కలిగినప్పుడు, అహంకారప్రవృత్తి చాలవరకు తగ్గినా, పూర్తిగా అంతరించిపోదు, తాను ఉపకరణము ననే భావంచాటున అది దాగుకొనే వుంటుంది. చైత్యపురుషావబోధం లేనిపరిస్థితియందది తన తృప్తికి దోహదమొనర్చే ఏదో ఒక శక్తికి తాను ఉపకరణం కావడానికై ఉత్సుకత చూపవచ్చును.



## అవచేతనద్వారమున విశ్వశక్తులప్రేరణ

మానవుని అవచేతన ద్వారముననే విశ్వశక్తులు నిరతముగా పనిచేస్తూ వుంటాయి. ముఖ్యంగా, అవి ప్రేరేపించే ప్రవృత్తికి సంబంధించిన బీజాలూ సంస్కారాలూ అవచేతనలో దృఢంగా పాదుకొనివుండి, అట్టి ప్రవృత్తికి లొంగే అలవాటు అతనికి ఉండేటప్పుడు సామాన్యంగా ఇట్లే జరుగుతూ వుంటుంది.

## బాధ, దుఃఖం, మృత్యువు

బాధ, దుఃఖము అనేవి ఒక విధంగా విశ్వశక్తులకు సంబంధించినవే. స్థూలదృష్టికి గోచరించే కారణమేదీ లేకుండానే తరచుగా ఈ విశ్వశక్తుల తరంగాలు వచ్చిపడుతూ మనలను పైకొనడం కద్దు. మృత్యువు కూడా విశ్వశక్తియే. మృత్యురూపమైన మార్పు విశ్వశక్తి కార్యఫలితమే కాని వేరుకాదు.

## చైత్యపురుషావబోధంచే కలిగెడి మేలు

చైత్యపురుషుడు మేల్కొని సాధనకు తోడైనప్పుడు, విశ్వశక్తులకది ఒకవిధమైన పరీక్షయై ఉపకరిస్తుంది. ఆమోదించగూడనివాటి విషయమై హెచ్చరిక పొంది వాటిని త్రోసిపుచ్చడానికి, ఆమోదించవలసిన వాటిని మాత్రం ఆమోదించి వాటికి తాను ఉపకరణం కావడానికి సాధకుడాపరిస్థితియందు యోగ్యతను సంతరించుకోగలుగుతాడు.

